# నవలారచయితగా గోపీచంద్

ఉస్మానియా విశ్వవిద్యాలయం వారి పిహెచ్.డి. పట్టం పొందిన
సిద్ధాంత గ్రంథం

డా॥ అమ్మంగి వేణుగోపాల్

జయమిత్ర పబ్లికేషన్స్
హైదరాబాద్
1988

navalaaracayitagaa goopiicand, Ph. D. Thesis by
Dr. Venugopal



మొదటి ముద్రణ మే, 1988
వెల : మేలుప్రతి 80 రూ॥లు
సాదాప్రతి 60 రూ॥లు

ముఖచిత్రం : సుదర్శన్

తెలుగు విశ్వవిద్యాలయం ఆర్థిక సహాయంతో ప్రచురితం

ప్రతులకు :
1. జయమిత్ర పబ్లికేషన్స్
MIG II B–15/F–12
బాగ్‌లింగంపల్లి, హైదరాబాదు-500 044

2. ఎ. విజయలక్ష్మి
4-7-105
ప్రశాంత్ నగర్ కాలనీ,
సంగారెడ్డి-502 001.

ముద్రణ : చంద్రశేఖర ప్రింటిగ్ వర్క్స్, బోలక్‌పూర్, సికింద్రాబాదు.
కవర్ పేజి ముద్రణ : జ్యోతి ప్రెస్సు, హైదరాబాదు.

స్నేహమూర్తి

చెన్నకేశవరెడ్డి కి

ప్రేమతో

# అభిప్రాయం

ఆచార్య డా॥ ఎం. కులశేఖరరావు
తెలుగు శాఖాధ్యక్షులు
ఉస్మానియా విశ్వవిద్యాలయం

గడచినతరంలో మంచి నవలలు వ్రాసి ప్రఖ్యాతి పొందిన వారిలో గోపీచంద్ ఒకరు. తెలుగు నవల ఆవిర్భవించి నూరు సంవత్సరాలు దాటి పోయింది. ఈ నవల కాలప్రవాహంలో గోపీచందు ఒకమైలురాయి లాగ నిలిచిపోయినాడు.

తెలుగుదేశంలోని సమాజం సంక్లిష్ట రూపం సంతరించుకొంటున్న సమయంలో గోపీచందు కలం చేపట్టి ఉత్తమ రచనలు చేసి వాటికి శాశ్వతమైన సాహిత్య విలువలు కలిగించినాడు. స్వాతంత్ర్యం రాకపూర్వం, స్వాతంత్ర్యం వచ్చిన తరువాత, నవలలు వ్రాసి సమాజానికి అద్దంపట్టిన కొద్ది రచయితల్లో ఈ నవలాకారుడు ఒకడు ఒకవైపు స్వాతంత్ర్య కాంక్ష, ఇంకొకవైపు ఇతర రాజకీయ మనోవైజ్ఞానిక తత్వాల వత్తిడి, మరొకవైపు పాశ్చాత్య విద్యా ప్రభావం, వాటన్నిటికి లోనైన సమాజం స్పష్టాస్పష్టమైన స్వరూపం దాల్చి ఉన్నప్పుడు, ఈ నవలలు వెలువడినాయి. అందుచేతనే వాటిలో ఈ సంక్లిష్ట స్వభావంతోబాటు, సామాజిక పరిణామగతి కూడా కనిపిస్తున్నది. ఈ విధంగా కూడ గోపీచందు రచనలు తెలుగువారికి పఠనీయాలే అయినాయి.

ఏదో ఒక సంప్రదాయ పరిధిలో కూర్చొని, దాన్ని మాత్రమే తన రచనల్లో చిత్రించడానికి ప్రయత్నం చేసేవాడు కాడు గోపీచందు. పాశ్చాత్య సాహిత్యంతోబాటు, ఆ దేశాల్లో వికసించిన అనేక శాస్త్రాలను అవగతం చేసికొన్నాడు. వాటి ప్రభావం మానవత్వం మీద ఏ విధంగా పనిచేస్తున్నదీ పరిశీలించినాడు. మన దేశంలోని తరతరాల సంప్రదాయాలను, వాటికి వ్యతిరేకంగా జరుగుతున్న సంఘర్షణలను దర్శించినాడు. ఇంతటి వస్తుజాలాన్ని

తన సొంతం చేసుకొని, రచనారంగంలో ప్రవేశించినాడు. కాబట్టే శక్తిమంత మైన రచనలు అతని కలం నుంచి వెలువడినాయి. సమకాలీన పాఠకుల్ని ఆకర్షించడమేకాక, ఈనాటి పరిశీలకుల దృష్టి కూడ వాటి మీద పడింది.

మనోవైజ్ఞానికశాస్త్రం దృష్టిలో పెట్టుకొని వెలువడిన నవలల్లో, ఏ ప్రమాణంతో చూసినా, అసమర్థుని జీవయాత్ర మన భాషలో ముందు వరస లోనే నిలబడుతుంది. వ్యక్తులతోబాటు ఒక సమాజంలోని విభిన్న శక్తుల మధ్య జరిగే సంఘర్షణ ఈ నవలల్లో రచయిత చక్కగా వ్యక్తం చేసినాడు. ఈ నవల కథానాయకుడు ఎంతటి సంక్లిష్ట స్వభావం కలిగినవాడో చూడండి. అతనికి 'తన తాత తండ్రుల్లాగా నిరంకుశంగా ప్రవర్తించరాదనే ఆశయం ఉన్నది. దాంతోపాటుగా మానవతా దృక్పథం ప్రదర్శించాలనే ఆదర్శం కూడ ఉన్నది చుట్టూ కనిపించే దాంపత్య జీవితానుభవాలు తన జీవితంలోకి ప్రవేశించగూడదనే ఆశయం ఉన్నది. దాంతోపాటే పెండ్లి చేసికోకూడదనే ఆదర్శం కూడ ఉన్నది. తోటి వారిలాగా అజ్ఞానిగా మారకూడదనే ఆదర్శం కూడ ఉన్నది. మేధావిగా రూపొందాలనే ఆదర్శం కూడ ఉన్నది. ఇన్ని 'ఆదర్శాలు' ఉన్నవాని కథ ఏ విధంగా ఉంటుందో అదే 'అసమర్థుని జీవ యాత్ర'. తనకుమాలిన ధర్మాన్ని ప్రదర్శించడంలోను, దూరదృష్టిని ప్రదర్శించ డంలోను, జీవిత సమస్యలను పరిష్కరించలేకపోవడంలోను, విపరీత పరి ణామం కలుగడం సహజం. అసమర్థతయే జీవలక్షణంగా కలిగిన సీతారామ రావు నిరాశావాద ధోరణి, దాని పరిణామంగా కలిగిన ఉన్మాదావస్థ విపరీత పరిణామమే. అందుచేత సీతారామరావు నాకు ఒక వ్యక్తిగాకాక, ఒక సామా జిక వ్యవస్థకు ప్రతినిధిగా కన్పిస్తాడు.

గోపీచందు వ్రాసిన సాంఘిక నవలల్లో పండిత పరమేశ్వరశాస్త్రి వీలు నామా ముఖ్యమైందే. సమకాలీన జీవితానికి ప్రతిబింబప్రాయంగా ఉన్నది. చాలచోట్ల ఈ నవలలో గోపీచందు స్వయంగా దర్శనమిస్తాడు. అయితే శిల్పమూ, కథాచిత్రణా ఎలా వున్నా, అనేకానేక యథార్థ విషయాలు ఈ నవ లలో ధ్వనిప్రాయంగా కనిపిస్తాయి. కాని, స్పష్టంగా వ్యక్తులను బయటకు రానీయవు. సినిమారంగం గురించి చెప్పినా, ఛాందస ప్రవృత్తి కలిగిన

వ్యక్తులను చిత్రించినా, గోపీచందు సహజత్వంతోబాటు వ్యంగ్యాత్మకంగా పాత్రచిత్రణ చేసినాడు. ఈ నవలలో శ్రీ అరవిందుల తాత్త్విక దర్శనం కూడ మనకు కలిగించి ధన్యుడైనాడు గోపీచందు.

డాక్టరు అమ్మంగి వేణుగోపాల్ చిరకాల మిత్రులు. ఆయన చేసే గోపీచందు రచనల పరిశోధనా కార్యక్రమాన్ని కొంతకాలం సన్నిహితంగా దర్శించే అవకాశం నాకు కలిగింది. అప్పుడే అనుకొన్నాను. ఈ యువ పరిశోధకుడు చక్కని గ్రంథం వెలువరిస్తాడని. నా ఆశ సఫలమైంది. గోపీచందు నవలల గురించి అన్ని కోణాల నుంచి నిశితంగా పరిశీలించి మంచి సిద్ధాంత వ్యాసాన్ని సిద్ధంచేసినాడు వేణుగోపాల్. పరీక్షకుల మన్ననలను అందుకొన్నాడు. విశ్వవిద్యాలయం నుంచి డాక్టరేటు పొందినాడు. ఇప్పుడు ఈ గ్రంథాన్ని మీకు అందిస్తున్నాడు. పరిశోధన దృష్టి కలిగిన వారికేకాక, సామాన్య పాఠకులకు కూడ ఒక ఉత్తమ రచయిత దర్శనం, ఈ గ్రంథం కలిగిస్తున్నదని నా పరిపూర్ణ విశ్వాసం.

విజ్ఞానపురి–హైదరాబాదు

29-4-'88

ఎం. కులశేఖరరావు

# The Merits of the Thesis

**Dr. B.V. KUTUMBA RAO**
M.A., B.Ed., Ph.D.

Dr. Venugopal, the maker of this thesis, who prosecuted his researches under my supervision, dived deep into the unfathomable depths of psychological analysis, while discussing about the state of minds of the variety of characters in this thesis and the state of the mind of the creator of the characters, namely, the author, late, Gopichand.

The scholar showed his stretch of imagination and understanding in V chapter while discussing how the incomplete novels of late Gopichand would have been completed, had he been alive.

The characteristics of art, craft, environmental influence, evolution, the trends of various schools of thought personality and the autobiographical element, are all well-kept, in mind, by the scholar, while making this thesis.

I wish him all success in life

Hyderabad
1-5-'88

Dr. B.V. KUTUMBA RAO
(Supervisor)

# కృతజ్ఞతలు

'నవలా రచయితగా గోపీచంద్' అన్న పరిశోధనాంశాన్ని సూచించిన వారు ఆచార్య సి. నారాయణరెడ్డి గారు. పరిశోధనకు అవకాశం ఇచ్చింది ఉస్మానియా విశ్వవిద్యాలయం వారు. 1984లో డాక్టరేట్ పట్టం వచ్చింది. పర్యవేక్షకులుగా అమూల్యమైన సలహాలను ఇచ్చిన వారు డా॥ బి.వి. కుటుంబ రావు గారు.

పరిశోధన తొలిదశ నుంచి గ్రంథరూపం పొందేదాకా సహకార ప్రోత్సాహాలను అందించిన మిత్రుడు డా॥ జి. చెన్నకేశవరెడ్డి. గోపీచంద్ జీవిత సాహిత్య విశేషాలను తెలియజేసిన పెద్దలు శ్రీ ఆవుల సాంబశివరావు లోకాయుక్త గారు, నా సందేహాలను తొలగించి సమాధానపరిచినవారు ఉస్మానియా మనోవిజ్ఞానశాస్త్ర శాఖ అధ్యక్షులు ప్రొ. ఎన్. యాదగిరిరెడ్డి గారు. అవసరమైన సమాచారం అందజేసినవారు ఆరుద్ర గారు, సంజీవదేవ్ గారు.

వెన్నుతట్టి ధైర్యం చెప్పిన సోదరుడు డా॥ పి. లక్ష్మీనారాయణ. అన్ని విధాలుగా తోడ్పడ్డ మిత్రులు కన్నస్వామి, డా॥ తిరుపతయ్య, జె. కొండన్న పి. చంద్రమౌళి, సుభాషిణి, ఎ. పాండయ్య, వేణు సంకోజ్, డా॥ నోముల సత్యనారాయణ, డా॥ వి. లక్ష్మీనారాయణ గారలు. అన్నివిధాలుగా సహక రించిన నా అర్ధాంగి విజయలక్ష్మి.

సమాచార సేకరణకోసం ఆంధ్రప్రదేశ్‌లోని ఎన్నో గ్రంథాలయాలను దర్శించవలసి వచ్చింది. ముఖ్యంగా వేటపాలెం గ్రంథాలయం వారు ఎంతో సహకరించారు.

అందరికీ నా కృతజ్ఞతలు.

మళ్ళీ ఒకసారి నా సిద్ధాంత వ్యాసాన్ని చదివి, తమ అభిప్రాయాలతో

నన్ను ప్రోత్సహించిన ఆచార్య ఎం. కులశేఖరరావు గారికీ, డా॥ బి. వి కుటుంబరావు గారికి హృదయపూర్వక ధన్యవాదాలు

సిద్ధాంత గ్రంథానికి అందమైన ముఖచిత్రాన్ని వేసి ఇచ్చిన మిత్రుడు శ్రీ సుదర్శన్ గారికి, అచ్చుకు సంబంధించిన అన్ని పనులను బాధ్యతతో నిర్వహించిన మిత్రులు శ్రీ వి. నరసింహారావు గారికి, కరెంటు కోత వున్నా సకాలానికి గ్రంథాన్ని అందంగా అచ్చువేసి ఇచ్చిన చంద్రశేఖర ప్రింటర్స్ యజమానులకూ, కార్మికులకూ నా ప్రత్యేక ధన్యవాదాలు.

ఈ గ్రంథం వెలుగు చూడాలని నిండు మనసుతో ఆకాంక్షించిన వారు గోపీచంద్ కుమారులు డా॥ టి. రమేశ్ గారు. తెలుగు విశ్వవిద్యాలయం వారు ఆర్థిక సహాయం చేసి వుండకపోతే ఈ సిద్ధాంత వ్యాసం ప్రచురితమై వుండేది కాదు.

వీరికి కృతజ్ఞతలు.

ఇరవైమూడు సంవత్సరాల మైత్రికి చిన్న గుర్తుగా ఈ గ్రంథాన్ని చెన్న కేశవరెడ్డికి అంకితం చేస్తున్నాను. నిండు మనస్సుతో స్వీకరించిన మిత్రునికి ధన్యవాదాలు.

1-5-1988

హైదరాబాద్

—అమ్మంగి వేణుగోపాల్

# విషయసూచిక

మూడవ ప్రకరణం



నాల్గవ ప్రకరణం



ఐదవ ప్రకరణం



## రెండవ భాగం

ఆరవ ప్రకరణం

ఏడవ ప్రకరణం



ఎనిమిదవ ప్రకరణం



తొమ్మిదవ ప్రకరణం

# భూమిక

గోపీచంద్ తన మొదటి కథానికను 1928 లోను, మొదటి నవలను 1943 లోను రచించాడు. అందువల్ల 1928 కి అనతిపూర్వం నుంచి 1943 వరకు దేశంలోను, ఆంధ్ర ప్రాంతంలోను నెలకొని వున్న ఆర్థిక సామాజిక రాజకీయ పరిస్థితులను సంక్షిప్తంగా తెలుసుకోవటం అవసరం.

ప్రముఖ హేతువాది, నాస్తికుడూ, బ్రాహ్మణేతరోద్యమ సృష్టికర్తా అయిన త్రిపురనేని రామస్వామి చౌదరి (కవిరాజు) గోపీచంద్ తండ్రిగారు. కవిరాజుగారు గోపీచంద్ పదమూడో ఏట, 1922 లో పుట్టి పెరిగిన కృష్ణా జిల్లాను వదిలి గుంటూరుజిల్లా తెనాలికి తరలివచ్చారు. ఒక పత్రికకు సారథ్యం వహించే ఉద్దేశంతో కవిరాజుగారు తెనాలి వెళ్ళటం జరిగింది. ఇదే సంవత్సరం గుంటూరు జిల్లాలో జరిగిన పన్నుల నిరాకరణోద్యమము చరిత్రాత్మకమైందిగా చెప్తారు.

1922—24 మధ్య కాలంలో విశాఖ ఏజెన్సీ ప్రాంతాలలో సీతారామారావు నాయకత్వంలో జరిగిన తిరుగుబాటు ఆంధ్రులకు ఎంతో ఉత్తేజాన్నిచ్చింది.

1930 లో గాంధీగారు చేపట్టిన ఉప్పు సత్యాగ్రహానికి ఆంధ్రులు స్వాగతం పలికారు ఏప్రిల్ 2 వ తేదీన కృష్ణా గుంటూరు జిల్లాలలో సత్యాగ్రహం జరిగింది ఇతర పట్టణ నాయకులతోపాటు తెనాలి న్యాయవాదులు కూడా చందాలిచ్చి ఉద్యమానికి తోడ్పడ్డారు. గుంటూరుజిల్లా 'కరవది'లో జాతీయ జెండాను ఊరేగించి ఎగరేసినందుకు అనేకులను ప్రభుత్వం అరెస్ట్ చేసింది. ఉద్యమానికి సంబంధించిన వార్తలు ప్రకటించకుండా ప్రభుత్వం నిషేధపుటుత్తర్వులు జారీచేసినప్పుడు, తెనాలి గోడల మీద పోస్టర్లు ప్రత్యక్షమయ్యాయి! దేశ వ్యాప్తంగా వున్న జాతీయ భావాలే, ఆంధ్ర దేశాన్నీ ఏలుతున్నాయనటానికి ఈ అంశాలు నిదర్శనం.

ప్రపంచ వ్యాప్త ఆర్థిక మాంద్యంవల్ల భారతీయ శ్రామికవర్గం పరిస్థితి పూర్తిగా దిగజారింది. 1931 లో ఒక పేదరైతు రెండెకరాల భూమిని కేవలం ఇరవైఅయిదు రూపాయలకు అమ్ముకున్న దయనీయ వాస్తవాన్ని రావి నారాయణరెడ్డిగారు తమ 'వీరతెలంగాణా, నా అనుభవాలు జ్ఞాపకాలు' పుస్తకంలో తెలియజేశారు. స్వాతంత్ర్యోద్యమంలో శ్రామిక జనులు అధిక సంఖ్యలో పాల్గొనటానికి ఈ నిరాశాజనక పరిస్థితులుకూడా దోహదం చేశాయి. ఈ సమయంలో రైతాంగ ఉద్యమాలను అణచివేయటానికిగాను దేశంలోని జమీందార్లతో బ్రిటిష్ పాలకులు సంబంధాలను పటిష్ఠపరుచుకున్నారు. క్రమంగా స్థిరపడుతూ వచ్చిన పెట్టుబడిదారీ వ్యవస్థవల్ల భారతదేశంలో శ్రామికుల సంఖ్యతోపాటు, మధ్య తరగతి ప్రజల సంఖ్య కూడా పెరుగుతూ వచ్చింది.

కులతత్వం కొంత సడలింది. జాతీయ విద్య ప్రాచుర్యాన్ని పొందలేక పోయింది. అస్పృశ్యతా వ్యతిరేక భావాలు ప్రచారంలోవున్నా, అవి మేధావి వర్గానికే పరిమితంగా వున్నాయి. అందుకే, ఆంధ్రలో గాంధీగారు పర్యటించి అస్పృశ్యతకు వ్యతిరేకంగా చేసిన ప్రచారం ఒక ముఖ్యమైన సంఘటన.

ఇక సాహిత్యానికి సంబంధించి, ఆంధ్రలో—

'సాహితీ సమితి'తోపాటు 'యువకవి మండలి', 'సారస్వత సమాజం' కవితా 'సమితి' మొదలైన ఇతర సంఘాలు కూడా ఉండేవి కాని, అవి ఏవీ కూడ 'సాహితీ సమితి' స్థాయిని అందుకోలేకపోయాయి. 1930 ప్రాంతాలకు ఈ చిన్నచిన్న సంఘాలనన్నిటిని మింగేసి 'నవ్యసాహిత్య పరిషత్తు' ఉద్భవించింది. దానినొక తెలుగు సారస్వతపీఠంగా రూపొందించాలనే ఆశయంతో ప్రారంభించినారు. దాదాపు ఆ స్థాయికి చేరుకున్నట్లే. కాని నిలబడలేక పోయింది." (శ్రీశ్రీ వ్యాసాలు) అని శ్రీశ్రీ అభిప్రాయపడుతున్నారు.

1930 వరకు ఆంధ్ర కవిత్వరంగాన్ని శాసించిన భావకవిత్వం ఆ తర్వాత కూడా కొంత కాలం తన ఆధిపత్యాన్ని కొనసాగించింది. మన జాతీయోద్యమం, పాశ్చాత్య దేశాల నుంచి దిగుమతి అయిన వినూత్న వాదాలు, రష్యా నుంచి వీచిన మార్క్సిస్టు వీచికలు. ఫ్రాయిడ్‌వంటి మనోవైజ్ఞానికుల

పరిశోధనలు మన తెలుగు సాహిత్యాన్ని ప్రభావితం చేశాయి. ఈనేపథ్యంలో కొడవటిగంటి కుటుంబరావు జీవితానికి దగ్గరగా కథలను రాయటానికి పూను కున్నాడు.

1934 లో కమ్యూనిస్టు పార్టీ ఆంధ్రశాఖ రహస్యంగా ఏర్పడింది. క్రమంగా నెల్లూరు, తెనాలి, బెజవాడవంటి ప్రదేశాల్లో ఆ పార్టీ శాఖలు ఏర్ప డ్డాయి. కమ్యూనిస్టులతోపాటుగా కాంగ్రెసు సోషలిస్టులు, యం. యన్. రాయ్ అనుచరులు కూడా బలపడ్డారు.

రెండో ప్రపంచ యుద్ధం ప్రపంచ రాజకీయాలనే మలుపు తిప్పింది. ప్రజల ఆమోదం లేకుండా భారతదేశాన్ని యుద్ధంలోకి లాగినందుకు కాంగ్రెస్ పార్టీ తీవ్ర అభ్యంతరాన్ని తెలియజేసింది. అంతేకాదు, అది సహాయ నిరాకరణ వైఖరిని అవలంబించింది. ఈ యుద్ధాన్ని ఫాసిస్టు వ్యతిరేక యుద్ధంగా వర్ణించి, ప్రజాస్వామ్యవాదులందరూ యుద్ధంలో మిత్ర రాజ్యాలతో సహకరించాలని యం. యన్. రాయ్ వాదించాడు.

వామపక్షభావాలు అటు రాజకీయరంగంలో, ఇటు సాహిత్యరంగంలో కూడా క్రమంగా బలపడ్డాయి. సాంఘిక ప్రయోజనమే సాహిత్య లక్ష్యమనే భావం పునాదిగా అఖిల భారతాభ్యుదయ రచయితల సంఘం అవతరించింది.

ప్రఖ్యాత రచయిత ప్రేమ్‌చంద్ అధ్యక్షతన 1936 లో లక్నోలో ఈ సంఘం మొదటిసారి సమావేశమై తన లక్ష్యాలను నిర్వచించింది. 1943 లో ఆంధ్రదేశంలో అభ్యుదయ రచయితల సంఘం అవతరించింది. తెనాలిలో తాపీ ధర్మారావుగారి అధ్యక్షతన సభ జరిగింది. అయితే, రాయ్ ప్రభావం వల్ల, కమ్యూనిస్టు వ్యతిరేకతను పెంచుకున్న గోపీచంద్ అరసం కు దూరం గానే వున్నాడు.

1943 ప్రారంభం నాటికి కనుచూపుమేరలో యుద్ధం ముగిసే సూచ నలు లేవు. మిత్రరాజ్యాల పరిస్థితి బలహీనంగా ఉన్నది. 'క్విట్ ఇండియా' ఉద్యమం తీవ్రత తగ్గలేదు. యుద్ధంవల్ల బ్రిటన్ బలహీనపడుతుందనీ, యుద్ధం

తర్వాత దేశానికి స్వాతంత్ర్యం తప్పక లభిస్తుందనీ యం యన్. రాయ్ ప్రచారం చేస్తున్నాడు.

గోపీచంద్ అనగానే ఎవరికైనా వెంటనే గుర్తుకు వచ్చేది. 'అసమర్థుని జీవయాత్ర'. 'అసమర్థుని జీవయాత్ర'తో తెలుగు నవల మలుపు తిరిగింది. గోపీచంద్ సృజనశక్తి పరాకాష్ఠను అందుకున్న రచన ఇది. అయితే ఆ తర్వాత ఆయన రాసిన నవలలేవీ 'అసమర్థుని జీవయాత్ర' దరిదాపుల్లోకి కూడా రాలేవు. అయితే గోపీచంద్ రచనలకు ఒక వ్యక్తిత్వం వుంది. సాంఘిక ప్రయోజనంకోసం స్పష్టమైన అవగాహనతో గోపీచంద్ కలం పట్టాడు. దాదాపు ప్రచారకుడుగా గోపీచంద్ సాహిత్యరంగంలోకి అడుగు పెట్టాడు. తొలి రచనల మీద తండ్రిగారి ప్రభావం పూర్తిగా వుంది. అయితే, కేవలం వ్యక్తిత్వాలు మాత్రమే ఏ రచయితనూ ప్రభావితం చేయవు. సాంఘిక పరిస్థితుల నుంచి ప్రేరణపొంది, ఆ ప్రేరణకు అనుగుణంగా స్పందించి రచనలుచేసే రచయితల విషయంలో 'ప్రభావం' అన్న మాటను జాగ్రత్తగా ఉపయోగించవలసి వుంటుంది. కవిరాజుగారు గోపీచంద్ విషయంలో తొలి సన్నిహిత ఆదర్శవ్యక్తి మాత్రమే. నాస్తిక హేతువాదభావాలు కవిరాజుగారికి బ్రాహ్మణేతరోద్యమం నిర్మించటానికి పనికివచ్చాయే తప్ప, సామ్యవాదభావాలను కలిగించలేకపోయాయి కవిరాజుగారికి జమీందార్ల జస్టిస్ పార్టీతోగల సంబంధాలు ఈ విషయాన్నే వెల్లడి చేస్తున్నాయి. తండ్రిని ఆకర్షించని సోషలిస్టు భావాలు గోపీచందీను ఆకర్షించటం గమనార్హం. ఇక్కడ గోపీచంద్ కొంతలో కొంత స్వతంత్ర వ్యక్తిగా గోచరిస్తున్నాడు. అయితే, గోపీచంద్‌లో విశ్వాసంపట్ల విధేయతకన్నా, అవిశ్వాసం ఎక్కువ. ఇది గోపీచంద్‌లో స్థిరచిత్తం లేదు అన్నంత దూరం పోయింది ఒక భావం లేదా ఆలోచన కలగగానే రచనకు పూనుకోవటం ఆరోగ్య లక్షణమే. కృత్యాద్యవస్థకు లోను కాకుండా రచనను పూర్తి చేయటానికి ఈ లక్షణం తోడ్పడింది. అయితే, రచనా శిల్పంపట్ల ఎక్కువ శ్రద్ధ చూపకపోవటంవల్ల 'అసమర్థుని జీవయాత్ర' స్థాయిలో తక్కిన నవలలేవీ రాలేదు. 'పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా' మామూలు నవలగా రూపొందింది. ఫలితంగా గోపీచంద్ రెండో శ్రేణి నవలా రచయితగానే రూపొందాడు. ఈ పరిణామానికి మరో కారణం కూడా

వుంది. ఆధ్యాత్మిక భావ ప్రభావానికి లోనైన తర్వాత నవలా రచనకు పూనుకున్న సందర్భంలో శిల్పం వంటివీ, పాఠకుల దృష్ట్యా రచనను సమీక్షించుకోవటంవంటివీ గోపీచంద్ దృష్టికి చిన్న విషయాలుగా తోచివుంటాయి.

కొన్ని లోపాలున్నా, మేధావులకోవకు చెందిన రచయితగా గోపీచంద్ స్థానం సుస్థిరం. గోపీచంద్ రచనల్లో ఒక ఆలోచనాశీలి ప్రతి అక్షరంలోనూ కనిపిస్తాడు. ఒక నిజాయితీపరుడు ప్రతి అక్షరంలో కనిపిస్తాడు. తన ఆలోచనలను పాఠకునితో పంచుకోవటానికి ప్రతిక్షణం నిజాయితీతో గోపీచంద్ ప్రయత్నిస్తాడు. అందువల్ల ఆయన రచనలు ('బుడుతకీచు' వంటి కథానికలు తప్ప) అన్నీ స్పష్టంగా రూపొందాయి గోపీచంద్ తన రచన ద్వారా చెప్పదలచిన 'అంశాన్ని' ఎప్పుడూ పాఠకుడు అర్థం చేసుకుంటూనే వచ్చాడు. ఈ మేరకు 1940 ప్రాంతంలో కథానికలతోపాటుగా 'పరివర్తనం', 'అసమర్థుని జీవయాత్ర' నవలలు తెలుగు సాహిత్యంలో వాస్తవికతను సాధించటానికి గణనీయంగా తోడ్పడ్డాయి.

స్వాతంత్ర్యానంతరం దేశకాల పరిస్థితులు అన్ని వర్గాల మేధావులనూ నిరాశా నిస్పృహలకు లోనుచేశాయి. కమ్యూనిస్టు పార్టీల వైఫల్యం ఒకపక్కా, మతతత్వ శక్తుల విజృంభణ ఒకపక్కా యువతరాన్ని క్రుంగదీశాయి. నిజాయితినీ, దేశభక్తినీ ఎవరి నుంచి ఆశించామో ఆ రాజకీయ నాయకులు స్వార్థపరులై భూస్వామ్య పెట్టుబడిదారీ వర్గాల సహజస్వభావమైన ప్రజా వ్యతిరేకతను స్పష్టంగా ప్రకటించారు. స్వాతంత్ర్యోద్యమంలో కొత్తగా ఆవిర్భవించిన 'ప్రజాజీవితం' (Public life) అన్నది స్వాతంత్ర్యం రాక ముందే నటనతో నిండిపోవటం 'అసమర్థుని జీవయాత్ర'లో కనిపిస్తుంది రికమండేషన్లూ, లంచాలూ లేకుండా ఏ పనీ కాని పరిస్థితి స్వాతంత్ర్యానంతరం ఏర్పడింది (గడియపడని తలుపులు). ప్రభుత్వ యంత్రాంగం అన్నది పాములతో నిండిపోయిన వైకుంఠపాళిగా మారి సామాన్యుని కాటేసింది (యమపాశం). సంస్కర్తల కృషి ఫలితంగా స్త్రీల పరిస్థితి కొంతలో కొంత మెరుగ్గా వుండటంతో, తమ వ్యక్తిత్వ వికాసంకోసం సాహసాన్ని ప్రదర్శించే స్థితిలో వారున్నారు (శిథిలాలయం).

ఈ విధంగా స్వాతంత్ర్యానంతరం దేశకాల పరిస్థితులు కూడా గోపీచంద్ నవలల్లో బాగానే ప్రతిబింబించాయి.

ఈ సిద్ధాంత వ్యాసంలో మొదటి భాగంలో గోపీచంద్ నవలల పరిశీలనా, రెండో భాగంలో నవలా రచయితగా గోపీచంద్ వ్యక్తిత్వ పరిశీలనా వున్నాయి. నవలా ప్రక్రియనూ, తెలుగు నవలనూ, గోపీచంద్‌నూ మొదటి భాగంలోనే పరిచయం చేయటం జరిగింది.

గోపీచంద్ వివాదాస్పదుడు మాత్రమే కాదు, స్వతంత్ర వ్యక్తిత్వం వున్నవాడు కూడా. నిలకడలేనివాడు మాత్రమేకాదు, నిత్యాన్వేషి కూడా. ఇలాంటి అసాధారణ రచయితను అంచనా వేయటానికి నేను చేసిన ఈ ప్రయత్నం ఎంతవరకు సఫలమైందో నిర్ణయించవలసింది పాఠకులే.

మొదటి ప్రకరణం

నవల

# (అ) పరిచయం

విశ్వసాహిత్యంలో అత్యంతప్రాచుర్యంపొందిన సాహిత్యప్రక్రియ నవల. పదకొండో శతాబ్దపు ప్రారంభంలో జపాన్ దేశంలో నవలాప్రక్రియ ఆవిర్భవించినా,[1] బొకాషియో అనే ఇటలీదేశపు రచయిత రచించిన 'DECAMERON' అనే గ్రంథంలో ఆధునికనవల తొలిలక్షణాలను పరిశోధకులు గుర్తిస్తున్నారు. క్రీ.శ. 1348 లో వెలువడిన ఈ గ్రంథంలోని కదలు ఆ తర్వాతి వచనసాహిత్యం కళాత్మకంగా వికసించటానికి దోహదం చేశాయని చెప్పవచ్చు.[2] అయితే 'రొమాన్స్' భాషలో పుట్టి, ఆతర్వాత లాటిన్, ఫ్రెంచి మొదలైన భాషల్లోకి ప్రవేశించిన 'రొమాన్స్' అనే సాహిత్య ప్రక్రియే నవలా వికాసానికి తోడ్పడింది

ఆంగ్లభాషలో ఆధునిక నవలా వికాసం గూర్చి చర్చిస్తూ 'మధ్యయుగాలనాటి 'రొమాన్స్' ప్రక్రియ యథార్థ ప్రతిక్రియే నవల' అన్నాడు ఆర్నాల్డ్ కెటెల్.

ప్రతి యుగం తన అనుభవాలను, అనుభూతులను వ్యక్తం చేయటానికి అనువైన ప్రక్రియను సృష్టించుకుంటుంది. మధ్యయుగాల వీరపురుషుల వ్యవస్థకు ఈ కాల్పనిక ప్రక్రియ పూర్తిగా సరిపోయింది.

మొత్తంమీద నవల 'నవీనమైన' అనే అర్థాన్ని, 'పెద్దకథ' అనే భావాన్ని కలగలపు చేసుకొని, విశిష్టమైన రూపాన్ని సంతరించుకొని నిత్యనూతన పరిణామశీలంతో ముందుకు సాగుతున్నది.

ఖండాంతరయానం అభివృద్ధి చెందటం, గణనీయంగా అక్షరాస్యత పెరగటం, మధ్యతరగతివర్గం ఆవిర్భవించడం, యాంత్రికనాగరికత మూలంగా

స్త్రీల ఇంటిపని తగ్గటం వంటివి విశ్వవ్యాప్తంగా నవలాప్రాచుర్యానికి తోడ్ప డిన కొన్ని ముఖ్యాంశాలు. ముద్రణాయం త్రక్రమాభివృద్ధివల్ల, పత్రికావ్యాప్తి వల్ల, గ్రంథాలయాలు ఏర్పడటంవల్ల నవల ప్రజల అందుబాటులోకి వచ్చింది.

తొందరగా మార్పుకు లోనయ్యే సృజనాత్మకప్రక్రియ కావడంవల్ల నవలకు సార్వకాలిక ప్రామాణిక నిర్వచనం సాధ్యంకాదు. అయినా రచయి తలు, పరిశోధకులు దీన్ని నిర్వచించటానికి యత్నిస్తూనే ఉన్నారు.

''వివిధ విమర్శకులు, రచయితలు వివిధ నిర్వచనాలను సూచించారు' 'హాస్యరస ప్రధానవచన మహాకావ్యం' అని ఫీల్డింగ్, 'రచనాకాలానికి చెందిన యథార్థ జీవితచిత్రం' అని క్లేరారీవ్, 'ఒక ఇతివృత్తాన్ని కలిగిన కాల్పనిక గాథ' అని ప్రొఫెసర్ వారెన్, 'మంచినవలలోని అన్ని అధ్యాయాలు, అన్ని పుటలు, అన్నివాక్యాలు ఒకేఒక సృజనాత్మకమైన, అధికృతమైన సిద్ధాంతాన్ని ప్రతిధ్వనిస్తాయి, పునః ప్రతిధ్వనిస్తాయి' అని స్టీవెన్‌సన్....'' వివిధదృక్పథాల నుంచి నవలాప్రక్రియను స్పృశించే నిర్వచనాలు చేశారని పేర్కొంటూ, 'మానవ జీవితాన్ని వ్యాఖ్యానించే వచన కాల్పనికగాథే నవల' అంటూ బి.ఆర్. మల్లిక్ నిర్వచించారు.[4]

'నవల కేవలం కాల్పనిక వచనం కాదు అది మానవ జీవితానికి సంబం ధించిన వచనం. సమగ్రమానవుణ్ణి వ్యక్తీకరించటానికి యత్నించిన మొట్ట మొదటి కళారూపం'[5] అంటూ రాల్ఫ్‌ఫాక్స్ నిర్వచించాడు

నవలను అన్ని కోణాల నుంచి పరిశీలించిన అనుభవజ్ఞులు చేసిన నిర్వ చనాలను అధ్యయనం చేస్తే- నవలకు మానవజీవితంతో గాఢమైన ఆత్మీయత ఉన్నదనీ, అది వచనశరీరంలో కాల్పనికతా ప్రాణాన్ని నిలిపిందనీ తెలుస్తుంది.

మానవ ఉద్వేగలను నాటకీయంగా ప్రదర్శించే నవల నిస్సందేహంగా సాటిలేని ఆధునిక కళారూపం.

మిగిలిన ప్రక్రియలకన్నా నవల ఎక్కువ ప్రాచుర్యం సాధించటానికి ముఖ్యకారణం నాటకం, కావ్యంవంటి ఇతరప్రక్రియల లక్షణాలు ఇందులో ఇమిడి వుండటమే! సినిమా, రేడియో టెలివిజన్ వంటి ప్రజాబాహుళ్య సాధ నాలతో పోటీచేయగలిగిన స్థితిలోవున్న సాహిత్యప్రక్రియను కేవలం నవల

మాత్రమే. శతాబ్దాలుగా సాహిత్యరంగాన్ని పరిపాలిస్తూ వచ్చిన కవిత్వ స్థానాన్ని నవల ఆక్రమించింది ఆమేరకు నవల కొంత కవితాత్మకతను కూడా సాధించింది. పాఠకుడు తనకు వీలైనచోట చదువుకోవటానికి అను కూలంగా ఉండటం, సులభమైన వచనంలో సమకాలిక జీవిత చిత్రణ జరగటం వంటి అంశాలు నవలాప్రాచుర్యాన్ని పెంపొందించాయి 'మహాసంగ్రామానికి చెందిన సంఘర్షణాయుత సన్నివేశాలను ప్రదర్శించినట్లే, దుకాణం గుమాస్తా సాధారణ జీవితాన్ని కూడా ప్రతిఫలించగలగటం'6 వల్లా, పాఠకుడికి తన చరిత్రనే చదువుతున్న భ్రాంతిని కలిగించి, సమకాలీన జీవితాన్ని ప్రదర్శించ గలగటంవల్లా, నవల – ముఖ్యంగా సాంఘిక నవల మంచి ప్రాచుర్యాన్ని సాధించింది

 నవల - ముఖ్యాంగాలు

వస్తువుసూ, సంవిధానాన్నీ దృష్టిలో ఉంచుకొనిచూస్తే స్థూలంగా నవ లలో ఇతివృత్తం, పాత్రచిత్రణ, సన్నివేశం, సంఘటన, వాతావరణం, కాలం-స్థలం, సంవాదం కథాకథనం, ఉద్దేశం అనే ముఖ్యాంశాలు ఉంటాయి· భావచిత్రాలు, ప్రతీకలు వర్ణన వంటివి నవలాసమగ్రతకు తోడ్పడే ఇతర అంశాలు.

అయితే, వీటిని గూర్చి సంక్షిప్తంగా తెలుసుకునేముందు, నవలలో ఇవేవీ స్వతంత్రంగా ఉండవని గుర్తించవలసి ఉన్నది. నవలలో ఇవన్నీ అవినాభావ సంబంధం కలిగిన అంశాలే ''పాత్రను, ఇతివృత్తాన్ని కృత్రి మంగా మాత్రమే వేరుచేయగలం''7 అన్న రాబర్ట్ లిడ్డెల్ అభిప్రాయం ఇతర అంశాలకు కూడా వర్తిస్తుంది

*1* ఇతివృత్తం : రచయిత స్వీకరించిన కథావస్తువును క్రమ పద్ధతిలో వికసింపజేయటాన్ని ఇతివృత్తం అంటారు. సమగ్ర ఇతివృత్తంలో ప్రారంభం, వికాసం, ముగింపు వుంటాయి. సంఘటనల మధ్య క్రమబద్ధత వల్లా, పాత్రలమధ్య సరియైన సంబంధంవల్లా ఇతివృత్తంలో ఐక్యం సిద్ధిస్తుంది. ఇతివృత్తం వికసించేకొద్దీ భవిష్యత్తులో సంభవించే సంఘటనలపట్లా, తాము ఆసక్తి చూపే పాత్రల పరిణామం పట్లా పాఠకులకు కుతూహలం పెరుగుతుంది·

''కాలక్రమంలో అమర్చబడిన సంఘటనల కథనమే కథ. ఇతివృత్తం కూడా సంఘటనల కథనమే. కాని, ఇందులో సహేతుకతకు ప్రాముఖ్యం ఉంది''[8] అంటాడు ఇ.ఎం. ఫాస్టర్.

కొన్ని నవలల్లో పరస్పరం సంబంధం కలిగిన రెండు ఇతివృత్తాలు కనిపిస్తాయి.

ఇతివృత్త నిర్మాణాన్ని పరిశీలిస్తే రెండు రకాల నవలలు కనిపిస్తాయనీ, ఒకటి-శిథిలేతివృత్తంగల నవల, రెండు-సుసంఘటితేతివృత్తంగల నవల[9] అని విలియం హెన్రీ హడ్సన్ అభిప్రాయపడ్డాడు.

ఇతివృత్తం అస్థిపంజరం వంటిది. ఆకర్షణీయంగా ఉండదు. కాని, మొత్తం నవలా శరీరానికి అదే ఆధారం.

పాత్రచిత్రణ : నిజజీవితంలో ఒకవ్యక్తిని కొద్ది కొద్దిగా అర్థం చేసుకుంటాము. కాలం గడిచిన కొద్దీ అభివృద్ధి చెందిన సంబంధం వల్ల మర్రి కొంత అవగాహన కలుగుతుంది. అలాగే, నవలలోని పాత్రను గూర్చి మొదట్లో కొద్దిగా తెలిసినా, కాలక్రమంలో పాఠకుడి అవగాహన పెరుగుతుంది. అంటే, పాత్ర క్రమంగా ప్రాణం పోసుకుంటున్నదన్నమాట ఈ ప్రాణం పోసుకోవటం వెనుక ఉండే కీలకమే రచయిత శక్తి. అదే, పాత్రపోషణ శక్తి. జీవితంలో వ్యక్తిలాగానే నవలలో కూడా పాత్ర పరిణామం చెందుతుంది.

'జీవితమంటే సుఖదుఃఖాలు. ఒక మనిషి జీవితంలో అవి ఎలా సంప్రాప్తిస్తున్నవి ? ఆయా సందర్భాలలో ఆ మనిషి ఎలా ప్రవర్తిస్తున్నాడు ? ఈ రెండు విషయాల్నిబట్టి మనిషిలో వ్యక్తి వైశిష్ట్యం గోచరమౌతుంది. జీవితాన్ని కథగా మలిచే ప్రక్రియయైన నవలలో, అలా నిరూపింపబడే వ్యక్తి వైశిష్ట్యాన్నే పాత్రచిత్రణం అంటారు'[10] అని ఆర్. ఎస్. సుదర్శనంగారి అభిప్రాయం.

సాధారణంగా రచయితలు, పాత్రల పేర్లూ, ఆకారవిశేషాలూ, హావభావాలూ, వస్త్రధారణా, అలవాట్లూ, స్వభావంలోని ప్రత్యేకతా మొదలైన అంశాలను సంభాషణద్వారాగాని, వర్ణనలద్వారాగాని, స్పష్టం చేస్తుంటారు. పాత్రల మధ్యన తేడాను అరం చేసుకోవటానికి ఈ చిత్రణ తోడ్పడుతుంది

చిన్నపాత్రలు కూడా చాలాకాలం గుర్తుండే విధంగా చిత్రణ జరిగినప్పుడు రచయిత సామర్థ్యం వెల్లడవుతుంది.

నవలారచయిత తన పాత్రలలో అతిమంచిని, అతిచెడ్డను చిత్రించ రాదు. సహజత్వాన్ని, సంభావ్యతను, కళాత్మకతను దృష్టిలో ఉంచుకొని చూస్తే స్వభావంలో 'అతి' సమర్థనీయం కాదు.

సజీవ పాత్రను సృష్టించగలగటం నిజంగా నవలా రచయిత అద్భుతమైన శక్తికి నిదర్శనమే. అందుకే, 'ఈనాటి నవలల్లో అన్నీ ఉన్నాయి మానవ పాత్ర తప్ప'11 అనివాపోయాడు రాల్ఫ్‌ఫాక్స్.

ఉత్తమ నవలాకారుడు పాత్ర పరిణామం విషయంలో ఎప్పుడూ నిరంకుశంగా ప్రవర్తించాడు. ఈ అంశాన్ని దృష్టిలో ఉంచుకునే, పాత్రలకు కూడా కొన్ని హక్కులుంటాయని రాబర్ట్ లిడ్డెల్ భావించాడు.12

'పాత్రల ద్వారానే భావాలను ప్రకటించాలని'13 పాత్రలకు అత్యధిక ప్రాముఖ్యం ఇచ్చినవారు కూడా ఉన్నారు. ఒక మూస నుంచి తీసినట్లుగా, ఉండి పదేపదే దర్శనమిచ్చే పాత్రలను 'stock characters' అనీ, ఒక వర్గానికి చెందిన ప్రజలకు ప్రాతినిధ్యం వహించే పాత్రలను 'Type characters' అని కొందరు నిర్వచించారు.14

సాంఘిక నవలల్లో పాత్రలకు చాలా వరకు బహిర్ముఖత్వం ఉంటుంది. అంతర్ముఖత్వం అరుదుగా గోచరిస్తుంది. కాని, సాంఘిక నవలలే అయినప్పటికీ, మనోవైజ్ఞానిక నవలల్లోని ముఖ్య పాత్రలకు అంతర్ముఖత్వం ఉంటుంది, మనోవైజ్ఞానిక నవలా రచయితలు పాత్ర చిత్రణలో అనూహ్యమైన ప్రయోగాలు చేశారు. 'నవ్యత' అన్నది దానికదే ఒక ప్రయోజనంగా భాసించినప్పటికీ, మానవ ప్రవర్తన వెనుక ఉండే అజ్ఞాతశక్తుల మీద అదనపుకాంతిని ప్రసరింపజేసినందువల్లనే వారి ప్రయోగాలు ప్రయోజనాన్ని సాధించగలిగాయి.

3. సన్నివేశం : కథ జరుగుతున్న కాలంలో ఒక నిర్దిష్టక్షణంలో ఏర్పడే పరిస్థితుల కలయికే సన్నివేశం. 'ఒకానొక పాత్రగాని, పాత్రలుగాని

ఉన్నస్థితిని సన్నివేశ మనవచ్చు."[15] కాబట్టి సని,వేశాలు నవలలోని పర మార్థానికి చేర్చే మెట్ల వంటివి.

మానవ జీవితం అనేక సన్నివేశాల మయం. సన్నివేశాలలో మంచికో చెడుకో మనిషిని ప్రభావితంచేసేవి కొన్నైతే, యాంత్రికంగా, ప్రయోజన రహితంగా పునరుక్తమయ్యేవి అనేకం. అయితే, మానవ జీవన ప్రతిబింబ మైన నవలలో మాత్రం ముఖ్య పాత్రల జీవితానికి సంబంధించిన అన్ని సన్నివేశాలను కాక, ఇతివృత్తానికీ, శిల్పానికీ విధేయంగా ఉండే ప్రయోజ నాత్మక సన్నివేశాలను మాత్రమే రచయిత స్వీకరిస్తాడు.

ఏ నవల ఇతివృత్తంలోనైనా సన్నివేశాలు ప్రధాన స్థానాన్ని ఆక్ర మిస్తాయి. క్రమపద్ధతిలో అల్లబడిన సన్నివేశాలలోకి ఇతివృత్తం ప్రవహిస్తుంది. పాత్రలు, సంవాదం, వాతావరణం మొదలైన అంశాల సంగమస్థానం సన్ని వేశం.

ఒక సన్నివేశం మరో సన్నివేశానికి దారితీస్తుంది. సన్నివేశాలు పాత్రల రంగస్థలాలు పాత్రలు. బహిర్గతం కావటానికీ, నవల త్రికాలాలలో నడవటానికీ, పాత్రల సంబంధాలలో మార్పును సాధించటానికీ, రచయిత ఉద్దేశించిన ప్రయోజనాన్ని సాధించటానికి సన్నివేశం తోడ్పడుతుంది.

ఉద్రిక్తసన్నివేశాలలో శిలీముఖ సదృశమైన ఆవేశం, ప్రశాంత సన్ని వేశాలలో వెన్నెలవెలుగు లాంటి మానసిక వాతావరణం, నిరాశానిస్పృహ లలో చీకటి లాంటి మృత్యువు, జీవితానుభవం మధింపబడే సన్నివేశాలలో తాత్త్వికామృతం ఉన్మీలనం చెందుతాయి. వీటిని కథావసరాలకు తగినట్లుగా అవసరమైతే నాటకీకరించి ఉపయోగించుకోవటం రచయిత బాధ్యత

*4.* సంఘటన : ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని ఒక పాత్రను లేదా పాత్రలను ప్రభావితం చేసేటట్లుగా జరిగిన 'ఒక విషయాన్ని' సంఘ టన అనవచ్చు.[16] ఏదో ఒక జరిగిన విషయం ఉన్నప్పుడే అది సంఘటన అవుతున్నది. సంఘటన చాలా వరకు క్రియాత్మకమైనదే. అందువల్ల ఇది సన్నివేశం కంటే భిన్నమైనది. అయితే, సన్నివేశంలో సంఘటన, సంఘ టనలో సన్నివేశం ఉండవచ్చు.

సంఘటన నవలలో మలుపుకు దారి తీస్తుంది. పాత్రల పరిణామానికి బాటవేస్తుంది. మరికొన్ని సంఘటనలకు హేతువవుతుంది. సంఘర్షణకు ప్రేరకమౌతుంది.

సంఘటనల అమరికలో కాలక్రమానుసరణం లేకపోయినా, అంత స్సూత్రం అవసరమే.

సంఘటనలు ఎక్కువగా ఉండే నవలను సంఘటనాత్మక నవలలుగా విమర్శకులు గుర్తిస్తున్నారు. అయితే, నవల మనోవైజ్ఞానిక ప్రపంచంలో ప్రవేశించిన తర్వాత సంఘటనల సంఖ్య తగ్గిపోయింది. సంఘటనల ప్రభావం బాహిరంగా ఉన్నట్లే పాత్రల అంతరంగాల మీద కూడా ఉంటుంది

నవలలో ముగింపుకు ముందుండే సంఘటన మొత్తం నవలకు కేంద్ర బిందువై, రచయిత ఉద్దేశించిన పరమార్థానికి చోదకశక్తిగా కూడా ప్రాముఖ్యం సంతరించుకోవచ్చు.

వాతావరణం, సాంఘికార్థిక రాజకీయాది కారణాలు, పాత్రల మనస్తత్వం మొదలైనవి సంఘటన పుట్టుకకు కారణాలు కావచ్చు, దైవిక సంఘటనల కంటే,17 యాదృచ్ఛిక సంఘటనల కంటే, సహజ సంభవనీయ సంఘటనలు పాఠకునికి విశ్వసనీయంగా, ఆలోచనలు రేకెత్తించేవిగా వుంటాయి.

*5*. వాతావరణం : నవలలోని వాతావరణం నిజ జీవితంలోని వాతావరణం కంటే భిన్నమైంది. నవలలో చిత్రితమైన సంఘటనలు, వర్ణనలు పాత్రల ప్రవర్తన మొదలైన అంశాలు పాఠకుడిలో రచయిత కలిగించ దలచుకున్న మనస్థితితో సమన్వయం చెందటమే వాతావరణం.

నవలలోని కథా వస్తువును బట్టి రచయిత వాతావరణాన్ని సృష్టించుకుంటాడు. ఉదాహరణకు చారిత్రకనవలలో చారిత్రక వాతావరణాన్ని, సాంఘిక నవలలో సాంఘిక వాతావరణాన్ని సృష్టించుకుంటాడు. డిటెక్టివ్ నవలల్లోను, విజ్ఞానశాస్త్ర విషయ ప్రాముఖ్యం ఉండే నవలల్లోను కనిపించే వాతావరణం కొంత అసాధారణంగా ఉంటుంది. మనోవైజ్ఞానిక నవలల్లో ప్రధాన పాత్రల మానసిక వాతావరణ చిత్రణకు అవకాశమెక్కువ.

పాత్రల ఆలోచనలకు, అనుభూతులకు వాతావరణంతో తాదాత్మ్యం ఉంటుంది. పాత్రల స్థితిగతుల్లో మార్పు వచ్చినప్పుడు వాతావరణంలో కూడా మార్పు వస్తుంది. పాత్రలు ఒక వాతావరణం నుంచి మరో వాతావరణానికి భౌతికంగా మారినప్పుడు అనుగుణ్యానికి సంబంధించిన సమస్యలతో సత మతం కావటం చూస్తాము. పాత్రలు ప్రకృతి శక్తుల సంక్షోభానికి గురయిన ప్పుడు వాతావరణం కొంత క్రియాత్మకమైన పాత్ర వహిస్తుంది.

నవల ప్రారంభఘట్టంలో, ముఖ్య పరిణామాలను ధ్వన్యాత్మకంగా సూచించే సన్నివేశాలలో, ముఖ్యంగా ముగింపుల్లో రచయిత సాంకేతిక పద్ధ తులను అనుసరిస్తే వాతావరణ ప్రాముఖ్యం పెరిగే అవకాశముంది.

*6. కాలం_స్థలం :* వాతావరణంలో కాలస్థలాలు అవిభాజ్యమైనవి. నవలలో కాలాన్ని కథాకాలమని వ్యవహరిస్తుంటారు. నవలలో ఎప్పుడూ ఒక గడియారం ఉంటుంది.'18 అన్నాడు ఫాస్టర్. కాలక్రమాన్ని అనుసరించి కథ ఉండాలన్న నియమం లేదు. నవలలోని సంఘటనలను, పాత్రల ఆలోచనలను ఇతర అంశాలను దృష్టిలో ఉంచుకొని కథను త్రికాలాలలో నడపవచ్చు.

కాలపు చట్రాన్ని భేదించటానికి మానవుడు ప్రయత్నిస్తున్నట్లుగా కొన్ని నవలలు ప్రతిపాదిస్తున్నాయి. హీడెగార్ వంటి తాత్వికులు, ఐన్‌స్టీన్ వంటి మేధావులు కాలతత్వం గూర్చి చేసిన పరిశోధనల ప్రభావం, విజ్ఞాన శాస్త్ర పరిశోధనల ప్రభావం నవలా సాహిత్యం మీద లేకపోలేదు.19

నవలలో స్థలం కొంత స్థూలమైన పాత్రను వహిస్తుంది. దీన్ని దేశం అని కూడా వ్యవహరిస్తారు. 'గ్రామీణ వాతావరణం" 'నగర వాతావరణం' వంటి మాటలు స్థలాన్ని కూడా సూచిస్తాయి. విమర్శకులు నవలలోని ఇతర అంశాలతో పాటు 'కాలస్థల ఐక్యాన్ని' కూడా పరిశీలిస్తారు.

*7. సంవాదం :* పాత్రల మధ్యన జరిగే సంభాషణను 'సంవాదం' అనీ, పాత్ర తనలో తాను మాట్లాడుకోవటాన్ని 'అంతరసంభాషణ' అనీ అంటారు. నవలలో నాటకీయతను సాధించటానికి ఇవి పనికి వస్తాయి.

పాత్రల మాటతీరు సహజంగా, పాత్రల స్వభావాలకు తగినట్లుగా ఉండటం చాలా ముఖ్యం. మాండలిక భేదాలను, విద్యార్జన వల్ల మాటతీరులో

వచ్చే మార్పులను, పట్టణ గ్రామీణ భేదాలను పాత్రల సంభాషణలో వెల్లడించటానికి రచయిత కృషిచేయవలసి ఉంటుంది.

ఇద్దరి మధ్య జరిగే సంభాషణ కంటే గుంపులోని పాత్రల మధ్య జరిగే సంభాషణను నిర్వహించే విషయంలోను, వాక్కుకు, చేష్టకు మధ్య సమన్వయం సాధించటం విషయంలోను రచయిత ఎక్కువ శ్రద్ధ తీసుకోవలసి ఉంటుంది.

అవసరాన్ని మించిసాగే సుదీర్ఘ సంభాషణలు నవలలో ఇమడవు. వీని వల్ల పాత్ర చిత్రణ దెబ్బ తింటుంది. సన్నివేశాలు బిగువును కోల్పోతాయి. వాతావరణం కాంతిహీనమౌతుంది. కాల్పనిక భ్రమ చెదిరిపోతుంది.

*అంతర సంభాషణ* : పాత్ర తనలోతాను మాట్లాడుకోవటాన్ని అంతర సంభాషణ" అంటారు. తనలో మాట్లాడుకోవటానికీ, తనతోతాను మాట్లాడుకోవటానికి కొంత తేడా వుంది. పాత్ర తనతోతాను మాట్లాడుకున్నప్పుడు తాత్కాలికంగా నైనా రెండుగా చీలిపోతుంది.

ప్రతి నవలలో అంతర సంభాషణ అక్కడక్కడా కనిపించినా మనో వైజ్ఞానిక నవలల్లోనే ఇది ఎక్కువ. ముఖ్యంగా 'చైతన్యస్రవంతి' పద్ధతి నవలల్లో అంతర సంభాషణ ఒక ప్రధాన అంతర్భాగంగా కనిపిస్తుంది.

పాత్ర తప్పనిసరిగా 'మాట్లాడుకోవలసిన' అవసరంలేదు. భావాల రూపంలో, ఊహల రూపంలో, ఆలోచనల రూపంలో అనుభూతుల రూపంలో 'అంతర సంభాషణ' పాత్ర అంతరంగంలో ప్రవహిస్తుంది. ఇతర శ్రోత లెవరూ ఉండరు కనుక ఆలోచనల వ్యక్తీకరణలో దాపరికం ఉండదు. ప్రతి అక్షరాన్ని రచయితే రాసినా, అతని జోక్యం తక్కువగా ఉన్నట్లు అనిపిస్తుంది. కొంత నాటకీయత కూడా సిద్ధిస్తుంది. వాక్యసంవిధానం భావవిధేయంగా గాని, భావాతీతంగా గాని ఉండవచ్చు. సాధారణంగా అలాంటి సందర్భాలలో కథనంలో ఒక క్రమం ఉండదు. ఒక్కొక్కసారి అంతర సంభాషణ పాఠకుడి తర్కానికి కూడా అందకుండా ఉండవచ్చు.

బాహిర ప్రపంచానికీ, పాత్ర అంతశ్చేతనకూ గల సంబంధాన్నికూడా పాఠకుడు అంతర సంభాషణలో గమనించవచ్చు.

8. కథాకథనం : కథను చెప్పే పద్ధతినే కథాకథనం అంటారు. రచయిత తన నవలలోని ఇతివృత్తాన్ని, పాత్రలను సన్నివేశాలను, సంఘటనలను, ఇతర అంశాలను పాఠకుడి ముందు ప్రదర్శించడానికి ఎన్నుకునే పద్ధతిని కథాకథనంగా చెప్పుకోవచ్చు. మొదట్లో కథాకథనం పట్ల అంత పట్టింపు వుండేదికాదు. ప్రఖ్యాత అమెరికన్ నవలా రచయిత హెన్రీజేమ్స్ తన నవలలకు రాసుకున్న పీఠికల మూలంగా కథాకథనంపట్ల రచయితలకు ఆదరం ఏర్పడింది. కథాకథనం గూర్చి చెప్పటమంటే, ఒక విధంగా కథకుడికీ కథకూ మధ్యన ఉండే సంబంధాన్ని చర్చించటమే.

కథాకథనాన్ని స్థూలంగా 'పరాశ్రయ పద్ధతి', 'ఆత్మాశ్రయ పద్ధతి' అంటూ రెండుగా విభజించవచ్చు. రచయిత కథలో పాల్గొనకుండా ప్రథమ పురుషలో కథ చెప్పే విధానం 'పరాశ్రయ పద్ధతి'. ఈ పద్ధతిలో రచయిత 'సర్వజ్ఞత్వం' ప్రదర్శిస్తాడు. ఒకే పాత్రకు పరిమితమై, ఆ పాత్ర దృష్ట్యా కథను చెప్పటం ఈ పద్ధతిలో మరో విధానం. ఆత్మాశ్రయ పద్ధతిలో కథను చెప్పినప్పుడు ఇతర పాత్రల అంతరంగాలను గూర్చి సాధికారంగా చెప్పటానికి రచయితకు ఇబ్బంది కలుగుతుంది. నవలలోని ముఖ్యపాత్రలు ఒకరి తర్వాత ఒకరు ఆత్మాశ్రయ ధోరణిలో కథను చెప్పటం ఈ పద్ధతిలో మరో విధానం. ఏ పద్ధతిని ఎన్నుకున్నా సహజ సరళ భాషలో కథాకథనం కొనసాగితే నవలకు అదనపు విలువ చేకూరుతుంది. కథాకథనంలో సమంజసమైన సంక్షిప్తత వల్ల నవలకు సమగ్రత చేకూరుతుంది.

కథాకథనంలో నవలా రచయితలు అవలంబించే మరికొన్ని పద్ధతులు:

1 ఉత్తరాల ద్వారా కథను చెప్పటం

2. డైరీ పద్ధతిలో కథను చెప్పటం

3. ముఖ్య పాత్రలు ఒకరి తర్వాత ఒకరు కథ చెప్పటం

4. పైన పేర్కొన్న పద్ధతులలో ఒకటికంటే ఎక్కువ విధానాలను ఒకే నవలలో అనుసరించటం.

రచయిత తన ఇతివృత్తానికి ఏది తగిన పద్ధతో ఎన్నుకొని, ఆ పద్ధతిలో రచనకు పూనుకుంటాడు. చైతన్య స్రవంతి పద్ధతిని, మనోవిశ్లేషణ విధా

నాన్ని, కవితాత్మక శైలిని కథాకథనంతో మేళవించే రచయితలు కూడా ఉన్నారు.

ఇతివృత్తానికి కళాత్మకతను ప్రసాదించేదిగా, పాత్రలకు అదనపు జీవితాన్ని ప్రసాదించేదిగా, సన్నివేశాల మధ్యన అంతస్సూత్రాన్ని బలపరిచేదిగా, ఉద్దేశాన్ని సరళంగా శక్తిమంతంగా మలిచేదిగా ఉన్నప్పుడే, రచయిత ఎన్నుకున్న కథాకదనం ప్రయోజనదాయకం అవుతుంది.

*9. ఉద్దేశం* రచయిత ప్రకటించదలచిన విశ్వాసాన్ని, లేదా ప్రతిపాదించదలచిన సిద్ధాంతాన్ని ఉద్దేశం అంటారు. ఉత్తమశ్రేణి రచయిత తన ఉద్దేశాన్ని పాత్రల ద్వారా కళాత్మకంగా వ్యక్తం చేస్తుంటారు. నిజానికి ఆ ఉద్దేశాన్ని దృష్టిలో ఉంచుకొనే ఇతివృత్తాన్ని, పాత్రలను, సన్నివేశాలను సృష్టించటం జరుగుతుంది. 'రచయిత ప్రకటించదలచిన జీవిత వ్యాఖ్యయే యీ యుద్దేశము'.2

రచయిత జీవిత దృక్పథం వెల్లడి అయ్యే అంశం కావటం వల్ల, ప్రారంభం నుంచి ముగింపువరకు నవలలో అంతస్సూత్రం కావటం వల్ల, ఈ అంశం ప్రధానమైంది. రచయిత సాధారణంగా ముఖ్యపాత్ర ద్వారా తన ఉద్దేశాన్ని ప్రకటిస్తుంటాడు. నవలలో ఒక సమస్యను చిత్రించినప్పటికంటే, ఆ సమస్యకు పరిష్కారం సూచించినప్పుడే రచయిత ఉద్దేశం స్పష్టంగా వెల్లడవుతుంది. సామ్యవాద విశ్వాసాలు బలంగా ప్రతిబింబించే రష్యన్ నవలల్లో ఈ అంశం ప్రముఖంగా కనిపిస్తుంది. సాంఘిక ప్రయోజనాన్ని కాంక్షించే రచయితల నవల్లో కూడా ఈ అంశం ముఖ్యస్థానం ఆక్రమిస్తుంది. కొన్ని నవలల్లో కనిపించే 'నిబద్ధత' కూడా ఆయా రచయితల ఉద్దేశమే.

*ఇతర అంశాలు* : పై అంశాలే కాకుండా భావ చిత్రాలు, వర్ణనలు, ప్రతీకలు-వంటి ఇతర అంశాలు కూడా నవలలో అంతర్భాగాలే.

నవలలో భావచిత్రాలు రచయిత భావనాశక్తిని నిరూపిస్తాయి. కవితాత్మక శైలికి భావచిత్రాలు వన్నె తెస్తాయి. ఒక అంశాన్ని విశదం చేయటానికి లేదా పరిచయం చేయటానికి రచయిత వర్ణనలను ఆశ్రయిస్తాడు కొన్ని భావాలను సాంకేతికంగా చెప్పటానికి ప్రతీకలను సృష్టిస్తాడు. నవలను ధ్వన్యా

త్మకంగా నిర్మించదలచుకున్న రచయితలకు ఈ అంశాలు ఎంతగానో ఉపక రిస్తాయి.

*ముగింపు:* నవలా రచనలో నిత్యనూతన విధానాలు విప్లవాత్మక మైన మార్పులు విశ్వవ్యాప్తంగా చోటుచేసుకుంటున్నాయి. అందువల్ల విమర్శ కులు సరికొత్త కోణాల నుంచి నవలను పరిశీలిస్తున్నారు. ఈ ప్రయత్నంలో వారు రేఖాగణితశాస్త్ర భాషను, సంగీతచిత్రలేఖనాది లలితకళల పరిభాషను, ఇతర అనేక సంకేతాలను ఉపయోగించుకుంటున్నారు. ఈ విధంగా ఆధునిక నవల పరిధితో పాటుగా సాహిత్య పరిధి కూడా విస్తృతమౌతున్నది.

## (ఇ) నవలల విభజన

ఇతివృత్తనిర్మాణాన్ని బట్టి పరిమిత ఇతివృత్తం గల నవలలు, విస్తృత ఇతివృత్తం గల నవలలు అంటూ స్థూలంగా విభజించవచ్చు. మొదటి రకం నవల సగటు నవల. ఈ నవలలో రచయిత కొన్ని పాత్రలపైన, ఒకటి రెండు అంశాలపైన మాత్రమే తన దృష్టిని కేంద్రీకరిస్తాడు. సంఘటనల సంఖ్య సన్నివేశాల సంఖ్య కూడా పరిమితంగా ఉంటుంది. ఇలాంటి నవలల్లో సహేతు కతకు, సమస్యా పరిష్కార సూచనకు తగినంత అవకాశం ఉంటుంది. రెండో రకం నవల పెద్ద నవల. ఈ నవలలో రచయిత అనేక అంశాల మీద, సమస్యల మీద తన దృష్టిని కేంద్రీకరించటంవల్ల ఇతివృత్తం బిగువు సడలి ఉంటుంది. సంఘటనల సంఖ్య అధికంగా ఉంటుంది.

మరో విధంగా నవలను (1) సాంఘిక నవల (2) చారిత్రక నవల (3) అపరాధ పరిశోధక నవల (4) మనోవైజ్ఞానిక నవల- అంటూ ముఖ్యంగా నాలుగు విధాలుగా విభజించవచ్చు.

***1.* సాంఘిక నవల :** ఒక ప్రదేశంలోని నిర్దిష్ట కాలానికి చెందిన మానవ జీవితం మీద సాంఘిక ఆర్థిక ప్రభావాలను ప్రతిబింబించే నవల సాంఘిక నవల. ఈ నవల పారిశ్రామిక విప్లవం రోజుల్లో ప్రాముఖ్యం సంత రించుకున్నది. చాలావరకు సాంఘిక నవల పరిమిత ఇతివృత్తాన్ని, తత్క్షణ స్థానిక ప్రాముఖ్యాన్ని కలిగి ఉంటుంది. వరకట్నం, విడాకులు, జాతి విచక్షణ

వంటి సమస్యలు ప్రతిఫలించినప్పుడు సమస్యాత్మక నవలగానూ, ఒక వర్గాన్ని ఖండించి, మరొక వర్గాన్ని సమర్థించటమే రచయిత ఉద్దేశమైనప్పుడు ప్రచారక నవల గానూ సాంఘిక నవలను గుర్తించవచ్చు.

చారిత్రక నవలలోని ఇతివృత్తం ఒకప్పటి సంఘానికి సంబంధించిందే! మనోవైజ్ఞానిక నవలలోనూ, అపరాధ పరిశోధక నవలలోనూ సంఘం పాత్ర తప్పనిసరి అవుతోంది. అందువల్ల, ఇవి పాక్షికంగా సాంఘిక నవలా లక్షణాలు కలవే?

సమకాలీన రాజకీయాలు, వివిధ వర్గాల ప్రజల దైనందిన జీవితం, జీవిత సమస్యలు, ప్రభుత్వ యంత్రాంగం, మార్పుకు లోనయ్యే విలువలు, భిన్నమనస్తత్వాలు మొదలైన అసంఖ్యాక అంశాలు సాంఘిక నవలలో మాత్రమే చోటు చేసుకోగలవు. మనిషి జీవితాన్ని వ్యక్తంచేసే బలమైన సాధనం కావటంవల్ల విశ్వసాహిత్యంలో సాంఘిక నవల స్థానం అద్వితీయమైనది.

**2 చారిత్రక నవల :** నిజంగా జరిగిన ముఖ్య సంఘటనలు కొంతవరకు కనిపించేదీ, ఒకప్పుడు జీవించిన వ్యక్తులు తిరిగి జీవంపోసుకునేది ఒక్క చారిత్రక నవలలోనే! నిస్సందేహంగా చారిత్రక నవలకు సంబంధించిన ఇతివృత్తం, పాత్రలు, సంఘటనలు గతకాలానికి చెందినవే. తాను రాయదలచుకున్న చారిత్రక నవల కాలస్థలాలకు సంబంధించి, సాంఘిక రాజకీయ ఆర్థిక పరిస్థితులను గూర్చి అవసరమైతే రచయిత కొంత పరిశోధన కూడా చేయవలసి ఉంటుంది.

తనకు ప్రత్యక్ష పరిచయంలేని సంఘాన్ని నవలలో చిత్రీకరించి పాఠకులను మెప్పించటం రచయితకు అగ్నిపరీక్షే. '....చారిత్రక నవలలో దేశకాల పరిస్థితులకు చారిత్రకత వుంటుంది అనగా, ఆదేశం యొక్క గత చరిత్ర ఫలితంగా ఆనాటి సమాజం అలా వుందనే.. స్పృహ పాఠకుడికి కలుగుతుంది. చారిత్రక నవలలోని మరొక విశేషం దేశకాల నిర్దిష్టత. ఆ దేశకాల విశిష్ట పరిస్థితులలో తప్ప ఆ కథ అలా జరగదని అనిపిస్తుంది. చారిత్రక నవలలోని మరో ముఖ్య లక్షణం, పాత్రలను ఆనాటి చారిత్రక శక్తులకూ,

సామాజిక ధర్మాలకూ ప్రనితిధులుగా చిత్రించి, వాటి మధ్య జరిగే ఘర్షణను పాత్రల మధ్య జరిగే ఘర్షణగా చిత్రించడం'[21] అన్న వివేచన ఆధారంగా చారిత్రక నవల వైశిష్ట్యాన్ని గుర్తించవచ్చు.

మొత్తం మీద చారిత్రక నవలలో చారిత్రకతకు, కల్పనకు సమాన మైన అవకాశాలున్నాయి. చరిత్ర ఎక్కువైతే నవల కాకుండా పోతుంది. కల్పన ఎక్కువైతే చారిత్రకత లోపిస్తుంది. ఈ రెంటినీ సమన్వయపరచటం లోనే చారిత్రక నవలా రచయిత ప్రతిభ వెల్లడవుతుంది. చారిత్రక సత్యా లను తారుమారు చేసే హక్కు గాని, చారిత్రక వ్యక్తుల ముఖ్య లక్షణాలను వక్రంగా చిత్రించే అధికారం గాని రచయితకు లేదు.

*3. అపరాధ పరిశోధక నవల :* కుతూహల ప్రధానమైన నేర పరిశోధన ప్రధానంగాగల నవలను అపరాద పరిశోధక నవల లేదా డిటెక్టివ్ నవల అంటారు. అద్భుతరసం ఈ నవల ఆత్మ. అపరాధ పరిశోధకుడు సర్వజ్ఞుడు, సర్వసమర్థుడు. కథా వాతావరణం పాఠకుల్ని ఆశ్చర్య చకితుల్ని చేసేదిగా ఉంటుంది. సంఘటనలు అధిక సంఖ్యలో ఉండటమేకాక, ఆసక్తి దాయకంగా కూడా ఉంటాయి. విజ్ఞాన శాస్త్రాలకు సంబంధించిన అంశాలను కూడా రచయిత తన నవలకు ఉపయోగించుకుంటాడు.

డిటెక్టివ్ నవలను ప్రజలు ఆదరించటానికి కారణం నేరాల పట్లా హింస పట్లా అభిరుచి మాత్రమే కాదంటూ- 'డిటెక్టివ్ నవల సాహిత్యంలో సంఘటనావశ్యకతను గుర్తుచేస్తుంది'[22] అన్నాడు రాల్ఫ్‌ఫాక్స్.

*4. మనోవైజ్ఞానిక నవల :* మనిషి ప్రవర్తనను గూర్చి తెలిపే శాస్త్రం మనోవిజ్ఞాన శాస్త్రం. ఇది వ్యక్తి ప్రవర్తనను గూర్చిన ఎన్నో సూత్రా లను, సిద్ధాంతాలను రకరకాల ప్రయోగాల ద్వారా క్రోడీకరించింది. చాలా కాలం నుండి రచయితలు పాత్రల మనస్తత్వ చిత్రీకరణకు తమ నవలల్లో స్థానం ఇచ్చినప్పటికీ, సిగ్మండ్ ఫ్రాయిడ్ పరిశోధనా ఫలితమైన 'మనో విశ్లేషణ సిద్ధాంతం' ప్రభావంతో సమగ్ర మనోవైజ్ఞానిక నవలలు అవతరించా యని చెప్పవచ్చు.

మనోవైజ్ఞానిక నవల చాలావరకు ఒకేపాత్ర అంతరంగాన్ని ఆవిష్క-రించేది కావటంవల్ల, కథనంలో కొంతమేరకైనా ఆత్మాశ్రయత తప్పదు. కొంత అస్పష్టత కూడా చోటుచేసుకునే అవకాశం ఉంది. పాత్ర అంతరంగంలో దాగివున్న అజ్ఞాత అంశాలమీద వెలుగును ప్రసరింపజేయటంద్వారా మనోవైజ్ఞానిక నవలా రచయితలు కొత్త ప్రయోజనాలను సాధించారని చెప్పవచ్చు.

ఆలోచనాధారకు, స్పృహకు కాల్పనికవచన సాహిత్యంలో ప్రత్యేక స్థానం పొందిన 'చైతన్య స్రవంతి' పద్ధతి మనోవిశ్లేషణాత్మకమైనదే.

హృదయానుభూతులకు, సంఘటనలకు, సంవాదానికి, నాటకీయతకు కూడా ఈ నవలలో తగిన చోటుంది. అయితే, ఇవన్నీ కూడా పాత్ర అంతరంగంలో జరిగే అంతర్నాటకాన్ని ప్రదర్శించటానికే ఉద్దేశించబడతాయి.

ఈ నవల అవతరణతో రచనాశిల్పంలో గణనీయమైన మార్పులు వచ్చాయి అందుకు పూర్వం సంఘటనకున్న ప్రాముఖ్యం తగ్గిపోయింది. కథాకాలం కూడా పరిమితమైపోయింది పాత్రల సంఖ్య తగ్గిపోయింది. ఇదివరకు రచయితలు ప్రకటించటానికి వెనుకాడిన లైంగికభావాలను స్వేచ్ఛగా ప్రకటించటానికి వీలైంది.

మనోవైజ్ఞానిక స్వభావం సంతరించుకోవటంతో ఆధునికనవల పరిధి విస్తరించిన మాట నిజమే అయినా 'రచయితలు సాంఘికవాతావరణం నుంచి వైయక్తిక చేతనలోకి నిష్క్రమించటంతో, సాహిత్యవిమర్శ కూడా వాస్తవ ప్రపంచాన్ని వదలి మనోవైద్యుడి చికిత్సాలయంలోకి నిష్క్రమించింది'[23] అన్న విమర్శ లేకపోలేదు.

## (ఈ) నవలిక

నవలిక అంటే చిన్న నవల. నవలకైనా, నవలికకైనా బీజం కథే! సాహిత్యంలో మనోవిజ్ఞానశాస్త్రం ప్రవేశించిన తర్వాత బృహన్నవలా నిర్మాణం పట్ల రచయితలకు ఆసక్తి తగ్గిపోయింది.

పెద్దకథకంటే పెద్దదీ, సగటు నవలకంటే చిన్నదీ నవలిక. అంత మాత్రాన పెద్దకథను పెంచితే నవలిక కాదు. నవలికకు సంబంధించిన ముడి పదార్థాలన్నీ నవలకు సంబంధించినవే. నవలికలోని పాత్రలు, సంఘటనలు పరిమితంగానే అయినా, తమ పరిధిలో సమగ్రంగా వుంటాయి. అందువల్ల నవలను కుదిస్తే నవలిక అవుతుందనుకోవటం పొరపాటు.

నవలకూ, నవలికకూ తేడా స్థూలంగా పరిమాణానికి సంబంధించింది. అయితే, నవలికలోని పుటలసంఖ్యను నిర్దేశించటం అంత శాస్త్రీయం కాదు. అయినా, నవల 50,000 మాటలకు తక్కువకాకుండా ఉండాలని[24] పాస్టర్ భావించాడు అంటే, 50 000 మాటలకు తక్కువగా ఉన్న నవలను నవలికగా భావించవచ్చునన్నమాట.

నవలలో ఒకటికి మించిన లక్ష్యాలుండే అవకాశం వుంది. కాని, నవలికలో సాధారణంగా ఒకే లక్ష్యం కనిపిస్తుంది. సాధారణంగా కథలో ఒకే ఒక ముఖ్యసంఘటన ప్రాముఖ్యం వహిస్తుంది. నవలికలో రెండుమూడు సంఘటనలకు చోటుంటుంది.

నవలికలో కూడా నవలలో మాదిరిగా జీవితభాగాన్ని ప్రదర్శించటానికి వీలుంటుంది అందుకే, మంచి నవలికను చదివినప్పుడు, మంచినవలను చదివిన అనుభూతి కలుగుతుంది.

విపుల వర్ణనలకు, అనవసరమైన పాత్రలకు, సుదీర్ఘవాదోపవాదాలకు నవలికలో చోటులేదు. అందువల్ల పాఠకుని దృష్టి నవలికలోని ముఖ్యాంశం మీదే కేంద్రీకృతం కావటానికి ఎక్కువ అవకాశాలున్నాయి

పాఠకుడు ఒకటి రెండు పఠనాలలో చదివి సమగ్రంగా అర్థం చేసుకోవటానికి వీలుగా ఉందని కారణంగా, పాఠకుని మనసులోని కళాత్మక సమైక్యాన్ని భంగపరిచేదిగా ఉన్న కారణంగా, బృహన్నవల హడ్సన్ వంటి మేధావుల విమర్శకు గురయింది[25]. ఈ విమర్శ నవలికకు లభించిన పరోక్ష ప్రశంస.

## (ఉ) నవల-నవలా రచయిత

నవలకు నవలా రచయితకు మధ్యన ఉండేది జన్యజనక సంబంధం. రచయితకు జీవితంతో అనుబంధం ఉంటుంది. నవలకు రచయిత ద్వారా జీవితంతో సంబంధం ఉంటుంది.

నవలా రచయిత స్వయంగా మనిషే కావటం వల్ల, అతని రచనా ప్రక్రియలో ఉండేదీ మానవ పాత్రలే కావటంవల్ల ఆతనికి రచనతో గరిష్ఠ సంబంధం ఏర్పడుతుంది. ఇతర ప్రక్రియా సాధకులలో ఇంత ఆత్మీయ సంబంధం వుండటం అరుదు. ఉదాహరణకు చరిత్రకారునికి గతకాలపు వ్యక్తులతో వుండే సంబంధం అంత ఆత్మీయమైంది కాదు. చిత్రకారుడు, శిల్పి వాళ్ళు ప్రత్యేకించి ఇష్టపడితేనే మానవ వ్యక్తులను ప్రతిబింబిస్తారు. అలాగే సంగీత విద్వాంసుడు ఒక కార్యక్రమం సహాయంతోనే మానవ వ్యక్తులకు ప్రాతినిధ్యం వహించగలడు. నవలా రచయిత మాత్రం సులభంగా మానవ పాత్రలను సృష్టించి, వాటికి పేర్లను, స్త్రీ పురుష విభేదాలను, సంభాషణలను మనస్తత్వాలను కల్పించి ఇవ్వటం ద్వారా పాఠకునికి కొత్త జీవితాలతో సంబంధాలను కలగజేయగలడు.[2]

ఏ నవలాకారుడైనా సంఘంలో ఒంటరిగా జీవించడు. అతడు దేశ కాలాలకు బద్ధుడు. సమకాలీన సాంఘిక రాజకీయాది పరిస్థితుల వల్ల ప్రభావితుడయ్యేవాడే. ఇవన్నీ నవలా రచయితను సృష్టించే శక్తులే. ఈ అంశాలన్నీ అతని నవలకు ప్రేరణనిస్తాయి.

అర్నాల్డ్ బెన్నెట్ భావించినట్లు—

'జీవితాన్ని దర్శించి, ఉద్రేకపడి, తన భావాలను ఇతరులతో పంచుకొని మనసు బరువు దించుకోవటానికి, కాల్పనిక వచన గాథను సజీవవాహికగా ఎంచుకునే వాడే నవలా రచయిత.'[27]

కథతో రచయితకుండే సంబంధం తాత్కాలికమైనదే; కాని, ఒక నవలతో రచయితకుండే సంబంధం కొంత శాశ్వతమైనదేనని చెప్పాలి. అతడు సమకాలీన పరిస్థితులను ఆమోదించేవాడే అయినా, ఆమోదించనివాడే

అయినా అతని నవలలో ఆయా భావాలు ప్రతిబింబించి తీరుతాయి. ఉత్తమ నవల జాతి జీవితంతో పెనవేసుకొని శాశ్వత విలువను సంతరించుకుంటుంది.

ఈ విధంగా ఒకే నవల రచయిత కాలంనాటి సాంఘిక ధ్రువపత్రంగా, అతని అనుభూతులను ప్రవహింపజేసే వాహికగా, జీవితానుభవాన్ని ప్రతిఫలించే దర్పణంగా, సందేశాన్ని ప్రచారం చేసే ప్రాణవాయువుగా, ఒక లక్ష్యానికి దారిచూపే కాంతి కిరణంగా అనేక రూపాలలో దర్శనమిస్తుంది.

## 2. గోపీచంద్‌కు అనతిపూర్వంలో తెలుగు నవల

గోపీచంద్‌కు అనతిపూర్వంలో తెలుగు నవలను గూర్చి పరామర్శించటానికి పూనుకుంటే, వెంటనే స్ఫురించే నవల 'మాలపల్లి'. తెలుగు నవలా వికాస పథంలో ఉన్నవ లక్ష్మీనారాయణగారు ఒక మలుపును సూచించే రచయిత. వీరి 'మాలపల్లి' (1922) ఇతివృత్తపరంగా, భాషాపరంగా బలమై అభ్యుదయ లక్షణాలను కలిగి వుండటం వల్ల, సమకాలీన సాంఘిక రాజకీయ చరిత్రను కళాత్మకంగా ప్రతిబింబించటం వల్ల ఉత్తమ నవలగా మన్ననలను పొందింది. ఈ నవల ప్రభుత్వ నిషేధాలకు గురై ఎంతో సంచలనాన్ని సృష్టించింది.

సజీవ వ్యావహారిక భాష, గ్రామీణ జీవన చిత్రణ, ధనిక పేద వర్గాల మధ్యనా, అగ్రనీచకులాల మధ్యనా సంఘర్షణ, గాంధీయ సిద్ధాంతాల పట్ల విశ్వాసం, సాయుధ పోరాటం పట్ల సానుభూతి-ఇవి 'మాలపల్లి'ని అగ్రనవలగా రూపొందించిన కొన్ని అంశాలు మాత్రమే. తరాలమధ్యన అంతరాలను, వ్యవస్థాపరమైన ఘర్షణను, భావాల మధ్య వ్యత్యాసాలను బలంగా చిత్రించిన మొదటి సాంఘిక నవల మాలపల్లి'.

అప్పటి వరకు వ్యక్తి జీవితాన్ని, వ్యక్తి చుట్టూవున్న సంఘ జీవితాన్ని ప్రతిబింబిస్తూ వచ్చిన తెలుగు నవల, 'మాలపల్లి' అవతరణతో ఆర్థిక రాజకీయ శక్తులను సంతరించుకున్నది.

హైందవ సంప్రదాయ దృక్పథంతో అసంఖ్యాకంగా నవలలు, నవలికలు రచించిన విశ్వనాథ సత్యనారాయణ కొక విశిష్టస్థానముంది. కాల్పని

కోద్యమ ప్రభావంతో విషాదాంత ప్రణయగాధను 'ఏకవీరగా' తీర్చిదిద్దిన తర్వాత ఈయన పూర్తిగా సాంప్రదాయిక నిబద్ధతతో 'వేయిపడగలు'' 'చెలియలికట్ట' 'స్వర్గానికి నిచ్చెనలు' మొదలైన నవలలు రచించాడు.

'వేయిపడగలు' నవలలోని నాయకుడు ధర్మారావు విశ్వనాధ భావాలకు ప్రతినిధి. కథానాయకుని వ్యక్తిత్వ వికాసానికి రచయిత ప్రాధాన్యమీయలేదు. అందుకే నవల మొదట్లో కనిపించే ధర్మారావే, నవల చివరా కనిపిస్తాడు. రచయితలో వుండే 'సర్వజ్ఞత్వం'' ప్రధానపాత్రకు సంక్రమించటం స్పష్టంగా కనిపిస్తుంది. ధర్మారావు భావాల చుట్టూ, విశ్వాసాల చుట్టూ, పాత్రలనూ. సన్నివేశాలనూ కల్పించటంవల్ల, తెలుగుదేశపు సమకాలీన రాజకీయ సాంఘిక ఆర్థిక మత పరిస్థితులు ప్రతిబింబించటంవల్ల 'వేయిపడగలు' బృహన్నవలగా రూపొందింది.

'మతమును, సంఘమును, ఆచారమును మనోహరముగా చెప్పునదియే వాఙ్మయము'' అన్న విశ్వనాధ నిర్వచనం విశ్వనాద సాహిత్యానికి పూర్తిగా వర్తిస్తుంది.

గుడిపాటి వెంకటచలం తన మొదటి నవల 'శశిరేఖ' లోనే స్త్రీ స్వేచ్ఛావాదాన్ని ప్రతిపాదించి, పాఠకులలో ఆలోచనను ప్రేరేపించాడు. పురుషాధిక్య సమాజం మూలంగా నికృష్టస్థాయిలో ఉన్న స్త్రీ కోసం పరితపించి, తన కలాన్ని ఆయుధంగా చేసి. నవలల్లో, కథల్లో స్త్రీకి లైంగిక స్వేచ్ఛను ప్రచారంచేశాడు. ఆయన రాసిన ఏ నవల ఇతివృత్తాన్ని గమనించినా ఈ విషయం వెల్లడవుతుంది.

చలం మొదటి నవల 'శశిరేఖ' (1921)లో శశిరేఖాకృష్ణులు, 'దైవమిచ్చిన భార్య'లో పద్మావతీ రాధాకృష్ణులు, 'మైదానం'లో రాజేశ్వరీ ఆమీర్‌లు వివాహేతర దైహిక సంబంధాలను కలిగివుంటారు. మానసిక స్వేచ్ఛ కోసం, కుటుంబాన్ని, సంఘాన్ని ఖాతరుచేయకుండా, దుష్పరిణామాలను ఎదుర్కోవటానికి వెనుకాడని స్త్రీ పాత్రల సృష్టి చలం ప్రత్యేకత.

వివాహ వ్యవస్థ పట్ల తిరుగుబాటు ధోరణి రచనలో కాల్పనికఆవేశం ఆచరణలో నిజాయితీ చలాన్ని సాటిలేని రచయితగా మలిచాయి.

బహుముఖ ప్రజ్ఞాశాలిగా గుర్తింపు పొందిన అడవి బాపిరాజు సుకుమార శైలితో, కళాత్మక ఆవేశంతో సాంఘిక నవలలను, చారిత్రక నవలలను రచించాడు. ఆర్థికపరమైన వ్యత్యాసం కారణంగా, అంతస్థులో తేడా కారణంగా భార్యాభర్తల మధ్య ఏర్పడిన అగాధాన్ని, సహనంతో, సమ్యగవగాహనతో, సాహసంతో కథానాయకుడు అధిగమించటం 'నారాయణరావు' నవలలోని ఇతివృత్తం. జమీందారీ వ్యవస్థ అవసాన దశను, పెట్టుబడిదారి వ్యవస్థ ప్రారంభదశను, మధ్య తరగతి సమాజ వికాసదశను ఈ నవలలో రచయిత బాగా చిత్రించాడు. 'నారాయణరావు'లో కేవలం ప్రత్యేకాంధ్ర రాష్ట్రోద్యమం వంటి తెలుగు దేశపు రాజకీయ సమస్యలు మాత్రమే కాక, జాతీయ స్వాతంత్ర్య సమరం, రష్యా విప్లవం, ప్రపంచ యుద్ధ పర్యవసానంగా ఏర్పడ్డ దారిద్ర్యం కూడా ప్రతిఫలించాయి.

హేమకుసుమసుందరి అనే ముగ్ధురాలికథ 'తుఫాను' సంస్కారవతి, విద్యావతి అయిన హేమ స్వేచ్ఛా భావాలు గల యువతి. ఆమె స్త్రీత్వ వైశిష్ట్యం చుట్టూ వున్న మగ వారిని ఆకర్షిస్తుంది తనను కోరిన వారి నెవరినీ ఆమె పెళ్ళాడదు. తీర్థమిత్రుడనే కుటిలుని మూలంగా ఆపదపొంది, జీవితంలో గుణపాఠం నేర్చుకొని తన బావను పెళ్ళాడటంతో నవల సుఖాంతమౌతుంది.

లలితకళల పట్ల అభినివేశం వున్న రచయిత కావటం వల్ల, బాపిరాజు నవలల్లో కళాత్మక వర్ణనలు ఎక్కువగా కనిపిస్తాయి.

గోపీచంద్‌కు ముందే నవలా సాహిత్యరంగంలో ప్రవేశించిన మరో రచయిత కొడవటిగంటి కుటుంబరావు.

నిరాడంబరమైన, సుస్పష్టమైన శైలితో, అంతకంటే స్పష్టాతిస్పష్టమైన భావజాలంతో, తనకు తెలిసిన జీవితాన్ని నవలల్లో ప్రతిబింబించినవాడు కుటుంబరావు. ఆర్థిక మాంద్యం ఏర్పడిన రోజుల్లోని జీవితాన్ని, రెండవ ప్రపంచ యుద్ధం తెచ్చిన పరిణామాలను తన నవలలో వివరంగా చిత్రించాడు. ఏ నవలను పరిశీలించినా ఏదో ఒక సమస్య పాఠకులకు ఎదురవుతుంది, తాను స్వీకరించిన సమస్యను విశ్లేషించి, జీవితపు లోతులు తరిచే అరుదైన లక్షణం కలవాడు కావటంవల్ల కుటుంబరావు తెలుగు సాహిత్యంలో ఉన్నత స్థానాన్ని పొందగలిగాడు.

సంఘ సంస్కరణ భావాల ప్రభావం కారణంగా పడుపువృత్తిని నిరసించి, కుటుంబాన్నీ, సమాజాన్నీ ఎదిరించి సానిపిల్లను పెళ్ళాడే వ్యక్తి, ఆ వ్యక్తి సంతానమూ ఎలాంటి సమస్యలు ఎదుర్కోవలసివస్తుంది? అన్న ప్రశ్నకు జవాబే 'కులంలేని మనిషి' (1941) పూర్తిగా మారని సంఘంలో ఈ సమస్య ఎంత జటిలమైనదో ఊహించచలసిందే. సీతారామశాస్త్రి సాని పిల్లను పెళ్ళాడటాన్ని అతని తమ్ముడు కూడా ఏవగించుకుంటాడు. శాస్త్రి తన భార్య మరణించిన తర్వాత. కుమార్తె శాంతను నిస్సహాయంగా వదిలి చనిపోతాడు. పినతండ్రి ఇంట్లో కొన్నాళ్ళు, పినతల్లి ఇంట్లో కొన్నాళ్ళు శాంత దుర్భర జీవితాన్ని అనుభవిస్తుంది. భద్రతకోసమైనా ఒక పెద్దమనిషికి ఉంపుడుగత్తెగా ఉండిపోదామని కూడా శాంత ఆలోచిస్తుంది. అంటే, తండ్రి ఏ పడుపువృత్తిని నిరసించి, సమాజాన్ని ఎదుర్కొని రంపపుకోతను అనుభ వించాడో, దాదాపు ఆ జీవితంవైపే పరిస్థితులు ఆమెను నెట్టటానికి యత్నిం చాయి. కాని, విశ్వం అనే యువకుడు ఆ 'కులంలేని మనిషి'ని స్వీకరిస్తాడు.

ఈ విధంగా – 1920 నాటికి తెలుగునాడు ప్రవేశించిన అనేక భావాల సంగమ స్థానంగా 'మాలపల్లి'ని రచించి, బలమైన సాంఘిక దృష్టి కారణంగా తెలుగు సాహిత్యం మీద చెరిగిపోని ముద్రవేసిన ఉన్నవ; వ్యక్తి స్వాతం త్ర్యానికి అవకాశమున్న దైహిక స్వేచ్ఛను ప్రతిపాదించి, నికృష్ట జీవన పరిస్థితుల నుండి స్త్రీకి విముక్తి ప్రసాదించటానికి ఒంటరిగా పోరాటం సలిపిన చలం, ఆధునిక భావాలను వ్యతిరేకిస్తూ, శిథిలమౌతున్న హిందూ వ్యవస్థా ధర్మాన్ని పునరుద్ధరించే లక్ష్యంతో నవలా రచన చేసిన 'విశ్వనాథ' కాల్ప నిక ఆదర్శవాదానికి ప్రతినిధిగా, కళాత్మక ఆవేశంతో నవలలు రాసిన బాపి రాజు, మధ్యతరగతి జీవితాన్ని ప్రభావితంచేసే శక్తుల్ని విశ్లేషించే నవలలు రాయటం ద్వారా సాహిత్యంలో వాస్తవిక దృష్టికి పట్టంగట్టిన కుటుంబరావు– గోపీచంద్‌కు ముందే తెలుగు నవలా సాహిత్యానికి ఆధునిక నేపథ్యాన్ని సంతరించిపెట్టారు. వాళ్ళ కృషివల్ల నవలా సాహిత్యానికి చెప్పుకోదగిన వైవిధ్యం చేకూరిందని చెప్పవచ్చు.

## 3. గోపీచంద్ - సంక్షిప్త పరిచయం

గోపీచంద్ 8–9–1910 నాడు జన్మించాడు.[28] తండ్రి సుప్రసిద్ధ రచయితా, హేతువాదీ అయిన త్రిపురనేని రామస్వామి చౌదరి గారు. తల్లి

పున్నమాంబగారు. గోపీచంద్ బాల్యమంతా కృష్ణా జిల్లాలోని గ్రామీణ వాతావరణంలో గడిచింది. తెనాలిలో హైస్కూలు చదువును, గుంటూరులో కాలేజీ చదువును గోపీచంద్ పూర్తి చేశాడు. ఈ దశలోనే ఆయనకు ఆంగ్ల నవలలతో, నాటకాలతో పరిచయం ఏర్పడింది.

1932లో శకుంతలాదేవిగారితో గోపీచంద్ వివాహం జరిగింది. 1933లో బి.ఏ, పట్టాను, ఆ తర్వాత లా డిగ్రీని ఆయన సాధించాడు. గోపీచంద్ కొంతకాలం న్యాయవాదిగా ప్రాక్టీసు పెట్టాడు. కాని, ఆ వృత్తిలో ఇమడలేకపోయాడు.

తండ్రిగారి ప్రభావంతో 1928లోనే 'శంబుక వధ' కథ ద్వారా సాహిత్యరంగంలో ప్రవేశించిన గోపీచంద్‌ను సమకాలీన రాజకీయాలు ఆకర్షించాయి. అప్పుడప్పుడు కథలు రాస్తూ, 1938లో 'పట్టాభి గారి సోషలిజం' అన్న పుస్తకాన్ని ప్రచురించాడు. 'రాడికల్', 'విహారి' పత్రికలతో ఆయనకు సంబంధాలుండేవి. కొంతకాలం' ఆంధ్రా రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ కార్యదర్శిగా ఆయన పనిచేశాడు. ఆ రోజుల్లో గోపీచంద్ మీద ఎం. ఎన్. రాయ్ ప్రభావం ఎక్కువగా ఉండేది.

'గీతాపారాయణం', 'దేశం ఏమయ్యేట్టు', 'భార్యల్లోనే వుంది', 'దేవుని జీవితం', 'తండ్రులు-కొడుకులు' 'సరే కానివ్వండి' మొదలైన కథా సంపుటాలను గోపీచంద్ ప్రచురించాడు. కథా సాహిత్యరంగంలో స్థిరపడ్డ తర్వాతే ఆయన నవలా సాహిత్యరంగంలో అడుగు పెట్టాడు. గోపీచంద్ తొలి నవల 'పరివర్తనం' (1943).

గూడవల్లి రామబ్రహ్మం ప్రోత్సాహంతో గోపీచంద్ 1939 లో చలన చిత్రరంగంలో ప్రవేశించి, "రైతుబిడ్డ" చిత్రానికి రచయితగా, సహాయ దర్శకునిగా పనిచేశాడు. ఆ తర్వాత 'లక్ష్మమ్మకథ', 'పేరంటాలు', 'ధర్మదేవత', 'ప్రియురాలు' చిత్రాలకు దర్శకత్వం వహించాడు. 'కలిమిలేములు', చదువుకున్న అమ్మాయిలు'. చిత్రాలకు సంభాషణలు సమకూర్చాడు.

1953 లో ఆంధ్రరాష్ట్రం ఏర్పడ్డతర్వాత గోపీచంద్ రాష్ట్ర సమాచార శాఖ డైరెక్టర్‌గా నియమితుడయ్యాడు. 1956 లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డ తర్వాత, కొంతకాలం సమాచారశాఖ జాయింట్ డైరెక్టర్‌గా పనిచేశాడు.

1957 మొదలు 1962 వరకు హైదరాబాదు ఆకాశవాణిలో పని చేశాడు. గ్రామస్థుల కార్యక్రమాల ప్రయోక్తగా గోపీచంద్‌కు మంచి పేరు వచ్చింది.

ఈ దశలో అరవిందుల భావాలపట్ల గోపీచంద్‌కు విశ్వాసం ఏర్పడింది. 1959 లో 'తత్వవేత్తలు' మొదటి భాగాన్ని, 1960 లో రెండవ భాగాన్ని ప్రచురించాడు.

'పోస్టుచెయ్యని ఉత్తరాలు' (1955), ఉభయకుశలోపరి (1956), మాంచాల' (1960), 'తత్వమసి' (1961) మొదలైనవి గోపీచంద్ ఇతర రచనలు.

2-11-1962 నాడు, తన యాభైరెండోఏట గోపీచంద్ మరణించాడు[29].

## 4. గోపీచంద్ నవలల వర్గీకరణ

1943 నుంచి 1962 వరకు, అంటే పందొమ్మిది సంవత్సరాల కాలంలో గోపీచంద్ రచించిన నవలలు పదకొండు. కాలక్రమంలో అవి ఈ కింది విధంగా ఉన్నాయి.

1) పరివర్తనం (నవల, 1943)
2) అసమర్థుని జీవయాత్ర (మనోవైజ్ఞానిక నవల, 1947)
3) పిల్లతెమ్మెర (నవలిక, నవంబర్ '60 నుంచి జనవరి '61 వరకు 'యువ' మాసపత్రికలో సీరియల్‌గా వచ్చింది).
4) మెరుపుల మరకలు (నవల, 6-11-1960 నుంచి 12-3-1961 వరకు 'ఆంధ్రపత్రిక' దినపత్రిక ఆదివారం అనుబంధాలలో సీరియల్‌గా వచ్చింది).
5) గడియపడని తలుపులు (నవలిక, 1961)

6) పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా (నవల, సెప్టెంబర్ 1961),

7) శిథిలాలయం (నవలిక, నవంబర్ 1962).

8) గతించనిగతం (నవలిక, 1962)

9) చీకటిగదులు (అసంపూర్ణ నవల, జనవరి '60 నుంచి సెప్టెంబర్' 62 వరకు 'యువ' మాసపత్రికలో సీరియల్‌గా వచ్చింది).

10) ప్రేమోపహతులు (అసంపూర్ణనవల, మే '62 నుంచి సెప్టెంబర్' 62 వరకు 'యువ' మాసపత్రికలో సీరియల్‌గా వచ్చింది.

11) యమపాశం (అసంపూర్ణ నవల. ప్రథమ ముద్రణ రచయిత మరణానంతరం 1963లో).

ప్రకరణ పాఠక సౌలభ్యం కోసం గోపీచంద్ నవలలను—

| | | |
|---|---|---|
| మనోవైజ్ఞానిక నవల | : | 'అసమర్థుని జీవయాత్ర' |
| నవలలు | : | 'పరివర్తనం', 'మెరుపుల మరకలు', 'పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా' |
| నవలికలు | : | 'పిల్లతెమ్మెర', 'గడియపడని తలుపులు', 'శిథిలాలయం', 'గతించని గతం' |
| అసంపూర్ణ నవలలు | : | 'చీకటిగదులు', 'ప్రేమోపహతులు' 'యమపాశం' |

అని విభజించటం ఉత్తమ పద్ధతిగా తోస్తుంది. మొదటి ప్రకరణంలో నవలాప్రక్రియను గూర్చి, గోపీచంద్‌కు ముందున్న తెలుగునవలను గూర్చి, గోపీచంద్‌ను గూర్చి పరిచయాత్మకంగా తెలపటం జరిగింది. గోపీచంద్ నవలల వర్గీకరణతో యీ మొదటిప్రకరణం ముగుస్తుంది. తర్వాతి ప్రకరణాలలో గోపీచంద్ నవలలను, నవలారచయితగా గోపీచంద్‌ను పరిశీలించటం జరుగుతుంది.

మొదటి ప్రకరణం

## పాదసూచికలు

1. The great master piece of the age, indeed of all Japanese literature is the monument 'Genji Monogatari' (The Tale of Genji), written by Court lady Murasaki Shikibu, Probably during the first decade of the eleventh century. Rich in Psychological detail of 'The Tale of Genji' merits description as the first true novel, one of the classics of World literature.

— Collier's Encyclopedia, Vol.13, P.501.

2. The modern novel is usually traced to its beginnings in Giovanni Boccaccio's 'Decameron', Published in 1348. Although this is rather a collection of short stories than a collection of novels, it gave great impact to the artistic development of prose fiction.

— World University Encyclopedia, Vol. II, P.3630.

3. An Introduction to the English novel, P. 28.
4. English novel, Pages 1,2.
5. The novel and the People, P. 52.
6. World book Encyclopedia, P. 5791.
7. The treatise on the Novel, P.72.
8. Aspects of the novel, P. 87.
9. An Introduction to the Study of Literature, P. 139.
10. సమాజము-సాహిత్యము, పుట. 104.
11. The Novel and the People, Chapt.VIII.
12. A treatise on the Novel, P. 106.
13. Quoted by Elizabeth Drew, The novel, P.19.
14. A readers guide to literary terms, P.210. E.M'

Forster చెప్పే 'Round character', 'Flat character' కూడా గమనార్హం. చూ. Aspects of the novel, P.73.

15. తెలుగు కథానిక స్వరూప స్వభావాలు, డా. పోరంకి దక్షిణా మూర్తి, (అము.), పుట. 335.
16. Ibid. పుట. 326.
17. '....పాఠకుడి గుండెను పిండడానికి కొన్ని హద్దులున్నా యంటాను. 'దైవికంగా' జరిగే సంఘటనలతో పాఠకుణ్ణి రాచి రంపాన పెట్టటం చాలా దారుణం'
—సాహిత్య ప్రయోజనం, కుటుంబరావు, పుట. 196.
18. Aspects of the novel, P. 31.
19. ఉదా. హెచ్.జి. వెల్స్ నవల 'Time machine'
20. ఆంధ్ర నవలా పరిణామము, డా.బి.వి. కుటుంబరావు, పుట. 113
21. 'సంవేదన' ఏప్రిల్ 1968 'కొల్లాయి కట్టితేనేమి'
22. The novel and the people, P. 73.
23. The novel today, Philip Hinderson
24. Aspects of the novel, P. 25.
25. An Introduction to the Study of Literature, P. 183
26, Aspects of the novel pages 54, 55.
27. Quoted by Elizabeth Drew 'The novel', P. 13.
28. గోపీచంద్ 1908 ప్రాంతంలో పుట్టివుంటారని లోకాయుక్త గా. ఆవుల సాంబశివరావుగారు వ్యాసకర్తతో అన్నారు. (ఇంటర్వ్యూ తేది: 10-2-1984).
29. త్రిపురనేని సుబ్బారావుగారి 'గోపీచంద్' పుస్తకంనుంచి ఈ జీవిత విశేషాలను స్వీకరించడం జరిగింది. ఇతర జీవిత విశే షాలను 'ఆత్మకథాత్మక లక్షణాలు' అన్న ప్రకరణంలోను, 'చీకటి గదులు' నవలను పరిశీలించిన సందర్భంలోనూ ప్రస్తా వించటం జరిగింది.

రెండవ ప్రకరణం

## మనోవైజ్ఞానిక నవల

# అసమర్థుని జీవయాత్ర

గోపీచంద్ రచించిన రెండవ నవల 'అసమర్థుని జీవయాత్ర'[1] ఈనవల గోపీచంద్ ప్రయోగదక్షతకు, పరిశీలనా దృష్టికి నిదర్శనం. రచయితకు మనోవిజ్ఞానశాస్త్రంలో ఏర్పడిన గాఢ పరిచయాన్ని కూడ ఈ నవల వెల్లడి చేస్తుంది. ముఖ్యంగా ఫ్రాయిడ్ పరిశోధనా ఫలితమైన 'మనోవిశ్లేషణ' సిద్ధాంత ప్రభావం, ఆడ్లర్ ప్రతిపాదించిన ఆత్మన్యూనత, ఆత్మాధిక్య భావాల ప్రభావం ఈ నవలలో స్పష్టంగా కనిపిస్తాయి.

సాధారణంగా మనోవైజ్ఞానిక నవలల్లో రచయిత తన దృష్టిని ప్రధాన పాత్ర మీదనే కేంద్రీకరిస్తాడు. ఆ పాత్ర మనః ప్రపంచాన్ని ఆవిష్కరించాలనుకోవటమే ఇందుకు కారణం. 'అసమర్థుని జీవయాత్ర' కూడా పూర్తిగా నాయక ప్రధానమైన నవల. ఈ నవల కథానాయకుడైన సీతారామారావు జీవిత చిత్రణే కనుక, 'అసమర్థుని జీవయాత్ర'ను గూర్చి రాయడమంటే, సీతామారావును గూర్చి రాయడమే.

అంతరిస్తున్న జమీందారీ వ్యవస్థ, అప్పుడప్పుడే స్థిరపడుతున్న పెట్టుబడిదారీ వ్యవస్థ, ఈ రెండింటి సంఘర్షణలో ఒక అపురూపమైన సందిగ్ధ మనస్తత్వాన్ని సంతరించుకున్న పాత్ర సీతారామారావు.

అది సంధి కాలం సాగిపోయేకాలంతో చేతులు కలపటానికై ఆగిపోయిన కాలానికి వీడ్కోలు చెప్పవలసిన క్షణం. సీతారామారావు తనజీవితంలో మహత్తర నిర్ణయం తీసుకోవలసిన అమూల్యక్షణం. కాని, కాల ప్రవాహంలో తన అస్తిత్వాన్ని తానే సందేహిస్తూ, అలలలో సుడులు తిరుగుతూ, ఆవేగానికి ఎదురీదలేక, ఎదురీదే ప్రయత్నం కూడా చేయక మునుగుతూ తేలు

తూన్న గడ్డిపోచ లాంటి సీతారామారావు, సాలెగూళ్ళు నిండిన, గబ్బిలాలు తిరుగాడుతున్న శిథిలసౌధాన్ని కాపాడటానికి పూనుకున్నాడు. అందుకే, తననుతాను హరించే నిర్ణయాన్ని తీసుకున్న ఒక అసమర్థుని, అసహాయుని, అస్థిరచిత్తుని మనం అతనిలో దర్శిస్తాము. తన కాళ్ళ కింది భూమి ప్రతిక్షణం తొలగిపోతుందన్న భయంతో జడుసుకునే ఒక పిరికివాణ్ణి చూస్తాము.

అతడు జమీందారీ వ్యవస్థ అవశేషంగా కనిపిస్తాడు. దైనందిన జీవితాన్ని భారం చేసుకున్నవాడుగా, మనఃప్రపంచానికి వాస్తవిక ప్రపంచానికి సామరస్యం కుదర్చటంలో విఫలమైన దయనీయుడుగా కూడా గోచరిస్తాడు,

వంశం, కీర్తి ప్రతిష్ఠలు, తాత తండ్రుల అహంకార ఔదార్యాలు సీతారామారావు మనఃప్రపంచంపై బాల్యంలోనే ప్రగాఢమైన ముద్రలు వేశాయి.

''బాబూ, మన వంశం పేరు నిలబెట్టు'' అని మరణశయ్య మీది తండ్రి ఆఖరుమాటగా చెప్పకపోయినా, అతడు కర్మకాండకు ఘనంగా ఖర్చుపెట్టేవాడే. కారణం—

''డబ్బుదేముంది? మనిషికి కావలసింది పేరు.'' అని అతడు అదివరకే రూఢి చేసుకున్నాడు. జమీందారీ వ్యవస్థ పట్ల ఆరాధనా భావం ఉన్న జన సామాన్యం చేసిన ప్రశంసలు, స్వార్థపరుల ముఖస్తుతులు సీతారామారావును ప్రమత్తుణ్ణి చేశాయి. తనకు అప్పు చెల్లించవలసిన వారి పట్ల ఔదార్యంతో ప్రవర్తించాడు.

''నేను కోర్టు కెక్కను'' అన్నమాట పైకి జమీందారీ ఔదార్యాన్ని అనుకరించటంగా కనిపించినా, అంతర్గతంగా సీతారామారావు మనఃస్థితిని వెల్లడించేదే. న్యాయం కోసం, వంశమర్యాదను కోర్టు కీడ్చి, బజారుపాలు చెయ్యటం అతనికిష్టం లేదు.

అతని మేనమామ నలభై వేల రూపాయల అప్పును పరిష్కారం చేసుకున్న సన్నివేశం నవలలో వివరంగా చిత్రితమైంది. ఈ సన్నివేశం సీతా

రామారావులో వేరూనిన మనస్తత్వానికి అద్దం పడుతున్నది. అత్తామామల పొగడ్తలు, మర్యాదలు అతనికి 'అమితానందం' కలిగించాయి. అతనిఅహాన్ని ఉబ్బించడానికి వాళ్ళు అన్ని విధాలుగా ప్రయత్నించారు.

''నీకీ డబ్బు వొక లెక్కలోది కాదు. చదువుకున్న వాడివి, సమర్థుడివి. రేపటి నుంచి ఎంత సంపాదించాలంటే అంత సంపాదించుకోగలవు'" అంటాడు మామ. సీతారామారావును 'సమర్థుడివి' అనటం, ఈ రోజు నష్టపోతున్నవాడు భవిష్యత్తులో సంపాదించుకోగలడనటం వ్యంగ్యం. మామ మాటలన్నీ నిజమే నను కుంటాడు తప్ప, అతడు తనను మానసికంగా కూడా దోపిడీ చేస్తున్నా డని సీతారామారావు గ్రహించడు.

''సంపాదించుకోకపోతే మాత్రం నీకు సహాయం చేయకూడదా మామా?" అన్నాడతడు. సంపాదించే అవకాశం వుంది గనుక యితర్లకు సహాయం చేస్తున్నాడనుకోవటం కూడా సీతారామారావుకు యిష్టంలేదు.

''ఎందుకు చెయ్యకూడదు బాబూ, మేమేం పరాయివాళ్ళమా?'' అంది అత్త.

"పరాయివాళ్ళకు మాత్రం సహాయం చేయకూడదా అత్తా?'" అన్నా డతడు

పై మాటల్లో తాత తండ్రుల నుంచి సంక్రమించిన ఔదార్యం కనిపి స్తుంది. అంతేకాదు, ఆ ఔదార్యం వంశప్రతిష్ఠ కోసమేననే అవగాహన కూడా కనిపిస్తున్నది. వంశ ప్రతిష్ఠ కోసం ఔదార్యాన్ని ప్రదర్శించటం స్వార్థమే కనుక అపరాధభావం కూడా సీతారామారావులో చోటు చేసు కున్నది.

వంశప్రతిష్ఠ, జమీందారీ సంస్కారం సృష్టించిన అక్షయ్యం. ఈ సంస్కా రాన్ని పూర్తిగా ఒంటబట్టించుకోని సీతారామారావు వంటి ఆధునికునిలో అప రాధ భావం చోటుచేసుకోవటం సహజం. అందువల్ల తన ఔదార్యం అతి సహజమైందనే భావం ఎదుటివాళ్ళలో కలిగించటానికి ఒక ముసుగు అవసర మైంది. ఆ ముసుగే తర్కం. ఈ తర్కం వెనకాముందూ ఆలోచించే, మంచి చెడ్డల్ని చక్కగా అంచనావేసే, కార్యకారణ సంబంధాన్ని తరచి చూసే

హేతువాదం ఎంత మాత్రం కాదు. వ్యక్తావ్యక్తంగా ఎదుటి వాళ్ళను మభ్య పెట్టటానికీ, ఆత్మవంచన చేసుకోవటానికి పనికివచ్చే వాదనాపటిమ మాత్రమే.

ఎదుటివాళ్లేం మాట్లాడినా, ఆ మాటల్లో ఏదో ఒక లోపం అతనికి కని పిస్తుంది. లోపాన్ని కనిపెట్టగలుగుతున్నాననుకోవటం వల్ల తాను తెలివైన వాణ్ణనే భావం, తాను ఎదుటివాళ్ళకంటే భిన్నమైనవాణ్ణనే భావం అతనిలో చోటుచేసుకున్నాయి.

పైమాటల్లో అతనికి 'సంపాదించుకోవటం' మీద నమ్మకం లేనట్లే కని పిస్తుంది. సంపాదించటానికి ఏదో ఒకపని, మంచిదో చెడ్డదో చేయవలసి ఉంటుంది. ఒకరిమీద ఆధారపడటమో, ఒకరికింద పనిచేయటమో తప్పదు. ఒకరిచేత పనిచేయించే సామర్థ్యంగానీ, ఒకరికింద పనిచేసే విధేయతగానీ అతనిలో లేవు. సామర్థ్యంతో సంబంధంలేని అహంకారం, విధేయతతో నిమిత్తంలేని స్వార్థపూరితమైన మంచితనం అతనిలో క్రమంగా పెరుగు తున్నాయి.

దానధర్మాలు సీతారామారావుకు పొగడ్తలను సంపాదించి పెడు తున్నాయి. ఈ పొగడ్తలు రెండు పనులను సాధిస్తున్నాయి. ఒకటి- అతని అహాన్ని ఉబ్బించటం, రెండు- వంశ ప్రతిష్ఠ పెరుగుతున్నదనే భ్రమను అత నిలో కలిగించటం.

''చేతిలో నాలుగు రాళ్ళుంటే అంతా మూగుతారు. ఆ తర్వాత మన మొగం చూచే వాళ్ళుండరు.', అన్నాడు రామయ్యతాత. ''మళ్ళీ మొఖం చూస్తారనే అపేక్షతో నేనీ పన్లు చెయ్యటం లేదు తాతా! చేయటం కోసమే చేస్తున్నాను'' అన్నాడు

ఇది అప్పటి సీతారామారావు ఆదర్శం అయితే, ఆదర్శం ఆదర్శా భాసగా వక్రీభవించటమే సీతారామారావు జీవితంలో చూస్తాము.

సీతారామారావు బాల్యంలో చాలా ఉన్నతమైన ఆశయాలు కలిగివుండే వాడు. ఆదర్శయుతమైన జీవితం గడపాలని ఉవ్విళ్ళూరుతుండేవాడు[2]. తన తాత తండ్రులలాగా నిరంకుశంగా ప్రవర్తించరాదనే ఆశయం ఉన్నది; దాంతోపాటుగా మానవతా దృక్పథం ప్రదర్శించాలనే ఆదర్శం కూడా

ఉన్నది. చుట్టూ కనిపించే దాంపత్య జీవితానుభవాలు తన జీవితంలోకి ప్రవే శించగూడదనే ఆశయం ఉన్నది; దాంతోపాటే పెళ్ళి చేసుకోకూడదనే ఆదర్శం కూడా ఉన్నది. తోటివారిలాగా అజ్ఞానిగా మారకూడదనే ఆశయం ఉన్నది; మేధావిగా రూపొందాలనే ఆదర్శంకూడా ఉన్నది. ఇలాంటి ఆదర్శ భావాలకు అతని చదువు, సమకాలీన పరిస్థితులు కొంతవరకు దోహదం చేశాయి. తండ్రికంటే భిన్న సంస్కారం కలిగిన తల్లి కూడా అతని భావా లను ప్రభావితంచేసింది. ఈ ఆశయాలే, ఈ ఆదర్శాలే అతణ్ణి తాతతండ్రుల నుంచి వేరుచేశాయి. పూర్తిగా వేరుచేసివుంటే, అతని కథ మరోవిధంగా ఉండేది. కాని, అట్లా జరగలేదు. ఆదర్శాల సాధనకు అతడు ఆచరణాత్మ కంగా కృషిచేయలేదు ఊహాలోకాల్లో విహరించటంవల్ల ఒక ఎత్తుమీదనుంచి సమాజాన్ని చూడటం అలవాటు చేసుకున్నాడు.

ఫలితంగా అందరూ నిత్యజీవితంలో మునిగి తేలుతుంటే, అతడు దానికి అతీతంగా ఉండేవాడు. జీవితం నుంచి ఎడంగా ఉండటానికే ఈ 'అతీత' దృష్టి అతనికి తోడ్పడింది. కుటుంబ జీవితాన్ని, కుటుంబ జీవితం లోని వివాహ వ్యవస్థను అతడు ఈ అతీత దృష్టితోనే చూశాడు. అందుకే, అవి నీచంగా కనిపించాయి. పెళ్లిచేసుకోక తప్పని పరిస్థితి ఏ శక్తివల్ల ఏర్పడుతుందో అతనికి అర్థం కాలేదు. కాని, గర్భంతోతిరిగే స్త్రీలు, పిల్లల్ని సరిగ్గా పెంచలేని స్త్రీలు ఏ 'సుయ్యోగొయ్యో' చూసుకుంటామనే స్త్రీలే కని పించారు. అందువల్ల అతనిలో 'స్త్రీ ద్వేషం' 3 పెరిగింది. స్త్రీ ద్వేషమే 'వివాహ ద్వేషం' 4 గా పరిణామం చెందింది. స్నేహితులుగాని, బంధువులు గాని పెళ్ళి ప్రస్తావన తెస్తే ''నాకేమిటి? పెళ్ళేమిటి?'' అనేవాడు. ప్రధాన వాహినినుంచి తనసుతాను వేరుచేసుకోవటం ద్వారా తన అస్తిత్వాన్ని సంర క్షించుకుంటున్నానని అతడు భ్రమించేవాడు. ఈ దశలో అతడు ఇందిర అనే అమ్మాయి ప్రేమలో పడ్డాడు. మానవులంతా ఏ శక్తిని తట్టుకోలేక పెళ్లి చేసుకుంటారో అతనికి అర్థమైవుంటుంది. పెళ్లిచేసుకోకపోతే ఆమె దగ్గరకు రానివ్వదు! కనుక పెళ్లిచేసుకున్నాడు. అయితే, తాను రాజీపడిపోయినట్లుగా, తన ఆదర్శం దెబ్బతిన్నట్లుగా లోకానికి తెలియటం అతనికి ఇష్టంవుండదు.

''నేను పెళ్ళికి నూతనార్థం కల్పిస్తాను'' అని మిత్రులకు చెప్పటం ద్వారా తనకు ప్రత్యేకతను ఆపాదించుకున్నాడు.

అతడు ఊహాలోకంలో భావించుకున్న దాంపత్యం కూడా అందరి లాంటిదికాదు. 'ఆమె జీవితం ఆమెది, తన జీవితం తనది' అనుకుంటాడు. భార్యకు స్వేచ్ఛ ఇవ్వాలనుకునే ఆధునిక దృక్పథం ఉంది. కాని, తన ప్రత్యేకత చెదిరిపోగూడదనే దృష్టి కూడా ఉంది. అందుకే, ఆచరణలో అది 'తన కోసం' సహజీవనంగా రూపొందక తప్పలేదు.

పెళ్ళి అతని జీవితంలో ఒక వ్యంగ్యాత్మకమైన మలుపు. ఆదర్శాభాస సౌధంలో నివసిస్తున్న అతణ్ణి నేలపైకి విసిరేసింది పెళ్ళి. జమిందారుననుకునే సీతారామరావును అయిదేళ్ళ సాంసారిక జీవితం మధ్యతరగతిలోకి ఈడ్చింది. అతడు జీవితం చేతిలో కీలుబొమ్మ అయ్యాడు. ఇతరులనుగూర్చిన ఊహలు అతని జీవితంలోనే నిజంకావటమొక విపరీతం. మామ సహాయంతో పొట్టపోసుకోవలసి రావటంతో అతని ఆత్మాభిమానం దెబ్బతిన్నది.

అకౌంటు పుస్తకంలో బొమ్మగీశాడు. ఫలితంగా ఉద్యోగం ఊడింది. పై సన్నివేశం సీతారామారావులోని ఆత్మన్యూనతాభావాన్ని 5 బహిర్గతం చేసింది. తనకు ఉద్యోగం ఇప్పించటం ద్వారా మామ తనకంటే అధికుడయ్యాడని అతడు భావించాడు. అంతేకాదు, తనమీద అధికారం నెరపిన మేనేజరు మీదకూడా ఇది గెలుపే! ఈ ఆధిక్యతా ప్రయత్నంలో మేనేజరును అపహాస్యం చేయటం, పరోక్షంగా తనను కీలుబొమ్మగా మార్చిన జీవితాన్ని కూడా అపహాస్యం చేసుకోవటమే. అసలు మామమీదికంటే, మేనేజరుమీదికంటే జీవితానికి బానిస అయినందుకు అతనికి తనమీద తనకే కోపంగా, అసహ్యంగా ఉంది. నిజానికి అకౌంటు పుస్తకంలో మామ బొమ్మను వేయబోయి, అతడు వేసుకన్నది తన బొమ్మనే!

''మామ'' అని ఇకిలించటం, చప్పట్లు కొడుతూ గంతులు వేయటం అసహజంగా కనిపిస్తాయి. ఇది నిస్సందేహంగా అపసవ్య ప్రవర్తనే (Abnormal behaviour). ఆధిక్యాన్ని నిరూపించుకోబోయి ప్రదర్శించిన అపసవ్యత!

ఈ విధంగా సీతారామారావు మనఃప్రపంచంలోని అస్వస్థత మొదటి సారి వెలుగులోకి వచ్చింది.

ఉద్యోగం పోవడంవల్ల ఉత్పన్నమయ్యే ఆర్థిక సమస్యకు సంబంధించిన అవగాహనగానీ, పట్టింపుగానీ అతనికి లేవని కూడా ఈ సన్నివేశంలో తేలిపోయింది. అతని మానసిక ప్రపంచానికి వాస్తవిక ప్రపంచానికి మధ్య ఇదివరకే ఉన్న అసమతౌల్యం డబ్బు లేకపోవటంతో అఖాతంగా మారింది.

ఔదార్యం, దాతృత్వం, వంశప్రతిష్ఠ, కీర్తికాంక్ష అన్న అంశాలతో కూడిన జమీందారీ జీవన శైలి, డబ్బు అయిపోవడంతో దెబ్బతిన్నది. క్రమంగా సీతారామారావు సాంఘిక సంబంధాలు క్షీణించాయి. ఇది వరకు అతని డబ్బు కోసం వచ్చినవాళ్ళంతా రావటం మానేశారు.

సాంఘిక సంబంధాలు క్షీణించినందువల్ల ఏర్పడ్డ లోటును కుటుంబ జీవితం తీర్చితే బాగుండేది. ఐదేళ్ళ సాంసారిక జీవితం పెళ్ళికి ముందే ఏర్పడ్డ ద్వేషాన్ని పెంచిందే తప్ప తగ్గించలేదు.

ఆ రోజుల్లో అతడు రాసిన పాట అతని కవితా శక్తికి నిదర్శనం. అంతేకాదు. అతనిలో జీవితం పట్ల నెలకొన్న ప్రతికూల దృష్టికి కూడా ఇది నిదర్శనమే.

'పడగొట్టండోయ్ టాజ్ మహల్....
నలిపెయ్యండోయ్ పువ్వుల మొవ్వలు'

అంటూ సౌందర్య ద్వేషాన్ని ప్రదర్శిస్తాడు. తాజ్ మహల్ భార్యాభర్తల అనురాగ చిహ్నం కనుక, అది అతని దాంపత్యాన్ని వెక్కిరిస్తుంది.

'చిదిమెయ్యండోయ్ స్త్రీ సౌందర్యం'

అంటూ సౌందర్య ద్వేషంతో పాటు స్త్రీ ద్వేషాన్ని కూడా ప్రకటిస్తాడు. ఇందిరలో ఒకప్పుడు తనకు కనిపించిన సౌందర్యమే తన పతనానికి కారణమని తన మీద తనకే కోపం.

'దోచెయ్యండోయ్ ధనవంతుల
చంపెయ్యండోయ్ క్షుధార్తుల'

అంటూ విధ్వంసాత్మక వైఖరి[7]ని కూడా సీతారామారావు ప్రదర్శిస్తాడు. తాను ఒకప్పుడు ధనవంతుడే. కాని, తనను క్షుధార్తులంతా దోచేశారు. ఫలితంగా తాను ఆకలితో మాడి చస్తున్నాడు. తనను దోచిన వాళ్ళ మీదా కసే. దోచే అవకాశం వాళ్ళకు ఇచ్చినందుకు తన మీద తనకూ కసే.

సీతారామారావు శ్రమించకుండా సౌఖ్యాలను అనుభవించిన వర్గం నుంచి వచ్చినవాడు కావటం వల్ల, కార్యాచరణలోని ఫలాలను గ్రహించలేడు.

"ఏం చేస్తున్నారు ?" అని ఎవరైనా అడిగితే

"ఏముంది చెయ్యటానికి ?" అనే వాడు ఏదో ఒకపని చెయ్యాలనుకునేవారంతా అతనికి అజ్ఞానులుగా కనిపించేవారు. 'ఈ ప్రపంచం అజ్ఞానుల కోసం చెయ్యబడ్డదే అవడంవల్ల వాళ్ళు సుఖపడుతున్నారు.' అని అనుకునే వాడు, 'Where ignorance is bilss, it is folly to be wise.'[8] అన్న భావానికి దగ్గరగా.

ఆలోచనల బారి నుంచి తననుతాను రక్షించుకోవటానికి సీతారామారావు తోట పనికి పూనుకున్నాడు. అలవాటులేని పనికావటం వల్ల కోపం, చిరాకు ఎక్కువయ్యాయి ఫలితంగా కుటుంబ జీవితం దుర్భరమయింది. పనివల్ల ప్రయోజనం లేదనే తన వాదాన్ని నిరూపించుకోవటానికి ఉద్దేశ పూర్వకంగా చేసిన పనే తప్ప, జీవన సమరంలో పాల్గొనాలనే అనుకూల దృష్టితో చేసిన పనికాదు.

"బ్రతికినన్నాళ్లూ ఏదో ఒకరకంగా జీవితంలో పాల్గొనవలసిందే" అంటాడు తాత.

"ఎప్పుడో ఒకసారి అందరం చావవలసిందేగా !" అంటాడు సీతారామారావు.

రామయ్యతాతకూ సీతారామారావుకూ మధ్య జీవితానికీ, మృత్యువుకూ మధ్య వున్నంత వైరుధ్యం ఉన్నది !

సీతారామారావు ఒకప్పుడు ఒక అభిప్రాయం మంచిది అనుకుంటాడు. మరుక్షణం దానికి వ్యతిరేకమైన అభిప్రాయం మంచిదిగా తోస్తుంది. ఈ ద్వంద్వ ప్రవృత్తికి, ఈ స్వభావ ఘాత తత్వానికి, ముఖ్యకారణం అతనికి కలిగే అభిప్రాయాలు జీవితానుభవం నుంచి పుట్టినవి కాకపోవటమే. సంధి కాలపు ఊగిసలాట ధోరణి అతనిలో స్పష్టమైన వ్యక్తిత్వం ఏర్పడటానికి తోడ్పడలేదు.

ఇంతకు ముందే—

'ఈ ప్రపంచం అనుక్షణం మారుతూ వుంటుంది. కాని ఈ మార్పు ఎందుకో ఎవ్వరికీ అర్థం కాదు. ఈ మార్పుకి ఆదర్శం వున్నట్టు కనబడదు. ఇక మానవుడు చేసేది ఏమిటి?' అనుకున్నాడు.

ఇప్పుడు కూడా—

'ప్రపంచానికి ఒక ఆదర్శం లేదు కనక ఏ పనికీ ప్రయోజనం లేదు' అనుకుంటాడు. ఈ ప్రపంచం తనంతట తానుగా మారటం లేదనీ, ఈ మార్పు వెనుక బ్రహ్మాండమైన మానవ ప్రయత్నం ఉన్నదనీ అతడు అర్థం చేసుకోడు. మానవ ప్రయత్న లక్ష్యం నిరంతర ప్రగతేననీ, బహుముఖ వికాసమే అతని ఆదర్శమనీ సీతారామారావు అర్థంచేసుకోలేదు. వ్యవస్థలో వచ్చిన మార్పు తనను దెబ్బతీసింది కనుక అతనికి మార్పు పట్ల వైముఖ్యం ఏర్పడింది మార్పు తనను జయించిందని అంగీకరించడానికి అతని అహం ఒప్పుకోదు. అందువల్ల 'మార్పు'నే నిరాకరించటానికి తాత్విక స్థాయిలో ప్రయత్నిస్తాడు.

అంతేకాదు—

'ఎప్పుడూ ముసుగు పెట్టుకొని పడుకొని, కళ్లు మూసుకొని బాహ్య ప్రపంచాన్ని మరచిపోయి ఆలోచించేవాడు.'

'One who has curled up like a hedgehog with the sheet drawn over his head is not likely to be a striving or courageous character'[9] అని ఆల్‌ఫ్రెడ్ అడ్లర్ భావించినట్లుగా, సీతారామారావు వైఖరిలో పిరికితనమే కనిపిస్తుంది.

'అసమర్థుని ఆదర్శం' అన్న ప్రకరణం మొదట్లో సీతారామారావు కల నొకదాన్ని రచయిత చిత్రించాడు. సీతారామారావు సింహాలతో, ఏనుగులతో, పాములతో నిండిన కారడవిలో తపస్సు చేసుకుంటున్నాడు. ఒక నాగుపాము తన పడగతో అతణ్ణి ఎండనుంచి కాపాడుతున్నది. కొండచిలువ మనుష్య భాషలో 'అలారండి, ఇలారండి'' అంటూ ఉన్నది. ఒక ఎలుగుగొడ్డు తాటి చెట్టు ఎక్కి కల్లు తాగి కిందికి దూకే సరికి సీతారామారావుకు తపోభంగ మయింది. అతని కళ్ళలో నుంచి ఒక తేజస్సు బయలుదేరి ఎలుగ్గొడ్డు వెంట్రుక లను కాల్చివేసింది. మళ్ళీ అతడు తపస్సుకు పూనుకున్నాడు. ఎంతో కాలం గడిచింది. అర్ధనారీశ్వరుడు ప్రత్యక్షమయ్యాడు. శివుని శరీర భాగానికి, పార్వతి శరీర భాగానికి నడుమ నల్లగుడ్డ వుంది.

వరాలు ఇవ్వొద్దని పార్వతీ, తాను పుట్టిందే వరాలు ఇవ్వటానికని శివుడూ పోట్లాడుకుంటారు.

సీతారామారావు శివుణ్ణి 'అన్నం' కోరుకుంటాడు.

''నీకు అసలు ఆకలి అనేదే లేకుండా చేస్తాను'' అన్నాడు శివుడు.

''నాకు ఆకలి వుండాలి, ఆకలితీరే అన్నం ఉండాలి'' అన్నాడు సీతారామారావు. శివుడు ఆ వరం ఇచ్చాడు. ఇంకో వరం ఇవ్వటానికి పూను కునే సరికి పార్వతి అడ్డు తగిలింది.

''అనాది నుంచి సంపాదించుకున్న మంచిపేరు నేను చెడగొట్టు కోను'' అన్నాడు శివుడు. అంతేకాదు, మీ అందరికంటే పేరు ప్రఖ్యాతుల మీద ఎక్కువ ప్రేమ నాకు'' అని కూడా అన్నాడు.

సీతారామారావు ''నా వరం ఇంకొకళ్ళకివ్వకూడదు'' అని కూడా కోరాడు. శివుడు ఆ వరం కూడా ఇచ్చి అంతర్ధానమయ్యాడు.

ఇది సంక్షిప్తంగా కల.

ఫ్రాయిడ్ ప్రకారం వ్యక్తికి వచ్చిన కల అచేతన స్థితిలో గుప్తంగా ఉన్న ఆలోచనలకు, కోరికలకు ప్రతీక. వ్యక్తి కల ద్వారా సాధించేది 'అభిలాష సిద్ధి'.

ఆడ్లర్ ప్రకారం కలలు కేవలం గతాన్ని మాత్రమే సూచించేవికావు. అవి ప్రస్తుత సమస్యలపట్ల వ్యక్తి యొక్క ఆవేశాత్మక వైఖరిని కూడా వెల్లడి చేయవచ్చు.10

కలలో అడవిలోకి వెళ్ళటంలోనే సీతారామారావులోని పలాయన తత్వం వెల్లడవుతున్నది. సంఘంలో తాను పొందిన అసమర్థుడనే పేరును భరించలేక ఎక్కడికైనా వెళ్ళిపోయి, అక్కడ సమర్థుడనే పేరు తెచ్చుకోవాలనీ, అంతకు ముందు తనను అసహ్యించుకున్న జనులే అప్పుడు తన గొప్పదనం తెలుసుకొని దర్శనంకోసం రావాలనే వాంఛ వుంది. అందుకే, కొంద చిలువ "అలారండి, ఇలారండి" అంటూ ఉంది. ఎలుగ్గొడ్డును కాల్చటం కలలో మహిమకూ, నిజజీవితంలో కసికీ నిదర్శనం.

అర్ధనారీశ్వరుడు, శరీరాలు కలిసినా మనసులు కలువని భార్యాభర్తలకు వ్యంగ్యాత్మక రూపం.

ఇంతకూ సీతారామారావు కోరిన వరం అన్నం! అతని దైవందిన సమస్య అది. కాని, ఆ అన్నాన్ని కూడా కేవలం తన కొరకే కోరుకున్నాడు తప్ప, తన భార్యా బిడ్డల కొరకు కాదు. ఇది కుటుంబంపట్ల అతని బాధ్యతా రాహిత్యాన్ని సూచిస్తున్నది. శివుడు ఆకలే లేకుండా చేస్తానన్నప్పుడు అంగీకరించకపోవటానికి కారణం, అందరికీ ఉన్న సమస్య తనకు లేకపోవటం ద్వారా గొప్పదనాన్ని సాధించాలని అతడు కోరకపోవటం అందరికీ ఉన్న సమస్యను అందరికన్నా భిన్నంగా, సునాయసంగా పరిష్కరించుకోవటం ద్వారా మాత్రమే అతడు గొప్పదనాన్ని సాధించదలుచుకున్నాడు. "అనాది నుంచి సంపాదించుకున్న మంచిపేరు నేను చెడగొట్టుకోను" అన్నాడు శివుడు. ఇది సీతారామారావు అమలులో పెట్టిన ఆదర్శమే. తనకు లభించిన వరం మరెవ్వరికీ లభించకూడదనుకోవటం, సమాజంలో కోల్పోయిన ప్రత్యేకతను తిరిగి సాధించటం కోసమే!

అప్సరస పంచభక్ష్యాలు తినిపించటం, కల ద్వారా అతడు పొందిన 'అభిలాష సిద్ధి'కి సూచన. అప్సరస అతని తొడమీద కూర్చోవటం లైంగిక

అభిలాష సిద్ధికి సూచన. దాంపత్య జీవితంలో అసంతృప్తికరంగా ఉన్న లైంగిక సంబంధాన్ని ఈ ప్రతీక వెలుగులోకి తెచ్చింది.

మొత్తం మీద ఫ్రాయిడ్ భావాలను, ఆడ్లర్ భావాలను దృష్టిలో వుంచుకొని రచయిత ఈ కలను కల్పించాడు. ముఖ్యంగా దైనందిన ఆహార సమస్యకు సీతారామారావు ఎలాంటి అలౌకిక పరిష్కారాన్ని వాంఛిస్తున్నాడో ఈ కల వెల్లడిస్తున్నది. తనలోని న్యూనతా భావం నుంచి పారిపోవటానికిగాను ఆధిక్య భావాలను ఆశ్రయించినందువల్ల గతాన్ని గూర్చి కాక వర్తమానాన్ని గూర్చీ, భవిష్యత్తును గూర్చీ అతడు ఆలోచిస్తున్నందువల్ల, ఈ కల అడ్లర్ భావాలకు దగ్గరగా ఉంది.

'....the dream is not a contradiction to waking life, it must always be in the same line as other movements and expressions of life.'[11] అన్న ఆడ్లర్ అభిప్రాయం సీతారామారావు విషయంలో అక్షరాలా నిజం. అతడు మేల్కొన్న తర్వాత.

'ఇంత మంది మేధావులున్నారు గదా ప్రపంచంలో, వీళ్ళల్లో ఒక్కరైనా అన్నం తేలిగ్గా దొరికే పద్ధతి ఎందుకు కనిపెట్టరు ? ఏ వాసన చూట్టం వల్లో, ఏ గాలి పీలవటంవల్లో, ఏ నీళ్ళు తాగటంవల్లో ప్రాణాలు నిలిచేటట్టు ఎందుకు చెయ్యరు ?' అంటూ కలలో మాదిరిగానే అవాస్తవిక పరిష్కారాన్ని వాంఛిస్తాడు. ఇది అతని స్వప్నజగత్తుకు జీవితానికి ఎంత దగ్గరిపోలిక ఉన్నదో నిరూపించే ఆలోచన అంతర్జాతీయ స్థాయిలో ఆహార సమస్యను మరిచిపోయే ప్రయత్నమూ కనిపిస్తున్నాయి.

వర్గాలు లేని సమాజంలో అందరికీ అన్నం దొరుకుతుందనే మార్క్సిస్టు సిద్ధాంతం అతనికి నచ్చలేదు. కాని- 'తమ ఆస్తిపాస్తులన్నీ నాశనం అయినా లెక్కచెయ్యకుండా సహాయం చేయటం' అతనికి నచ్చింది. అంటే, సామాజిక వాదం కంటే ఆత్మీయ స్పర్శ ఉన్న ఔదార్య లక్షణమే సమంజసంగా కనిపించింది.

'మన మహాఋషులు...పాశ్చాత్యులకు మల్లే ఆకలిని తీర్చటం కాకుండా ఆకలిని జయించటానికి ప్రయత్నించారు' అని ఆధ్యాత్మికదృష్టిలో కూడా ఆలోచించేవాడు,

కాని, అతనిలో ఏ వాదం మీద కూడా పూర్తి విశ్వాసం కనిపించదు. మార్క్సిజం మీద పూర్తి వ్యతిరేకత ఉన్నదని అనుకోలేము. స్వానుభవం దృష్ట్యా ఔదార్య శీలం మీద కూడా అచంచల విశ్వాసం ఉండటం అసాధ్యం. ఇక ఆధ్యాత్మిక విశ్వాసానికి అతనిలో పునాదే లేదు. అందుకే,

'మనం ఈ గడియ చచ్చినా చచ్చిపోవచ్చు గదా!' అనే మృత్యుస్పృహ అతని ఆలోచనలకు ఒక అపరిపక్వమైన ముగింపును ప్రసాదించేది.

ఒకసారి సీతారామారావు తన మిత్రులను

"అసలు ప్రాణం అనేది ఎలా వొచ్చింది ?" అని అడిగాడు. ఇది సీతారామారావునే కాదు. మానవ మేధస్సునే కలవరపరచిన ప్రశ్న. ఆత్మా, ప్రకృతీ- వీటిలో ఏది ముందు ? చైతన్యం నుంచి పదార్థం ఉద్భవించిందా ? లేక పదార్థం నుంచి చైతన్యమా ? అన్న వివాదం ప్రపంచ తత్వవేత్తలను రెండు వర్గాలుగా చీల్చింది. విశ్వాసాన్ని ప్రమాణంగా భావించిన వారు చైతన్యం నుంచి పదార్థం ఉద్భవించిందనీ, జ్ఞానాన్ని ప్రమాణంగా భావించిన వారు 'పదార్థం అనుక్షణం పరిణామం చెందుతుందనీ ఆ పరిణామంలో ఒక దశలో ప్రాణం వొచ్చిందనీ'12 వాదిస్తారు. మొదటిది ఆధ్యాత్మిక వాదం రెండోది భౌతికవాదం.

సీతారామారావుకు గాని, అతని స్నేహితులకు గాని భగవంతునిలో నమ్మకంలేదు. అందువల్ల తర్జన భర్జనలు చేసి భౌతికవాదం వైపు మొగ్గు చూపుతారు.

సీతారామారావు తన మిత్రులను "ప్రాణం ఒక ప్రయోజనాన్ని సాధించటానికి పుట్టిందా ?" అని అడిగాడు.

"లేదు"

"ఎందుకు పుట్టింది ?"

"నిర్నిమిత్తం"

"నిర్నిమిత్తంగా పుట్టి పరిణామం చెందే దాని ఫలితం మనకు విదితం. అసలు దానికే ప్రయోజనం లేనప్పుడు మన జీవితానికి ఆదర్శం అనీ ప్రయోజనం అనీ ఎక్కడ నుంచి వొస్తుంది ?" అని తేల్చివేశాడు.

ప్రాణం నిర్నిమిత్తంగా పుట్టివుండవచ్చు. కాని, ప్రాణం అనేది దాని కదే ఒక లక్ష్యం కాదని అతడు ఆలోచించదలచుకోలేదు. అసలు సీతారామారావు వేసే ప్రశ్నలు తాను ముందే స్థిరపరచుకున్న సమాధానానికి దారితీసే ప్రశ్నలు. అందుకే, అతని ప్రశ్నల వెనుక నిజమైన జిజ్ఞాస తక్కువగా కనిపిస్తుంది.

"నిర్నిమిత్తంగా బ్రతకటానికి వీలుంటే బ్రతకటం, లేకపోతే చావటం" అన్నాడు. మళ్ళీ మృత్యువ్యూహే అతడు ప్రారంభించిన చర్చకు ముగింపును ప్రసాదించింది.

ఆహార సమస్యను గూర్చి ఆలోచించినప్పుడు అతడు మార్క్సిజానికి వ్యతిరేకంగా ఉన్నాడు. అంతేకాదు, ఔదార్య లక్షణానికి, ఆధ్యాత్మిక వాదానికి దగ్గరగా ఉన్నాడు. మరి ప్రాణం గూర్చి చర్చించినప్పుడేమో భౌతికవాద వైఖరికి కాస్త **దగ్గరగా** ఉన్నాడు. ఇది తాత్త్వికస్థాయిలో ద్వంద్వవైఖరి.

తన అవసరానికి గాను వందరూపాయలు పంపుమని సీతారామారావు మేనమామకు ఉత్తరం రాశాడు. జవాబు రాలేదు. 'మండి' మరో ఉత్తరం రాశాడు. ఈ ఉత్తరానికి మేనమామ వివరంగా సమాధానం రాశాడు.

"....మీది ప్రత్యేక సృష్టి అనీ, మిగిలిన వాళ్ళ కంటే గొప్పవాళ్ళమనీ అనుకుంటారు. పదిమందిచేత పొగిడించుకోవాలనే వాంఛ మీ అందరికీ వుంది." అంటూ ఇంకా అనేక విషయాలను రాశాడు. జమీందార్లకు సహజంగా శ్రమజీవి మీద ఉండే అల్పభావంతోనే సీతారామారావు తండ్రి తన బావ మరిదిని చూసేవాడు. ఎదుటి వంశం వాళ్ళను అడుగడుగునా అవమానించటం ద్వారా తమ వంశం గొప్పదనాన్ని కాపాడుకుంటున్నాననుకునేవాడు. సీతారామారావు తండ్రికి తన భార్యను ప్రేమించటానికి కూడా వంశం, అహం అడ్డు వచ్చాయి! తన చెల్లెలిని భర్త నుంచి విడదీయటం ద్వారా వంశాధిక్యాన్ని నిరూపించానని భ్రమించినవాడు సీతారామారావు తండ్రి!

పై అంశాలను మేనమామ ఆ ఉత్తరంలో వివరించాడు. అంతేకాదు, జీవితం ఎంతో స్పర్ధామయం అని కూడా రాసి, 'పిరికివాళ్ళకు, అసమర్థులకు' జీవిత సంగ్రామంలో చోటులేదు అని కూడా రాశాడు.

ఈ ఉత్తరం సీతారామారావు వంశం మీద మేనమామ రాసిన వ్యాసంలా వుంది. ఈ ఉత్తరం ద్వారా సీతారామారావు పెరిగిన వాతావరణం తెలుస్తుంది. కనీసం మేనమామ పోలిక వచ్చివున్నా లౌక్యుడై జీవితంలో నెగ్గేవాడేమోననిపిస్తుంది. బహుశా సీతారామారావును చూసినప్పుడల్లా మామకు తాను అనుభవించిన బాధాక్షోభలు గుర్తుకు వచ్చేయేమో. అందుకే, ఈ విధంగా ప్రతీకారం తీర్చుకున్నాడు. తన చెల్లెలికి, అంటే సీతారామారావు తల్లికి జరిగిన అన్యాయం పట్ల కూడా మామకు ప్రతీకారం కనిపిస్తుంది. సీతారామారావు తండ్రి మీద కాక, అమాయకుడైన సీతారామారావు మీద ప్రతీకారం తీర్చుకుంటున్న మేనమామ కూడా ఒకవిధంగా పిరికివాడేననిపిస్తుంది. జమీందారీ విధానం క్షీణదశలో ఉన్నప్పుడు లాభపడి పైకి వచ్చిన బతకనేర్చినవాడు, మేనమామ.

ఉత్తరం సీతారామారావు ఊహకు పూర్తిగా భిన్నంగా ఉన్నది. తమ వంశాధిక్యాన్ని, తన తాత తండ్రుల అహంకారాన్ని మేనమామ ప్రశ్నించాడు. మొత్తం మీద మేనమామ జీవిత సంగ్రామంలో యోధుడుగా, సంఘంలో పౌరుడుగా, కుటుంబంలో యజమానిగా సీతారామారావు సామర్థ్యాన్ని సందేహాస్పదం చేశాడు.

ఇన్ని కఠిన సత్యాలను అంగీకరించగలిగే సరళ హృదయం కాదు సీతారామారావుది. ఆ ఉత్తరంలో బయటపడ్డది, తన నిజస్వరూపం కాదనీ తానెంతగానో విశ్వసించిన మేనమామ నిజస్వరూపమేననీ ఆత్మవంచన చేసుకుంటాడు. తన మామ వెళ్ళి మేనమామతో మాట్లాడటం అతనికి మరీ మంటగా ఉంది.

'కుట్ర కుట్ర మామా మేనమామల కలయిక' అంటూ ఒక బొమ్మ వేశాడు. వంశాధిక్యాన్నీ, ఆదర్శాభాసలో పుట్టిన సిద్ధాంతాలను కవచాలుగా ధరించి సీతారామారావు జీవిస్తున్నాడు. మేనమామ ఆ కవచాలను చీల్చేసరికి అతనిలో కలిగిన భద్రతారాహిత్యానికి ప్రతిరూపం ఈ బొమ్మ. అయితే, మామా మేనమామల కుట్రను ముందే పసిగట్టగలిగానన్న ఆధిక్యభావాభాస కూడా ఇందులో లేకపోలేదు.

మేనమామ ఉత్తరం సీతారామారావు జీవయాత్రలో కీలకమైన మలుపుకు కారణమైంది అంతవరకూ అతడు తన వంశం మీద తనమీద, సంఘంలో కీర్తిగౌరవాలున్నాయని విశ్వసిస్తూ వచ్చాడు. మేనమామ దెబ్బతీయటంతో తన మీద తనకే ఏవగింపు కలిగింది. తన తండ్రి చివరి కోరికను తాను తీర్చలేక పోయాననే అసంతృప్తికి అతడు లోనయ్యాడు. ఈ ఏవగింపు, ఈ అసంతృప్తి కూతురు మీద, భార్య మీద అసహనంగా, క్రోధంగా వెల్లడి అయ్యాయి. సీతారామారావు మనస్తత్వం ఇంకా సంక్లిష్టం కాజొచ్చింది.

అతనికి లోకం నిండా శత్రువులే కనిపించసాగారు. తన అంతరంగంలోని విశ్వాసమనే గూడును మేనమామ కొంత దెబ్బ తీశాడు. కనుక, తనకు తటస్థపడే ప్రతివ్యక్తి ఆ గూడును పూర్తిగా దెబ్బతీయటానికే చూస్తున్నాడనే అనుమానం రోజురోజుకూ అతనిలో పెరగసాగింది.

తన గూడును తీసేస్తారేమోనని తనకు అనుమానం ఉన్న ప్రతివాణ్ణి కాకి తన్నినట్లుగా13 సీతారామారావు తనకు తటస్థపడే ప్రతివ్యక్తిని బాధ పెట్ట సాగాడు.

సీతారామారావుకు తాత్విక స్థాయిలో ఏర్పడ్డ ద్వంద్వ ప్రవృత్తి జీవితంలోని సామాన్య సమస్యల పైకి కూడా ప్రాకింది. ఎవరైనా కొడితే తిరిగి కొట్టమని కూతురుకు సలహా ఇచ్చినవాడే, తన సలహాను పాటించిన కూతురును దండించాడు. అందరితోనూ స్నేహం చేయవచ్చునని చెప్పినవాడే "చిల్లరవాళ్ళు తగనివాళ్ళు" అన్నాడు. తల్లిదండ్రులు తమ పిల్లల్ని కొట్టటం సహజ సంఘటనే. ఈ అత్యంత సహజ సంఘటన ద్వారా సీతారామారావులోని ద్వంద్వ ప్రవృత్తిని నిరూపించటం చక్కని శిల్పం.

జీవితాన్ని సమస్యగా చేసుకొని, జీవించటమే సమస్యగా భావిస్తున్న సీతాథామారావుకు, చిన్న విషయం కూడా తేల్చి చెప్పటానికి వీలులేని భయంకర సమస్యగా పరిణమించింది. తనను మార్చుకోవటం 'పద్మవ్యూహాన్ని ఛేదించటం'గా కనిపించింది,

తనను 'ప్రత్యేక సృష్టిగా' భావించుకొని, అలవాటు చేసుకున్న ఒంటరితనమే ఇప్పుడతని శత్రువు. తాను సంఘం నుంచి ఆశించిన కీర్తిగౌరవాల

లోటును తీర్చగల వ్యక్తి తన భార్యేనని, కేవలం ఆమెకే తనపట్ల సానుభూతి గౌరవాలున్నాయని అతనికి తెలుసు.

'తన భార్య అంకంలో తలపెట్టి పసిపిల్లవాడికి మల్లే ఏడవాలని పించింది.' '....తన ప్రవర్తనకు క్షమాపణ కోరుకోవాలనిపించింది.'

అంతరాంతరాలలో దాగివున్న సీతారామారావు కల్లాకపటం లేని పసి హృదయం పై మాటల్లో వ్యక్తమయింది. తనకు భార్యపట్ల వున్న ప్రేమను వ్యక్తం చేయాలని ప్రయత్నించాడు. ఎవరైనా ప్రేమను సహజంగానే ప్రకటిస్తారు. కాని, సీతారామారావు విషయంలో అందుకు కూడా ప్రయత్నం అవసరం,

''ఇవాళ బీరకాయ కూర బాగుంద''న్నాడు.

ఆమె మాట్లాడలేదు. కారణం, అతడు బీరకాయ కూర బాగుందన్నా, బాగులేదన్నా ఆమె దృష్టిలో ఒకటే. బాగుందన్నందుకు ఆమె సంతోషించినా, బాగులేదన్నందుకు ఆమె విచారించినా అతనికి ఏదో రకమైన తప్పు కనిపిస్తుంది. నిర్లిప్త స్వభావం మూలంగా మౌనంగా ఉండటం ఆమెకు అలవాటయ్యింది. మౌనంగా ఉండటం కూడా సీతారామారావు దృష్టిలో తప్పే. ఆమె పక్షాన తానే ఒక అభిప్రాయాన్ని సృష్టించుకుంటాడు. వెంటనే అన్నం తినకుండా లేచిపోయి తన కసిని వెల్లడిచేశాడు. తను చేస్తున్న పని మంచిది కాదని ఒక పక్క అతనికి తెలుస్తూనే ఉంటుంది. కాని, ఆ పని చెయ్యకుండా ఉండలేకపోతున్నాడు. అంటే, తన మీద తనకే అదుపులేదన్న మాట.

ఒక్క క్షణం భార్య కనిపించకపోయేసరికి, తన మూలంగా బావిలో దూకిందేమోనని భయపడిపోయాడు. కాని, ఆమె సజీవంగా కనిపించేసరికి అతనికి పిచ్చికోపం వచ్చింది: ప్రాణాలతో ఉండటమే ఆమె నేరమైనట్లు.

భార్యను కొట్టాడు.

ప్రేమను వ్యక్తంచేయాలనుకొని కసిని వ్యక్తం చేశాడు. భార్యకు సంతోషం కలిగించాలనుకొని దుఃఖాన్నే కలిగించాడు. ఆమె ఒడిలో తలపెట్టి పసివాడిలా ఏడవాలనుకొని, ఆమె మీద చేయి చేసుకున్నాడు!

కుటుంబ జీవితం మీద, ముఖ్యంగా దాంపత్య జీవితం మీద పడ్డ దెబ్బలివి.

'తను కొట్టాడు భార్య మీద చేయిచేసుకున్నాడు....తన భార్యని కొట్ట డంలో ఈ ప్రపంచానికి ఏమీ సంబంధం లేదా....?' అని సీతారామారావు మథనపడ్డాడు. ఒక విషాదం జరిగిపోయిందన్న స్పృహ పై వాక్యాల్లో ఉన్నది. సంఘం పట్ల బాధ్యతతోనే తాను దానధర్మాలు చేశాననీ, అందువల్ల సంఘా నికి తన పట్ల కూడా బాధ్యత ఉన్నదనీ నిస్సహాయంగా భావిస్తున్నాడు.

సీతారామారావు స్వభావంలో ఆత్మవిమర్శకు చోటు చాలా తక్కువ. సీతారామారావును ప్రేమపూర్వకంగా నడిపించే వారెవరూలేరు. రామయ్య తాత వున్నాడు. కాని, అతనికీ సీతారామారావుకూ మధ్య వయస్సులో అంతరం కారణంగా స్నేహం సాధ్యపడలేదు. తాతచేసే పెద్దమనిషి తరహా నీతి బోధ అతని మీద పెద్దగా పనిచేయలేదు. మేనమామ ఉత్తరం ద్వారా తన వంశాన్నే నిర్దాక్షిణ్యంగా విమర్శించాడు. ఆ ఉత్తరం ప్రభావం అతని మీద ప్రతికూలాత్మకంగానే ఉన్నది. నిష్క్రియావాద నిరాశావాదాలతో విషపూరితమైన అతని అహం మేనమామను గానీ, సంఘాన్ని గానీ కాటేయ జాలదు. కనుక తనను తానే కాటేసుకుంటుంది. ఇందులో మొదటి దశ కూతురును కొట్టటంతో ప్రారంభమై భార్యను కొట్టటంతో పూర్తయింది.

ఈ దశలో అతడు వైవాహిక జీవితపు తొలి స్మృతుల తోటలోకి అడుగుపెట్టాడు. బహుశా ఆ తోటకు వీడ్కోలు చెప్పటమే అతని ఉద్దేశమై వుంటుంది. తానూ తన భార్యా ఒకరికోసం ఒకరుగా బతికిన ప్రేమమయ జీవి తంలో ఇప్పటి జీవితాన్ని పోల్చి చూసుకుంటే అతనికి ఆశ్చర్యం కలిగింది. తన జీవితమేనా అది అనే అనుమానం కలిగింది. ఆ జీవితాన్ని తిరిగి అందు కునే ప్రశ్న లేదు. అది ఫోటోల్లో మిగిలిపోవలసిందే, నిర్జీవంగా. డైరీల్లో14 మిగిలిపోవలసిందే చరిత్రలాగా. తనకు సంబంధించినంతవరకు అది గతిం చిన గతం. ఇకముందు స్మృతిగా కూడా మిగలదు.

దాంపత్యానికి కేవలం దైహికకామమే ఆధారం కాదు. అడ్లర్ అన్నట్లుగా-

'...each partner must be more interested in the other than in himself. This is the only basis on which love and marriage can be successful.'[15]

సీతారామారావు తనకు వివాహమైన కొత్తలో ఇందిరతో ఏర్పడిన అనుబంధాన్ని కొనసాగించలేక పోయాడు. ఆదర్శాలు, అభ్యుదయ భావాలు ఆచరణలోకి రాకపోవటంవల్ల అతని తండ్రి తల్లిని ఏ దృష్టితో చూశాడో, దాదాపు అదే దృష్టితో అతడు తన భార్యను చూశాడు. మొదటి నుంచి అతనికి తనపట్లనే ఆసక్తి ఉన్నది. ఇందిర భర్తను అర్థం చేసుకోవటం ఏ పొరపాటూ చేయని మాట నిజమే అయినా, దైనందిన జీవన సమరంలో పాల్గొనటానికి అతణ్ణి తానై తానుగా ప్రోత్సహించలేక పోయింది. ఇందుకు కారణం, తన భర్త వంటి మేధావి సామాన్య జీవన సమస్యలకు అతీతుడని ఆమె పొరపడటమే. మొదట్లో ఆమెకు భర్తపట్ల ఉన్న ఆసక్తి అతని అనాసక్తి కారణంగా కుంటుపడింది. భర్తలోని ప్రతికూల వైఖరి. ద్వంద్వప్రవృత్తి, చాంచల్యం మొదలైన లక్షణాల గమ్యం మృత్యువేనని ఆమె గుర్తించినా, గుర్తించకపోయినా ఆమె చేయగలిగింది చాలా తక్కువ. తండ్రి ఆమెను భర్తను వదిలేసి రమ్మన్నాడు. ఆమె వెళ్ళలేదు. వెళ్ళకపోవటానికి కారణం, భర్తలో ఏ క్షణంలోనైనా మార్పు రావచ్చుననే ఆశకాదు. అతనితో చివరివరకు ఉండటం తన విధ్యుక్తధర్మమనే భావమే. భర్త పతనాన్ని మొదటి నుంచి చివరివరకు నిస్సహాయంగా, నిశ్శబ్దంగా తిలకించిన ప్రేక్షకురాలు ఇందిర.

సీతారామారావు తన దుస్థితికి స్నేహితులే కారణమనుకున్నాడు. వాళ్ళ నందరినీ జ్ఞాపకం చేసుకున్నాడు.

సంకుచిత దృష్టితో అందరి ప్రతిభను సందేహించే సూర్యారావు;

''నేను సుఖపడను, ఇతరులను సుఖపడనివ్వను'' అనే ఆదర్శంగల శాతవాహనుడు;

అహర్నిశలు తన తండ్రిని పొగిడే బాలకృష్ణుడు,

లోకం తనకోసం పడిచస్తున్నదని చెప్పుకునే శివరావు-వీళ్ళే తన పతనానికి కారణం అనుకున్నాడు.

అయితే, పై స్నేహితులందరి లక్షణాలు సీతారామారావులో ఉన్నాయి. నిజానికి పై స్నేహితులు సీతారామారావు అంతర్గత లక్షణాలకు రూపకల్పనలే. సీతారామారావు తనలోని అచేతన లక్షణాలని వాళ్ళలో చూస్తున్నాడు.

'తనలోని అచేతన ప్రచోదనలను, ప్రేరకాలను ఎదుటి వాళ్ళ మూర్తిమత్వానికి ఆపాదించే 'ప్రక్షేపణి'16 (Projection) తంత్రానికి సీతారామారావు ఆలోచనా విధానం చక్కని ఉదాహరణ.

సీతారామారావుకు మహారణ్యాల్లోకి వెళ్ళి దారులుకొట్టి బతకాలనిపించింది. అతనిలో వెంటనే ఒక స్వైరకల్పన17 (Fantacy) రూపొందింది.

అర్ధరాత్రి రెండెడ్ల బళ్ళలో మొగవాళ్ళు, ఆడవాళ్ళు, పిల్లలూ అంతా భయపడుతూ ప్రయాణం చేస్తుంటారు అంతలో దొంగల తోపు వస్తుంది. తన అనుచరులూ, తానూ వాళ్ళమీద దాడిచేసి నిర్దాక్షిణ్యంగా ఒక్కొక్కరినీ దోపిడీ చేస్తారు. ఎవరయినా ఎదురుతిరిగితే ఇష్టం వచ్చినట్లు తన్నాలనుకుంటాడు. దోపిడీకి లోనైన వాళ్ళలో మంచి వయసులో ఉన్న పిల్లమీద అతని కన్ను పడుతుంది ఆమె అదివరకే మానభంగాలను గూర్చి విని ఉన్నది. అతని చేతిలో తనకు మానభంగం తప్పదనుకొని భయపడుతూనే మానసికంగా సంసిద్ధురాలైంది. అతడు 'జావ్' అంటాడు. అనేక దృశ్యాలను ఊహించుకున్న ఆ పిల్లకు, ఏమీ జరక్కపోయేటప్పటికి ఆశాభంగం అవుతుంది.

ఇవి ఆ స్వైరకల్పనలోని ముఖ్యాంశాలు.

స్వైరకల్పనలు కూడా కలలలాగే అభిలాషసిద్ధిని కలిగిస్తాయి ఈ స్వైరకల్పనల్లో లైంగికవాంఛతో సంబంధం లేనివీ, లైంగికపరమైనవీ కూడా ఉంటాయి. ఇతరులను హింసించటం ద్వారా ఆనందాన్ని పొందే తత్వంగల వాటిని పరపీడనరతి (Sadism) కి సంబంధించిన స్వైరకల్పనలనీ, హింసకు గురికావటం ద్వారా ఆనందాన్ని పొందే తత్వంగల స్వపీడనరతి (Masochism) కి సంబంధించిన స్వైరకల్పనలనీ అంటారు. సీతా

రామారావు ఇదివరకు అడవిలోకి వెళ్ళినట్లు కలగన్నాడు. ఇప్పుడూ అడవి లోకి వెళ్ళాలనే స్వైరకల్పనకు లోనయ్యాడు. అంటే, అతనిలో నాగరక సమాజం మీది కసికొద్దీ చోటు చేసుకున్న పలాయన తత్వం బలపడిందన్న మాట. ఇక్కడ అతడు అడవికి యజమాని. ఇంటికి యజమానిగా అసమర్థుడు కాని, అడవి రాజుగా సమర్థుడు. భయపెడుతూ నిలువు దోపిడీ చేయటానికైనా తెగించాడు. ఇది సీతారామారావులోని చేతగానితనాన్ని పరిహరించుకునే ఊహాత్మక సాహసం. మానభంగానికి మానసికంగా సంసిద్ధురాలైనా ఆ అమ్మాయికి ఆశాభంగం కలిగించటమంటే, మానసికంగా బాధపెట్టటమే. ఇది శాడిజపు లక్షణమే. ఆమెకు ఆశాభంగం కలిగించటంలో అతడు ఔదార్యభావాభాసను కూడా ప్రదర్శించాడు.

రామయ్య తాత తనను తాను మరిచిపోయి మనుమడితో ఆడుకోవటం సీతారామారావుకు నచ్చలేదు. కారణం, సీతారామారావు తనను తానెప్పుడూ మరిచిపోలేదు. తనను గురించిన ఆలోచనల్లో తప్ప సీతారామారావు మరిదేని లోనూ తాదాత్మ్యం చెందలేదు. తన జీవితాన్ని ఆటగా భావిస్తున్నాడని అర్థం చేసుకున్నాడు. ఎదుటివారు జీవితాన్ని ఆనందిస్తుంటే ఓర్వలేదు.

సీతారామారావుకు తన క్షోభే ప్రపంచపు క్షోభ.

అతడి దృష్టికి తాత 'మరుగుజ్జు' గా 'మట్టిపిడత' గా కనిపించాడు. నిజానికి ఎదుగలేని మరుగుజ్జు, జీవం నశించిన మట్టిపిడత తానే. స్వైర కల్పన ద్వారా తనను తాను హెచ్చవేసుకున్న వేడిలో చూశాడు కనుక తాత మరుగుజ్జుగా కనిపించటం సహజమే.

తాతను పడేసి తన్నాలనుకోవటం సీతారామారావులోని మానసిక అనారోగ్యాన్ని వెల్లడిచేసే ఊహ. భార్యపట్ల, కూతురుపట్ల పరిమితంగా ప్రదర్శితమైన ఈ అనారోగ్యం ఇంటినిదాటి వీధిని పడింది.

భార్యను కొట్టిన సంగతిని కూడా, తనను సమర్థించుకోవటానికే తాత ముందు బయటపెట్టాడు. శ్రీరాముడు చేసిన పనినే తానూ చేశానని వాదించాడు.

తాత మాటల్లో ఇది——

'మహనీయుల్ని నీచస్థితికి గుంజి తృప్తిపడటం. సీతారామారావు భార్యను కొట్టటం తాతకు కోపకారణమైంది. సీతారామారావు మాట్లాడే వెకిలి అపహాస్య ధోరణిని సహించలేక బయటకు వెళ్ళమన్నాడు. సీతారామారావు మాట్లాడేవి పిచ్చిమాటలని తాత గ్రహించాడు.

"నీకేమన్నా పిచ్చెక్కిందా" అన్నాడు తాత.

సీతారామారావు తనను తాను ఇంతకు పూర్వం చూసుకోని కోణం నుంచి చూసుకున్నాడు.

"నేను పిచ్చివాణ్ణా"

"తాను పిచ్చివాడా...."

"పిచ్చి మాటలు మాట్లాడతావే తాతా ?"

"నాకేం పిచ్చి తాతా, పిచ్చివాళ్ళకి పిచ్చిగాని"

పై మాటల్లో, ఆలోచనల్లో ఒక నిజాన్ని కాదనటానికి తాపత్రయ పడటం, కనిపిస్తుంది. తనకు పిచ్చిలేదనుకోవటం, ఎదుటి వాళ్ళే పిచ్చి వాళ్ళనుకోవటం కూడా పిచ్చివాడి లక్షణమే!

తాత కత్తిని చేతిలోకి తీసుకొని

"ఓరి పిచ్చి వెధవా" అనటంతో సీతారామారావు బయటకు పరిగెత్తాడు. ఇంచుమించు ప్రాణభీతితోనే పరుగెత్తాడు. ఇది ప్రాణాల మీద సీతారామా రావుకు మిగిలివున్న మమకారాన్ని వెల్లడి చేస్తున్నది.

"కళ్లెంలేని గుర్రం" అన్నాడు మనుమడు.

సీతారామారావు నిజంగా కళ్లెంలేని గుర్రమే. హేతువనే కళ్లెం కోల్పో యిన వ్యక్తి ప్రమాదంలో పడక తప్పదు.

సీతారామారావు తన మెదడుకూ ఇతర అవయవాలకూ ఉండే సమ న్వయం సన్నగిల్లినట్లు గమనించాడు.

దారిలో ఒక మసిబొగ్గు కనిపిస్తే అటూ ఇటూ తన్నసాగాడు. తన

జీవితం తనను ఎటు తన్నితే అటు తాను పోతున్నట్టు, తాను ఏటు తన్నితే అటు పోతున్న మసిబొగ్గును చూస్తే, అతనికి జాలి వేసింది.

తెల్లగోడలను నల్లగా చేయటానికి ఒకే బొమ్మను వేస్తూ వెళ్ళాడు. తెలుపును నలుపు చేయటం ఒక విధమైన మానసిక అనారోగ్యాన్ని సూచించే చర్య అయితే, ఒకే బొమ్మను వేయటం అన్నది వైవిధ్యం ప్రదర్శించలేని మానసిక స్థితిని సూచించే చర్య.

వేసిన బొమ్మలోని తల-వంశం, హృదయం—నాన్న, కడుపు-అమ్మ, చేతులు—మేనత్తా మేనమామలు, కాళ్ళు-తానూ, తన భార్యా. ఇది సీతారామా రావు సాంకేతిక భాష. ఈ భాషను విప్పి రాస్తే- తలలో వంశం నుంచి సంక్ర మించిన విలువలు, హృదయంలో తండ్రి నుంచి సంక్రమించిన జమీందారీ సంస్కారం, కడుపులో నవమాసాలు మోసి ఆకలి దప్పులు తీరుస్తూ పెంచి పెద్ద చేసిన తల్లి, చేతులలో తన వంశానికి సేవచేసి, 'చేతనైనతనం' ప్రద ర్శించిన మేనత్తా మేనమామలు, కాళ్ళు-మొత్తం భారం మోసే తానూ తన భార్యా— అవుతారు.

తాతతో గిల్లికజ్జా పెట్టుకున్నాడు. అంతటితో ఆగకుండా దారినిపోయే పెద్ద మనిషితోనూ హోటల్ యజమానితోనూ, న్యాయవాదితోనూ అదే ధోర ణిలో ప్రవర్తించాడు.

''మొన్న ఒక చీర అడిగిందని ఎందుకురా నీ భార్యని కొట్టింది?'' అని పెద్దమనిషిని నిలదీసినా, ''పాపం ఆమె కన్నవారినందర్నీ వొదులు కొని నువ్వే దేవుడవు అనుకొని పరపురుషుణ్ణి జేరనివ్వకుండా బిగబట్టుకొని నీతో కాపురం చేస్తూ వుందే. ఆమెను నువ్విట్లా కష్టపెడితే ఎట్లాగురా'' అని న్యాయవాదిని ప్రశ్నించినా, అపరాధ మనస్తత్వం కారణంగా తన వ్యక్తి త్వాన్ని విమర్శించుకోవటమే తప్ప మరొకటి కాదు.

పోలీసు దిమ్మె మీద నిలబడి చేసిన ఉపన్యాసంలో సీతారామారావు వివిధ వాదాలను, వాటి తత్వాలను ప్రస్తావించాడు.

''మొదట్లో దేవుడు మనల్ని పుట్టించాడు కాబట్టి వాళ్ళో ఐక్యం అవ టానికి మనం ప్రయత్నించాలనీ చెప్పార్రా''—

ఇది ఆధ్యాత్మిక వాదం.

"దేవుడనేవాడు బయటలేడు మనుష్యుల్లోనే వున్నాడు. కాబట్టి మానవ సేవే మాధవ సేవ....అని చెప్పార్రా"—

ఇది సంస్కారణ వాదం.

"సంఘంలో అనేక వర్గాలున్నాయి ఈ వర్గాల కలహం వల్లే సంఘం అభివృద్ధి చెందుతూ వుంది.... వర్గ పోరాటం సాగించండి అన్నార్రా"—

ఇది మార్క్సిజం.

"ఎందుకు? ఎందుకు? ఎందుకు? అని ప్రశ్నించుకోమని చెపుతార్రా. అన్ని ఎందులకు వాళ్ళ జ్ఞానాన్ని" బట్టి జవాబులు చెపుతారు.

ఇది హేతువాదం.

నవలా రచనా కాలంలో జిజ్ఞాసువైన ప్రతి యువకునికి ఎదురైన, ప్రతియువకున్ని సంఘర్షణకు గురిచేసిన వివాదాస్పదమైన వాదాలివి. అతణ్ణి ఆధ్యాత్మికవాదివో, భౌతికవాదివో తేల్చుకొమ్మని నిలదీసిన వాదాలివి. భూస్వామ్య వ్యవస్థలోని విలువలను సందేహించి, ప్రశ్నించి, తిరస్కరించమని నిర్బంధించిన కాలమది ఈ చారిత్రక నిరంకుశత్వాన్ని సీతారామారావు తట్టుకోలేడు. అలాగని తలవొగ్గటానికి అతని అహం అంగీకరించదు.

ఈ వాదాలన్నీ అసమగ్రమైనవని సీతారామారావు చెప్పాడు.

ఈ దిమ్మె మీద సీతారామారావు చేసిన ఉపన్యాసంలో మనకు అతని జ్ఞానం కనిపిస్తుంది. అయితే, ఈ జ్ఞానాన్ని ఇతరులకు బోధించాడే తప్ప, తనకు అన్వయించుకోలేకపోయాడు. అందుకే ఇది అజీర్ణమైన జ్ఞానం.

ఇప్పుడతడు "... నలుగురం కూడబలుక్కొని బతకలేమటరా?" అని సామరస్య వైఖరిని ప్రదర్శించాడు. మరి ఈ వైఖరిని అతడు తన జీవితంలో ప్రదర్శించి వుంటే ఈ స్థితి వచ్చివుండేదే కాదు. నిజానికి అతడు విశ్వసించేది—

"నిర్నిమిత్తంగా పుట్టాం, నిర్నిమిత్తంగా బ్రతకటానికి వీలుంటే బ్రతకటం లేకపోతే చావటం" అనే నిష్క్రియావాద వైఖరినే. అతడు ఏ వాదాన్నీ, ముఖ్యంగా ఏ అభ్యుదయ వాదాన్నీ పూర్తిగా విశ్వసించటంలేదు. ఏ అభ్యుదయ వాదమూ అతని నిష్క్రియాత్మక నిరాశావాద జీవిత విధానాన్ని సమర్థించకపోవటమే యిందుకు కారణం.

తర్వాత అతడు భోగంవాళ్ళపేటకు వెళ్ళాడు.

వేశ్యను చూస్తుంటే అతనికి 'తన ఇంటి ముందు నుంచి పూళ్ళో మురికినంతా పోగుచేసుకొని' పారే కాలువ జ్ఞాపకం వచ్చింది. ఇది నవలా ప్రారంభాన్ని 18 గుర్తుకు తెచ్చే వాక్యం. వేశ్యనూ సీతారామారావునూ సంఘం అసహ్యించుకుంటున్న మాట నిజమే. కాని, వేశ్య అవసరం సంఘానికి ఉన్నది. సీతారామారావుతో సంఘానికి అవసరం తీరిపోయింది !

తాను బజారుపాలుకావటానికి సంఘమే కారణమని సీతారామారావుకు అనిపించింది. కసితో సంఘం కోసం వెతుకుతుంటే, ఒక బహిరంగ సభలో వేదిక మీద పెద్దలూ, వేదిక కింద ప్రజలూ కనిపించారు. ప్రజల్లో వున్న దారిద్ర్యం పోవాలనీ, అజ్ఞానం నశించాలనీ నాయకులు గంభీరమైన ఉపన్యాసాలు ఇస్తున్నారు, సీతారామారావు ప్రజల్ని నెట్టుకుంటూ వెళ్ళి వేదిక ఎక్కి, అక్కడున్న నాయకుల నిజస్వరూపాలను బయటపెట్టాడు. వారిని నిర్మొహమాటంగా విమర్శించాడు. ఇది సాంఘిక వాస్తవాలను నిశితంగా విమర్శించటమే. ఇంత ధైర్యం ముందెప్పుడూ సీతారామారావు ప్రదర్శించలేదు. సంఘంలోని కుళ్ళను, నటనను అతడు సహించలేకపోయాడు. అయితే, ఏ సంఘాన్నయితే అతడు ఆరోగ్య మనస్సుతో ఎదిరించలేడో, దాన్ని అపసవ్య మానసిక ధోరణితో ఎదిరించగలుగుతున్నాడు. తాను ఆచరణలో పెట్టని ఆదర్శాన్ని, ఇతరులకు చెప్పే హక్కును ఏ నాయకునికీ లేదనే సత్యాన్ని సప్రమాణంగా తీసుకునే చేసిన సద్విమర్శే అది. కాని, అతడు పెద్దలతో ఆగక ప్రజల బలహీనతల మీద కూడా విరుచుకుపడే సరికి, పెద్దలూ ప్రజలూ ఒకటైపోయారు !

దెబ్బలుతిన్న తర్వాత సీతారామారావును రామయ్యతాత పలకరించాడు. నిజానికి సీతారామారావును కొట్టటానికి రామయ్యతాత కూడా

ప్రజలను పురికొల్పాడు. సీతారామారావులో ఉన్మాదం ప్రవేశించిందని తాత విశ్వసించాడు ప్రజల చర్య విద్యుద్ఘాత చికిత్స (shock treatment) లాగా పనిచేసి, అతని మనస్సును మెత్తబరుస్తుందనీ, ఆ తర్వాత అతణ్ణి తనకు అనుకూలంగా మలచుకోవచ్చుననీ రామయ్య తాత భావించాడు. కొంత తాత్కాలిక ఫలితం కనిపించిందనే చెప్పొచ్చు.

"నీ మనమరాలితో నన్ను క్షమించమని చెప్పు తాతా...." అన్నాడు. భార్యకు అతడు చెప్పే వీడ్కోలిది దాంపత్యానికి అతడు చెప్పే వీడ్కోలిది. భర్త ప్రేమకోసం తపించిన ఇందిరకు, భర్త ప్రతిభను గౌరవించిన ఇందిరకు, భర్త అహంకారాన్నీ, అసహనాన్నీ, ద్వంద్వ ప్రవృత్తినీ దాంపత్యంలో అనివార్యమైన అంశాలుగా విశాల హృదయంతో స్వీకరించిన ఇందిరకు లభించిన ప్రతిఫలమిది!

తాత అతణ్ణి నిద్రగన్నేరు చెట్టు కిందికి తీసుకుపోయాడు.

సీతారామారావులో ఆలోచనలు చెలరేగాయి. అన్ని దశలకు సంబంధించిన లక్షణాలను కలుపుకునే సంఘం వృద్ధి చెందుతున్నదనే అవగాహన కలిగింది కాని, ఈ అవగాహనలోని మంచిచెడ్డలను తర్కించటానికి అతడు సిద్ధంగా లేడు. కారణం, ఆలోచించ బుద్ధిపుట్టలేదు.' తననిన్ని రోజులు మోసగించిన ఆలోచనల్ని ఇక నమ్మదలచుకోలేదు. అనుభూతిపైనే మొగ్గు చూపదలచుకున్నాడు.

ఈ దశలో తాత సుదీర్ఘమైన ఉపదేశం చేశాడు. ఆ ఉపన్యాస సారాంశం ఇది :

'మానవ అభివృద్ధి క్రమంలో ముఖ్యపాత్ర వహించిందీ, మానవుణ్ణి ప్రకృతికి అధిపతిని చేసిందీ 'జ్ఞానం'. అంటే, హేతు జ్ఞానం. ఈ హేతు జ్ఞానంతో కాలక్రమంలో నిరుపయోగం అవుతున్న అంశాలను తొలగించి, కొత్త అంశాలను నింపుకుంటూ పోతేనే అది మానవుని అభివృద్ధికి ఉపయోగపడుతుంది లేకపోతే సర్వనాశనం చేస్తుంది. సీతారామారావు హేతువాదాన్ని విశ్వసించాడు కాని మారిన పరిస్థితులకు అనుగుణంగా తన విశ్వాసాన్ని మార్చుకోలేకపోయాడు. అందువల్ల, అతని జ్ఞానం అతని అభివృద్ధికి తోడ్పడ

లేకపోయింది. ఫలితంగా అతడు నిష్క్రియావాది అయ్యాడు. 'ప్రతి సిద్ధాంతం అసమగ్రమైనదే' అని నిరూపించుకోవటానికి పూనుకోవటంతో అర్థంలేదు. ఒకటి తర్వాత ఒకటిగా అనేక సిద్ధాంతాలు అస్తిత్వంలోకి వస్తున్నాయంటే అందుకు కారణం పాత సిద్ధాంతాలలోని లోపమే.'

'జ్ఞానంతో పాటు అజ్ఞానాన్ని సంఘం శ్రేయిస్సుకు ఉపయోగపడేటట్లు చేసే మనస్తత్వం కూడా అవసరమే. సీతారామారావుది చాలావరకు పుస్తక జ్ఞానమే కావటంవల్ల సమగ్రమైన మనస్తత్వం ఏర్పడలేదు. అందువల్ల అతనికి భవిష్యత్తు కూడా అంధకార బంధురంగా తోచింది. జీవితపు లోతులు అర్థం కాలేదు.

'మనిషి గతాన్నిబట్టి వర్తమానాన్ని, వర్తమానాన్ని బట్టి భవిష్యత్తును తన జ్ఞానం సహాయంతో అర్థంచేసుకోగలడు. అయితే, భవిష్యత్తును ఖచ్చితంగా ఊహించటం అసాధ్యం. అనేక దశలు దాటిన తర్వాత సంఘం ఎలా వుంటుందో చెప్పటం, అసత్యం చెప్పటమే అవుతుంది,'

ఇక్కడ తాత కొంత సేపు ఆగాడు.

ఇప్పటి వరకు తాత చేసిన ఉపదేశంలో మానవాభివృద్ధిక్రమంలో హేతువాదం వహించిన పాత్రను వివరించాడు. కాలంతోపాటు సిద్ధాంతం కూడా మార్పుకు లోనుకావలసిందేనని కూడా వక్కాణించాడు. అసమగ్రమైన సిద్ధాంతాన్ని నమ్మేవ్యక్తి పతనం చెందక తప్పదు. సీతారామారావులో హేతువాదం పట్ల కొంత నమ్మకం వున్నట్లు తాతకు తెలుసు. కాని, సీతారామారావు నిజంగా హేతువాది కాడని, అతనిలో ఉన్నది కేవలం పుస్తక జ్ఞానమేనని తాత నిర్ధారణ చేసుకున్నాడు. ఎం.ఎన్. రాయ్ వాదాన్ని19 ఆధారంగా చేసుకొని సుదూర భవిష్యత్తును వ్యాఖ్యానించే మార్క్సిజాన్ని, సోషలిస్టు వ్యవస్థ ఏర్పడి తీరుతుందని చెప్పే మార్క్సిజాన్ని తాత ఖండించాడు. ప్రతి సిద్ధాంతం అసమగ్రమైనదేనని, అందుకే కొత్త సిద్ధాంతాలు పడుతున్నాయనీ అతడు ఉపదేశించాడు.

తాత తన ఉపదేశాన్ని కొనసాగిస్తూ, భౌతికవాదాన్ని కొంత వరకు సమర్థించాడు. ప్రాణిం పుట్టుకనూ, జ్ఞానావిర్భావంతో వచ్చిన మార్పునూ,

కలిసికట్టుగా జీవించిన ఆదిమ మానవజాతి ఎప్పటికప్పుడు ఏర్పరచుకున్న ఆదర్శాలను వివరించాడు. వ్యక్తి సమష్టికోసం త్యాగం చేయవలసి వుంటుందనీ, అప్పుడే పరిణామానికి దోహదం చేసిన వాడవుతాడనీ చెప్పాడు.

వ్యక్తి తనలోని విపరీత భావాలను జయించి, పరిణామానికి తోడ్పడటానికి మనోవిజ్ఞాన శాస్త్రం చెప్పే 'ఉదాత్తీకరణం' (Sublimation)[20] ఒక సాధనమని తాత వివరించాడు.

మానవజాతిలో వర్గాలున్నాయని మార్క్సిజాన్ని అంగీకరిస్తూనే, అవి శత్రు వర్గాలు కావనీ వాటి కలయికే సంఘం అనీ, సంఘం వర్గాతీతమనీ ఇంచుమించుగా ఎం.ఎన్. రాయ్ వాదాన్ని తాత బోధించాడు.

'తాత గీత'తో సీతారామారావు ఎంతవరకు ఏకీభవించాడో చెప్పలేం. రామయ్య తాత సీతారామారావు ఆత్మ ప్రబోధకుడుగా నవలలో చిత్రితమయ్యాడు. జీవితానుభవానికి ప్రతీకగా కనిపించే రామయ్య తాతను సీతారామారావులో కొరవడిన అంశాలను బహిర్గతం చెయ్యటానికి రచయిత సృష్టించినట్లు కనిపిస్తుంది.

ప్రతి క్లిష్ట సన్నివేశంలో రామయ్య తాత సీతారామారావును హెచ్చరించాడు. అయితే, అతని యీ హెచ్చరికలను సీతారామారావు పెడచెవిని పెట్టాడు. కనీసం ఒక్కసారైనా తాత సలహాను అతడు పాటించవచ్చు. కాని, పాటించకపోవటమే సీతారామారావు ప్రత్యేకత.

సీతారామారావు అపసవ్యతను ఊహించినవాడు అతని మేనమామే అయినా, మొదట గుర్తించినవాడు మాత్రం తాతే. తానతణ్ణి దూషించినా, ప్రజల చేత తన్నించినా సీతారామారావు మేలుకోరే చేశాడు. తాత చేసిన సుదీర్ఘ ప్రబోధం సీతారామారావును రక్షించటానికి చేసిన చివరి ప్రయత్నం. కాని, అది విఫలప్రయత్నమైంది,

రామయ్యతాత ఒక్కడే వెళ్ళిపోయాడు, జీవచ్ఛవాన్ని వదిలేసి.

'The rest is silence'[21] అని చనిపోయే ముందు హామ్లెట్ అన్నట్లు 'నిశ్శబ్దాన్ని తనలోకి' తీసుకోవాలనుకున్నాడు. సీతారామారావు.

''మిథ్య....మిథ్య....అంతా మిథ్య'' అని నిశ్శబ్దాన్ని బద్దలు చేస్తూ అరిచాడు. ఒక దిక్కుతోచని జిజ్ఞాసువు, అసమగ్రమానవుడు గత్యంతరంలేక చేసిన ఆర్తనాదమిది. హెచ్చరికలను నిర్లక్ష్యం చేసిన అమాయకుడు వేసిన వెర్రికేక యిది.

సీతారామారావు శ్మశానం చేరుకున్నాడు. అందరు చచ్చిన తర్వాత చేరుకునే శ్మశానాన్ని అతడు జీవించి ఉండగానే చేరుకున్నాడు. శ్మశానం అతనికి 'మనశ్శాంతి' ని చేకూర్చింది. అంతే! అతనిలో మొదటినుంచి కని పిస్తున్న మృత్యువాంఛ రెక్కలు విప్పుకుంది.

శ్మశానం నిర్జీవానికి ప్రతీక. జీవించటానికి చేసిన చివరి ప్రయత్నం ఫలించనప్పుడు ప్రాణిచేరుకునే ప్రదేశం. మానవ ప్రయాణం అంతమయ్యే చోటు జీవితానికి పనికిరాని వ్యర్థప్రదేశం. బహుశా సీతారామారావు దృష్టికి మానవ అస్తిత్వపు నిష్ప్రయోజనత్వానికి చిహ్నంగా కనిపించిందేమో శ్మశానం.

ఒక ముసలివాడు, కూతురు చితిమీద కాలిపోతూ వుంటే వచ్చి ''....నీతి, ధర్మశాస్త్రం అన్నీ బతికే వీలున్నవాళ్ళకి. బతకటమే కష్టమైన వాళ్ళకి బతకటమే నీతి బతకటమే ధర్మం. బతకటమే శాస్త్రం'' అంటూ జీవితపు విలువను చెప్పాడు. కాని–

''బతకాలి అనుకోవటం మనుష్యులకు తప్పించుకోలేని వ్యసనం అయింది'' అన్నాడు సీతారామారావు.

చదువూ సంధ్యాలేని ముసలివాడు ఎలాగైనా బతకాలనుకుంటు న్నాడు. మేధోపజీవి సీతారామారావు బతుకును వ్యసనంగా భావిస్తున్నాడు

''నూరేళ్ళు వర్ధిల్లు'' అని దీవించి వెళ్లిపోయాడు ముసలివాడు. నూరేళ్లు నిండబోతున్న సీతారామారావుకు శ్మశానంలో లభించిన ఆశీస్సు అది.

శ్మశానంలో సీతారామారావుకు సర్వసమానత్వం కనిపించింది. శ్మశానం మాతృమూర్తిలాగు కనిపించింది.

'శ్మశానమంతా కదులుతున్నట్టు కనిపించింది. దిబ్బలు కదలుతున్నాయి.'

ఇది అతని అంతరంగంలోని శ్మశానం. ఇప్పుడు చైతన్యవంతమైంది! తండ్రి సమాధిమీద జిల్లేళ్ళు మొలిచాయి. తన తండ్రి జిల్లేడు మొక్కలకు ఎరువయ్యాడనిపించింది. అతనికి కోపం వచ్చింది. తన తండ్రి జిల్లేడు మొక్కలకు కారణభూతుడు కావటంతో ఆయన రక్తంలో ఆలోచనలలో ఏదో చెడు ఉందని అనుకున్నాడు.

సీతారామారావు తన అంతరంగ శ్మశానంలో చాలా రోజులుగా పెంచుకుంటున్న జిల్లేడు మొక్కల్లో పెద్ద మొక్క కదిలి 'అన్నాయ్' అంటూ సీతారామారావును పలకరించింది. దాని నీడ పెరిగి, ఉబికి తండ్రి ఆకారం ధరించింది.

తండ్రి సంపాదించిన డబ్బును వంశప్రతిష్ఠకే ఖర్చు చేశాడు. అంత వరకూ బాగుంది. ఆ తర్వాత తాను సంపాదించి వంశగౌరవాన్ని నిలబెట్టి వలసి వుండేదని అతని భావం. తండ్రి కోరికను పూర్తిగా తీర్చలేకపోయాననే అసంతృప్తి.

సీతారామారావులో మానసిక అపసవ్యతకు దారితీసిన కారణాలలో ఒకటి. తండ్రి సమాధిని చూడగానే పెల్లుబికి వచ్చిన ఈ అపరాధ భావనతో పాటు తల్లిపట్ల అతనికి తెలియకుండా దమనమైపోయిన 'ఎడిపస్ కాంప్లెక్సు' (Oedipus complex) ఛాయా మాత్రంగా వెల్లడయింది.

'ప్రతి బాలునిలోను శైశవదశలో తల్లిని పొందవలెననే అభిలాష, తండ్రి పట్ల ద్వేషము ఉంటుందని ఫ్రాయిడ్ అభిప్రాయపడినాడు. ఈ అభిలాషనే 'ఎడిపస్ కాంప్లెక్స్' అని అన్నాడు.... తండ్రిపై అతనికున్న విముఖత, తండ్రి ఆధిక్యము ఈ రెండూ కలిసి, అతనిలో తండ్రి దండిస్తాడేమో అనే భయాన్ని కలిగిస్తాయి. ఈ వ్యాకులతవల్ల అతడు తల్లి పట్ల లైంగికేచ్ఛను తండ్రి పట్ల విముఖతను దమనం చేసుకోవటానికి ప్రయత్నిస్తాడు. తండ్రిలో తాదాత్మ్యీకరణం (Identification) చేసుకోవడంవల్ల ఈ వ్యాకులతను దమనం చేయడం సులభమవుతుంది. దీనివల్ల అతనికి తల్లిపట్ల గల లైంగి

కేచ్ఛ నెరవేరిన తృప్తికలుగుతుంది. అతని అపాయకరమైన లైంగికేచ్ఛ తల్లి పట్ల సరళమైన అనురాగంగా మార్పుచెందుతుంది. తండ్రి పట్ల ఆరాధన భావము పెంపొందుతుంది.'22

సీతారామారావు 'ఎడిపస్ కాంప్లెక్స్'ను దమనం చేయటానికి గాను తండ్రితో తాదాత్మ్యం సాధించాడు. 'చిన్నతనంలో కూడా నువ్వు మీ నాన్నని అనుసరించటానికి ప్రయత్నిస్తూ వుండే వాడివి. కుర్చీ ఎక్కి మీ నాన్న కూర్చునట్టు కూర్చొని కాలు ఆడిస్తూ వుండేవాడివి. ఇంట్లోకి వచ్చి మమ్మల్ని మీ నాన్నకి మల్లే అవులు చేస్తూ వుండేవాడివి.' అని మేనమామ సీతారామారావుకు రాసిన ఉత్తరంలో పేర్కొన్నాడు.

'పులి కడుపున పిల్లిపిల్ల పుడుతుందా' అని తండ్రి గర్వించేవాడు. తండ్రిపట్ల అతడు రోజురోజుకూ ఆరాధనాభావాన్ని పెంచుకున్నాడు. తండ్రే అతని ఆదర్శమయ్యాడు.

కాని, మేనమామ ఉత్తరం చదివిన తర్వాత అతనికి తల్లిపట్ల ఏర్పడిన సానుభూతి తండ్రిపట్ల ఉన్న ఆరాధనను అవ్యక్తంగా కొంత తగ్గించింది. ఈ మార్పును అతడు అపసవ్య స్థితిలోనే గుర్తించగలిగాడు.

తండ్రి జమీందారీ విలువలకు, తల్లి మానవత్వ భావాలకు ఇన్ని రోజులుగా అతనిలో అవ్యక్తంగా ఉన్న వైరుధ్యం, సంఘర్షణా ఇప్పుడు బహిర్గతమయ్యాయి.

"....నేనెంత చెప్పినా నీకు నీ తల్లే ఆదర్శమయింది." అన్నాడు తండ్రి. నిజానికి అనుకున్నది సీతారామారావే. తన భావాన్నే ప్రక్షేపణ (Projection) తంత్రం సహాయంతో తండ్రికి ఆపాదించాడు.

"తల్లి పేరెత్తేటప్పటికి అతనికి కోపమెక్కువయింది. తండ్రి మీద అంతకు ముందు అతనికి వున్న గౌరవమూ, అభిమానమూ అన్నీ ఆ వొక్క మాటతో ఎగిరిపోయినయి. హృదయం మీద నుంచి ఒక పెద్ద బరువు తొలిగి పోయినట్టయింది.23

ఆ బరువు తండ్రే! తండ్రి మీద వైముఖ్యం ఎప్పుడైతే కలిగిందో,

అప్పుడే తల్లిపట్ల అభిమానం పెల్లుబికింది. ఎడిపస్ దుర్దమ భావఛాయ మీద వెలుతురు ప్రసరించింది.

"....ఏమిటి నీ వంశానికి వున్న గౌరవం, నా తల్లి వంశానికి లేని గౌరవం? నీ వంశ గౌరవం అనే గానుగలో ఎంతమంది పిప్పి అయ్యారో, అవుతున్నారో నువ్వు ఎప్పుడైనా ఆలోచించావా?" అంటూ తనలోని తండ్రిని ఎదిరించాడు. తండ్రి వంశాన్ని 'నీ' అని, తల్లి వంశాన్ని 'నా' అని పేర్కొన టం గమనార్హం.

కొడుకును చూసి భయపడ్డ 'తండ్రి'కి, కొడుకు నీడ కనిపించింది. నీడ తండ్రి పక్షం వహించి, సీతారామారావును విమర్శించింది. పై సన్ని వేశం, సీతారామారావు అంతరంగంలో జరుగుతున్న సంఘర్షణకు రచయిత రూపొందించిన కళాత్మక నాటకీయ రూపం. సీతారామారావు తండ్రికి వ్యతి రేకి అయ్యాడు. కనుక అతని నీడ, అంటే వికృతి తండ్రికి అనుకూలం కాక తప్పదు. ఇంతవరకు తాను తండ్రి నీడగా బతకటం వల్ల సీతారామా రావుకు జీవితం చీకటైంది.

తల్లి పిలిచినట్లనిపించింది. "నువ్వు మారావు నాయనా" అంది. ఇది తనలోని మార్పును అతడు తిరిగి తల్లి అంశ ద్వారా తెలుసుకోవటమే. ఈ మార్పు అతనికి ఆనందాన్ని కలిగించింది. కాని, అది విషాదకర ఆనందమే. అతడే అంగీకరించినట్లుగా 'ఆలస్యం' అయింది.

అతడు తిరిగి జీవితంలోకి ప్రవేశించటానికి అడ్డంకు ఏమిటి? అతడే! తండ్రి ద్వారా ప్రవేశించి అతనిదైపోయిన దురభిమానమే. సంఘం తనను చిన్న చూపు చూస్తుందన్న భావాన్ని, తన భార్య క్షమించదనే భావాన్ని, సంతానం అసహ్యించుకుంటుందనే భావాన్ని అతడు జయించలేడు. అట్లా జయించలేకపోవటానికి ముఖ్యకారణం అతని మనస్సు అతని వశంలో లేక పోవటం. దురభిమానం ఉన్మాదం విషపూరితం చేసింది.

సీతారామారావుకు తన నీడ తన నుంచి వేరైనట్లు అనిపించింది. తన లోని తండ్రి అంశను అతడు గుర్తించాడు. ఇది అతని ఎదుగుదలకు గుర్తు. తనను తాను తెలుసుకునే అతని ప్రయత్నం కొంత ఫలించింది.

సీతారామారావు తన నుంచి వేరైపోయిందనుకున్న తండ్రి ఛాయ భవిష్యత్తును పిచ్చిగా ఊహిస్తాడు. ఇది తన వృద్ధాప్యాన్ని ఊహించటమే. వృద్ధాప్యం మృత్యువుకు దగ్గరిది కావటం ఈ ఊహలోని ఔచిత్యం.

ముసలి ఆకారం సీతారామారావును దూషిస్తూ, దగ్గుతూ, కుక్కి-మంచం మీద పడుకున్నది. మానసికంగా దూరమైన భార్య అభిమానంకోసం, తనను అసహ్యించుకునే కొడుకు గుర్తింపుకోసం 'ఆకారం' పాకులాడుతుంది. ఆ 'ఆకారం' చివరి దశలో కోరుకునేది తనవాళ్ళ సానుభూతినే. అది కరువైన నాడు జీవితమే వ్యర్థం. ఆకారానికి సీతారామారావు మీద విపరీతమైన కోపం వచ్చింది. సీతారామారావుకు కూడా తన ఆకారం మీద కోపం వచ్చింది. అయితే, ఆ ఆకారానికి కూడా తానే ఆధారం అన్న వివేకాన్ని సీతారామా రావు కోల్పోయాడు.

"తన ఆకారాన్ని తాను జయించలేడూ?" అంటూ తనపైకి దూకిన ఆకారంతో పోట్లాటకు దిగాడు. రెండు చేతులతో గొంతు పట్టుకున్నాడు. నొక్కాడు. పిసికాడు. తన శక్తి కొద్దీ పిసికాడు.... తన్నుతానే హత్య చేసు కున్నాడు. సీతారామారావు భయంకరంగా ఆత్మహత్య చేసుకున్నాడు. తన లోని వికృతిని జయించలేక, ప్రపంచంలోని కుళ్ళుతో సామరస్యాన్ని సాధించ లేక దురభిమానంతో, కసితో తననుతానే చంపుకొని, తననూ ప్రపంచాన్నీ జయించాననుకున్న దయనీయుడు సీతారామారావు.

అతడు ప్రపంచంలో ఒక చెడ్డ గుర్తింపును పొందిన శరీరం నుంచి విముక్తిని సాధించటానికి పూనుకున్నాడా అనిపిస్తుంది. భూతాకాలానికి కొంత బలం ఉన్నప్పుడు పుట్టిన సీతారామారావు, వర్తమానం బలం పుంజుకున్న తర్వాత తనను తాను ఉపసంహరించుకున్నాడు.

సీతారామారావులో అంతర్ముఖీన ప్రవృత్తికి సంబంధించి లక్షణాన్నీ 24 కనిపిస్తాయి. అతడు ఆత్మాశ్రయరీతిలో ఆలోచిస్తాడు. ఒంటరితనాన్ని కోరుకుంటాడు. తను నమ్మిన ఆదర్శాలకు కట్టుబడి ఉండటానికి ప్రయత్ని స్తాడు. అంతేకాదు, మానసిక సునిశితత్వమూ, కలలుగనే మనస్తత్వమూ అతని ప్రత్యేకతలు. ఇతరులను శంకిచటం, ఇతరులపట్ల సానుభూతిని కనబరచక

పోవటం సీతారామారావు స్వభావంలోని అంతర్భాగాలే. ఈ లక్షణాలన్నీ రామయ్య తాత ముందే అనుమానించినట్లుగా తేళ్ళూ జెర్రులుగా మారటమే కాదు విషసర్పాలై అతని అంతరంగంలో నివాసం ఏర్పరచుకున్నాయి.

అతని తాత తండ్రులు జమీందారీ అహంకారం, వంశప్రతిష్ఠ అనే పాముల సహాయంతో బతికారు. సీతారామారావు కనీసం ఆ పాములను బుస కొట్టించైనా ప్రజల్ని భయపెట్టి బతుకొచ్చు. కాని, ఆ పని చేయలేక పోయాడు.

ఈ అంతర్ముఖీన ప్రవృత్తి సీతారామారావులో ఒక ప్రతి నాయకుణి సృష్టించింది. తనకుతానే శత్రువుగా రూపొందిన సీతారామారావు తెలుగు సాహిత్యంలో ఒక 'Anti-hero'[25]గా రూపొందాడు.

ఈ అంతర్ముఖీన ప్రవృత్తే ప్రాణాంతకంగా పరిణమించటంవల్ల సీతా రామారావు విషాదాంత గాథ సాంద్రంగా, అనుభూతి సంపన్నంగా రూపొం దింది.

సీతారామారావులో చివరి దశలో ప్రముఖంగా కనిపించే ఉన్మాదాన్ని గూర్చి కొంత చర్చించటం అవసరం.

మేనేజర్ సీతారామారావును ఉద్యోగం నుంచి తొలగించినప్పుడు అతని లోని అపసవ్యత మొట్టమొదటిసారి బహిర్గతమైంది. అయితే, అంతకుముందే అతనిలో అపసవ్యతా లక్షణాలు అంకుర స్థాయిలో కనిపిస్తాయి.

ఇందుకు 'అపసవ్య మనోవిజ్ఞాన శాస్త్రీయ'[26] పరిశీలన కొంత అవసరం.

మేనమామ సీతారామారావుకు రాసిన ఉత్తరంలో—

'ఒక్కొక్కప్పుడు మీ నాన్న పిచ్చి చూపులు చూస్తుండేవాడు. ఎప్పుడో అకస్మాత్తుగా ఒక్క క్షణం నీకూ ఆ చూపులే వొచ్చేవి.' అని పేర్కొన్నాడు.

బాల్యంలోనే సీతారామారావుకు ఈ పిచ్చి చూపులు తండ్రి నుంచి సంక్రమించాయని మేనమామ సూచించాడు. మానసిక వ్యాధుల మీద అను వంశికత ప్రభావం సుస్పష్టం.

సీతారామారావులో 'మానసిక నాడీరుగ్మత' (Psycho-neurosis) లక్షణాలు కనిపిస్తాయి.

"'నాడీరుగ్మత' ఒకరకమైన మానసిక వ్యాధి. తీవ్ర మానసిక వ్యాధులతో పోల్చిచూస్తే ఇది శారీరకంగా మానవునికి తక్కువహాని కలగజేసినా, మానవుడు మిగిలిన అపసామాన్య వ్యాధుల కంటే దీనికే ఎక్కువ గురి అవుతాడు. ఈ రుగ్మత వ్యక్తి సహజ దైనందిన జీవితం గడుపుకోవటానికి అడ్డుగా నిలవదు. తనలో ఏర్పడిన విపరీత మానసిక పరిస్థితులను ఎదుర్కోలేక పోవటం వల్లా వ్యక్తిగతంగా ఇతరులతోనూ, పరిస్థితులతోనూ రాజీ కుదరక పోవటం వల్లా ఈ వ్యాధి వస్తుంది. ఇంకా అనేక ఇతర కారణాలు ఈ వ్యాధికి దోహదం చేస్తాయి "27

మూర్తిమత్వం గూపొందటంలో బాల్య దశకు ఎంతో ప్రాముఖ్యం ఉన్నదని మనోవిజ్ఞాన శాస్త్రవేత్తలు భావిస్తున్నారు.

'సాధారణంగా ఒకే ఒక్క బిడ్డ ఉన్నప్పుడో, మరేదోకారణం వల్లనో తల్లిదండ్రులిద్దరూ, లేదా ఒక్కరు అతిగారాబం చేయవచ్చు. అటువంటి తల్లిదండ్రుల పిల్లలు....కష్టపడి ఏ వస్తువునూ ఎన్నడూ సంపాదించకపోవటంవల్ల వస్తువుల విలువ, మనుషుల విలువ కూడా వీళ్ళకు తెలియదు. అందువల్ల, ప్రపంచాన్ని తమంతగా తాము ఎదుర్కోవలసి వచ్చినప్పుడు వీళ్ళు తికమక పడతారు.'28

'తల్లిదండ్రులు అతిగా రక్షించే పిల్లలు వ్యక్తిత్వం లేని అసమర్థులుగా పిరికివారుగా తయారవుతారు '29

పై అంశాలు సీతారామారావు విషయంలో చాలావరకు నిజమేనని చెప్పవచ్చు. సీతారామారావు కూడా అతని తల్లిదండ్రులకు ఏకైక సంతానమే కావటంవల్ల జమీందారీ కుటుంబంలో పెరగటంవల్ల అతిగారాబంగా పెరిగాడనటంలో సందేహం లేదు. బాల్యంలో తండ్రిని అనుకరించేవాడు కనుక తండ్రి ప్రభావానికి లోనయ్యాడని కూడా చెప్పవచ్చు. తండ్రి చనిపోయిన తర్వాత డబ్బు విలువ, ఆస్తిపాస్తుల విలువ తెలియకపోవటంవల్లనే అపాత్రు

లకు దానధర్మాలు చేసి, హద్దు మీరిన ఔదార్యం ప్రదర్శించి అనేక సమస్యలు కొనితెచ్చుకొన్నాడు.

అయితే, తాత తండ్రులు అన్యాయంగా సంపాదించిన ఆస్తిపాస్తుల మీద అసహ్యంతో ఆపని చేసి ఉంటే, సమస్యలను కొనితెచ్చుకున్నా సమర్థించుకునే అవకాశం ఉన్నది. కాని తాత తండ్రుల పరువు ప్రతిష్ఠలు నిలబెట్టటానికే అతడీ పనులు చేశాడు. అందుకు బాల్య ప్రభావం కూడా ఒక కారణమని చెప్పవచ్చు.

'నాడీ రుగ్మత రావటానికి మరిఒక కారణము-వ్యక్తుల చిన్ననాటి అనుభవాలు అతని బాల్యంలో వ్యాకులతను కలిగించే కొన్ని పరిస్థితులను ఎదుర్కొంటాడు....తన తల్లిదండ్రుల అవధానము ఎక్కువగా చెల్లెలి వైపు తమ్ముని వైపు మళ్ళడం చూస్తాడు. ఇటువంటి పరిస్థితులలో తల్లిదండ్రులు అనుకోకుండా ఆ బాలుని నిర్లక్ష్యం చేయడంగాని, శిక్షించడంగాని జరుగుతుంది. దీని మూలంగా అతనిలో ప్రతికూల ఉద్వేగాలు (Negative emotions) పెంపొందుతాయి. కాని, వీటిని అతడు బయటికి వ్యక్తంచేయలేడు.... అందువల్ల ఆ బాలుడు తనలో జనిస్తున్న ఉద్వేగాలను తనలోనే అణచుకోవలెనని చూస్తాడు. అంటే, అచేతనంగా దమనాన్ని అమలుపరుస్తాడు.30

పై అంశం సీతారామారావు పాక్షికంగా అన్వయిస్తుంది. ఏకైక సంతానం కావటంవల్ల లభించిన తల్లిదండ్రుల అవధానత, గారాబం, తమ్ముడు గాని చెల్లెలు గాని పుడితే లభించదేమోననే వ్యాకులత సీతారామారావులో జనించింది. ఇరుగు పొరుగు కుటుంబాలలో ఇలాంటి బాధకు లోనైన పిల్లలను అతడు చూసి ఉంటాడు. ఈ వ్యాకులతను అణచుకోవటానికి అతడు అచేతనంగా దమనానికి యత్నం చేశాడు. ఇందుకు నవల చివరి ఘట్టంలో నిదర్శనం ఉంది.

సీతారామారావు శ్మశానంలోకి అడుగు పెట్టిన తర్వాత జిల్లేడు మొక్కల్లో ఒక మొక్క కదిలి 'అన్నాయ్' అని పలకరిస్తుంది. తండ్రిని సమర్థించి, సీతారామారావును విమర్శించి తండ్రితో పాటు నిష్క్రమిస్తుంది. తండ్రి హృదయంలో తాను పొందిన స్థానానికి ముప్పు కలిగించే పోటీదారుడు ఎవరైనా

పుడతాడేమోనని సీతారామారావు బాల్యంలో వ్యాకులత పొందాడనటానికి ఈ సన్నివేశం నిదర్శనం. 'అన్నాయ్' అని సీతారామారావును సంబోధించింది, అతని ఊహాత్మక సోదరుడే. తండ్రి భావాలను సీతారామారావులో ప్రతినిధిగా పెరుగుతున్న ఒక అంశంతో ఈ సోదరుని అస్తిత్వం ముడిపడి ఉన్నది.

సీతారామారావు విద్యార్థి దశలో దమనాన్ని అమలు చేశాడు. "తను చదువుకునే రోజుల్లో ఆడవాళ్లు ఒక పెద్ద బస్సు నిండా ఎక్కి చదువుకోడానికి కాలేజికి వెళ్తూంటే వాళ్ళు, వాళ్ళ మధ్య కూర్చోబుద్ధి అయ్యేది అతనికి. తాను కూర్చున్న తర్వాత బస్సు బోల్తా కొట్టాలనీ, ఒకళ్ళకు మొహం దోక్కుపోవాలనీ, ఒకళ్ళకు బుగ్గలు చీరుకుపోవాలనీ, ఒకళ్ళకు కాళ్లు విరగాలనీ అనిపించేది. అట్లా తయారైన వాళ్ళని ఊహించుకుంటే అతనికి ఎందుకోగాని చాలా సంతోషంగా ఉండేది. కాని, అట్లా కోరటం తప్పు కాబట్టి ఆ భావాన్ని బలవంతంగా అణచుకునేవాడు."

ఈ దమనమే అతనిలో స్త్రీ ద్వేషంగా, సౌందర్య ద్వేషంగా రూపొందటానికి దోహదం చేసిందనటంలో సందేహం లేదు. "నాడీ రుగ్మతకు గురైన రోగి సాంఘిక జీవితం నుండి విరమించుకొని ఇతరుల సాంగత్యాన్ని వదులుకొని ఏకాకిగా మారుతాడు. అతని స్వార్థాన్ని ఇతరులతో అనంగీకారానికి దారితీస్తుంది. అతడొక నిస్సంతోషిగా రూపొందుతాడు. సాంఘిక సంబంధాల నుండి, అనుభవాల నుండి దూరంగా తప్పుకోవటం నాడీ రోగ లక్షణమే కాకుండా దాన్ని తీవ్రతరం చేసే హేతువు కూడా.

ఉద్యోగం కోల్పోయిన తర్వాత సీతారామారావు క్రమంగా సాంఘిక జీవితాన్ని విరమించాడు. ఏకాకిగా మారాడు. ఎప్పుడైనా మిత్రులు వస్తే వారితో వివాదాస్పద అంశాలను చర్చించేవాడు. తన లక్ష్యమైన నిష్క్రియాత్మక వైఖరి మూలంగా వారితో ఏకీభవించేవాడు కాదు. సూర్యారావు, శాతవాహనుడు మొదలైన మిత్రులతో అతనికి అన్నీ దోషాలే కనిపించేవి. వారిని గూర్చి ప్రతికూల దృష్టితోనే ఆలోచించేవాడు వీధిలో నడిచేటప్పుడు తెలిసిన వాళ్లెవరైనా కనిపిస్తారేమోనని భయపడేవాడు. ఏపనీ చేయటానికి ఉత్సాహం ప్రదర్శించేవాడు కాదు. ఈ విధంగా అతడు సాంఘిక జీవితానికి

దూరమైపోవటంతో, తనను గురించి ఆలోచించుకోవటం తప్ప అతని మనసుకు మరో వ్యాపకం లేకుండా పోయింది.

ఒక స్నేహితుని ద్వారా తనలో నరాల బలహీనత చోటు చేసుకున్న దని తెలుసుకొని.

"నా నరాలు ఎందుకు పటుత్వం తప్పినై" అని ప్రశ్నించుకున్నాడు.

"ఆలోచనలవల్ల" అని తెలుసుకోగలిగాడు. కాని, నరాల బలహీనతను జయించటానికి పూనుకోకపోవటంవల్ల అతని పరిస్థితి రోజురోజుకు క్షీణించ సాగింది.

సీతారామారావు ఎదుర్కొన్న సమస్యల్లో అనుగుణ్య సమస్య (Problem of adjustment) కూడా ఒకటి. భూస్వామ్య వ్యవస్థను పెట్టుబడిదారీ వ్యవస్థకు మధ్యను అతడు నలిగిపోయాడు. మారుతున్న పరిస్థితులకు అనుగుణంగా అతడు తన జీవితాన్ని మలుచుకోలేకపోయాడు.

సీతారామారావు తనతో మాట్లాడిన మాటలలోను, ప్రవర్తించిన తీరులోను రామయ్య తాత అపసవ్యతను గుర్తిస్తాడు.

"నువ్వు పిచ్చివాడివి" అని చెప్పటమే కాక,

"ఇవాళే పిచ్చివాడవని నీ భార్యతో పిటిషన్ పెట్టిస్తాను. నీ భార్యా పిల్లల్ని నీ నుంచి రక్షించటం కంటే ఇక చేసేది ఏమీలేదు" అని కూడా అంటాడు తాత. అంతేగాని, సీతారామారావుకు వైద్యంచేయించాలని అనుకోడు.

నాడీ రుగ్మతకు సరియైన చికిత్స లభించని సందర్భాలలో, వ్యక్తి తన మానసిక బలహీనతలను జయించిన సందర్భాలలో నాడీరుగ్మత (మనోవిక్షిప్తి)గా పరిణమించే అవకాశం ఉన్నది.

మనోవిక్షిప్తులలో మూర్తిమత్వ సమైక్యం బాగా దెబ్బతింటుంది. వ్యక్తి వాస్తవికతతో సంబంధాన్ని కోల్పోతాడు. మనోవిక్షిప్తి వ్యాధిగ్రస్తులు తమ పనులను తాము చేసుకోలేనంత, తమ బాధ్యతలను తాము నిర్వహించ లేనంత తీవ్రంగా మానసిక అపవ్యవస్థకు లోనవుతారు.31

అందుకే రోగుల క్షేమాన్ని, ఇతరుల క్షేమాన్ని దృష్టిలో ఉంచుకొని వీరిని వైద్యశాలలో చేర్పించటం అత్యవసరమవుతుంది.

'సామాజిక ప్రాముఖ్యాన్ని దృష్టిలో ఉంచుకొని, మనోవిక్షిప్తి రోగ లక్షణాలను అమర్చి పరిశీలించినప్పుడు 997 మంది రోగులు చికాకును కలిగించే విధంగా విచిత్ర ధోరణిలో ఇతరులకు ఇబ్బంది కలిగించే విధంగా ప్రవర్తిస్తారని తెలుస్తున్నది. వైద్యశాలలో చేర్చబడిన రోగులలో దాదాపు ముప్పావు వంతుతమకు తాము అపాయాన్ని కొనితెచ్చుకునే లక్షణాలను ప్రదర్శిస్తారు. వారు సంభ్రమాత్మకంగా, లక్ష్యరహితంగా, ఆత్మహత్యాభావంతో ఉంటూ తమజీవితాన్ని నిర్వహించుకోవటంలో అసమర్థులై ఉంటారు.'32 అని అపసవ్య మనోవిజ్ఞానశాస్త్రంలో నిష్ణాతులైన జె.డి. పేజ్ అంటున్నారు.

సీతారామారావులో కూడా చికాకు, విచిత్ర ధోరణి, ఇతరులకు ఇబ్బంది కలిగించే వైఖరీ కనిపిస్తున్నాయి. మొదటి నుంచే ఉన్న సంభ్రమాత్మకత లక్ష్యరహితంగా రూపొంది జీవితాన్ని అపార్థం చేసుకోవటానికే దోహదం చేసింది. మొదట్లో చిన్న స్థాయిలో ఉన్న మృత్యుస్పృహ క్రమంగా ఆత్మహత్యగా పర్యవసించింది.

రామయ్య తాత తను మనుమడితో ఆడుకుంటున్నప్పుడు సీతారామారావు మాటల్లోనూ అంతకుముందు భార్యను కొట్టిన సన్నివేశంలోనూ అతని మూర్తిమత్వ సమైక్యం దెబ్బతిన్న సూచనలు బలంగా కనిపిస్తాయి.

మనోవిక్షిప్తి రోగి ప్రవర్తన తనకే కాక ఇతరులకు కూడా హాని కలిగించే విధంగా ఉంటుంది.

సీతారామారావు ఊరి పెద్దలను వారి సమక్షంలోనే బహిరంగ సభలో తీవ్రమైన పదజాలంతో తూర్పారపట్టాడు. ఈ సందర్భంలో అతని మీద దాడి చేయనున్న ప్రజలను కుర్చీతో కొట్టటానికి సిద్ధంగా ఉన్న సీతారామారావు 'ఆకారం భయంకరంగా వుంది. ఏపని చెయ్యటానికైనా వెనుతియ్యడని ముఖకవళికలు చెపుతున్నై.' అని అన్నాడు, రచయిత. ఇది మనోవిక్షిప్తి రోగి లక్షణమే.

సీతారామారావు జీవితంలోని చివరిదశను స్థూలంగా రెండు భాగాలుగా విభజించవచ్చు. రామయ్య తాత ఇంటి నుంచి బయలుదేరింది మొదలు బహిరంగసభలో ఉపన్యాసం ఇవ్వటం వరకు మొదట భాగం ప్రజల చేతుల్లో దెబ్బలుతిన్నది మొదలు ఆత్మహత్య చేసుకోవటం వరకు రెండవ భాగం. మొదటిదశలో ఉన్మాద ప్రతిచర్యలు (Manic reactions), రెండవ దశలో అవసాద ప్రతిచర్యలు (Depressive reactions) అతనిలో పూర్తిగా కాకపోయినా ఎక్కువగా కనిపిస్తాయి.

"ఉన్మాద ప్రతిచర్యలలో విపరీతమైన ఆశావాదము, చింతన, చలన ప్రక్రియలలో వేగము కనిపిస్తాయి. రోగి అంతులేని శక్తిని, ఆసక్తిని, ప్రదర్శిస్తాడు విపరీతంగాను, గట్టిగాను మాట్లాడుతూ కుర్రతనంగా ప్రవర్తిస్తాడు. దేనిమీదా మనస్సును లగ్నం చేయలేడు. రోగి ఒక ఆలోచన నుంచి మరిఒక దానికి, ఒక పని నుంచి ఇంకొక దానికి గంతులు వేస్తాడు. నిర్ణయశక్తి తగ్గిపోతుంది."33

తాత ఇంటి నుంచి బయలుదేరిన సీతారామారావులో మనకు పై లక్షణాలన్నీ కనిపిస్తాయి. అతని ఆలోచనలు త్వరత్వరగా మారిపోవటం చూస్తాము. నడకలో అసాధారణమైన వేగం కనిపిస్తుంది. పరిచయస్తుల ప్రశ్నలకు అసంబద్ధంగా జవాబు చెప్తాడు. కుర్రవాళ్ల బిళ్ళంగోడు ఆడుకుంటూ 'మున్నాంచి' అంటే, అతడు 'ఎన్నాంచి' అని కుర్రతనంగా కేకవేస్తూ ముందుకు సాగాడు.' బొగ్గు ముక్కను పైకి గిరాటువేసి "దెబ్బతగిలిందా?" అని ముద్దు పెట్టుకుంటాడు. దాంతో తెల్ల గోడల మీద బొమ్మలు వేశాడు. పిచ్చివాళ్ళ గోడల మీద పిచ్చి బొమ్మలు వేయటం సాధారణమే.

పోలీసు దిమ్మ మీద నిలబడి ఇంగ్లీషులో ఉపన్యాసం ఇవ్వాలనుకొని తెలుగులో ఎర్లరామదాసు కీర్తన పాడటం ఆ తర్వాత మళ్ళీ ఉపన్యాసం ఇవ్వాలనుకొని, హరికథ చెప్పడమా, బుర్రకథ చెప్పడమా అని ఆలోచించి ఉపన్యాసం ఇవ్వడం అతనిలో క్షీణించిన నిర్ణయశక్తికి నిదర్శనం. ఇదివరకు పూర్తిగా నిరాశావాద ధోరణిని ప్రదర్శించినవాడు, "నలుగురం కూడబలుక్కొని బతకలేమంటూరా?" అని కొంత ఆశావాదాన్ని ప్రకటించాడు

ప్రజలు కొట్టి వెళ్ళిన తర్వాత అతడు అలసటకు, నిరాశా నిస్పృహలకు

లోనయ్యాడు. ఇంతకు పూర్వం అతనిలో కనిపించిన ఉన్మాద ప్రతిచర్యలు స్థానాన్ని అవసాద ప్రతిచర్యలు ఆక్రమించాయి.34

అవసాద ప్రతిచర్యలకు గురైన రోగి—

'—తీవ్రమైన విచారాన్ని, ఒంటరితనాన్ని అనుభవిస్తాడు. ఈ ప్రపంచంలో సంతోషం అనేది లేదనిపిస్తుంది. ఏ విషయంలోను ఉత్సాహము, ఆసక్తి కనబరచడు. ప్రవర్తనలో చురుకుదనం తగ్గిపోతుంది. అమిత మిత భాషిగా ఉంటాడు.35

ఈ దశలో సీతారామారావులో పై లక్షణాలన్నీ కనిపిస్తాయి. ఆవేశం తగ్గటంతో కొంత ఆలోచనకు అవకాశం ఏర్పడినట్లు కనిపిస్తుంది. కాని జీవితం పట్ల అనాసక్తి కారణంగా అతనికి 'ఆలోచించ బుద్ధి పుట్టలేదు.'

రామయ్య తాత చేసిన ఉపదేశాన్ని నిశ్శబ్దంగా విన్నాడు.

మూర్తీభవించిన నిశ్శబ్దంలా కూర్చున్నాడు.

తాత తనతోపాటు ఇంటికి రమ్మని కోరినప్పుడు, మిగిలిపోవటానికే35 సీతారామారావు ఇష్టపడతాడు.

శ్మశానంలోకి ప్రవేశించటంతో సీతారామారావు జీవితంలోని చివరి దశలో అంతిమఘట్టం ప్రారంభమౌతుంది. ఈ దశలో అతనిలో 'భ్రాంతులు', 'విభ్రమాలు'36 (Delusions and hallucinations) చోటు చేసుకున్నాయి.

'భ్రాంతులు అంటే కొన్ని అసత్యమైన నమ్మకాలు, ఈ అసత్యమైన నమ్మకాలనే వ్యక్తి గాఢంగా విశ్వసిస్తాడు. వీటికి వ్యతిరేకంగా ఎన్ని నిదర్శనాలు చూపించినా లాభం ఉండదు.'37

'బాహ్య ప్రపంచంలో వాటికి తగిన ఇంద్రియ సంబంధమైన ఉద్దీపనలు లేకుండానే వ్యక్తి వస్తువులను, సంఘటనలను ప్రత్యక్షించడాన్ని విభ్రమము అంటారు.' ఎవరో ఏదో ఆదేశిస్తున్నట్లు వినబడవచ్చు. ఏవో సంఘటనలు జరుగుతున్నట్లు కనిపించవచ్చు. విభ్రమాల దృష్టి సంబంధమైనవి గాని, శ్రవణ సంబంధమైనవిగాని కావచ్చు.'38

శ్మశానంలోకి ప్రవేశించే ముందు అతడు 'మిథ్య, మిథ్య అంతా మిథ్య' అంటాడు. ఇది శూన్యరహిత భ్రాంతి (Nihilistic delusion)[39]కి అతి దగ్గరి లక్షణం.

సీతారామారావును జిల్లేడు మొక్క 'అన్నాయ్' అని పలకరించటం శ్రవణసంబంధమైన విభ్రమంగా, ఆ మొక్క నీడ తండ్రి అకారాన్ని ధరించడం దృష్టి సంబంధమైన విభ్రమంగా భావించవచ్చు. మొదట తండ్రి, ఆ తర్వాత తల్లి తనతో మాట్లాడారని సీతారామారావు అనుకోవటం శ్రవణ సంబంధమైన విభ్రమమే.

ఈ ఘట్టంలో గమనించవలసిన ముఖ్యాంశం. సీతారామారావు వ్యక్తిత్వం తండ్రి అంశగా, తల్లి అంశగా చీలిపోవటం. వ్యక్తుల్లో సహజంగా ద్వంద్వ ప్రవృత్తి ఉంటుంది క్లిష్ట సమస్యలు ఎదురైనప్పుడు ద్వంద్వ ప్రవృత్తిని ప్రదర్శించటం సబబే. కాని సీతారామారావు అతిసాధారణ అంశాల పట్ల కూడా ద్వంద్వప్రవృత్తిని ప్రదర్శించిన అసాధారణ వ్యక్తి. అదే క్రమంగా విజృంభించి చివరిదశలో అతని వ్యక్తిత్వాన్నే చీల్చింది.

నవలలోని చివరి సన్నివేశంలో సీతారామారావు తన వృద్ధాప్యాన్ని ఊహించాడు ఇంతకాలం ద్వంద్వాన్ని ఆశ్రయించినవాడు తండ్రి అంశ నిష్క్రమించిందనుకున్న తర్వాత ఏర్పడ్డ ఏకాంత మానసిక పరిస్థితిలో తిరిగి ద్వంద్వాన్ని ఆశ్రయించే ప్రయత్నం అసలు సీతారామారావులో మానసిక వృద్ధాప్యం చోటుచేసుకొన్నది. జీవితం చేతిలో ఓడిపోయిన సత్యాన్ని అతడు దాపరికం లేకుండా అంగీకరించాడు

అతడు అపసవ్య మనస్తత్వంతో తన వృద్ధాప్యాన్ని ఊహించుకోవటం మూలంగా ఆ ఊహలో అపసవ్యత చోటుచేసుకోక తప్పదు. ఈ స్థితి 'జరా జన్య మనోవిక్షిప్తి' (Senile Psychosis) ఎంతమాత్రం కాదు గాని, ఊహలో ఆ లక్షణాలు చోటుచేసుకొన్న స్థితి.

'జరాజన్య మనోవిక్షిప్తులలో లక్షణాలు క్రమంగా ఏర్పడుతూ వస్తాయి... క్షీణత పరాకాష్ఠను అందుకొన్నప్పుడు వ్యక్తి మంచం పట్టి అస్థిపంజరం వలె జీవిస్తాడు. వ్యాధినిరోధకశక్తి పూర్తిగా నశిస్తుంది.'[40] ఈ లక్షణాలు ముసలి సీతారామారావు 'అకారం'లో కనిపిస్తున్నాయి.

'....మొహం ముడతలు పడివుంది. జుట్టు పండి రెల్లుదుబ్బులాగుంది. కళ్ళు చింతనిప్పుల్లా వున్నాయి. శరీరం అస్థిపంజరం లాగుంది. వొంగిపోయి వుంది. ఊగులాడుతూ నడుస్తూ వుంది. నుంచోలేక కూర్చొని కడుపు చేత్తో పట్టుకుని దగ్గుతూ వుంది.'41

ఊహ విభ్రమంగా రూపొందింది. దృష్టి సంబంధమైన, శ్రవణ సంబంధమైన విభ్రమాల కారణంగా సీతారామారావు తన ఆకారం తనపై దాడి చేసిందని భావించాడు.

సీతారామారావు రెండుగా చీలిపోవటాన్ని ఆధారంగా చేసుకొని అతడు 'మనోవిదళనం' (Schizophrenia) అనే మానసిక అపవ్యవస్థకు గురయ్యాడని చెప్పటానికి అవకాశం ఉన్నది. 'మనోవిదళనం' అంటేనే 'మానసిక విచ్ఛిన్నత' (Psychological Splitting). 'మనోవిదళనం'లోని సంభ్రాంతి సంబంధమైన (Paronoid type) లక్షణాలు చాలావరకు సీతారామారావులో కనిపిస్తాయి.

'ఇది చాలా తరుచుగా సంభవించే అపవ్యవస్థ. ఈ అపవ్యవస్థకు లోనుకాకముందు వ్యక్తి అనుమాన స్వభావమున్నవాడుగాను, అహంకేంద్రిత వ్యక్తి (Egocentric Individual) గాను ఉంటాడు. ఇతరులతో సంబంధ బాంధవ్యాలను పెంపొందించుకోలేనివాడుగాను ఉంటాడు. క్రమంగా అనేక రకాల భ్రాంతులు, విభ్రమాలు కలగడం మొదలవుతాయి. ....ఈ భ్రాంతులవల్ల పరిసరాలలో ఉన్న వ్యక్తులను వేటినీ నమ్మలేని స్థితిలోకి వస్తాడు. ఒక్కొక్కసారి ఆ భ్రాంతులవల్ల దౌర్జన్యపూరితంగా ప్రవర్తిస్తాడు. ఇతరులను శత్రువులుగా భావించి వాళ్ళను గాయపరచడం మొదలైన దౌర్జన్యచర్యలు ప్రదర్శించవచ్చు....ఈ భ్రాంతులతోపాటు విభ్రమాలు కూడా ఉండవచ్చు. శత్రువులు తనను తిడుతున్నట్లు బెదిరిస్తున్నట్లు...విభ్రమాలు కలుగవచ్చు. శత్రువుల నుంచి తనను కాపాడుకోవడానికి ఒక్కొక్కప్పుడు హత్యలు కూడా చేయవచ్చు. మరొకప్పుడు పారిపోవడానికి ఒక మార్గంగా భావించి ఆత్మహత్యకు కూడా పూనుకోవచ్చు.'42

పై లక్షణాలు చాలా వరకు సీతారామారావులో చోటుచేసుకొన్నాయి.

అతడు అహంకేంద్రిత వ్యక్తి అన్నది సుస్పష్టమే. నవలలోని మొదటి దశలోనే అతడు అందరికీ దూరమై ఏకాకిగా మారిపోయాడు. కనీసం భార్యాబిడ్డలతో కూడా అతడు తన సంబంధ బాంధవ్యాలకు పెంపొందించుకోలేకపోయాడు. భార్యను కొట్టటం, నాయకుల్ని తీవ్రంగా విమర్శించటం తన మీదికి రాబోయిన ప్రజల్ని కొట్టబోవటం మొదలైనవి మాటలద్వారా చేతులద్వారా సీతారామా రావు తన స్థాయిలో ప్రదర్శించిన దౌర్జన్యపూరిత చర్యలే. అతడు తాత చెప్పిన మాటల్నేకాదు తాను అదివరకు నమ్మిన ఆదర్శాలను కూడా నమ్మలేని స్థితికి వచ్చాడు. సీతారామారావు శ్మశానంలోకి ప్రవేశించిన తర్వాత పొందిన భ్రాంతులు, విభ్రమాలు అతని మనోవిదళన అపవ్యవస్థను కూడా తెలియజేస్తు న్నాయి.

తన ఆకారం తనను దూషిస్తున్నట్లుగా విభ్రమానికి గురయ్యాడు. ఆ ఆకారం తన శత్రువనుకొన్నాడు. ఆ శత్రువు పీడను వదిలించుకునే ప్రయత్నంలో హత్య చేస్తున్నారని భావిస్తూ ఆత్మహత్య చేసుకొన్నాడు.

ఇది సీతారామారావు ఉన్మాదావస్థకు పరాకాష్ఠ.

ఈ విధంగా సీతారామారావు బాల్యంలో ఉండీ లేనట్లుగా కనిపించే అపసవ్య లక్షణాలు క్రమంగా బలపడి, 'నాడీదుర్గ్మత'గాను, ఆ తర్వాత 'మనోవిక్షిప్తి'గాను రూపొందటం జరిగింది. 'మనోవిక్షిప్తి' మనోవిదళనంగా రూపొందిన ఫలితంగానే అతడు ఆత్మహత్య చేసుకొన్నాడని స్థూలంగా భావించవచ్చు.

అయితే, రోగనిదానం విషయంలో ఇంతకు మించిన చర్చకు గాని, అపసవ్య మనోవిజ్ఞాన శాస్త్రానికి సంబంధించిన ఇతర సూక్ష్మాంశాల పరిశీల నకు గాని ఈ సిద్ధాంత వ్యాస ప్రణాళికలో అవకాశం లేదు. ఇందుకు ముఖ్య కారణం, ఈ రకమైన పరిశీలన సాహిత్య పరిధిని దాటి మనోరోగ చికిత్సా (Psychiatry) రంగంలోకి అడుగుపెడుతుందనే భావమే.

'అసమర్థుని జీవయాత్ర' నవల మీద గోర్కీ రచించిన 'The man who was afraid'43 అన్న సుప్రసిద్ధ నవల ప్రభావం ఉందని ఒక అభి ప్రాయముంది. గోపీచంద్ ఒక రచనను ప్రచురించగానే ఆ రచనలోని పాత్రల

ఒరిజినల్స్ కోసం పాఠకులూ, విమర్శకులూ వెతికేవారట. ఆ వెతకటం అయన చుట్టూ ఉన్న వ్యక్తుల్లో కావచ్చు. లేదా ఇతర సాహిత్యపాత్రల్లో కావచ్చు తన చుట్టూ ఉన్న వ్యక్తుల ప్రభావం, సమాజం ప్రభావం తప్పనిసరిగా రచయిత మీద ఉండి తీరుతుంది. ఈ విషయాన్ని గోపీచంద్ అంగీకరించాడు. 'నేను సృష్టించిన పాతల Originals జీవిత రంగంలో ఉండి ఉండవచ్చు. మనస్సులో మెదిలే ఈ నమూనాలకు కొత్త రంగులనూ, కొత్త గీతలనూ నేను కలిపివుంటాను.'44

గోపీచంద్ తనను మొదట్లో పాశ్చాత్య రచయితలే ఎక్కువగా అకర్షించారని కూడా పేర్కొన్నాడు. ఆత్మకథాత్మక నవల 'చీకటి గదులు'లో గోర్కీ రచించిన అంతర్జాతీయ నవల 'అమ్మ'ను గూర్చిన ప్రస్తావన కూడా ఉన్నది.

అందువల్ల 'The man who was afraid' నవలలోని ఫోమా గార్డియెవ్ 'అసమర్థుని జీవయాత్ర'లోని సీతారామారావు పాత్రల సంక్షిప్త తులనాత్మక పరిశీలన అవసరం. ఈ రెండు నవలలు పాత్ర ప్రధానమైన నవలలే.

ఫోమాగార్డియెవ్ కోటీశ్వరుని కొడుకు. సీతారామారావు కూడా ధనవంతుని కొడుకే. డబ్బు ఎక్కువైపోవటం వల్లనే ఫోమా ఎక్కువ సమస్యలు ఎదుర్కొన్నాడు. డబ్బు ఉన్నంతవరకు సీతారామారావుకు సమస్యలు లేవు. డబ్బు అయిపోయిన తర్వాతనే అతని సమస్యలు ప్రారంభమయ్యాయి.

తండ్రి వ్యాపారంలో గడించే డబ్బుపట్ల లొమ్మిదేళ్ళ చిన్నవయసులోనే ఫోమాకు నిరసన కలుగుతుంది. సీతారామారావుకు డబ్బు మీద నిరసన భావం లేదు, సరికదా, డబ్బు ద్వారా కీర్తిప్రతిష్ఠలు గడించాలనే వ్యామోహం కూడా ఉన్నది. సీతారామారావు దివాలా తీసిన తర్వాత కూడా దానధర్మాలు చేసేవారినే సమర్థిస్తాడు. ఫోమాలోని జీవ లక్షణం 'భయం'. తండ్రి ఫోమాతో, 'నాలో లేనిది ఏదో నీలో ఉన్నది. అదేమిటో నాకు సరిగ్గా తెలియదు కాని, అది మాత్రం నీలో స్పష్టంగా అగుపిస్తూనే ఉంది. అదే నీకు ప్రమాదం తెచ్చి పెడుతుందని నా భయం'45 అంటాడు. తండ్రిలో ఉన్నది ధైర్యం. ఫోమాలో

ఉన్నది భయం. బాల్యంలోని ఒకరాత్రి సముద్రం నీళ్ళలో తేలిన శవాన్ని చూసినప్పుడు స్థిరపడిపోతుంది. తండ్రి చావు కూడా అతణ్ణి విపరీతంగా భయ పెట్టింది.

'భయం' భయంతో గజగజ వణికిపోతున్నాడు. అతని కళ్ళు పిచ్చి వాడి కళ్ళలా ఉన్నాయి. భయమే క్రమంగా పిచ్చికి దారితీస్తుంది.

సీతారామారావులోని జీవలక్షణం అసమర్థత. తనకు మాలిన ధర్మాన్ని ప్రదర్శించటంలోనూ, దూరదృష్టిని ప్రదర్శించకపోవటంలోనూ, ఆర్థికంగా దెబ్బతిన్న తర్వాత జీవిత సమస్యలను పరిష్కరించలేకపోవటంలోను, నిష్క్రియాత్మక నిరాశవాద ధోరణిని పెంచుకోవటంలోనూ ఈ అసమర్థత కని పిస్తుంది. ఇది అహంకారంతోనూ ఇతర సంక్లిష్ట లక్షణాలతో కలిసి సీతా రామారావులో పిచ్చికి దారివేసింది. ఫోమా వ్యవస్థ మీద చేస్తున్న విమర్శ, అతణ్ణి పెంచిన తండ్రికీ ఇతర వర్తకులకూ నష్టదాయకంగా ఉంది కనుక వాళ్ళంతా అతని ఉన్మాదాన్ని పెంచటానికే కృషిచేశారు.

సీతారామారావు ఉన్మాదానికి వ్యవస్థ పరోక్ష కారణమే. ప్రత్యక్షంగా ఎవరూ పనికట్టుకొని కుట్ర పన్నలేదు. స్వయంకృతాపరాధమే అతనికి ఉన్మా దానికి కారణం.

అయినా ప్రవర్తనలో కొన్ని పోలికలు, జీవితంకోసం ఆరాటపడటం లోనూ, నిరాశ నిస్పృహలకు లోనుకావటంలోనూ రెండు పాత్రల్లో పోలికలు కనిపిస్తాయి. అంత మాత్రాన గోర్కీ నవల ప్రభావం అసమర్థుని జీవయాత్ర మీద ఉందనటం సమంజసం కాదు.

గోర్కీది అంతర్జాతీయ సాంఘిక నవల.

గోపీచంద్‌ది తెలుగు మనోవైజ్ఞానిక నవల.

రెండవ ప్రకరణం

## సూచికలు

1. 'అసమర్థుని జీవయాత్ర' 'ఆంధ్రప్రభ' దినపత్రిక ఆదివారపు సాహిత్యానుబంధాలలో సీరియల్ నవలగా 1945 ప్రారంభమై 1946లో ముగిసింది. ప్రథమ ముద్రణ 'నవయుగ' ప్రచురణాలయం పెదనన గల్లు, కృష్ణాజిల్లా, 1947. అప్పటి పత్రికల ఫైళ్లు పోయాయని 'ఆంధ్రప్రభ' దినపత్రిక వాళ్ళు తెలియజేశారు. 'సారస్వత నికేతన్' (వేటపాలెం), 'గౌతమీ' (రాజమండ్రి) వంటి ప్రసిద్ధ గ్రంథాలయాల్లో కూడా ఆ పత్రికలు లేవు. శ్రీ సంజీవదేవ్ గారి 'హిమాలయాల్లో కొన్నాళ్ళు,' 'అసమర్థుని జీవయాత్ర' ఒకేసారి 'ఆంధ్రప్రభ' (దిన)లో వెలువడ్డాయి. 'అసమర్థుని జీవయాత్ర' కూడా 1945లో మొదలై, 1946 ప్రారంభం వరకు నడిచిందని శ్రీ సంజీవదేవ్ గారు ఈ వ్యాస కర్తకు రాసిన లేఖ (4-1-1984)లో తెలియజేశారు.
2. 'అసమర్థుని జీవయాత్ర', పుట 6.
3. MISOGYNIST : An individual who hates women
   –Dictionary of Psychology, p. 168. Edited by Howard C. Warren.
4. MISOGAMY : Hatred of marriage
   –Concise Oxford Dictionary of Current English, p. 774, Edited by H.W. Fowler and P.G. Fowler.
5. 'ఏ న్యూనతాభావమైనా, ఆంగిక కారణాలవల్ల కలిగినదైనా, మానసిక కారణాలవల్ల కలిగినదైనా, సాంఘిక కారణాలవల్ల కలిగినదైనా పరిహారానికి దారితీయవచ్చు. ఏ అసంపూర్ణ భావమైనా న్యూనతా భావా

లకు దారితీయవచ్చునని అడ్లర్ అభిప్రాయపడినాడు. మొదట అడ్లర్ న్యూనతా భావాలు కలగడం అపసామాన్య లక్షణమని అభిప్రాయ పడినాడు. కాని, తరవాత న్యూనతాభావాలు కలగటం సామాన్య లక్షణమని, అవి వ్యక్తి అభివృద్ధికి కారణాలని విశ్వసించినాడు. కాని, ఈ న్యూనతాభావాలే తీవ్రరూపం దాల్చినప్పుడు, న్యూనతా దుర్దమ భావం (Inferiority Complex)గా మార్పు చెందుతాయి. లేదా పరిహారంగా (Compensation)గా ఆధిక్య దుర్దమభావం (Superiority Complex)గా మార్పుచెందుతాయి. ఇవి అపసామాన్యతను సూచిస్తాయి. ఈ అపసామాన్యతలు కలగటానికి పరిసరము, పెంపకము కారణాలు కావచ్చు.'

—అపసామాన్య మనోవిజ్ఞానము, పుట 95, శ్రీమతి డి. భారతి, కుమారి శైలజ

6. VANDALISM : Malicioas or careless destruction of Property, esp. Property characterized by beauty or historical association.

—Dictionary of Psychology, p. 288.

7. ఈ ధోరణి అరాజక వైఖరికి దగ్గరదే. అందుకే— 'కట్టుబాట్లు, నియమాలు, ఆచారాలు, న్యాయసూత్రాలు ఏమీ లేకుండా వుండడం అతనికి హాయిగా' ఉంటుంది. అ.జీ. పుట. 143.

8. 'Ode on a distant Prospect of Eton College' (99).
—Thomas Gray.

(ఎక్కడైతే అజ్ఞానం ఆనందదాయకమో అక్కడ జ్ఞానిగా ఉండటం మూర్ఖత్వం.)

9. 'Problems of neurosis', p. 215, Adler.

10. 'Contemporary Schools of Psychology' p. 197, Robert S. Woodworth.

11. 'What life should mean to you' p. 75, Adler.

12. 'గతితార్కిక భౌతికవాదం, చారిత్రకవాదం,' పుటలు 16 నుంచి 19 వరకు వి. బొగుస్లావ్‌స్కీ, పి. హెచ్. డి. మున్నగువారు.

13. అ.జీ. పుట 103 తండ్రి కూతురును కొట్టిన ఈ సన్నివేశాన్ని, ఆ తర్వాత గోపీచంద్ 'తండ్రి' అన్న కథానికగా కూడా రచించాడు. నవలలో తండ్రి మనస్తత్వం మీద దృష్టిని కేంద్రీకరించిన రచయిత, ఈ కథానికలో కూతురు మనస్తత్వం మీద తన దృష్టిని కేంద్రీకరించాడు. 'తండ్రి'-'సరే కానివ్వండి' కథా సంకలనం).

14. అ.జీ. పుటలు 125 నుంచి 129 వరకు.

ఉత్తమపురుషలో ఉండవలసిన డైరీ ప్రథమపురుషలో ఉండటం గమనార్హం. ఈ విషయాన్ని

'హేతువాదానికి గోపీచంద్ గుడ్‌బై'?? అన్న వ్యాసంలో 'ప్రగతి' గారు పేర్కొన్నారు. ('వీచిక' మాసపత్రిక, మార్చి 1977).

15. 'What life should mean to you,' Chapter XII 'Love and Marriage', p. 192, Adler.

16. అపసామాన్య మనోవిజ్ఞానము, పుట 159.

17. 'రేపు', మనోవైజ్ఞానిక మాస పత్రిక, ఏప్రిల్ 1978, పుటలు 24, 25.

18. అ.జీ. పుట 163,

19. —'మార్క్స్ మానవునకు యివ్వవలసినంత ప్రాముఖ్యం యివ్వకుండా 'చరిత్ర నియమానికే' హెచ్చు ప్రాముఖ్యం యిచ్చాడు....కాని మానవునిలో ప్రకృతిని, చరిత్రను మార్చగల శక్తి వుందని అంగీకరించినప్పుడు ప్రకృతి పరిస్థితులను, చరిత్ర నియమాన్ని బట్టి మానవుడు తప్పనిసరిగా వుంటాడనే వాదన దెబ్బతింటుంది. ఈ వాదన అంగీకరిస్తే మానవుని ఆలోచనా శక్తికి, మనో సంకల్పానికి ప్రయత్నానికి అవకాశం లేదు.'

—యం ఎన్. రాయ్ వ్యాసాలు, పుట 239.

20. అభ్యంతరకరమైన లైంగిక భావాలను, సాంఘికంగా ఆమోదయోగ్య మైన లైంగిక భావనలకు చోటులేని లక్ష్యంవైపు అచేతనంగా మళ్ళించటాన్ని 'ఉదాత్తీకరణం' (Sublimation) అంటారు.

21. 'Hamlet' (5—2), Shakespeare,

22. అ.ప.మ.వి. పుట 78.

23. అ.జీ. 195.

24. 'ఆత్మాశ్రయ తత్వం, ఏకాంత ప్రియత్వం, ఆదర్శ భావాలు, మాన సిక సునిశితత్వం, అనుమాన స్వభావం, ఎదుటివాళ్ళ పట్ల సాను భూతి లేకపోవటం'—మొదలైనవి, అంతర్ముఖీన ప్రవృత్తికి ముఖ్య లక్షణాలుగా జె.డి. పేజ్ పేర్కొన్నాడు (Abnormal Psychology, p. 74.).

25. '....Anti-hero is an ancient as the hero and is indeed the other face of the hero.'

—'Tradition and Dream,' p. 300, Walter Allen.

26. మనోవిజ్ఞానశాస్త్ర శాఖలలో అపసవ్య మనోవిజ్ఞాన శాస్త్రం (Abnormal Psychology) ఒక కొత్త శాఖ. 'మనోవిజ్ఞాన శాస్త్రం' మానవ మనస్తత్వాన్ని, ప్రవర్తనను పరిశీలిస్తే, అపసామాన్య మనోవిజ్ఞాన శాస్త్రం మానవ మనస్తత్వంలోని అపసవ్యతను పరిశీలిస్తుంది. మనందరి మధ్యన తేడాలు ఉన్నప్పటికీ, అపసవ్య మనోవిజ్ఞాన శాస్త్రం అవాంఛ నీయమైన తేడాలను అధ్యయనం చేస్తుంది.

28. అప. మ. వి., పుటలు 170, 171, Abnormal Psochology, p. 90, J.D. Page.

28, 29. అప. మ. వి., పుట 41.

30. 'అభ్యంతరకరమైన కోరికలను, ఆలోచనలను చేతనస్థితిలో ఉండ

నివ్వకుండా, వాటిని 'అహం' అచేతన స్థితిలోకి నెట్టివేస్తుంది. ఈ నెట్టి వేయటాన్ని దమనం (Repression) అంటారు.'
—అప. మ. వి., పుట. 112.

31. Ibid, 199.

32. Abnormal Psychology, p. 209, J.D. Page.

33. అప. మ. వి. పుట 207.

34. 'ఉన్మాద-అవసాద ప్రతిచర్యలు (Manic and depressive reactions) చక్రీయ (Cyclic) పద్ధతిలో సంభవించే వీలున్నది.'
—Ibid, పుట 206.

35. Ibid, పుట 207.

36, 37. మనోవికృత రోగిలో 'భ్రాంతులు', 'విభ్రమాలు' మొదలైన తీవ్ర లక్షణాలు ఉంటాయి.'
—Ibid, పుట 198.

38. Ibid, పుట 199.

39. 'ఏమీ లేదనే భ్రాంతిని (శూన్యవాద భ్రాంతి) అంటారు.'
—Ibid, పుట 199.

40. Ibid, పుట 256.

41. అ.జీ. పుట 199.

42. అప.మ.వి, పుటలు 223, 224.

43. 'Foma Gordeyev' (The mean who was afraid) అన్న నవలను 'భయస్థుడు' అన్న పేరుతో తెనిగించిన రెంటాల గోపాల కృష్ణ గారు 23-11-1981 నాడు ఈ వ్యాసకర్తతో 'అసమర్థుని జీవ యాత్ర' నవల మీద గోర్కీ నవల ప్రభావం వుందన్నారు.

44. 'ఇరుగు పొరుగు' కథానికా సంపుటానికి 'ముందు మాట'లో.

45. 'భయస్థుడు' పుట 174.

మూడవ ప్రకరణం

## సాంఘిక నవలలు

# 1. పరివర్తనం

'ఉదయం మెరుపుల్తో ఉరుముల్తో పెద్ద వర్షం కురిసింది. ఆ రోజంతా మసకమసగ్గానే వుంది. ఇంకా తుంపర పడుతూనే వుంది' అంటూ వర్ణనలో నవల1 ప్రారంభమవుతుంది. ఈ వర్ణనలో కథానాయకుడైన రాజారావు అంతరంగం, జీవితం ప్రతిబింబిస్తున్నాయి.

'పెద్ద వర్షం'-భార్య మరణంవల్ల కలిగిన దుఃఖం. అది కాల ప్రభావం వల్ల క్రమంగా తగ్గి 'తుంపర'గా మిగిలి వుంది. బలమైన గాలి మబ్బుల్ని చెల్లాచెదరు చేస్తే, ఈ తుంపర ఎంతోసేపు వుండదు.

ఇప్పుడు మాత్రం-

'దుఃఖం వల్లా, సంస్కారం లేకపోవటం వల్లా....అంతా కంగారు కంగారుగా వున్నాయి.'

రాజారావు చనిపోయిన తన భార్యను మరచిపోలేక పోవటం అసహజమైనదీ, సంస్కారరహితమైనదీ అని రచయిత సూచిస్తున్నాడు. నవల వాతావరణ నిర్మాణంలో ఈ వర్ణనకు కొంత పాత్ర వుంది.

అతని భార్యావియోగ దుఃఖాన్ని భావకవుల విరహవేదనతో పోల్చాడు రచయిత. కాని, ఒక తేడాను గుర్తించవలసి వుంది: భావకవుల విరహవేదన జీవించి వున్న ప్రియురాలికోసం, చాలా వరకు ఊహాసుందరి కోసం. కాని, రాజారావుది మరణించిన భార్యకు సంబంధించిన వియోగ దుఃఖం. అతడు ఆ దుఃఖానికి అలవాటుపడి, ఆ అలవాటును వ్యసనంగా మార్చుకొని, ఆ వ్యసనంలోనే మానసిక సౌఖ్యాన్ని పొందుతున్నాడు.

తన భార్య మరణించిందన్న భౌతిక దృష్టి, మానసిక స్పృహ రాజారావులో ఉన్నాయి. అయితే, తన భార్య తన అంతరంగాన్ని వదిలిపోలేదనీ, ఆమె తనలోనే వుండి తనను నిరంతరం ప్రేమిస్తూ, జీవితానికి మార్గదర్శకత్వం వహిస్తున్నదనీ అతడు భ్రమిస్తున్నాడు. భార్యకు ప్రాణంపోసి తన మనస్సులో భద్రపరచుకొని, ఎప్పుడూ 'ఆమె'తో మానసికంగా జీవించటానికే ఇష్టపడతాడు. తోటలోని పూల మొక్కలతోనూ, తోట పక్కనుంచి ప్రవహించే గంగాస్రవంతితోనూ అప్పుడప్పుడు 'మాట్లాడుతాడు. అవి తిరిగి తమ భావాన్ని వ్యక్తం చేసినట్లుగా భ్రమిస్తాడు.

'తన జీవితంలో ఆ తోటకీ గంగాస్రవంతికీ తెలియని రహస్యాలూ, బాధలూ, సుఖాలూ లేవు. ఆ నది, ఆ నదిలోని ప్రతి అల, ఆ తోట ఆ తోటలోని ప్రతి పూల మొక్కా తన జీవితంలోని ఒక్కొక్క ప్రకరణానికి ఒక్కొక్క శీర్షికగా కనిపించినై. ఒక్కొక్క పూల మొక్క కింద తన జీవితంలోనే ఒక్కొక్క అధ్యాయం ముగిసింది. – మొదలైంది' అంటూ భావోద్వేగపూరితమైన శైలీ విన్యాసాన్ని ప్రదర్శిస్తూ కథానాయకుని విరహవేదనా భరిత హృదయాన్ని రచయిత ఆవిష్కరించిన తీరు ప్రశంసనీయం. ఎడతెగని కష్టసుఖాల వర్ణన యిది. ముగిసినట్లే ముగిసి మళ్లీ మొదలయ్యే, మొదలయినట్లే కనిపించి మళ్ళీ ముగిసిపోయే తీరనిదాహం లాంటి జీవితానుభవాల వర్ణన యిది.

రాజారావుతోపాటు ప్రారంభంలోనే పాఠకునికి పరిచయమయ్యే మరో పాత్ర 'జీజీ'. ఆమె చనిపోయినా రాజారావులో తాను బతుకుతున్నట్టుగానే, పాఠకుని ఊహలో కూడా వెంటనే ఊపిరి పోసుకుంటుంది.

భావకవి మనస్తత్వాన్ని కలిగిన రాజారావును భావకవుల భాషలో చిత్రించటం మంచి శిల్పం. మొక్కలు తాము జంటగావస్తే 'కళకళలాడేవి.' ఒంటరిగా వెళ్లితే 'మొహం ముడుచుకునేవి.' అంటూ ఆనందాన్నీ, వెలితినీ మొక్కల్లో చూసుకుంటాడు. తమ మధ్యన గులాబీ 'జోక్యం' చేసుకొని చెవిలో రహస్యాలు ఊదింది. తాను రెండు రోజులు భార్యను వదిలి వెళ్లినప్పుడు ఆమె ఎంత బాధపడ్డదో గంటసేపు చెప్పి, విరజాజి మొక్క తనకు 'సహాయం' చేసింది, అనుకుంటాడు.

ఈ సౌమ్య సన్నివేశాలు, మొక్కల నీడల్లో సేదదీర్చుకునే అలౌకిక భావాల వలయంలో చిక్కుకున్న సుకుమార హృదయాన్ని వ్యంగ్య పరిమళంతో పరిచయం చేస్తాయి. రచయితకు రాజారావు సృష్టించుకున్న లోకం పట్ల ఎంత సానుభూతి వుందో, అంత అసహనం కూడా వుంది.

రాజారావుకు ఆరేళ్ళ పాపా, చిన్నారి బాబూ వున్నారు. చిన్ని తమ్ముణ్ణి చూడవలసిన బాధ్యత కూడా అంత చిన్న వయసులో ఆ పాపమీద పడటంవల్లా ఆ అమ్మాయిలో వయసుకు మించిన అవగాహనా, మాటకారితనమూ కనిపిస్తాయి.

మాలగా అల్లి భార్య ఫోటోను అలంకరించటానికి రాజారావు తోటలోని పూలను సేకరించిన సందర్భంలో అతనికీ కూతురుకూ జరిగిన సంభాషణ గమనించతగ్గది. పాప మాటలు ఎవరో బోధపరిస్తే వల్లించిన మాటలలా అనిపిస్తాయి. ఈ పాప పాత్ర చిత్రణ చివరి వరకు ఇదే విధంగా సాగింది.

రాజారావు మానసిక ప్రపంచంలో సృష్టించుకున్న కృత్రిమ జీవితాన్ని భగ్నం చేసి; కొత్త జీవితాన్ని ప్రసాదించే శక్తి అతని అత్తగారికి లేదు. అందుకే ఆమె రాజారావు అక్కను రప్పించింది.

అక్క ప్రవేశంతో నవలలోని వాతావరణంలో మార్పు వస్తుంది. 'అంతర సంభాషణ'ల స్థానంలో 'సంభాషణ'లు చోటుచేసుకుంటాయి. చీకటి మూలల మీద వెలుగు ప్రసరిస్తుంది. ఆమెతోపాటే పాఠకునికీ రాజారావుపట్ల సానుభూతీ శ్రద్ధాసక్తులూ ఏర్పడతాయి. రాజారావులో మార్పు తేవటానికి అక్కతోపాటే హేతుజ్ఞానం రంగప్రవేశం చేస్తుంది.

ఈ సందర్భంలో అక్కకూ రాజారావుకూ మధ్యన రచయిత కల్పించిన కుశల ప్రశ్నల సన్నివేశం ముఖ్యమైంది.

ఎదురుగా గోడ మీద వున్న తన భార్య ఫోటో చూస్తూ రాజారావు–

''అక్కా, ఎప్పుడొచ్చావు ?'' అని అడిగాడు.

"ఇప్పుడే వొచ్చారా! అంతా బాగున్నారా?" అడిగింది అక్క.

ఆ ప్రశ్నకు అతను జవాబు చెప్పలేదు.

"బావ ఏం చేస్తున్నాడు?" అని అడిగాడు.

ఒక్క క్షణం అతను తనతో మాట్లాడుతున్నాడా.

ఆ ఫోటోతోనా అని ఆమెకు సందేహం కలిగింది.

"బావ ఈ మధ్య డిష్టిక్ కలెక్టరు అయ్యారు" అని.

రెండు సార్లు అక్క చెప్పినా అతడు గ్రహించలేకపోయాడు.

తాను వచ్చినందుకు అతడు పెద్దగా సంతోషించలేదని ఆమె గ్రహించింది. తనతో మాట్లాడిన రెండు నిమిషాలు కూడా భార్యను విస్మరించలేకపోయాడనీ, తానుగానీ, తనభర్తగానీ అతని దృష్టిని మళ్ళించలేమని తెలుసుకోగలిగింది. రాజారావు అతని కూతురు మాటకిచ్చే విలువను కూడా అక్క ఈ సన్నివేశంలో గమనించింది.

రాజారావు దృష్టి భార్య ఫోటోమీద కేంద్రీకృతం కావటం వల్ల, అతని జీవితసమస్య కేంద్రాన్నే కాదు, ఆ సమస్య తీవ్రతను కూడా అర్థం చేసుకున్న అక్క, ఆ తర్వాత తన వ్యూహాన్ని నిర్ణయించుకుంటుంది. తాను వెళ్ళలేని చోటుకు వెళ్ళగల మేనకోడలు దొరికినందుకు ఆమె సంతోషించింది. అందుకే, పాపను తనకు అనుకూలంగా మలచుకోవటం ప్రారంభించింది.

జీవితం పట్ల అక్కకున్న అనుకూలదృష్టి ఆమె ప్రత్యేకత. అందుకే ఆమె బాగా ఆలోచించి రాజారావు 'ప్రాణస్నేహితుడు' కిష్టుడు తనకు తోడ్పడతాడనీ, కిష్టుడి చెల్లెలు శాంత రాజారావుకు రెండోభార్యగా యోగ్యురాలనీ నిర్ణయించింది.

అక్క తన ప్రయత్నాలను రాజారావుకు తెలియనీయలేదు. తెలిస్తే తన ప్రయత్నాలమీది అసహ్యం కొద్దీ ఇంకా భార్యకు మానసికంగా చేరువ అవుతాడని ఆమె జాగ్రత్త వహించింది.

"కిష్టయ్య మామయ్య వొస్తాడని కూతురు చెప్పగానే రాజారావుకు కిష్టుడు గుర్తు రాలేదు. ఈ మతిమరుపు అతని దుఃఖతీవ్రతకు ఒకగుర్తు.

'కిష్టయ్య మామయ్య' తన ప్రాణస్నేహితుడైన కిష్టుడేనని తెలుసుకోగానే అతనికి చాలా సంతోషం కలిగింది. రాజారావులో చాలాకాలం తర్వాత నిజమైన సంతోషాన్ని కలిగించటం – అక్క సాధించిన తొలివిజయం.

రాజారావుకు వివాహం కాకముందునుంచీ కిష్టుడు ప్రాణస్నేహితుడే. అయినా ఈ దశలో కిష్టుడికి సంబంధించిన జ్ఞాపకాల్లో భార్యతో ముడిపడి వున్న వాటినే రాజారావు మననం చేసుకోగలగటం విశేషం. కిష్టుణ్ణి ఒక ప్రత్యేకవ్యక్తిగానో, తన మిత్రునిగానో కాక, భార్యకూ తనకూ సంబంధించిన అనుబంధంగానే అతడు గుర్తించాడు. ఈ పరాధీనత, అతని సామాజిక సంబంధాలు పూర్తిగా దెబ్బతినడాన్ని సూచిస్తున్నది.

కిష్టుడి స్నేహం పునర్నవం కావటంవల్ల, రాజారావులో ఏర్పడే నూతన మానసిక వాతావరణాన్ని వాడుకోవటం, కొంత ఆర్ద్రంగా మారే అతని హృదయ పలకంమీద శాంత బొమ్మ చిత్రించటం అక్క వ్యూహంలో మొదటిదశ.

రాజారావు తన భార్య స్మృతులతో తాదాత్మ్యం చెంది, తనతో ఆమె ఉందనే విభ్రాంతిలోనే కొంతవరకు జీవిస్తున్నాడు. అంటే, ఆ భ్రాంతిలో ఉన్నంతసేపూ అతనికి వియోగదుఃఖం లేదు; ఎటొచ్చీ ఆ భ్రాంతి చెదిరితేనే సమస్య ఈ కీలకాన్ని అర్థం చేసుకున్న కిష్టుడు, జీజీని మరిచిపోమ్మనీ, నాలుగు రోజులపాటు ఈ వాతావరణాన్ని విడిచిపెట్టి ఎక్కడికైనా వెళ్ళి రమ్మని చెప్పాడు· ఈ సలహా చెప్పే చనువు ఆ ఇంట్లో ఎవరికీ లేదు. ఒక విధం — రాజారావు మానసిక ఆభాస జీవితంలోకి రాయి విసరటమే ఇది. కా , అతణ్ణి వాస్తవప్రపంచంలోకి తీసుకురావటానికి ఈ దెబ్బ అవసరమే.

కిష్టుడు రచయితకు ప్రతినిధి.

ఈ సందర్భంలో అక్క కిష్టుణ్ణి సమర్థించనట్లుగా దూరదృష్టితో ప్రవర్తించింది. రాజారావు మనసును అతని భార్యనుంచి మళ్ళించటం ఎవరికీ సాధ్యంకాదు అతని సర్వస్వం మీద అతని భార్యకే హక్కు ఉన్నది. అతడు తన భార్య కోరికలను, ఆజ్ఞలను మాత్రమే మన్నిస్తాడు. పాపతో రాజారావు వ్యవహరించే తీరే ఇందుకు సాక్ష్యం. పరివర్తన దిశలో అతని ప్రయాణం

ప్రారంభమైన తర్వాత, అతనిలో అతడు సమాధానపడ్డ తర్వాత, అతని అంత రంగమే అతనితో చెప్తుంది- కొత్తస్త్రీని అంగీకరించమని. ఇది అక్క అవగాహన.

రాజారావు భార్యస్థానాన్ని ఆక్రమించే వ్యక్తికి కొన్ని ముఖ్యలక్షణాలు అవసరం. రెండో పెళ్ళివాణ్ణి వివాహమాడే విశాలహృదయం ఆమెలో ఉండాలి. స్వరూపంలో స్వభావంలో చనిపోయినవ్యక్తి పోలికలు కొన్నైనా ఉండాలి. అంతేకాదు, రాజారావు మీద పూర్తి సానుభూతీ, గౌరవం ఉండాలి. ఇవే తర్వాత ప్రేమగా పర్యవసిస్తాయి. చనిపోయిన తర్వాత కూడా భర్తను 'నడిపిస్తున్నం దుకు' మొదటిభార్య మీద అసూయగానీ, భయంగానీ కాక ఆదరాభిమానా లుండాలి. ముఖ్యంగా, అతని పిల్లలంటే తనకు సంతానం కలిగినా మారని మమత ఉండాలి. ఈ లక్షణాలన్నీ కిష్టుడి చెల్లెలు శాంతలో అక్కకు కని పించాయి. అందుకే, అక్క ధైర్యంగా ముందుకు సాగింది. ఈ రెండో పెళ్ళికి శాంత ఒప్పుకుంటుందా ? అన్న సందేహం అక్కకు రాలేదు. తన తమ్ముని శ్రేయస్సుకోసం శాంతకు అన్యాయం చేస్తున్నానేమోననే భావం ఆమెకు కలుగలేదు ఆమె 'అక్క'గానే ఆలోచించి, అక్కగానే వ్యవహ రించింది.

పై అంశాన్ని దృష్టిలో పెట్టుకొని చూస్తే నవలలో శాంతను ప్రవేశ పెట్టిన పద్ధతి ప్రశంసనీయంగా వుంది. ఆమెకు తాను రాజారావు భార్య స్థానాన్ని ఆక్రమించే సంగతి ముందుగా తెలియదు. అదీగాక, ఆమెను రాజా రావు భార్య సుగుణాలే ముందు ఆకర్షించి, ఆమెపట్ల ఒక ఆరాధన భావం కలగజేశాయి. జీజీ రాజారావుకు స్వప్నమైతే, శాంతకు ఆదర్శం. జీజీని శాంత తన అక్కగా భావించింది.

అక్క ప్రవేశంతో ఆ ఇంటి వాతావరణంలో ఆత్మవిశ్వాసం ప్రవేశిస్తే, శాంత ప్రవేశంతో ప్రేమానురాగాలు నెలకొన్నాయి. వచ్చీరాగానే పిల్లలతో ఏర్పడ్డ చనువు, అప్పుడప్పుడు రాజారావును గూర్చి అక్కచెప్పిన మాటలు, 'బావ'ను ఆదుకోవటం పట్లా, పిల్లల రక్షణపట్లా తనకూ బాధ్యత వుందన్న భావం శాంతలో కలిగించాయి.

రాజారావును శాంత 'బావ' గా భావించింది. వివాహయోగ్యమైన యౌవనం ఆమెలో వివాహవాంఛను కలిగించింది.

శాంత త్వరలోనే ఆ ఇంటి వాతావరణానికి అలవాటు పడింది మొదట్లో అమ్మమ్మకు సహాయం మాత్రమే చేసేది. తర్వాత ఇంటిపనులన్నీ తానే చేయటం మొదలుపెట్టింది. అంటే, క్రమంగా ఆమె రాజారావు భార్య స్థానాన్ని ఆక్రమించసాగింది. ప్రతి పనీ చేసేముందు—

''అక్క అయితే ఏమి చేసేది''? అన్న ప్రశ్న పుట్టటానికి కారణం అదే.

రాజారావు గుండె గాయానికి కిష్టుడు మొదటిసారి మందువేయటానికి ప్రయత్నించాడు తన వియోగదుఃఖపు గొప్పదనాన్ని ఎదుటివాళ్ళు గుర్తించటం లేదని, పైగా తేలికచేస్తున్నారనీ రాజారావు భావించాడు. ఈ విషయంలో అతని స్వాభిమానం గాయపడింది. తానొక ప్రత్యేక మానవుణ్ణనే భావం కూడా అతనిలో వుండటం వల్ల సమస్య మరికొంత జటిలమైంది.

'ఆరోజు గంగా స్రవంతి రోజుకు మల్లే లేదు....' అనిపించిందతనికి. నిజానికి ఆ కలవరం, ఆ మార్పు గంగాస్రవంతిలోనివి కావు. తన అంతరంగం లోనివే

అతనిలో సంఘర్షణ ప్రారంభమయింది.

అయితే, అతడు ఆ సంఘర్షణ స్వరూపాన్ని స్పష్టంగా గుర్తించలేదు. ఆ గంగాస్రవంతి తనకోసమూ, తన భార్యకోసమూ మాత్రమే ప్రవహిస్తూ వుందనీ, ప్రతికెరటం తమ ప్రణయ మాధురీగత స్మృతులనే గానం చేస్తున్నదనీ అతని భావం. అందుకే ఒక పల్లెవాడు గంగాస్రవంతిని చనువుగా పలకరిస్తే రాజారావుకు శూలాలు గుచ్చుకున్నట్లయింది. తనచుట్టూ ఒక ప్రపంచం ఉన్నదనే సంగతి గుర్తుకురాగానే అతనికి గంగాస్రవంతిలో మార్పు కనిపించింది అది తనలోని మార్పే! తనకు తెలియకుండా జరుగుతున్న మార్పే. అందరిలో తానూ ఒకడనే భావం. తానో ప్రత్యేకసృష్టిననే భావాన్ని క్రమంగా

నాశనం చేస్తున్నది. బాహ్య ప్రపంచ జ్ఞానం కలిగినప్పుడు, మానసిక ప్రపంచంలోకి భ్రాంతి విరిసిపోతుంది.

అక్కౕ పూనికతో ప్రారంభమైన పరిణామక్రమంలో ఇది రెండవ మజిలీ.

తర్వాత అతడు తోటలోకి వచ్చాడు. తోటంతా పరిశుభ్రంగా వుంది మొక్కలు మొగ్గలు తొడుగుతున్నాయి. అంతకుముందు గంగాస్రవంతి దర్శనం వల్ల కలిగిన బాధను ఈ దృశ్యం ఇనుమడింపజేసింది. తోటంతా అపరిశుభ్రంగా, చిందరవందరగా వుంటేనే అవి తనతోపాటు తన భార్య కోసం దుఃఖిస్తున్నాయని తృప్తి చెందేవాడు. ఈ మొక్కలన్నీ ఎవరికోసం పూస్తున్నాయో అతనికి అర్థం కాలేదు.

"ఎవరి కోసం? ఎవరికోసం? ఎవరికోసం?" అని పిచ్చిగా ప్రశ్నించాడు.

"పిన్నికోసం నాన్నా! రోజూ పూలుకోసి అమ్మ మెళ్ళో దండ వేస్తున్నాం" అన్నది కూతురు.

దండ తల్లి ఫోటోను అలంకరిస్తున్నప్పుడు, పూలు తల్లికోసమే పూస్తున్నాయనే అర్థం కదా! "పిన్నికోసం" అన్న మాటను అత్తగారి బోధ వల్ల పాప అన్నదన్నమాట. తల్లి స్థానాన్ని పిన్ని ఆక్రమిస్తున్నదనటానికి కూడా ఇది నిదర్శనం.

రాజారావు కిష్టుడి చెల్లెల్ని గూర్చి మొదటిసారి ఆలోచించసాగాడు అతడట్లా తప్పనిసరిగా ఆలోచించే పరిస్థితులను అక్క కల్పించింది. శాంత చేసే పనులు జీజీ పనులలాగే వుంటాయని తన అక్క అన్నట్టుగా కూతురు ద్వారా అతనికి తెలిసింది.

'....మరొక్క వ్యక్తి తన భార్య చేసినట్లుగా చెయ్యటం అనే భావం అతణ్ణి కలవరపెట్టింది.'

'గంగా స్రవంతి' వల్ల పొందిన కలవరం నుంచి, 'తోట' కలిగించిన బాధ నుంచి తేరుకోకముందే కూతురు మాటలు అతణ్ణి సంఘర్షణకు గురి చేశాయి.

తర్వాత కుటీరంలోకి వెళ్ళాడు. అది కూడా పరిశుభ్రంగా సర్దబడి వుంది :

తన భార్య ఫోటో ముందున్నచోట కాక, ఎత్తైన చోట వుంది. ఒక పక్కన శాంత నిలబడి వుంది, తన భార్యకు చాలా ఇష్టమైన కనకాంబరం రంగు చీర ధరించి :

భార్యాస్మృతుల్ని శాంత ఉద్ధృతంగా రెచ్చగొట్టింది.

"అంతా తన భార్యే...." అనిపించిందతనికి.

అంతే, అతని భార్య స్థానం కదిలింది.

మరోవైపు శాంత, తను ఏయే వస్తువులను ఎందుకు సర్దిందో సంజాయిషీ చెప్పుకుంటోంది.

అతడదేమీ విన్నట్లులేదు. సూటిగా శాంతని చూస్తున్నాడు. అతని మనసంతా కొత్త మార్పుల మూలంగా మొద్దుబారింది. అతడు భార్య ఫోటోను తిరిగి యథాస్థానంలో ఉంచటం ద్వారా, తన హృదయంలో భార్య పదిలంగా వున్నదని తనను తాను ఊరడించుకునే ప్రయత్నం చేశాడు. కాని, శాంతలో అతనికి జీజీ పోలికలు కనిపించటం గమనార్హం. అతడు భార్య వంటి వ్యక్తిని అచేతనంగా కోరుకుంటున్నాడనటానికిది నిదర్శనం.

శాంత కనకాంబరం రంగు చీరను ధరించి కుటీరంలోకి వెళ్ళటానికి నిస్సందేహంగా 'అక్క' కారణమనుకోవాలి. ఇది అక్క పథకంలోని భాగమే ఈ సన్నివేశం రాజారావు మానసిక సంధి దశను సుస్పష్టం చేస్తూ, అక్క ప్రయత్నం ఫలోన్ముఖంగా ఉన్నదని సూచిస్తున్నది.

ఇక శాంత సంగతి. ఆమె తనకు రాజారావు పట్ల వున్న ప్రేమను బహిర్గతం చేసుకున్నది. ఆమె దుఃఖమంతా, తాను అతని ముందు మొదట బయటపడ్డందుకే. తన ప్రేమను గుర్తించి, వెంటనే అతడు ఆమోదించనందుకే. శాంత తోటను, కుటీరాన్ని సర్ది వాటికి కొత్తదనాన్ని సంతరించి పెట్టింది. ఈ రకంగా రాజారావుకు కొత్త జీవితాన్ని అందివ్వాలన్న తన

ఆకాంక్షను వెల్లడించింది. కాని, అతని ప్రవర్తన అందుకు సహకరించేటట్లుగా లేదు.

శాంత వెళ్ళిపోయింది.

కుటీరంనుంచి తిరిగి వచ్చిన తర్వాత ఆమెలో మార్పు వచ్చింది. ఈ మార్పు ఇంటి వాతావరణాన్ని మార్చేసింది. ఆమె ఆ ఇంట్లో ఎంత ముఖ్యమైన స్థానాన్ని ఆక్రమించిందో ఈ వాతావరణ చిత్రణ ద్వారా రచయిత చక్కగా సూచించాడు స్వతంత్రంగా కాకపోయినా, అక్క పథకంలో భాగంగా, కొత్త జీవితంవైపు శాంత వేసిన అడుగు ఆమెకు దుఃఖాన్ని తెచ్చిపెట్టింది. అంకురదశలో వున్న అనురాగ భావాలకు దెబ్బతగిలినప్పుడు మానవతి అయిన యువతిలో ఎలాంటి భావోద్వేగం చెలరేగుతుందో, క్రమంగా ఎలాంటి పరిపక్వత చోటుచేసుకుంటుందో రచయిత చక్కగా సూచించాడు.

ఈ దశలో పసిపిల్లలకూ, శాంతకూ మధ్యన, అమ్మమ్మకూ, శాంతకూ మధ్యన అనుబంధాల అల్లిక చిక్కబడింది.

ఎప్పుడూ ఎంతో ఆప్యాయంగా చూసుకొనే పాపను కూడా రాజారావు కసురుకున్నాడు. ఇది ముదురుపాకాన పడబోతున్న సంఘర్షణను సూచిస్తున్నది ఆవేశం తగ్గిన తర్వాత అతడు ఆత్మపరిశీలనకు ప్రయత్నించాడు. 'ఏకాగ్రత' సాధించటానికి ప్రయత్నించాడు. తన భార్య మీద మనసు నిలపటానికి ప్రయత్నించాడు. కాని, లాభం లేకపోయింది.

తన మనసులోకి శాంత ప్రవేశించిన విషయం చూచాయగా అతనికి తెలిసింది. కాని, సత్యాన్ని స్పష్టంగా దర్శించటానికి భయపడ్డ రాజారావు ఆత్మవంచనకు ప్రయత్నించాడు.

భార్య ఫోటో మీద దృష్టి నిలిపి "జీజీ" జీజీ" అని పిలిచాడు. మనసు స్వాధీనం తప్పింది. "జీజీ" అన్న సంబోధన నిస్సహాయంగా చేసిన ఆర్తనాదం. అతని మనసు "స్వాధీనం" తప్పింది. అంటే, ఇంతవరకు "తనది"గా అనిపించిన భార్య జీజీ యొక్క అధీనంలో ఉన్న మనసు స్వాతంత్ర్యాన్ని పొందింది. అయితే, ఈ పరిణామాన్ని వెంటనే గుర్తించటానికి అతడు సిద్ధంగా లేదు.

తనను తాను తెలుసుకోవటానికే బయటి ప్రపంచంలోకి అడుగు పెట్టాడు.

రాజారావు ఇల్లు వదిలి వెళ్ళిపోవటాన్ని శాంత సరిగ్గా అర్థం చేసుకో లేకపోయింది. తాను అతని జీవితంలో అడుగుపెట్టటం రాజారావుకు ఇష్టం లేదనీ అందుకే అతడు వెళ్ళిపోయాడనీ అనుకుంది. 'ఆయనకు ఇష్టం లేని పని ఎందుకు చేశాను?' అని ప్రశ్నించుకుంది. నిజానికి రాజారావు మృత్యువు వైపు పయనించటం ఆమెకు ఇష్టంలేదు. అందుకే మృత్యువుకు చిహ్నమైన జీజీ ఫోటోను 'పైకి' పంపింది.

రద్దీగా వుండే వీథిలో పరధ్యానంగా నడిచి రాజారావు ఏ ముప్పు తెచ్చుకుంటాడోనని శాంత ఆందోళన చెందుతుంది. ఇది భార్య మనస్తత్వంతో ఆలోచించటమే. ఆ రాత్రి ఆమెకొక పీడకల[2] కూడా వచ్చింది. అతని భార్య స్థానం ఆక్రమించాలనే కోరికా, అతని క్షేమచింతనా ఎంత బలంగా శాంతలో ఉన్నాయో తెలుసుకోవటానికి ఆ కల ఒక నిదర్శనం. "Absence makes the heart grow fonder"[3] అన్నట్లు, అతడు భౌతికంగా దూరం కావ టంతో శాంతకు మానసికంగా దగ్గరయ్యాడు.

అతని ప్రవర్తనను చక్కగా అంచనా వేసిన వ్యక్తి అక్క. తమ్ముని దృష్టి మారి వుంటుందనీ, అతనిలో సంఘర్షణ బయలుదేరి వుంటుందనీ ఆమె అంచనా. రాజారావుది మృత్యువుతో జీవితం చేసే సంఘర్షణ. ఈ సంఘర్షణ బాహ్యజగత్తులో కంటే, అంతర జగత్తులో ఎక్కువ ప్రమాదకరమైంది. జీవించాలనే కాంక్ష ప్రబలంగా వుంటే తప్ప, రాజారావు బతికి బయటపడ లేదు. అందువల్ల, చాలా కాలంగా తాను అంటిపెట్టుకొని ఉన్న తోటనూ, కుటీ రాన్నీ వదిలి, రాజారావు సమాజంలోకి అడుగుపెట్టటం నవలలో ఒక మలుపు. మార్పుకు సంకేతం. అతడు కొత్త జీవితాన్ని ఆహ్వానించటానికి ద్వారాలు తెరిచాడు. తానో ప్రత్యేక వ్యక్తిననే భ్రమను ఛేదించుకొని అంద రిలో ఒక్కణ్ణనే భావాన్ని పొందటానికి ప్రయత్నిస్తున్నాడు. దీనికి తగ్గట్టుగా నవలలోని వాతావరణంలో కూడా మార్పు వచ్చింది. అతడొక ఊరేగింపును చూశాడు. ఊరేగింపును చూడటమంటే, అతడన్ని రోజులుగా నిర్లక్ష్యం చేసిన

సామాజిక జీవితాన్ని "దర్శించటమే." ఈ దృశ్యం అతణ్ణి ఉత్తేజపరుస్తుంది, మానసిక ధైర్యాన్నిస్తుంది.

తన భార్య బతికి వున్నప్పుడు రోజూ పూలు కొన్న దుకాణంవద్దకు వెళ్ళాడు. పూలు కొనాలనిపించింది. పూలు కొనాలనిపించటం జీవితాశకు గుర్తు. కాని, "ఎవరికోసం?" అన్న ప్రశ్న ఉదయించింది. పూలదండను జారవిడిచాడు. దండను భార్య ఫోటోకు వేయవచ్చుగదా! కాని, మనసులోనే మసకమసకగా కనిపించే వ్యక్తి, ఫోటోలో సజీవంగా ఉండటం అసాధ్యం

జీవితం నుంచి తప్పించుకుపోతున్నట్లు అతణ్ణి అంతరాత్మ హెచ్చరించింది. మనిషి స్వయంగా దర్శించే సత్యమే బలమైంది. అందుకే రాజారావు జీవించాలనే సంకల్పంతో తిరిగి కుటీరాన్ని చేరుకున్నాడు.

అతనిలో చివరి పరిణామాన్ని చిత్రించే రచనా భాగం చాలా వరకు ప్రతీకాత్మకంగా సాగింది.

'అతనికి కళ్ళ ముందు నల్లని ఆకాశం కనిపించింది....' ఒకేసారి సూర్యోదయ సూర్యాస్తమయాలు కనిపించాయి.

సూర్యోదయం జ్ఞానం, సూర్యాస్తమయం ఆత్మవంచన.

"నువ్వు పిరికివాడవు, పారిపోతున్నావు" అన్నాడు సూర్యోదయం.

"కాదు నేను పోయిన వస్తువుకోసం వెతుక్కుంటున్నాను" అన్నాడు సూర్యాస్తమయం.

"అది దొరకదని నీకు తెలుసు."

"దొరకనిదాన్ని వెతకటంలోనే వుంది విశిష్టత."

"సంఘాన్ని ఎదుర్కొటానికి భయపడి, నీ పిరికితనాన్ని కప్పిపోవటానికి ఒక సిద్ధాంతాన్ని సృష్టిస్తున్నావు."

'అస్తమయం' మాట్లాడలేదు.

అంటే అస్తమయం అస్తమించింది.

దొరకదని స్పష్టంగా తెలిసినదానికోసం వెతకటం అర్థంలేని పనే. దొరికే వస్తువుకోసం వెతికితే, కొంత కాలానికైనా దొరకవచ్చు. కాని ఆత్మ వంచనతో బతికేవాడికి తనను తాను మభ్యపెట్టుకోవటానికీ, తన ప్రత్యేక తను ప్రదర్శించుకోవటానికి ఎప్పుడూ ఏదో ఒక సాకు అవసరం. తాను వెతికేది దొరికితే, వెతకటం ఆగిపోతుందనే భయం. అయితే యీ ఆత్మ వంచనకు గట్టి పునాది ఉండదు, కనుక, సంఘర్షణకు గురైనప్పుడు చెదిరి పోకతప్పదు. ఈ సన్నివేశంలో 'సూర్యోదయం' ప్రస్తావించిన 'సిద్ధాంతం' భావకవుల ప్రేమ సిద్ధాంతమే. పోయిన వస్తువు జీజీ. జీజీ తిరిగి దొరకదని తెలిసినా, ప్రేమించినవాళ్ళను మరిచిపోవటం ప్రేమ సిద్ధాంతానికి వ్యతిరేక మని రాజారావు భావిస్తున్నాడు. ఈ భావన విరహ సంస్కారంగా మారి జీవితాన్ని మృత్యువు వైపు నడిపిందని రచయిత విమర్శ.

ఇంత కాలంగా మానసిక ప్రపంచాన్ని పరిపాలిస్తున్న జీజీ నిష్క్రమించిన సన్నివేశం నవలలో పతాకసన్నివేశం. ఇది రాజారావు మనస్తత్వమంత క్లిష్టమైనది. తాను చేసిన పొరపాటేమిటి? తాను కొత్త జీవితాన్ని పొందాలంటే ఏం చెయ్యాలి? వంటి ప్రశ్నలకు సమాధానాలు లేకపోలేదు. కాని, అవి అస్పష్టంగా ఉన్నాయి.

అతని మానసిక జీవితం నుంచి జీజీ నిష్క్రమణకు రెండు మార్గాలున్నాయి. ఒకటి - రాజారావే జీజీ నిజస్వరూపాన్ని గుర్తించి, ఆ మృత్యుచ్ఛాయను బహిష్కరించటం. రెండు - జీజీ స్వయంగా నిష్క్రమించినట్లు రాజారావు భ్రమించటం. రాజారావు మనస్తత్వం దృష్ట్యా మొదటిది కష్టసాధ్యమే. జీజీ అనుబంధాన్ని తెంచుకోవటానికి ఇష్టపడనివాడు కావటంవల్ల జీజీ స్వయంగా నిష్క్రమించిందని, ఆమె నిష్క్రమణకు తాను ఎంతమాత్రం కారణం కాదని అనుకోవటానికే అతడు ఇష్టపడతాడు. ఇది ఒక భ్రమను ఇంకో భ్రమతో జయించటం.

ఈ దశలో -

"ఇలా వొస్తారూ? ఒక్కసారి వొస్తారూ?" అని జీజీ తనను పిలిచినట్లు రాజారావు విభ్రాంతికి లోనయ్యాడు. జీజీ ఇప్పుడు పిలిచిన పిలుపు కాదని, జీవించి ఉన్నప్పుడు పిలిచిన పిలుపే.

'అలల్లో నుంచి తెల్లని పద్మం పుట్టుకొచ్చింది. ఆ పద్మానికి రెండు ప్రక్కలా రెండు ఐరావతాలు మొలుచుకొచ్చినై. ఆ పద్మం లోంచి ఒక స్త్రీ ఆకారం బయటకు వొచ్చింది.'

అంటే. ప్రేయసి దేవతగా మారింది. ప్రేమ ఆరాధనగా రూపొందిం దని సూచన. జీజీ అలౌకిక వ్యక్తనని ధ్వని.

జీజీ తోటలోకి 'నడిచింది.' అతడు అనుసరించాడు. తన ఆవేదనను ఆవేశంగా వ్యక్తం చేశాడు. పూలమొక్కలు కన్నీరు కార్చాయి. ముసలి గులాబీ, విరజాజీ, కనకాంబరం మొక్కలు తోటలోని ప్రధాన పాత్రలు. ఇవి అతనికీ ఆమెకూ మధ్యన అనుబంధవాహికలు. అతనితో ఆమె మాటలు చెప్తాయవి. కాని, ఇప్పుడవి తనను అర్థం చేసుకోవటానికి సాధనాలుగా ఉపయోగపడ్డాయి.

'నిజంగా జీవించటానికే, జీవితాన్ని ఆనందమయం చేసుకోవటానికే తనను జ్ఞాపకం వుంచుకొమ్మని' ప్రకృతి ద్వారా అతనికి బోధించి జీజీ గంగా స్రవంతి అలల్లో 'కలిసిపోయింది'.

అతని అచేతనలోకి నిష్క్రమించిందన్న మాట.

ఈ 'అంతర్నాటకం' లోని దృశ్యసంబంధ, శ్రవణసంబంధ విభ్రాంతులు4 అతని అచేతనలోకి నిష్క్రమించిన తర్వాత అతడు స్పృహతప్పి పడి పోవటం, అతని సంధిదశను సూచిస్తున్నది.

మానసికంగా పూర్తి స్వస్థత పొందటానికి, పాతజీవితాన్ని మరిచి పోయి, కొత్తజీవితాన్ని వరించటానికి ఈ సంధిదశ దోహదం చేస్తుంది.

శాంత అహర్నిశలు రాజారావుకు సపర్యలు చేసింది. ఆ విధంగా ఆమె స్థానం బలపడింది. వారం తర్వాత రాజారావుకు జీజీ శాంతగా మారినట్లు కనిపించింది5.

ఇది అతనిలో వచ్చిన మార్పే!

శాంత ఇదివరకు తన ప్రేమను చూచాయగా వెల్లడించింది. బాధ పడింది. ఇప్పుడే సేవ ద్వారా ప్రేమను ఆచరణాత్మకంగా ప్రకటించింది.

శాంత ప్రేమను అంగీకరించవలసిన బాధ్యత రాజారావు మీద ఉన్నది. అతడు తన అభిప్రాయాన్ని వెల్లడించేవరకు తన భంగపాటును పరిహరించుకోవటానికి ఆమె అవలంబించిన పద్ధతి కొంతలో కొంత అనుకూల వైఖరిగా పైకి కనిపిస్తుంది. ఆమె కుటీరాన్ని పూర్వం మాదిరిగానే చిందరవందరగా ఉంచటానికి ప్రయత్నించటంలో కొంత కొంటె వైఖరి కూడా కనిపించింది. ఈ దశలో కుటీరంలోకి ప్రవేశించిన రాజారావు ఏ మాత్రం చలించకుండా, ఎంతో నిగ్రహంతో—

"జీజీకి ఆ ఉన్నత స్థానమే బాగుంటుంది" అని అనగలిగాడు శాంతతో.

అంటే, అతనిలో పూర్తి 'పరివర్తనం' వచ్చిందన్నమాట!

ఈ నవల రచనా కాలం నాటికి సమాజం కూడా పరివర్తనదశలోనే ఉన్నది. స్థూలంగా భూస్వామ్య వ్యవస్థకూ పెట్టుబడిదారీ వ్యవస్థకూ మధ్యన సంధి దశగా భావించవచ్చు. అభ్యుదయ భాస్కర కిరణాలు విజృంభించవలసిన సమయంలో విరహహిమమేఘం దోబూచులాడటం అసంగతం. కాని, భావకవితోద్యమ ప్రభావంవల్ల 'విరహం' ఒక సంస్కారంగా వ్యాప్తిచెంది, సాహిత్యం ద్వారా యువకుల జీవితంలోకి కూడా వ్యాపించసాగింది. ప్రేమించిన యువతిని పెళ్ళిచేసుకోలేకపోయినవాడు మరో యువతిని పెళ్ళిచేసుకోలేకపోవటం, భార్యను కోల్పోయినవాడు మరో స్త్రీని పెళ్ళిచేసుకోలేకపోవటం మాత్రమేకాక మిగిలిన జీవితమంతా పాత జ్ఞాపకాలలో జీవించడానికి ఇష్టపడటం ఈ విరహ సంస్కారపు ముఖ్య లక్షణాలుగా రచయిత పీఠికలో వివరించారు. అందువల్ల ఆ వ్యక్తి జీవితం తనకుగాని, కుటుంబానికిగాని, సమాజానికిగాని ఏ మాత్రం ప్రయోజకారి కాకుండాపోతున్నది. ఇది జీవన సూత్రానికి విరుద్ధం. బలవంతంగా లైంగికవాంఛను అణచుకోవటం ప్రకృతికి వ్యతిరేకం.

ఈ నవల రచనా కాలం నాటికి గోపీచంద్ ఎం.ఎన్. రాయ్ అనుచరునిగా ప్రసిద్ధి పొందాడు. 'సెక్సు వాంఛ ప్రకృతి ప్రేరేపణ. దాన్ని మనం తీసివెయ్యలేం. మానవునికి సహజంగా వుండే వాంఛలను తీర్చుకో

వలసిందేగాని, అణగదొక్కితే ఎన్ని వెర్రితలలు వేస్తుందో ఎవ్వరు చెప్ప గలరు.' అని నవల పీఠికలో గోపీచంద్ చెప్పిన మాటలు ఎం.ఎన్. రాయ్ బ్రహ్మచర్యాన్ని ఖండిస్తూ చెప్పిన ఈ కింది మాటలను గుర్తుచేస్తాయి.

'... బ్రహ్మచర్యం విపరీత పరిస్థితులకు దారితీస్తుంది. ప్రకృతి సహజ మైన కార్యాన్ని అరికట్టటం ప్రమాదభరితం. ప్రకృతి పగతీర్చుకోకమానదు.'[6]

మరి రాజారావులో వచ్చిన 'పరివర్తనం' స్వరూపం ఏమిటన్నది ప్రశ్న.

ఇది వ్యక్తితో వచ్చిన పరివర్తనం. రచయిత సమాజంలో ఆశించే పరివర్తనం కూడా. కాలం చెల్లిన సిద్ధాంతాలకు జీవితాలను బలిచేయటం తగ దని రచయిత హితవు చెప్తున్నాడు. రాజారావు కంటే ముందు నడుస్తున్న అక్కగాని, కిష్టుడుగాని నమ్ముతున్న భావాలు వారి సొంత భావాలు కావు. సమకాలీన సంఘం నుంచి వారికి సంక్రమించిన భావాలే.

సమకాలీన జీవన సూత్రాలకు విరుద్ధంగా జీవిస్తున్న రాజారావు వంటి వ్యక్తులు మొదట్లో మార్పును వ్యతిరేకించినా, క్రమేపీ వారి మానసిక ప్రవృత్తి మార్పుకు సుముఖమవుతుందని రచయిత ఈ నవల ద్వారా ఆత్మ విశ్వా సాన్ని కలిగిస్తున్నాడు. సమకాలీన అభ్యుదయ భావాలు ఎప్పుడూ జీవితానికి అనుకూలంగా వుంటాయన్న విషయాన్ని రాజారావు రుజువు చేశాడు.

# 2. మెరుపుల మరకలు

'అసమర్థుని జీవయాత్ర'లోని సీతారామారావు పాత్ర తర్వాత 'మెరుపుల మరకలు'7లోని ఉషారాణి ప్రత్యేక వైశిష్ట్యాన్ని సంతరించుకున్న పాత్ర.

సామాన్య మానవ బలహీనతలున్న స్త్రీ, సాంఘిక నీతి దృష్ట్యా 'చెడిపోయిన' స్త్రీ. మానవాతీత వ్యక్తిగా పరిణామం చెంది 'మహా యోగిని'గా అవతరించటం ఈ నవలలోని ప్రత్యేకత.

ప్రధాన పాత్రలన్నీ ఉషారాణి చుట్టూ తిరుగుతాయి. ఫలితంగా మొత్తం కథంతా ఉషారాణి చుట్టూ తిరుగుతుంది. ఈ నవలను గూర్చి రాయటమంటే ఉషారాణిని గూర్చి రాయటమన్నమాట.

చక్రవర్తి తిరుపతిలో ఉన్న తన భార్యను తీసుకురావటానికి గాను ఉషారాణిని వదిలివెళ్లే సన్నివేశంతో నవల ప్రారంభమవుతుంది.

చక్రవర్తితో పరిచయం కలిగిన కొద్ది రోజులలోనే ఉషారాణికి విసుగు కలగటం, ఆమెలోని నిత్యనూతన అనుభవాలను రుచి చూడాలనే తత్వానికి నిదర్శనం. తన లైంగిక స్వేచ్ఛా జీవితం సాధ్యమైనంత రహస్యంగా ఉండాలనే ఉద్దేశం ఆమె కుంది. సంఘం తలుచుకుంటే తన జీవితాన్ని దుర్భరం చేసేస్తుందనే భయం కూడా ఉషారాణి ప్రవర్తనలో కనిపిస్తుంది. అందుకే ఆమెలో కొంత దాపరికం, మరికొంత జాగ్రత్త చోటుచేసుకున్నాయి.

చక్రవర్తి మూలంగా శ్రీకాంత్‌తో స్వేచ్ఛగా ఉండలేకపోవటం ఉషారాణికి అసంతృప్తినే కలిగించింది. అందువల్ల చక్రవర్తి నాలుగు రోజులు తనను వదిలివెళ్ళటం ఆమెకు సంతోషాన్నే కలిగించింది. చక్రవర్తి పట్ల ఆమెకు కలిగింది, తాత్కాలికమైన విసుగే కాని, వైముఖ్యం కాదు.

కొత్త అనుబంధం, పాత అనుబంధాల పట్ల అసహ్యం గాని, వైముఖ్యం గాని కలిగించలేకపోవటం ఉషారాణి విశిష్ట వ్యక్తిత్వానికి గుర్తు.

'ఒకే వ్యక్తిని ప్రేమించటం అనే భావం ఆమె అనుభవానికి విరుద్ధంగా వుండేది. అనుభవం వేరుగా ఉన్నప్పుడు కాగితాల మీది సిద్ధాంతాలను ఎలా నమ్మటం ?

ఇది ఆమె జీవితానుభవం నుంచి పుట్టిన భావం. ఉషారాణి మౌలిక ఆలోచనా శక్తికి పై భావం ఒక నిదర్శనం. 'అనుభవం' ఆమె దృష్టిలో జీవితానికి పర్యాయపదం. 'అనుభవం' తనను తాను తెలుసుకోవటానికి ఒక వాహిక.

ఉషారాణి లాగా గారాబంగా పెరిగిన వాళ్లలో కనిపించే ముఖ్య లక్షణాలు తమకు తోచిన కోరికలన్నీ కోరుతూండటం. కోరికలు తీరిన కొద్దీ ఏ కొత్త కోరికలు కోరధామా అనే ఆలోచనలతోనే సతమతమవుతుండటం.

ప్రతి వ్యక్తి మీద బాల్య జీవిత ప్రభావం వుంటుంది. మగ సంతానం లేకపోవటంతో తల్లిదండ్రులు ఆమెను పిల్లవాడిలాగే పెంచారు. ఉషారాణి కూడా 'మగపిల్లలతోనే ఎక్కువ ఆడుకుంటూ వుండేది. కాని ఆడపిల్లలకు తానంటే ఎక్కువగా మోజుగా వుండేది.' ఆమెలో 'తాను పురుషుణ్ణి'అనే భావం ఆమెకు తెలియకుండానే చోటుచేసుకున్నది. ఆమె తోటి స్నేహితురాళ్ళు ఆడపిల్లలలాగే పెరిగారు. కాబట్టి వాళ్ళలో సహజంగా పురుషులపట్ల ఉండే ఆకర్షణ ఉషారాణి పట్ల వ్యక్తమయ్యేదన్నమాట.

స్వసుఖం కోరి సాంప్రదాయిక నీతిని పురుషుడు సులభంగా ధిక్కరిస్తాడు. ఉషారాణి కూడా కొంత తెగింపును ప్రదర్శించి, సాంప్రదాయక నీతిని ధిక్కరించటానికి బాల్య జీవితం కూడా కారణమే.

హైస్కూల్‌లో చదువుకునే రోజులలోనే నాటకాలలో ఉషారాణి కృష్ణుని వేషం వేస్తే నిర్మల అనే అమ్మాయి రాధ వేషం వేసేది. నాటకం తర్వాత కూడా ఆమె ఉషారాణిని తన ప్రియునిగానే భావించేది. నిర్మల మూలంగా ఆమెలో ఆరాధింపబడే మనస్తత్వం ఏర్పడింది. నిర్మల మూలంగానే ఉషారాణిలో లైంగిక ప్రవృత్తి జాగృతమయింది.

ఉషారాణి పెళ్ళికి ముందు ఊహించుకున్న జీవితానికి అనుభవంలోకి

వచ్చిన జీవితానికి పోలికలేదు. రామానుజం అన్నివిధాలా ఆమెకు ఆశాభంగం కలిగించాడు. అతని పెద్దమనిషి తరహా, ఈమె చిలిపి కోరికలను తీర్చలేదు. ఎప్పుడూ తను పనిచేసే వ్యాపారసంస్థను గూర్చే ఆలోచించే రామానుజం గారికి భార్యను గూర్చి ఆలోచించే తీరికలేదు. మరి ఉషారాణి స్వభావాన్ని తెలుసుకునే ప్రయత్నం చేయగలగటం అసాధ్యం. అయినా భర్తపట్ల ఉషారాణికి సహజమైన గౌరవం ఉన్నది. భర్త దైవసమానుడనే సాంప్రదాయిక విశ్వాసం అంతర్గతంగా ఉండటం మూలంగాను, అతనిపట్ల ఏర్పడిన లైంగికాతీత దృష్టి కారణంగాను ఒక నిర్లిప్త భావం ఏర్పడింది. ఈ భావాన్నే రామానుజం 'వేదాంతపరమైన దృష్టి'గా అర్థం చేసుకున్నాడు. రామానుజం అవగాహన యాదృచ్ఛికమే అయినా హృదయపూర్వకమైంది. అందుకే తర్వాతి కాలంలో అది సత్యమేనని తేలింది. 'ఆయన మంచితనం ఆమెకు శ్రీరామ రక్ష అయింది.'

వివాహానికి పూర్వం తల్లిదండ్రుల నుంచి లభించిన ప్రేమ కరువు కావటంతో, భర్త నుంచి తాను ఆశించిన ప్రేమ లభించకపోవటంతో, నిరాశ చెంది ఉన్న ఉషారాణిని, భార్యపట్ల చక్రవర్తి ప్రదర్శించిన ఆరాధనా భావం ఆకర్షించింది. ఉషారాణి సాంగత్యం లభించిన తర్వాత అదివరకు తన భార్య పట్ల ప్రదర్శించిన ఆరాధనా భావాన్నే ఉషారాణి పట్ల కూడా చక్రవర్తి ప్రదర్శించాడు. ఉషారాణి ఊహించిందీ వాంఛించిందో కూడా అదే. అయితే, చక్రవర్తి ప్రేమ లభించిన తర్వాత ఉషారాణికి తన భర్త మీద ప్రేమ పెరిగింది. కాని చక్రవర్తికి ఉషారాణి ప్రేమ లభించిన తర్వాత తన భార్య పట్ల ప్రేమ తగ్గింది. ఇది ఇద్దరి వ్యక్తిత్వాలలో ఉన్న అంతరం. రామానుజం అనాసక్తి వల్ల ఏర్పడిన లోటును చక్రవర్తి తీర్చటంవల్ల ఉషారాణి విషయంలో భర్తలోపం కూడా తీరిపోయింది। ఇది ఉషారాణి మానసిక ప్రవృత్తిలో ఉన్న చిత్రమైన అమరిక.

హృదయం ఉన్నవాడు కావటంవల్ల, ఉషారాణితో సంబంధం పెట్టుకోవటం ద్వారా తన భార్యకు ద్రోహం చేస్తున్నాననే బాధ చక్రవర్తికి ఒక మూల ఉండనే ఉన్నది. అందువల్ల అతడు అపరాధ భావనకు లోనయ్యాడు.

హైదరాబాద్ రాగానే సంసారాన్ని పునరుద్ధరించే యత్నంలో భార్య పురమాయించిన పనులు చక్రవర్తికి విసుగు కలిగించాయి. ఉషారాణితో అతనికి కలిగిన గాఢానుబంధం భార్యపట్ల పరాయిదృష్టి ఏర్పరిచిందనటానికి ఈ విసుగు నిదర్శనం.

శ్రీకాంత్‌తో పరిచయం ఉషారాణి జీవితంలో రెండవ మజిలీగా చెప్పుకోవచ్చు. శ్రీకాంత్‌లో ప్రేమికుని లక్షణం కంటే కాముకుని లక్షణం ఎక్కువ చక్రవర్తి ఆరాధనాభావం అంతరంగంలో అణగిన తన కోరికలకు రెక్కలు తొడిగితే, శ్రీకాంత్ కామావేశం లైంగికసంతృప్తిని కలిగించింది.

శ్రీకాంత్ ఉండగానే అనుకోకుండా చక్రవర్తి వచ్చిన సన్నివేశంలో ఉషారాణి ప్రవర్తనను, ఆమె విలక్షణత్వానికి నిదర్శనంగా భావించవచ్చు. ఇద్దరూ ఎవరికివారే ఆమెమీద హక్కు ఉన్నట్లుగా భావిస్తారు. ఇద్దరిలోనూ సమానంగా ఉన్న పురుషాధిక్యభావానికిది నిదర్శనం. నిజానికి ఈ పరిస్థితిలో ఉషారాణికాక మరొక స్త్రీ ఉన్నట్లయితే చాలా ఇబ్బంది పడేది. కానీ, ఉషారాణికి___

'ఈ పరిస్థితి చిత్రంగా వుండి మనస్సుకు గమ్మత్తుగా వుంది'.

బాల్యంలో మాత్రమే కనిపించేది. అపరాధ భావానికి లేశమాత్రం ఆస్కారంలేనిదీ అయిన ఆమెలోని అమాయికపుటాలోచననా ధోరణికీ, చిలిపితనానికీ ఇది నిదర్శనం ఈ ధోరణికి ఆమెలోని నిజాయితీయే కారణం.

చక్రవర్తి జీవితంలో ఉషారాణితో సాంగత్యం అనుకోని మొదటి సంఘటన కాగా, శ్రీకాంత్‌తో కూడిన ఉషారాణిని చూడటం రెండో సంఘటన. ఈ రెండో సంఘటన చక్రవర్తిని విపరీతమైన సంఘర్షణకు లోనుచేసింది. ఉషారాణి తెలివితేటలతో తనను మోసం చేసిందని భావించిన తర్వాత, ఆమె నిజస్వరూపాన్ని తాను గుర్తించానని అతడు ప్రకటించదలచాడు. ఉషారాణి తననేకాక శ్రీకాంత్‌నూ, రామానుజాన్నీ మోసగించింది. ఈ వ్యవహారంలో ఆమెదే పైచేయిగా ఉండటం చక్రవర్తి పురుషాహంకారం సహించలేదు. తాను తలచుకుంటే రామానుజంతో ఈ విషయం చెప్పగలడు. ఉషారాణి జీవితాన్ని

ఛిన్నాభిన్నంచేసే శక్తి తన చేతుల్లో వున్నందుకు ఆమె తన దయమీద ఆధారపడి వుండాలనే భావం కూడా వుంది. అయితే, ఆమెను చూడాలను కోవటం, ఆకర్షణను పూర్తిగా జయించలేక పోవటమేనని అతడా ఆవేశంలో గుర్తించలేదు.

ఈ సన్నివేశంలో చక్రవర్తిని లైంగికంగా వశపరచుకోవటం ద్వారా ఉషారాణి అతణ్ణి యథాపూర్వక స్థితికి తీసుకురాగలిగింది. ఈ దశలో చక్ర వర్తి తనతో సంభోగించటమంటే, శ్రీకాంత్‌తో తనకుగల లైంగిక సంబం ధాన్ని ఆమోదించటమేనని కూడా ఉషారాణి భావించింది. చక్రవర్తి ఊహకు భిన్నంగా ఉషారాణి స్థితి పైచేయిగా మారింది.

"శ్రీకాంత్ నాతో స్నేహంగా వుంటున్నాడని నువ్వింత బాధపడు తున్నావే, మరి రామానుజంగారి సంగతి నీవెప్పుడైనా ఆలోచించావా ? పైగా ఆయన నాభర్త" అన్నది ఉషారాణి.

ఇది, చక్రవర్తి మెత్తబడగానే అతవి ఆయువుపట్టుమీద తీసిన దెబ్బ ఆవేశం చల్లారింది. అతనిలో సరియైన ఆలోచనకు దారి ఏర్పడింది. కాని, వెంటనే తన ప్రత్యేకత నిలబెట్టుకోవటానికీ, 'తనది ప్రేమ, ఆమెది కామం' అని నిర్ధారణ చేసుకోవటానికీ ప్రయత్నించాడు. చక్రవర్తిలో భావకవుల ప్రణయతత్వం వుంది. దాన్నే భార్యపట్ల ఉన్న ఆరాధనాభావంతో జోడించి ఉషారాణి పట్ల ప్రదర్శించాడు. కాని, ఇప్పుడు ఉషారాణి మూలంగా అతని ప్రణయారాధన దెబ్బతిన్నది.

తనకూ శ్రీక్రాంత్‌కూ పోలికేలేదని భావించే చక్రవర్తి తనవ్యక్తిత్వ ఔన్నత్యాన్ని నిరూపించుకోవటానికి పూనుకున్నాడు. నిజానికి శ్రీకాంత్ తన కంటే ఏవిధంగా తక్కువవాడో అతడు వివరించవచ్చు కాని, ఉషారాణి తన కంటే తక్కువవాడితో సంబంధం పెట్టుకున్నందుకు ఎంతగా దిగజారిందో చెప్పటం అతని అప్పటి మానసికస్థితికి అనువుగా ఉండటంతో ఆమెను వ్యభి చారిణిగా చిత్రించి కసితీర్చుకున్నాడు.

ఉషారాణిని మానసిక హింసకు గురిచేయాలనుకున్న చక్రవర్తి కోరిక నెరవేరలేదు. ఉషారాణి పథకం ప్రకారం చక్రవర్తిని ఈ సన్నివేశంలో

ఎదుర్కొన్నది. ముందుగా అతని కోపం బహిర్గతమయ్యే అవకాశం ఇచ్చింది. శ్రీకాంత్‌తో తనకున్న సంబంధాన్ని చక్రవర్తికి అలవాటు చేయాలను కున్నది. అంతేకాని, సంబంధాన్ని తెంచుకోవాలని అనుకోలేదు.

తానై తానుగా అనుబంధాలను తెంచుకునే దశను ఆమె ఇంకా అందు కోలేదు.

శ్రీకాంత్‌తో తనకున్న సంబంధం పాతబడినదృష్ట్యా చక్రవర్తి పట్ల ప్రేమ పెరగటం ఆమె ప్రత్యేక మానసికస్థితికి సహజమైన అంశమే. అతడూ తన ఆకర్షణ నుంచి తప్పించుకోలేడనే అతివిశ్వాసం కూడా ఉషారాణిలో కని పిస్తుంది.

ఉషారాణికి చక్రవర్తి పట్ల లైంగికవాంఛ పెరిగింది. ఇందుకు ఆరాత్రి ఆమెకు వచ్చిన కలే నిదర్శనం. ఆకలలో అనేక దృశ్యాలను చూస్తూ, పక్కనే పడుకున్న భర్త వక్షస్థలాన్ని నిమిరింది. అంతేకాదు, 'చేతులు ప్రక్కలకు బారులు చాచి వెల్లకిలా పడుకొని, శరీరాన్ని సడలించింది. పావు రాయివలె కంఠంలోనే గురగుర శబ్దం చేసింది.' లైంగికసంపర్కానికి ఆమె సమాయత్తం కావటాన్ని సూచించే మాటలవి.

ఆ తర్వాత కలలో

'....మందర పర్వతాన్ని మోసుకొచ్చి సముద్రం మధ్యన నిలిపి ఆది శేషుని కవ్వపు తాడుగాచేసి సముద్రాన్ని మథించనారంభించారు. ఒకవైపు దేవతలు, మరోవైపు దానవులు పోటీపడి లాగుతున్నారు. ఆమె శరీరం అమృతవాహినిలో తేలిపోయింది.'

మందరపర్వతం లింగానికి ప్రతీక. దేవతలూ రాక్షసులూ పోడీపడటం తనకోసం చక్రవర్తీ శ్రీకాంత్‌లు పోటీపడటమే. మథనం లైంగికక్రియే. ఆ 'ఆనందం' లైంగికానందమే, చక్రవర్తీ శ్రీకాంత్‌లు తనకోసం ఇంకా పోటీ పడాలనీ, ఆ పోటీనుంచి తాను ఆనందాన్ని పొందాలని ఆమెలోని 'అభిలాష'. కల ఆ అభిలాషను సూచిస్తున్నది.

వ్యక్తి ఒక్కసారి ఒక్కరినే ప్రేమిస్తాడన్నది చక్రవర్తి అభిప్రాయమైతే, ఒకవ్యక్తి ఒకేసారి ఎందరినైనా ప్రేమించవచ్చునన్నది ఉషారాణి అభిప్రాయం. వాళ్ళిద్దరూ మౌలికంగా విభేదించిన అంశమిది. ఉషారాణి అభిప్రాయాన్ని అతడు ఖండించాడు కాని, 'తనకు అప్పుడప్పుడు అలాగే అనిపిస్తూ వుంటుంది.' అయితే, యీ 'అనిపించటం' ఒక విశ్వాసంగా పరిణామం చెందలేదు. దీనిని బట్టి ఉషారాణి స్థాయికన్నా అతని స్థాయి చిన్నదని తెలిపోయింది.

ఫ్రెంచివారి జీవిత విధానంలో వచ్చిన మార్పులను గురించి అతడు ఆలోచించాడు. ఆ దేశంలో సలింగ కామప్రవృత్తి (Homo - Sexuality) ప్రబలటం వల్ల—

'రాబోయే మానవసంఘానికి ఈ విధంగా మనస్సు విశాలపడటం పునాది కాదుగదా !' అని అనుకున్నాడు ఒక స్త్రీ, ఒక పురుషుడు వివాహబంధంలో కట్టుబడి జీవించటానికి బదులు, ఇద్దరు స్త్రీలు గాని, ఇద్దరు పురుషులు గానీ కలిసి జీవించటంలో వివాహవ్యవస్థ దెబ్బతింటుందనీ, ఆ తర్వాత స్త్రీ పురుషులు కూడా స్వేచ్ఛగా జీవించటానికి దారి ఏర్పడుతుందనీ భావించటమే చక్రవర్తి ఊహకు ఆధారంగా కనిపిస్తున్నది.

సాధారణంగా యుద్ధాల మూలంగా, జైలుశిక్షల మూలంగా లేదా ఇతర నిర్బంధ కారణాల మూలంగా స్త్రీలుగాని, పురుషులుగాని ఎక్కువ కాలం పాటు కలిసి ఉండవలసివచ్చినప్పుడు సలింగకామ ప్రవృత్తి పెరుగుతుంది. ఇంకా అనేక వైయక్తిక కారణాలు కూడా అరుదుగా ఈ ప్రవృత్తిని ప్రోత్సహించవచ్చు. కాని ప్రాథమికంగా ఇది అసహజమైనది. అందుకే. విపరీతమైనది. నిజమైన స్వేచ్ఛా ప్రవృత్తికే, తద్వారా జీవనవికాసానికి ఒక అసహజ విపరీత ప్రవర్తన దోహదం చేయజాలదు. రేపటిసమాజం సలింగ కామ ప్రవృత్తిని ఆమోదించినా అప్పటి సమస్యలు అప్పుడు ఉండక తప్పవు. 'కామం' ఉన్నంత కాలం స్త్రీ అవసరం పురుషునికి, పురుషుని అవసరం స్త్రీకి ఉండక తప్పదు.

ఉషారాణి దూరం కావటంకోసం తనను తాను సంసిద్ధపరచుకుంటున్న

చక్రవర్తికి ఈ ఆలోచనాధోరణి ఒక మానసికావసరంగా పనికివచ్చిందని చెప్పవచ్చు.

ఈ సందర్భంలో చక్రవర్తికి, తెలిసీ నపుంసకుణ్ణి వివాహమాడి కాపురం చేసిన స్త్రీ కథ 'సాహిత్యం'[8] గుర్తుకు వచ్చింది. సార్త్రే రాసిన ఈ కథలో సాంప్రదాయక జీవన విధానానికి భిన్నంగా ఉండే పద్ధతులను ఆవిష్కరించే యత్నం కనిపిస్తుంది. ఒక స్నేహితురాలి ప్రోత్సాహంతో కథానాయిక 'లులు' నపుంసకుడైన భర్త హెన్రీని వదులుకోవటానికి సిద్ధపడుతుంది కాని వదులుకోలేక భర్తను తిరిగి చేరుకుంటుంది. గోపీచంద్ సూచించలేదు కాని, లులుకు ఒక ప్రియుడున్నాడు. అతనితో కలిసి జీవించాలనే కోరిక కూడా ఆమెకున్నది. ఒక విధంగా లులుకు ఆమె భర్త పట్ల ఉన్నది. రాగద్వేషాలతో కూడిన 'Ambivalence'[9] అన్న భావమే.

ఆ తర్వాత 'మనం ఏనాడూ గ్రంథస్థం అవటానికి అర్హమని ఊహించలేని జీవితాన్ని సార్త్రే వర్ణించాడు. అదే వాస్తవిక జీవితం అంటాడు సార్త్రే' అని గుర్తుకుతెచ్చుకున్నాడు, చక్రవర్తి.

ఈ ధోరణి గల నవలా ప్రక్రియనే సార్త్రే 'Anti-Novel'[10]గా గుర్తింపు కూడా వచ్చింది.

'ఇప్పటికీ సాహిత్యం జీవితపు ఉపరితలాన్ని కూడా శోధించలేద'ని ఆ రచయితల భావం.

ఈ సాహిత్య సిద్ధాంతం గానీ, సార్త్రే అస్తిత్వవాదం గానీ చక్రవర్తికి నచ్చలేదు. వారిది అవినీతిపరులు వక్రసిద్ధాంతంగా చిత్రించి, తన అవినీతిని దాచుకున్నాడు.

ఈ విషయాలేవీ తెలియనిదానిలా కనిపించినా ఉషారాణి వాటిని అధ్యయనం చేసినట్లుగా, వాటిపట్ల ఆమెకు సదభిప్రాయం ఉన్నట్లుగా ఇప్పుడిప్పుడే చక్రవర్తికి రూఢి అయింది.

ఈ స్థితిలో అతని ముందు రెండే మార్గాలున్నాయి. ఒకటి—ఉషారాణితో సంపర్కం ఏర్పడకముందున్న జీవితాన్ని పునరుద్ధరించుకోవటం. రెండు—ఉషారాణితో సంపర్కాన్ని కొనసాగించటం.

ఈ సంఘర్షణ నుంచి తనకు విముక్తి ప్రసాదించి, 'మనస్సుకి శాంతి' చేకూర్చేది పాత జీవితమే అన్న నిర్ణయానికి చక్రవర్తి వచ్చాడు. ఈ నిర్ణయం అతనిలోని సంప్రదాయ శక్తికి విజయం.

ఈ దశలో చక్రవర్తికి కారు ప్రమాదాన్ని కల్పించటాన్ని గోపీచంద్ రచనా శిల్పజ్ఞతకు మచ్చుగా చెప్పొచ్చు. ఈ సన్నివేశంలోని పదజాలం సాంకేతికంగా వుంది.

'ఇంటి సమీపానికి వచ్చాడు.'

అంటే, ఉషారాణితో పరిచయానికి పూర్వజీవితానికి ముఖ్యంగా భార్యకు దగ్గరకావటం.

'మలుపు తిరిగాడు.'

ఇది అతని జీవితంలోని ముఖ్య పరిణామం.

'స్పృహతప్పి పడిపోవటం' సంఘర్షణలో నలిగి సంధిదశను చేరుకోవటం.

చక్రవర్తిలో మానసిక ప్రక్షాళన జరగటానికి వీలుగా రచయిత 'ప్రమాదాన్ని' కల్పించాడు.

ఉషారాణి చక్రవర్తిని పరామర్శించటానికి వచ్చినప్పుడు చక్రవర్తి మగతనిద్రలో వున్నాడు. వాళ్ళ అనుబంధం ఏకపక్షం అయిందని సూచన.

ఉషారాణికి రామానుజంతో దాంపత్యం కొంత అసంతృప్తిని కలిగించింది. కాని, పరపురుషులపైకి దృష్టిపోవటానికి ఈ అసంతృప్తికి పెద్దగా సంబంధం లేదని చెప్పవచ్చు. ఎందుకంటే, చక్రవర్తివల్ల పూర్తి సౌఖ్యం లభించినా ఆమె దృష్టి శ్రీకాంత్ వైపు మళ్ళింది. అలాగే, చివరి దశలో పద్మ భర్త కమలాకరం పైకి కూడా.

ఇలా పరపురుషుల పైకి దృష్టి మళ్ళటానికి కేవలం లైంగిక వాంఛ మాత్రమే కారణంకాదు. ఉషారాణిలో మొదటి నుంచి ఆమెకే తెలియని ఒక అజ్ఞాత ఆనందానుభూతికోసం అన్వేషణ కనిపిస్తుంది. ఆ అన్వేషణలో భాగంగా

ఆమె లైంగిక సౌఖ్యాన్ని ఆహ్వానించింది. అనుభవించింది. ఆమెతో సంపర్కం పెట్టుకున్న వాళ్లు కూడా గొప్పవాళ్ళు కారు. చక్రవర్తి సంస్కారం వున్న మధ్య తరగతివాడు. శ్రీకాంత్ సాధారణమైన మగవాడు. ఇక పోతే, కమలాకరం సహృదయుడైన ఆధునికుడు.

ఎదుటి వాళ్ళ గొప్పదనంతోగానీ, ప్రత్యేకతతోగానీ ఆమెకు పెద్దగా సంబంధంలేదు. వాళ్ళ సాంగత్యంలో తాను పొందే అనుభూతి ఆమెకు ముఖ్యం.

ప్రమాదం నుంచి కోలుకున్న తర్వాత కూడా చక్రవర్తి రాకపోవటంతో, అతణ్ణి ఆకర్షించటానికి ఉషారాణి రచించిన ప్రేమలేఖల్లోని వస్తువు 'విరహం'. ఇది అతనిలోని ప్రణయారాధనా భావానికి ఉషారాణి వేసిన గాలం. అయితే, ఈ విరహం ఉషారాణిలోని 'నిజంగా తీరని కోరికకు సంకేతం. ఉషారాణిలో నిగూఢంగా వున్న సృజనాత్మకశక్తి ఈ లేఖల రూపంలో బహిర్గతం కావటం ఒక కొత్త అంశం. ఈ సృజనాత్మకశక్తి ఆమె అంతరంగానికి సంబంధించిన రహస్యం. లౌకిక జీవితమనే బెరడు మాటున దాగివున్న సున్నితమైన వస్తువు. ఇది ఆమెలో నిగూఢంగా ఒక అధ్యాత్మికలోకం వున్నదనటానికి కూడా ఒక సంకేతం.

ఆమె వ్యక్తిత్వం ఉన్నతమైందనీ, ఆమెలో తనకు తెలియని అద్భుతాలెన్నో దాగి వున్నాయని చక్రవర్తి గుర్తించాడు. లేఖలను చదివి తనను కలుసుకున్న దశలో చక్రవర్తిని చూసి ఆమె ఆశ్చర్యపోయింది. అంతకు ముందు అతనిలో ఆమెకు కనిపించిన వ్యామోహం ఇప్పుడు కనిపించలేదు. అతనిలో నిర్మలమైన స్నేహం వెలుగుతున్నది:

'చక్రవర్తిలో వచ్చిన మార్పు ఆమెను పైకి బాధపెడుతూనే వున్నా, హృదయాంతర్గతమైన ఏ పొరకిందో అనిర్వచనీయ ఆనందం పొరలుతున్నట్లు స్ఫురించి, ఆమెను చకితురాలను చేసింది.'

'పైకిబాధ' మానసికమైందీ, లైంగికమైందీ అని చెప్పొచ్చు. 'అనిర్వచనీయానందం'? అంతర్గతమైన అధ్యాత్మిక లోకానికి సంబం

ధించింది. చక్రవర్తిలోని మార్పుకు ఆమే కారణం. అయితే, 'హృదయాంత ర్గతమైన ఏ పొరకిందో' పొరలుతున్న ఆనందాన్ని మొదటిసారి ఆమె అనుభవంలోకి తెచ్చినవాడు చక్రవర్తి.

కమలాకరంతో పరిచయం ఉషారాణి జీవితంలో కొత్త మలుపు. హిమాలయాలను చూడాలనే కుతూహలం ఆమెకు చాలా కాలంగా ఉన్నది. ఢిల్లీ చూడాలనిపించటం ఎవరికైనా సహజమే. అయితే, హిమాలయాలను చూడాలనిపించటం, ఆమె ఆధ్యాత్మిక గమ్య స్థానానికి సంబంధించిన అవ్యక్త వాంఛ యొక్క విన్యాసమే.

కమలాకరం ఉషారాణికి ఆగ్రాలోని చారిత్రక కట్టడాలను చూపించాడు. చూపించటమే కాదు ఎన్నో చారిత్రక విశేషాలను వివరించి చెప్పాడు. కాలపు లోతుల్లోకి వెళ్ళటం ద్వారా, అంతరంగపు లోతులను స్పృశించటం చక్కని శిల్పం.

ఆగ్రా నుంచి తిరుగు ప్రయాణంలో ఉషారాణితో కమలాకరం చర్చించిన విషయాలు, ఇదివరకు చక్రవర్తి పరంగా రచయిత చేసిన చర్చకు కొనసాగింపుగా కనిపిస్తున్నాయి.

కమలాకరం, తనకు నచ్చినదేశం ఫ్రాన్స్ అని చెప్పి, ఆదేశ ప్రజలకు "జీవితం అనుభవించటం చేతనైనంతగా మిగిలిన వాళ్ళకు చేతకాద"న్నాడు. వారు వైవాహిక విధానాన్ని పవిత్రంగా చూడకపోవటాన్ని సమర్థిస్తూ "...మనలో మాత్రం పురుషులు వివాహాన్ని పవిత్రంగా చూస్తున్నారా ? అంటూ, "బహు భార్యలను చేసుకోవటం, ఇష్టం వచ్చిన స్త్రీని వుంచుకోవటం...." వంటి వాటిని గుర్తుచేశాడు.

అంతేకాదు,

"....క్రమక్రమేణా వివాహంలో మార్పులు వచ్చి, చివరికి వివాహం అవుసరంలేని దశకు సంఘం రావచ్చు."నని కూడా ఊహించాడు.

కమలాకరం ప్రకటించిన భావాలన్నీ ఉషారాణి వ్యక్తావ్యక్తంగా విశ్వసించేవే. కాని, కమలాకరంతో వివరంగా చెప్పించుకోవాలని—

వివాహంలేని దశ....“మృగదశే కదా” అన్నది.

“....ఒక్క మృగదశకు చెందినదేకాదు, దేవతల దశకు చెందింది కూడా.” అంటాడు. వివాహ వ్యవస్థ లైంగిక వాంఛను తీర్చుకోవటానికి గాను ఏర్పడిందనీ, మొత్తం సాంఘిక వ్యవస్థ మీదనే పురుషాధిక్యం ఏర్పడినందు వల్ల వివాహ వ్యవస్థ మీద కూడా పురుషాధిక్యం బలపడిందనీ, తత్ఫలితంగా ద్వంద్వప్రమాణాలు ఏర్పడ్డాయనీ కమలాకరం విశ్వాసం. విడాకుల వంటి సంస్కరణలు వివాహం అవసరంలేని స్థితికి సంఘం చేరుకునేందుకు దోహదం చేయగలవని కూడా కమలాకరం నమ్ముతాడు. అతని భావాలు ఎవరినో అనుకరిస్తున్నట్లుగాకాక ఒక మౌలిక ఆలోచనాపరుని భావాలే అనిపిస్తాయి.

కమలాకరం ఊహిస్తున్నది ఫ్రాన్స్ దేశపు వివాహ వ్యవస్థ భవిష్యత్తునా ? భారతదేశపు వివాహ వ్యవస్థ భవిష్యత్తునా ? అంటే ప్రపంచ వివాహ వ్యవస్థ భవిష్యత్తునే అని సమాధానం చెప్పుకోవలసి వుంటుంది. కేవలం వివాహ వ్యవస్థను ఒక ప్రత్యేకాంశంగా విడిగా పరిశీలిస్తే ఈ సమస్య తేలేది కాదు. సంఘం, కుటుంబం, వివాహ వ్యవస్థ — ఇవి అవినాభావ సంబంధం కలవి. సంఘంలోని అసమానత్వానికి ఏ శక్తులు కారణమో, ఆ శక్తులే కుటుంబంలోనూ, స్త్రీ పురుష సంబంధాలలోనూ అసమానత్వానికి మూలం. ఈ ఆర్థిక సామాజిక శక్తులతో నిమిత్తంలేని స్వేచ్ఛ నిజమైన స్వేచ్ఛకాదు. ఒకరిద్దరు స్త్రీలు సంఘానికి అతీతంగా ప్రవర్తించటం కొత్త విషయం కాదు. కమలాకరం మానసిక స్వేచ్ఛకు ప్రాముఖ్యం ఇస్తున్నాడు. అతని భావాల ప్రకారం ఉషారాణి ‘దేవతల దశ’లోనే వుంది. మానసికంగా తనకు ఇంత సన్నిహితంగా వచ్చిన కమలాకరంతో ఉషారాణికి లైంగిక సంపర్కం కలగటం ఆశ్చర్యమేమీ కాదు. వివాహవ్యవస్థకు సంబంధించిన చర్చకు పర్యవసానం, ఆ వ్యవస్థ కట్టుబాట్లను అతిక్రమించటమే.

‘రెండు మేఘాల ఘర్షణలో మెరుపు మెరిసింది.’ ఆ మెరుపులోని క్షణిక కాంతి ఉషారాణి లోలోతుల్లోకి ప్రవహించింది.

కమలాకరంతో అనుబంధం ఏర్పడిన తర్వాత శ్రీకాంత్‌తో సంబంధం

తెగిపోవటం యాదృచ్ఛికం కాదు. ఉషారాణికి లైంగిక ప్రవృత్తి పట్ల అసహ్యం కలగటానికి రచయిత ఉద్దేశించిన పరిణామమిది.

'ఫెళ్ళున ఒక చెంపదెబ్బ వేశాడు. పొత్తికడుపు మీద ఒక చరుపు చరిచాడు. భుజం మీద ఒక గుద్దు గుద్దాడు' శ్రీకాంత్.

ఇంతకుముందు, కమలాకరం ఉషారాణి చర్చించుకున్నప్పుడు ప్రస్తావనకు వచ్చిన మృగదశకు చెందినవాడిలా ప్రవ-ర్తించాడు. శ్రీకాంత్. శ్రీకాంత్ ఆవేశపరుడు. అందుకే, అతని పశ్చాత్తాపం కూడా ఆవేశంతో కూడిందే చక్రవర్తి లాగా కొత్త మానసిక పరిపక్వతను పొందటానికి అనుకూలమైన మనఃస్థితి శ్రీకాంత్‌లో లేదు. అతనికి శరీరం ముఖ్యం. ఉషారాణి శరీరం దూరమైతే, ఉషారాణి దూరమైనట్లే.

కమలాకరంతో అనుబంధం ఉషారాణి జీవితంలో ముఖ్యమైనది.

'తనకు తెలిసిన వ్యక్తుల్లో సత్యానికి కమలాకరం వున్నంత చేరువగా మరెవ్వరూ లేరు అందుకనే, అతను తన మీదకు యితరుల ప్రసరింపలేని ఒక కాంతిని ప్రసరించగలిగాడు.'

మౌలిక వస్తువు ఆమెలోనే ఉన్నది. కాని, చీకట్లో కాంతిని ప్రసరించి వ్యక్తావ్యక్తంగా చూపించినవాడు కమలాకరం.

ఇదివరకు రామానుజంగారూ, చక్రవర్తీ శ్రీకాంత్‌లూ ఆమెకు లైంగిక సౌఖ్యం అందజేసినా, సంతృప్తికరమైన మానసిక అనుబంధాన్ని ఇవ్వలేకపోయారు. ఒక్క సందర్భంలో మాత్రం చక్రవర్తి 'అనిర్వచనీయ ఆనందం' ఆమె అనుభవంలోకి తెచ్చాడు. కమలాకరంతో సంబంధంవల్ల, మానసిక అనుబంధపు అవసరం, లైంగిక సంబంధపు అవసరం-రెండూ తీరాయి. కమలాకరంతో సంపర్కమే అమె జీవితంలో చివరిది కావటం యాదృచ్ఛికం కాదు.

'కామము పూర్తిగా నశించితేగాని-పైకి కనబడే ప్రపంచమంతా ముహూర్తకాలములో కనబడకుండాపోవునది, అని బాధపడదు.'12 అని హిందూ అధ్యాత్మికవాదం విశ్వసిస్తున్నది.

ఉషారాణి ఢిల్లీ నుంచి హిమాలయాలపైకి చేసిన ప్రయాణం నీచస్థితి నుంచి ఉన్నత స్థితికి ప్రస్థానం.

ఆవేశంతో కూడిన హిమాలయాల వర్ణన, ఉషారాణి ప్రస్థానానికి అనుకూలమైన వాతావరణాన్ని సృష్టించింది.

ఆమె హృషీకేశ్‌లోని కరుణానంద స్వాములవారి ఆశ్రమంలోకి ప్రవేశించింది. స్వాముల వారిని చూస్తుంటే ఆమెకు శరీరంలోకి విద్యుత్ప్రసారం జరిగినట్లనిపించింది. ఉషారాణికిది మొదటి ప్రత్యక్షానుభూతి. గత క్షణంవరకు జరిగిన వాటినన్నింటిని మరిచిపోయి, ఈ క్షణంలో కొత్త పుంతలలో జీవించగల అపురూపమైన ప్రవృత్తి ఉషారాణిది. మంచిచెడ్డల ప్రమేయంలేదు. సుఖదుఃఖాల ప్రసక్తిలేదు. దేన్నైనాసరే అనుభవించటానికే ఆమె సంసిద్ధురాలు.

'ఆమె మనస్సు పూమొగ్గ వికసించినట్లు వికసించింది. మంచుబిందువులను విదిలించింది. సుగంధ పరిమళాలను విరజిమ్మింది. ఆమెకాళ్ళు తీసుకెళ్లిన చోటుకల్లా నడిచింది.'

ఉషారాణి ప్రకృతిలో భాగమైందని రచయిత సూచిస్తున్నాడు. ఉషారాణి 'నడక' మారింది.

ఉషారాణికి జ్వరం వచ్చింది. జ్వరం తగ్గటానికి శరీరానికి ఏదో లేపనం పూశారు. ఆ నిద్రలో కూడా, కరుణానందస్వాములవారే ఆ లేపనం పూశారని ఆమె గుర్తించింది. ఇది త్వగింద్రియ నైశిత్యం. ఇంకా కొంత శారీరకస్పృహ ఆమెలో మిగిలే వుందనటానికి ఇది నిదర్శనం.

క్రమంగా, ఉషారాణిలో మానసిక ప్రక్షాళన జరిగింది. మనసును మర్కటంతో పోల్చి, మనిషి పతనానికి మనసే కారణ13మని వేదాంతులు చెప్తుంటారు.

ఈ ప్రయాణంలో ఆఖరి మజీలి నుంచి క్లిష్టమైన ప్రయాణం చేసి, ఉషారాణి గంగోత్రికి చేరుకోవటం సాధనదశలో ఒక భాగంగా భావించవచ్చు.

అక్కడ—

'మంచును పూర్తిగా కరిగించుకొని, అనాడే గంగాభవాని నిండుగా ప్రవహిస్తూ వుంది.

సరిగా ఉషారాణి అంతరంగగంగకు అద్దంపట్టే వర్ణన ఇది. 'గంగ పాపనాశని' అన్న సాంప్రదాయిక విశ్వాసాన్ని ఆధారంగా చేసుకొని, ఉషా రాణి పాపాలను నాశనంచేసే శక్తి గంగకే వుందని రచయిత ఉద్దేశం భక్తులు పూజిస్తున్నారు. అకుదొన్నెలో నూనెపోసి, వత్తివేసి వెలిగించి గంగాభవాని లోకి వదులుతున్నారు.

ఆ 'దృశ్యాన్ని వీక్షించినంతనే ఉషారాణి హృదయం తన్మయత్వంతో ఉప్పొంగిపోయింది.' అప్పుడే వెలిగి, ప్రవాహాన్ని వెలిగిస్తున్న దీపాలలో తనలోవెలిగిన ఆధ్యాత్మిక జ్యోతిని దర్శించగలిగిందని రచయిత సూచిస్తు న్నాడు.

గంగాలయం చేరుకున్న తర్వాత ఉషారాణికి కలిగిన 'అలౌకికానంద పారవశ్యం' ఆధ్యాత్మికవాదులు చెప్పే 'మైమరపే'14 (Trance or Ecstasy). ఇది తాత్కాలికమైనదే. అప్రయత్నపూర్వకంగా కలిగేదే, తప్ప సాధకుడు తలచుకున్నప్పుడల్లా అనుభవించగలిగేది కాదు. యోగి ఎంతో సాధన తర్వాత సాధించే 'సమాధి' దశమాత్రం అతని సంకల్పానికి లోబడి వుంటుందని ఆధ్యాత్మికవాదులు భావిస్తారు. ఈ దశవైపే ఆమె అడుగు వేసిందన్న అభిప్రాయాన్ని కొంత ప్రతీకాత్మకంగా సాగిన వర్ణనద్వారా రచయిత తెలియజేశాడు

మానవప్రపంచం కీకారణ్యమైతే, లౌకిక బంధాలు సాలెగూడు వంటివి. ఆ బంధాలనన్నింటినీ ఆమె తెంచుకోగలిగింది. అప్పుడే ఆమె ముందుకు అడుగు వేయగలిగింది.

'అవతల పెద్ద పర్వత శిఖరాగ్రం వుంది.'

ఇది ఆమె చేరుకోవలసిన గమ్యం ఇప్పటికి ఒక్క అడుగే – వేసింది. ఎంతో ప్రయాణం మిగిలివుందనే సూచన.

ఆమె నెమ్మదిగా పురోగమించింది.

'ఆమె చేతిలో 'తోలుసంచి' ఒకటి వుంది దాని మీద 'స్త్రీలకు ప్రత్యేకం' అనే అక్షరాలు చెక్కబడి వున్నాయి వరుసగా పది మెట్లు ఎక్కగానే చేతిలోని సంచి కరిగి అదృశ్యమైంది. ఆమె ధరించిన దుస్తులు అదృశ్యమైనయ్'.

'తోలుసంచి' శరీరానికి ప్రతీకగా రచయిత ఉద్దేశించినట్లు కనిపిస్తోంది. పురోగమనంలో ముఖ్యమైన అంశం ఆమెకు స్త్రీ పురుషాతీతదృష్టి అలవడటం తనలోని స్త్రీత్వాన్ని జయించటం.

ఆ తర్వాత—

'ఏదో మహత్తరశక్తి ఆమెను ముందుకు తోసింది.'

దైవశక్తి తోడ్పడటంతో ఆమె

'శిఖరాగ్రం మీదకు చేరింది.'

ఆమె చుట్టూ గుమిగూడి వున్న జనులకు అది స్పృహ తప్పటమే. కాని, కరుణానందస్వాముల దృష్టిలో నిజమైన స్పృహలోకి రావటం. ఆమెకు 'విముక్తి అయినది' అని అయన వ్యాఖ్యానించారు. ఈ వ్యాఖ్యానం ఆమె చేరుకున్న 'శిఖరాగ్ర' స్వరూపాన్ని తెలియజేసేదిగా ఉన్నది. ఈ 'విముక్తి' 'జీవన్ముక్తి' కాదు. కేవలం బంధవిముక్తే. సాధనవల్ల ఆత్మసాక్షాత్కారం, ఆత్మసాక్షాత్కారం వల్ల 'సిద్ధి' లభిస్తుందనీ ఆధ్యాత్మికవాదులు విశ్వసిస్తారు. సిద్ధికే మరో పేరు ముక్తి. ఈ ముక్తిని సాధించిన తర్వాత కూడా యోగి జీవించి ఉండవచ్చు. ఆ దశను 'జీవన్ముక్తి'15 అంటారు. హిందూ ఆధ్యాత్మిక విశ్వాసాల ప్రకారం ధర్మార్థకామమోక్షాలనే చతుర్విధ పురుషార్థాలలో చివరిదే 'ముక్తి'.16 ఈ దశను ఉషారాణి ఇంకా చేరుకోవలసి ఉంది.

హిమాలయాల వర్ణనతో ప్రారంభమైన ఈ భాగం మొత్తం నవలలో ఉత్తమమైన రచన గోపీచంద్ గొప్ప ఆవేశంతో రచించిన భాగమిది. హిమాలయాలకు భారతీయ సాహిత్యంలో, భారతీయుల హృదయంలో ఉన్న విశిష్ట స్థానాన్ని వర్ణించి, అక్కడి ప్రకృతిని, ఆదిమవాసుల జీవన విధానాన్ని స్పృశించాడు రచయిత. ఉషారాణి కరుణానందస్వాముల ఆశ్రమానికి రావటాన్ని,

ఆధ్యాత్మిక ప్రేరణను అనుభవించటాన్ని అతిసరళమైన సన్నివేశాలలోకి అనువదించి చెప్పాడు. గంగానది ప్రవహించిన కొద్ది మురికిని కలుపుకున్నట్లే, మనిషి తన జీవన ప్రవాహంలో కూడా మురికిని కలుపుకోకతప్పదు. నది జన్మస్థలం మనిషి శైశవంలాగా పరిశుభ్రమైంది. హృషీకేశ్‌లోని గంగానదిని చూసిన తర్వాత ఉషారాణికి గంగ జన్మస్థలాన్ని చూడాలనిపించటమంటే, తన శైశవాన్ని దర్శించాలనిపించటమే. శైశవం లాంటి కల్లాకపటంలేని జీవితాన్ని దర్శించాలనుకోవటం. ఇది సులభసాధ్యమైన గమ్యంకాదు. ఎదురీదటం వంటిది. గంగోత్రిని చేరుకోవటానికి ఆమె చేసిన ప్రయాణం క్లిష్టతరమైంది. అలాగే ఆమె ఆత్మవైపు చేసిన ప్రయాణం కూడా ఎంతో శ్రమతో, అనేక పరీక్షలతో కూడినట్టిదని రచయిత భావం.

ఆమె నిర్వర్తించవలసిన బాధ్యత ఒకటి మిగిలిపోయింది. అది రామానుజం గారితో తాను దాచిన విషయాలను చెప్పటం. అందుకే, ఆమె తిరిగి రామానుజంగారి దగ్గరకు వచ్చి, తనకు చక్రవర్తితో శ్రీకాంత్‌తో, కమలాకరంతో ఏర్పడ్డ లైంగిక సంబంధాలను గురించి అతనితో '....ఎవరికో జరిగిన కథ చెప్పినట్లు చెప్పి' క్షమించమనికోరి వెళ్ళిపోయింది. ఈమె పూర్వాశ్రమంలోని ఉషారాణి కాదన్నమాట!

ఈ సన్నివేశ కల్పనలో ఔచిత్యం లేదని పైకి అనిపిస్తుంది. లౌకిక బంధాల నుంచి విముక్తి పొందిన ఉషారాణి పాత అక్రమ లైంగిక సంబంధాలను గురించి రామానుజంతో చెప్పకూడదని, చెప్పవలసిన అవసరంలేదని అనిపించటమే ఇందుకు కారణం. కాని, ఈ సన్నివేశం ఉషారాణి మానసిక నిగ్రహశక్తికి పరీక్ష వంటిది. సంఘంలోకి, కుటుంబంలోకి, తాను ఒకప్పుడు కాపురం చేసిన భర్త దగ్గరకు వెళ్లి, తన పాత సంబంధాలను గూర్చి చెప్పి కూడా మళ్ళీ ఎటువంటి ప్రలోభాలకు గురికాకుండా లైంగిక వాంఛావర్తంలో చిక్కుకోకుండా తిరిగి తన శిఖరాన్ని చేరుకోగలిగింది. ఆమెకు బంధవిముక్తి కలిగిందనటానికి సాక్ష్యంగా రచయిత ఈ సన్నివేశాన్ని కల్పించాడు.

పదేళ్ళ తర్వాత, హృషీకేశ్ సమీపంలోని మహారణ్యంలో తపస్సు చేసుకుంటున్న 'మహాయోగిని' ఉషారాణేనని చక్రవర్తి దంపతులు గుర్తిం

చారు. కమలాకరం దంపతులు అంతకుముందే గుర్తించారు. చక్రవర్తి చెప్పగా రామానుజం కూడా తన రెండో భార్యతో, కొడుకుతో పాటుగా వచ్చి, ఆమె దర్శనం చేసుకున్నాడు. ఆమెను పూర్తిగా మరిచిపోయిన వ్యక్తి శ్రీకాంతే.

ఉషారాణి యోగినీ అవతార వర్ణనలో పాఠకులకు ఒక దేవతామూర్తి దర్శనమిస్తుంది.

చక్రవర్తి మాటల్లో—

"తన స్థాయికి సరిపడని జీవితంలో చిక్కుకుని ఆమె కల్లోలపడింది. ఇప్పుడు తన స్థాయికి సరిపడిన ఆదర్శాన్ని అందుకొని జన్మను చరితార్థం చేసుకుంది"

చాలా మంది ఆధ్యాత్మిక జీవులకు ముందు సరిపడని జీవితమే లభిస్తుందనీ, వాళ్లు ఆ జీవితంలో సంఘర్షణను అనుభవిస్తారనీ విశ్వసిస్తుంటారు. ఒక వ్యక్తిలోని నిగూఢ లక్షణాలను కనిపెట్టటం ఎవరికైనా కష్టసాధ్యమే. వారి సన్నిహితులే వారిని అపార్థం చేసుకుంటారు. కనక, సంఘం వారిని అర్థంచేసుకోలేదు.

వారు ప్రతి సన్నివేశం ద్వారా, ప్రతి అనుభవం ద్వారా, ప్రతి ఆలోచనద్వారా వ్యక్తావ్యక్తంగా తమ అంతరంగంలోని అట్టడుగుపొరల్లో కదలాడుతున్న ఆధ్యాత్మికలోకానికి దారివేసుకునే ప్రయత్నం చేస్తుంటారనీ, అందుకే గమ్యం చేరుకునే వరకు వారిది అంతులేని అన్వేషణేననీ, గమ్యం చేరుకున్న తర్వాత వారే సామాన్యులకు గమ్యం అవుతారనీ రచయిత తన విశ్వాసాన్ని ఉషారాణి పాత్ర ద్వారా వెల్లడిచేశాడు.

ఈ నవల పేరు 'మెరుపుల మరకలు'. ఈ సమాసాన్ని 'మెరుపులతో గూడిన మరకలు' అని గానీ, 'మెరుపులనే మరకలు' అనిగానీ, 'మెరుపుల వంటి మరకలు' అనిగాని సాధించవచ్చు.

ఈ నవలలో గోపీచంద్ 'మెరుపు', 'తేజస్సు', 'కాంతి'—వంటి మాటలను ఆధ్యాత్మిక సౌందర్యానికి, జ్ఞానానికి సంకేతంగా ఉపయోగించాడు.

కమలాకరంతో ఉషారాణి నెరపిన లైంగిక కార్యాన్ని వర్ణించిన దశలో చేసిన వర్ణన17లో 'మెరుపు'—శారీరకానందం తన పరిధిని దాటి అంత రంగపు పొరలలోనికి ప్రయాణం చేసిన అపూర్వానుభవానికి సంకేతమే. అలాగే, కరుణానంద స్వాముల వారి శక్తిని ఉషారాణి దృష్టితో వర్ణించినప్పటి 'తేజస్సు' ఆధ్యాత్మికమైన మెరుపే.

అలాగే, ఆమె 'మహాయోగిని'గా మారిన తర్వాత—

'....కదలక వెలిగే దీపం వలె వెలుగొందుతూ వున్నదా మహాయోగిని. ఆమె నుంచి వెలువడుతున్న తేజస్సు, శరీరం అంచులను చేరి విద్యుల్లతవలె మెరుస్తూ వుంది. మానవ శరీరాన్ని అంటిపెట్టుకొని వుండే పోలికలు సురిగిన అవస్థ అది.' ఈ వర్ణనలోని 'తేజస్సు, 'మెరుపులు' ఆధ్యాత్మికమైనవే.

హిమాలయాలలోని ప్రకృతిని కూడా— 'అక్కడ లతలు దీపపు కాంతులను వెదజల్లుతున్నాయి. చెట్ల సందుల నుంచి సింధూరం మెరిసింది.' అని ఉషారాణి పరిశీలనలో భాగంగా వర్ణించాడు, రచయిత. ఈ దృష్టిలో కూడా ప్రకృతి మెరుపే. అంటే, వికృతి మరక.

ఒక స్వచ్ఛమైన పదార్థం మీద, ఆ పదార్థం కంటే పూర్తిగా వేరైన లేదా విరుద్ధమైన పదార్థం పడ్డప్పుడు మరక అవుతుంది. జన్మరాహిత్యం కలిగే వరకు జీవికి సంభవించే జన్మలన్నీ కర్మఫలితమేననీ మానవజన్మ కూడా అలాంటిదేననీ ఆధ్యాత్మిక విశ్వాసం. కనుక జన్మ మరక వంటిదే.

మెరుపు వెలుగైతే మరక చీకటి. మామూలు మెరుపు క్షణికమే. కాని, ఆధ్యాత్మిక తేజస్సు శాశ్వతమైందని ఆధ్యాత్మికవాదం విశ్వసిస్తుంది. అందు వల్ల, జన్మ అనే మరకను తొలగించేది శాశ్వతానంద తేజస్సే. ఈ భావనకు 'మెరుపులతో కూడిన మరకలు' అన్న వివరణ కొంత దగ్గరగా ఉన్నదని చెప్పొచ్చు.

'మరకలు' అన్న బహువచనాన్ని ఉపయోగించాడు కనుక, రచయిత ఉషారాణిని మాత్రమే కాక ఇతర పాత్రలను కూడా ఉద్దేశించాడన్నమాట. ఉషారాణి వంటి వ్యక్తిత్వం ఉన్నవారు లోకంలో అరుదుగానైనా తప్పకుండా

ఉంటారని రచయిత విశ్వాసం. అందువల్ల, ఉషారాణి ఉషారాణి వంటి వారు అనే భావంలో రచయిత బహువచనం ఉపయోగించి వుండవచ్చు. లేదా, నవల లోని పాత్రలనే ఉద్దేశించి ఉంటే, ఉషారాణికి దగ్గరగా ఉన్న 'మెరుపుల మరకలు'—చక్రవర్తీ కమలాకరంలు. ఉషారాణి మార్గాన్ని అనుసరించే అవకాశం ఉన్నవారు వీరిద్దరే!

అందుకే,

యోగినిగా మారిన ఉషారాణిని ముందుగా గుర్తించిన ఘనత కమలా కరంకు దక్కింది.

ఉషారాణి జీవితానికి రచయిత దృష్టితో సమీక్షాప్రాయాలైన మాటలు, భరతవాక్యం లాగా పలికే యోగ్యత చక్రవర్తికి లభించింది.

నవలను పూర్తిచేసిన తర్వాత ఎవరికైనా ఒక సందేహం పీడిస్తుంది. రామానుజంతో, చక్రవర్తితో, శ్రీకాంత్‌తో, కమలాకరంతో కనిపించే ఉషా రాణి, కరుణానందస్వాములతో కనిపించే ఉషారాణి ఒక్కరేనా? అని. ఈ సందేహం కలగటానికి కారణం ఒకరు నిజస్వరూపంలాగా, మరొకరు ఆ నిజ స్వరూపంకనే కలలాగా కనిపించటమే. నిజస్వరూపానికి, కలకూ ఉండే అంతరం సామాన్యమైంది కాదు. మొదటి దశలో ఒకటి రెండు సందర్భాలలో అనిర్వచనీయానుభవాలు పొందటం ఉషారాణి అంతర్ముఖీనప్రవృత్తికి బలమైన సాక్ష్యాలు కాజాలవు. ఎందుకంటే, ఈ అంతర్ముఖీనప్రవృత్తిని మింగివేసే బహిర్ముఖీనప్రవృత్తి ఆమెలో అడుగడుగునా కనిపిస్తుంది. జాణతనమూ, సంపుంపట్ల భీతీ ఆమె స్వభావంలో అత్యంత సహజమైన అంశాలుగా రూపొందాయి. హిమాలయాలకు వెళ్ళేముందు కూడా, శ్రీకాంత్‌తో ఆమె జరి పిన సంభాషణను పరిశీలించినా 'నెరజాణ' ఛాయలే కనిపిస్తాయి.

ఉషారాణి పాత్రలో వచ్చిన పరిణామం గురించి ముచ్చటిస్తూ ఒకనాడు, ''సోమర్సెట్ మామ్ 'ది రేజర్స్ ఎడ్జ్' లో పురుషపాత్రను భారతదేశానికి ఆధ్యాత్మిక ప్రయాణం చేయిస్తాడు. భౌతిక జీవితాన్ని పశ్చిమదేశాల్లోనే గడి పిస్తాడు. ఆ నవలతో పోటీపడి ఒక స్త్రీ పాత్రను ఆధ్యాత్మికోపలబ్ధికి ఆశ్రమా లకు హిమాలయాలకు పంపించాను.''18 అని దోనేపూడి రాజారావుగారితో గోపీచంద్ అన్నాడు.

ఈ అంశాన్ని క్లుప్తంగా చర్చించటం అవసరం. మామ్ రచించిన 'ది రేజర్స్ ఎడ్జ్' లో లారెన్స్ డారెల్ ఆధ్యాత్మిక జిజ్ఞాసతో భారతదేశానికి వస్తాడు. బనారస్ మథుర వంటి ప్రదేశాలను సందర్శిస్తాడు.

హిందూ వేదాంతం పట్ల అతనికి గౌరవభావం ఏర్పడుతుంది. ఒక సాధువు ద్వారా కొంత మహిమను19 కూడా సంపాదిస్తాడు.

ఉషారాణి కూడా చారిత్రక ప్రదేశాలను చూసిన తర్వాత హిమాలయా లకు వెళ్తుంది. హృషీకేశ్‌లోని ఆశ్రమానికి వెళ్తుంది. గంగోత్రికి వెళ్ళి సమీపంలోని గంగాలయం సందర్శిస్తుంది.

అయితే, లారెన్స్‌లో కనిపించే బలమైన ఆధ్యాత్మికజిజ్ఞాన ఉషా రాణిలో లేదు. జ్ఞానసాధనకు అతడు చేసిన పరిశ్రమ ఉషారాణి చేయలేదు. ఆధ్యాత్మికదృష్టి అతని జీవలక్షణంగా మొదటి నుంచీ కనిపిస్తుంది. ఈ విష యంలో జాతీ, మతం అనే హద్దులను కూడా అతడు దాటగలిగాడు.

ఉషారాణిలో ఆధ్యాత్మిక చింతన మొదటి దశలో లేదు.

'ది రేజర్స్ ఎడ్జ్' లో కనిపించే మరో ఆసక్తిదాయకమైన పాత్ర సోఫీ మెక్డొనాల్డ్. ఈమెలో సృజనాత్మకశక్తి ఉన్నది. భర్తపట్ల ఆమె ప్రదర్శించిన అనురాగం అపూర్వమైంది. కాని, భర్త మరణానంతరం పచ్చివ్యభిచారిణిగా20 మారుతుంది.

ఈ పాత్రలోని కొన్ని లక్షణాలు ఉషారాణిలో కనిపిస్తాయి. ఉషా ణిలో కూడా సృజనాత్మకశక్తి ఉన్నది. భర్తపట్ల ఆమెకు ప్రేమానురాగాలు ఉన్నాయి ఉషారాణి కూడా వ్యభిచారానికి పాల్పడింది.

సోఫీ భర్త ఉండగా ఎలాంటి అక్రమలైంగిక సంబంధాలు పెట్టుకో లేదు. సోఫీ సరళహృదయం కలది. ఉషారాణి నెరజాణ.

మొత్తం మీద ఉషారాణి జీవితంలోని మొదటిదశలో సోఫీ పోలికలు కొన్ని కనిపించినా, లారెన్స్ పోలికలు లేవనే చెప్పవచ్చు. గోపీచంద్ నవ లల్లోనే కాదు, తెలుగు నవలల్లోనే ఉషారాణి ఒక అసాధారణమైన పాత్ర.

# 3. పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా

'పండిత పరమేశ్వర శాస్త్రి వీలునామా21' నవలలోని కథానాయకుడు కేశవమూర్తి, ఒక రచయిత. అతడు కొత్త నవలను రాయటం ప్రారంభించినా ఘట్టంలో ఈ నవల ప్రారంభమై, అతడు రచించే నవల ముగిసేనాటికి అసలు నవల కూడా పూర్తి అవుతుంది.

కేశవమూర్తి మధ్యతరగతికి చెందినవాడు. అతని బాల్యం గురించిన వివరాలు నవలలో లేవు. కులం గోత్రంలేని సుజాతను పెళ్లిచేసుకోవటంతో నవలలో మొదటిసారి అతనికి గుర్తింపు లభిస్తుంది. సుజాతను పెళ్లిచేసుకోవటం ద్వారా తాను త్యాగం చేశానన్న భావం అతనిలో ఏకోశానా లేదు. అంతే కాదు, తనకు వివాహం చేసుకుంటే పండిత పరమేశ్వరశాస్త్రి ఆస్తి సుజాతకు గానీ, ఆమెద్వారా తనకుగానీ దక్కదని తెలిసి కూడా అతడు ఆమెను వివాహం చేసుకోవటానికి వెనుకాడలేదు. ఇది అతని అభ్యుదయదృష్టికి నిదర్శనం.

కేశవమూర్తి తాను అప్పుడు రాస్తున్న నవలలో, పూర్వం మనిషికి సంబంధించిన వాళ్లంతా దగ్గరదగ్గరగా ఉండేవారనీ, కష్టసుఖాలలో పాలు పంచుకునే అవకాశముండేదనీ ప్రస్తావించాడు. ఇప్పుడు స్వగ్రామం వదిలి మారప్రదేశాలకు వెళ్లవలసిరావటం వల్ల మనిషి 'ఏకాంతజీవి' అవుతున్నాడనీ, మానవజీవితంలో ఇదొక 'విషాదఘట్ట'మనీ కేశవమూర్తి వివరించాడు. ఆ విషాదాన్ని జయించటానికి 'ఆధ్యాత్మిక సాధన' మాత్రమే మార్గమని కూడా ప్రతిపాదించాడు.

కేశవమూర్తి తాత్త్వికస్థాయిలో ప్రతిపాదించిన ఈ అంశాలు మానవ జీవితంలో కాలం తెస్తున్న మార్పులు. అంటే, మనిషి అనేక రంగాలలో సాధిస్తున్న ప్రగతివల్ల వస్తున్న పరిణామాలే ఇవి। తనకు జీవితంలో ఎదురైన అనుభవాల వల్ల ఉన్న వూరు వదిలి, మిత్రులతో విభేదాల కారణంగా ఆవేదన

చెందిన కేశవమూర్తికి ఆధ్యాత్మికరంగం పట్ల కలుగుతున్న ఆకర్షణే పై రూపాన్ని పొందింది.

నవలా రచనలో నిమగ్నమైన కేశవమూర్తి మధ్యన ఆపి, అంతకు ముందు తాను ప్రచురించిన నవలను గూర్చి తన మిత్రుడు సీమంతం అభిప్రాయాన్ని భార్య ద్వారా తెలుసుకోవాలని కుతూహలపడతాడు.

సీమంతం తనకు వ్యతిరేకి అని కేశవమూర్తికి తెలిసినా అతని అభిప్రాయం తెలుసుకోవాలనే ఆసక్తికి కారణం, తన ఊహకు భిన్నంగా మంచి అభిప్రాయం చెప్తాడేమోననే ఆశ. ఆశాభంగం కలిగినా, అతడు తనకు వ్యతిరేకి కావటంవల్లే, తన రచన మీద వ్యతిరేక భావాన్ని ప్రకటించాడనీ, నిజానికి తన నవల గొప్పదేనని సంతృప్తి పొందాలనుకోవటం మరోకారణం.

సుజాత అనాథ స్త్రీ కావటంవల్ల ఆమెలో కృతజ్ఞతాభావమే ఎక్కువగా కనిపిస్తుంది. తనను పెంచిన నరసయ్యపట్ల, పరమేశ్వరశాస్త్రిపట్ల ఆమెలో చోటుచేసుకున్న కృతజ్ఞతా భావమే, కులంలేని తనను పెళ్లిచేసుకున్నందుకు కేశవమూర్తి పట్ల కూడా చోటుచేసుకోవటం అడుగడుగునా కనిపిస్తుంది. అతడు తన రచనలు చెప్తుంటే రాసిపెట్టటం తన భర్తకు అత్యంతప్రియమైన పనిలో పాలుపంచుకోవటం మాత్రమే కాదు, తద్వారా అతని మానసిక చైతన్యంలో ఒక భాగం కావటానికి కూడా. ఆమె తన భర్త రచనలు గొప్పవని భావించటానికి ప్రధాన కారణం, తన భర్త గొప్పవాడని భావించటమే.

పరమేశ్వరశాస్త్రికి అనారోగ్యంగా ఉన్నదని తెలిసి, ఆమె ధవళేశ్వరం బయలుదేరి వెళ్లేముందు తన భర్తకు ఇబ్బంది కలగకుండా చెప్పిన జాగ్రత్తలను గమనించినా, ఇచ్చిన సూచనలు గమనించినా ఆమెకు అతనిపట్ల ఉన్న కృతజ్ఞతాభావం స్పష్టమౌతుంది. ఆమె సూచనలను తూచా తప్పకుండా అనుసరించటంలో కేశవమూర్తి పరాధీనతత్వం కూడా వెల్లడవుతున్నది.

కేశవమూర్తి మిత్రులకు సహాయం చేయటం వల్ల వాళ్ళు అతనికి శత్రువులయ్యారని నవల ప్రారంభంలో రచయిత వివరంగా చిత్రించాడు.

తమ బతుకుల్లోని నైచ్యం అతనికి తెలిసినందుకు, వారికి అతనిమీద కక్ష ఏర్పడింది. అతడు తమకంటే పెద్ద రచయిత అయినందుకు అసహనం చోటుచేసుకున్నది. ప్రశాంత దాంపత్య జీవితం గడుపుతున్నందుకు అసూయ కూడా కలిగింది. వీటన్నిటి ఫలితంగా వేరూనిన ఆత్మన్యూనతా భావం అతని మిత్రులలో రోజురోజుకూ పెరుగుతూ వచ్చింది. అందువల్ల ఏ పద్ధతిలో వీలైతే ఆ పద్ధతిలో అతణ్ణి అవమానించి ఆధిక్యభావాన్ని పొందాలని ప్రయత్నించారు.

తన పెంపుడు కుమార్తెను పెళ్లిచేసుకున్నందుకు కేశవమూర్తిని శత్రువుగా భావిస్తున్న పరమేశ్వరశాస్త్రికి చేరువకావటం ద్వారా వాళ్ళు కేశవమూర్తి మీద పగసాధించటానికి కొత్త ఎత్తు వేశారు.

పరమేశ్వరశాస్త్రికి కేశవమూర్తి మీద కోపం రావటానికి కొన్ని సహజమైన కారణాలున్నాయి. కేశవమూర్తిని వివాహమాడటానికి సుజాత నిర్ణయించుకున్నా, పెంచిన ప్రేమకారణంగా ఆమెనేమీ అనలేడు. వృద్ధాప్యంలో తనను నిరాధారం చేసినందుకు జీవితంలో ఒంటరివాడైన తన ప్రేమాభిమానాలను ప్రదర్శించుకునే ఏకైక లక్ష్యం లేకుండా చేసినందుకు అతనికి కేశవమూర్తి మీద కోపంగా ఉన్నది. సుజాతను తన భావాలకు వారసురాలుగా రూపొందించాలన్న అభిలాష సిద్ధించకపోవటానికి కేశవమూర్తే కారణం కనుక అతని మీద రోజురోజుకూ కోపం పెరిగింది.

కేశవమూర్తి సినిమారచయితగా మద్రాసు వెళ్లటానికి ముందు స్నేహితులవద్ద వీడ్కోలు తీసుకున్న సన్నివేశం నవలలోని ముఖ్య సన్నివేశంగా భావించవచ్చు. ఈ సన్నివేశంలో కేశవమూర్తితో పాటుగా వరసగా సీమంతం, శారద్వతుడు, రాధారమణ అనే మిత్రులు పాల్గొంటారు. కేశవమూర్తి మిత్రుల ప్రవర్తనలోని అనాగరకతను మాట తీరులోని కుసంస్కారాన్ని, బతకనేర్చినతనాన్ని ప్రత్యక్షీకరించటంతో పాటుగా, కేశవమూర్తిలోని నాగరకతను, సంస్కారాన్ని, అమాయకత్వాన్ని నిరూపించటానికి రచయిత ఈ సన్నివేశాన్ని చిత్రించాడు.

సీమంతం కేశవమూర్తికి తమ బంధువుల అమ్మాయి సుభాషిణితో అక్రమ సంబంధాన్ని అంటగట్టాడు. తాను ఒక స్త్రీతో అక్రమ సంబంధం పెట్టుకోవటానికి విఫలప్రయత్నం చేసి, ఆమెను చంపిన విషయం కేశవ మూర్తికి తెలుసు కనుక అతణ్ణి తన స్థాయికి లాగటానికే ఈ ఆరోపణచేశాడు. ఇది సీమంతం తనలోని అపరాధ భావాన్ని జయించే ప్రయత్నం.

పూర్వాశ్రమంలో కమ్యూనిస్టులను సమర్థించే 'పిత్రార్జితం'22 కథ రాసి నందుకు కేశవమూర్తిని శారద్వతుడు తీవ్రంగా విమర్శించాడు. మేధావులు కేవలం భావాలను వెదజల్లాలని, దేనినీ ఆచరణలో పెట్టనవసరం లేదనే విశ్వా సాన్ని ప్రకటించాడు. ఇందులో శారద్వతుని నిజాయితీ లోపించిన విషయం స్పష్టంగా తెలుస్తూనే ఉన్నది. తనలోలేని సృజనాత్మకశక్తి కేశవమూర్తిలో ఉండటంవల్ల అసూయ చెందటమూ కనిపిస్తున్నది.

ఇక మూడవ మిత్రుడు వర్తకుడు రాధారమణ. కృష్ణమూర్తి అనే యువకుడు రాసిన లేఖలోని అబద్ధం ఆధారంగా అప్పులు ఎగగొట్టేవాడనే ముద్ర వేస్తాడు రాధారమణ. ఇక్కడే కృష్ణమూర్తి తనను గురించి రాసిన కథను చదువుతాడు కేశవమూర్తి. ఉన్నత భావాలు ప్రబోధించే తాను సవతి తల్లినీ, చెల్లెలినీ మోసం చేసినట్లుగా ఆ కథలో చిత్రితమైంది.

కృష్ణమూర్తిలోని కుసంస్కారానికి కేశవమూర్తి చాలా బాధపడతాడు

ఈ సన్నివేశం గతానికి సంబంధించింది. సుభాషిణి ప్రస్తావనవల్లా 'పిత్రార్జితం' కథను గూర్చిన చర్చ మూలంగా, రాధారమణ కృష్ణమూర్తి వ్యవహారాన్ని గుర్తుచేయటం కారణంగా కథ గతం నుంచి ఇంకా గతంలోకి వెళ్ళింది.

ప్రపంచమంతా ఒకటై, కేశవమూర్తిని ఒంటరివాణ్ణి చేసి కక్ష సాధించ దలచుకున్నట్లుగా ఈ సన్నివేశంవల్ల పాఠకులకు అనుభూతమై, ఆ పాత్ర పట్ల సానుభూతి పెరుగుతుంది. ఈ సన్నివేశంలో కనిపించే పాత్రలు ఇప్పుడు పాఠకులకు కలగజేసే భావమే ఆ తర్వాత కూడా కొనసాగుతుంది. భవిష్య

త్తులో సీమంతాదుల చర్యలపట్ల పాఠకులలో అనుమానాస్పద వైఖరి ఏర్పర చటం ద్వారా రచయిత మరో ప్రయోజనాన్ని సాధించాడు.

అయితే, ఇలా ముగ్గురి దగ్గరకు పనిగట్టుకొని వెళ్లిన కేశవమూర్తి పురూరవుని దగ్గరకు వెళ్ళలేదు. అతడు ఏదో నిందను వేస్తాడని భావించి వెళ్ల లేదనుకోవటానికి కూడా వీలులేదు. నిజానికి పై ముగ్గురు కూడా తనను బాధ పెట్టటానికే ప్రయత్నిస్తారని కెశవమూర్తికి తెలుసు. అందుకే అతడు మిత్రులు వేసే'ఏదోవాక నిందను మనస్సును సిద్ధపరచుకొని' ఉన్నాడు. తర్వాతి కథలో పురూరవుడు కేశవమూర్తి పట్ల తప్పుగా వ్యవహరించినందుకు పశ్చాత్తాపపడి సీమంతం మొదలైనవాళ్ళను వ్యతిరేకిస్తాడు. ఎలాగూ అతనిలో మార్పు వస్తుందని, తర్వాత కేశవమూర్తి పక్షం వహిస్తాడని భావించి, ఇప్పుడు కేశవ మూర్తి అతని వద్దకు వెళ్ళనవసరం లేదనుకోవటం అసహజమైన విషయమే ప్రస్తుత కల్పన ఆధారంగా భవిష్యత్తులో పరిణామాలు సంభవించేనట్లుగా చిత్రించటం సమంజసంగా ఉంటుంది. అందువల్ల అందరితోపాటు పురూరవు నితో కూడా కలిసినట్లుగా చిత్రించి, అతనిలో కలగబోయే పశ్చాత్తాపానికి ఈ సమావేశంలో బీజాలువేసి ఉండిన పక్షంలో మంచి కల్పన అయ్యేది

వాళ్ళను కలిసి ఇంటికి తిరిగివెళ్తూ—

'....వారి సానుభూతికోసం ప్రయత్నించటం లాభం లేదని తేల్చు కున్నాడు,' కేశవమూర్తి.

సానుభూతికోసం ప్రయత్నించటమెందుకు? అన్నది ప్రశ్న. తనకంటే అన్నివిధాలా తక్కువ స్థాయిలో ఉన్నవాళ్ళ సానుభూతికోసం కేశవమూర్తి ప్రయత్నించదమెందుకు? మైత్రికోసమైతే, అది కేవలం తన ప్రయత్నం మీద ఆధారపడలేదు. అవతలి వాళ్ళు కూడా సహకరిస్తేనే మైత్రి వృద్ధి పొందు తుంది.

మరేదో కారణం ఉండాలి. ఈ విషయాన్ని భార్యతో చర్చిస్తూ అతడు—

"నాలో ఏమన్నా దోషం వుందేమోనని అప్పుడప్పుడు భయంగా వుంటుంది సుజాతా !" అన్నాడు.

సరిగ్గా అతని మిత్రులలో ఎలాంటి అపరాధభావం చోటుచేసుకున్నదో, అలాంటి భావమే అతనిలోనూ చోటుచేసుకున్నది. ఆయా పరిస్థితుల్లో వాళ్లకు అతడు సహాయం చేసినందుకు వాళ్ళ నుంచి కొంత కృతజ్ఞతను, మరికొంత ప్రశంసను ఆశించటం కూడా కేశవమూర్తి వంటి సున్నిత మనస్తత్వం ఉన్న వాడిలో అపరాధభావాన్ని కలిగించవచ్చు. తన మిత్రులు చేసిన ఆరోపణల్లో కొంతైనా నిజముందేమోననే సందేహం కూడా అతనిలో అపరాధభావాన్ని కలిగించవచ్చు.

కృష్ణమూర్తి పట్ల కేశవమూర్తి ప్రదర్శించిన మంచితనం కృత్రిమ మైందిగా కనిపిస్తుంది. ప్రవర్తనలోగాని, మాటతీరులోగాని సంస్కారం ఏ మాత్రం లేనివాడు కృష్ణమూర్తి ఎదుటివాళ్ళ దగ్గర డబ్బుతీసుకోవటం తన హక్కుగా భావించే స్వభావంతో పాటు, తనను పోషించటం ఎదుటివాళ్ళ బాధ్యతేననే విపరీత భావం కూడా అతనిలో స్థిరపడ్డది. తనచుట్టూ ఉన్న వాతావరణాన్ని కలుషితం చేసే లక్షణం కలవాడు కావటంవల్ల ఒకచోట ఎక్కువకాలం ఉండలేడు. ఎదుటివారిని బాధపెట్టి, సంతోషించే పాశవిక ప్రవృత్తి కారణంగా, తీవ్రమైన మానవ ద్వేషం కారణంగా చుట్టూ ఉన్న వారిని శత్రువులుగా మార్చుకునే వ్యక్తి కృష్ణమూర్తి. అతడు కేశవమూర్తికి అక్రమసంబంధాలను అంటగడుతూ వ్యాసాలు రాస్తాడు. అపనిందలు వేస్తాడు. అయినా, కేశవమూర్తి మాత్రం మద్రాసులో కృష్ణమూర్తికోసం వెతికాడు. అతణ్ణి సక్రమ మార్గంలో పెట్టటానికి ప్రయత్నించాలనుకునేవాడు. చివరకు మద్రాసులో కేశవమూర్తి ఆర్థిక సహాయంతోనే పత్రిక పెట్టి, ఆ పత్రికలోనే కేశవమూర్తికి కన్యకామణి అనే చిన్న వేషాలు వేసే నటికి అక్రమసంబంధాన్ని అంటగడుతూ వ్యాసం రాస్తాడు ! అయినా కేశవమూర్తి మాత్రం కృష్ణమూర్తిని బాగుచెయ్యాలనే కోరుకుంటాడు.

ఎన్ని అనుభవాలు ఎదురైనా అవతలివాడి జీవలక్షణాన్ని తెలుసుకో లేకపోవటం హద్దు మీరిన అమాయకత్వమే

అందువల్ల కృష్ణమూర్తి ఎంత చెడిపోయాడో తెలుసుకోవాలనే కుతూహలంతోనే కేశవమూర్తి అతణ్ణి కలుసుకోవటానికి ప్రయత్నించేవాడా అనే సందేహం కలుగుతుంది.

నవలలో సీమంతం ప్రతినాయకుడు. కేశవమూర్తిని వ్యతిరేకించే వారికి నాయకుడు. సీమంతం వ్యతరేకత రెండు విధాలుగా కనిపిస్తుంది. రచయితగా కేశవమూర్తిని వ్యతిరేకించటం వ్యక్తిగతంగా కేశవమూర్తిని వ్యతిరేకించటం. కేశవమూర్తి జీవితాన్ని అస్తవ్యస్తం చేసే ఉద్దేశంతో శత్రుత్వంతో ప్రవర్తించటం ఎక్కువగా కనిపిస్తుంది. రచయితగా కేశవమూర్తిని వ్యతిరేకించటానికి మనకు పైకి కనిపించే కారణం, లేదా రచయిత చెప్పే కారణం కేశవమూర్తికి లభించిన కీర్తిపట్ల, సినిమారంగంలో లభించిన అవకాశాల పట్ల సీమంతానికి కలిగిన అసూయే.

మొదట్లో కేశవమూర్తి సీమంతాదులకు మార్క్సిజం మీద విశ్వాసం ఉన్నది. కేశవమూర్తి రచనలు కూడా ఆ విశ్వాసాన్నే ప్రతిఫలించేవి. కాని రానురాను కేశవమూర్తిలో మార్పు రావడం మొదలైంది. అతణ్ణి క్రమంగా ఆధ్యాత్మికభావాలు ఆకర్షించాయి. సీమంతాదులలో ఈ రకమైన మార్పేదీ రాలేదు. అందువల్ల సీమంతం కేశవమూర్తిని రచయితగా వ్యతిరేకిస్తూ వచ్చాడనవచ్చు. ఇందులో దోషమేమీ లేదు. అయితే, కేవలం కేశవమూర్తి రచనలను మూర్ఖంగా వ్యతిరేకించే విధంగా సీమంతం పాత్రచిత్రణ జరిగింది. అంతేకాని, సిద్ధాంత స్థాయిలో కేశవమూర్తి తాత్త్విక భావాలను వ్యతిరేకించే పాత్రగా సీమంతం రూపొందలేదు. ఒకవేళ ఇదే జరిగివుంటే కేశవమూర్తి రచనలలోని అంశాలు నిజమైన పరిశీలనకు లోనై ఉండేవి. వాటిలోని గుణదోషాలు బహిర్గతమయ్యేవి. సీమంతం కేవలం దుష్టపాత్రగా రూపొందటవల్ల రచయిత పూర్తి ప్రయోజనాన్ని పొందలేకపోయాడు. ప్రతినాయకుడు కూడా నాయకునంతటి ఉన్నతుడైనప్పుడే, నాయకుని ఔన్నత్యం రుజువవుతుంది. కేశవమూర్తి దాంపత్య జీవితాన్ని నాశనం చేయటానికి సీమంతం శత్రుత్వభావంతో ప్రయత్నించాడు. సీమంతంలో డబ్బు మీద మొదటి నుంచీ వ్యామోహం కనిపిస్తుంది. పరమేశ్వర శాస్త్రి ఆస్తి మీది ఆశతో సుజాతను

పెళ్ళిచేసుకోవాలనుకున్నాడు కాని, సుజాత అతణ్ణి తిరస్కరించి కేశవ మూర్తిని పెళ్లిచేసుకుంది. ఈ కారణం వల్ల కూడా వాళ్ళ సాంసారిక జీవితాన్ని భగ్నం చేయాలనుకున్నాడు గయ్యాళి భార్య లభించటంతో తీరనికోరికలతో దుర్భరమైన జీవితాన్ని మరిచిపోయే ప్రయత్నంలో అతడు చేసిన కొన్ని పనులను సానుభూతితో అర్థం చేసుకోవలసి ఉన్నది. ఒక నిరుపేద విధవరాలితో లైంగిక సంబంధంకోసం ప్రయత్నించి వైఫల్యం పొందటం వరకు అర్థం చేసుకోవచ్చు. కాని, ఎక్కడ తన భార్యతో చెప్తుందోనని ఆమెను చంపటం మాత్రం సమర్థనీయంగా లేదు. హత్యతో మాత్రమే రూపుమాపాలనుకునేటంత దారుణమైన నేరం అతడు చేయలేదు. సీమంతాన్ని క్రూరమైన వ్యక్తిగా, ఆ పరిస్థితుల్లో అతణి ఆదుకున్న కేశవమూర్తిని సౌజన్యమూర్తిగా పాఠకులకు స్ఫురింపజేయటానికే రచయిత ఈ కల్పన చేశాడని పిస్తుంది. 'The devil is not so black as he is painted'[23] అన్న మాట సీమంతం పాత్రకు వర్తిస్తుంది.

ధవళేశ్వరంలో ఉన్నప్పుడే కాకుండా, మద్రాసు వెళ్ళిపోయిన తర్వాత కూడా కేశవమూర్తి మీద సీమంతం అనేక ఆరోపణలు చేశాడు. సినిమా ప్రొడ్యూసరుతో, తన ఊహలను దొంగిలించే కేశవమూర్తి ఇతర స్త్రీలతో అక్రమ లైంగిక సంబంధాలను పెట్టుకున్నాడని సుజాత ఎదుటే దూషించాడు. తన మాటను సుజాత నమ్మకపోవటంతో వారి సాంసారిక జీవితాన్ని భగ్నం చేయటానికి కుట్రపన్నాడు. ఆ కుట్రను ఒక పథకం ప్రకారం అమలు జరిపాడు. ఇది ఈ నవలలోని ముఖ్యమైన సంఘటన. రచయిత కూడా ఈ సంఘటనను అతి ముఖ్యమైనదిగా భావించాడు. అందువల్ల దీన్ని గురించి వివరంగా తెలుసుకోవటం, చర్చించటం అవసరం.

సీమంతం ఈ కుట్రకు తమ బంధువులమ్మాయి సుభాషిణి కేశవమూర్తిని రచయితగా అభిమానించడాన్ని ఆధారంగా చేసుకున్నాడు.

సినిమా షూటింగ్ చూడటానికి వెళ్లిన సుభాషిణీ కేశవమూర్తులు షూటింగ్ నుంచి రాత్రి రెండు గంటలకు రావటాన్ని ఆధారంగా చేసుకొని వాళ్ళు షూటింగ్ చూడటానికి వెళ్ళలేదని, బీచికి, బీచి నుండి హోటల్‌కు వెళ్లి-

ఆ రాత్రంతా గడిపి స్టూడియో నుంచి వచ్చినట్లుగా ఇంటికి వచ్చారని సుజాతకు రాసిన తన మొదటి 'ఆకాశరామన్న' ఉత్తరంలో పేర్కొన్నాడు. సీమంతం ఈ ఉత్తరం ద్వారా సుజాతకు కేశవమూర్తి పట్ల అనుమానం కలిగించగలిగాడు.

సుభాషిణి తాను ఉద్యోగం చేస్తున్న బొంబాయిలో కేశవమూర్తికి ఒక సన్మానాన్ని ఏర్పాటు చేసినట్లుగా ముందు సీమంతం మొదలైన వాళ్ళకు ఉత్తరాలు రాస్తుంది. దీన్ని ఆధారంగా చేసుకొని సీమంతం రెండో ఆకాశరామన్న ఉత్తరాన్ని రాస్తాడు. ఇందులో కేశవమూర్తి వారాంతంలో సుభాషిణి ఆహ్వానం పురస్కరించుకొని బొంబాయి వెళ్తాడని, ఈ ఏర్పాటు ముందే జరిగినా కేశవమూర్తి ఆమెతో చెప్పి ఉండడని రాశాడు. కేశవమూర్తికి ఆహ్వానం సంగతి ముందు తెలియకపోవటంతో సుజాత అడిగినప్పుడు బొంబాయి వెళ్ళే అవసరం తనకేమిటని చెప్పాడు. సుభాషిణి టెలిగ్రాం ఇవ్వటంతో బొంబాయి ప్రయాణం గురించి చెప్పటంవల్ల అనుమానం ధ్రువపడింది. తన భర్తతోపాటుగా బొంబాయి వెళ్ళటానికి ఆమెకు మనస్కరించలేదు. భర్త బొంబాయి వెళ్లిన తర్వాత విరక్తితో ఆమె బెంగుళూరుకు బయలుదేరుతుంది. ప్రయాణంలో తారసిల్లిన వెంకాయమ్మ బలవంతంమీద బెంగుళూరులో ఆమె ఇంట్లోనే కొన్ని రోజులు గడిపింది. ఏదో పని మీద వచ్చినట్లుగా సీమంతం సుజాతకు తారసిల్లి సిల్కు శిక్షణా కేంద్రంలో చేర్పించి జీవనాధారం కల్పించగలనని నమ్మకం కలిగించి ఒక హోటల్‌లో బస ఏర్పాడు చేస్తాడు. మరునాడు ఉదయం వచ్చి తనకు ఆమె మీద ఉన్న ప్రేమను ప్రకటిస్తాడు. సరిగ్గా ఈ సమయానికే వెంకాయమ్మ ఇచ్చిన టెలిగ్రాం అందుకొని కేశవమూర్తి మిత్రుడు రామమోహన శాస్త్రి, సుభాషిణీ అక్కడికి రావటంతో సీమంతం కుట్ర వెల్లడవుతుంది.

ఇది సంఘటన.

దీనిని నవలలోని ముఖ్యమైన సంఘటనగా సుజాతా కేశవమూర్తులు కూడా భావించారు. వాళ్ల చాలాసార్లు దీన్ని ప్రస్తావించారు. తమ మధ్య సాన్ని

హిత్యం, ప్రేమ పెరగటానికే కాక, భౌతిక జీవితంపట్ల నిర్లిప్తభావం పెరగటానికి అరవిందుని బోధనలను అవగతం చేసుకోవటానికి కూడా ఈ సంఘటన దోహదం చేసిందని కేశవమూర్తి భావించాడు.

పరమేశ్వరశాస్త్రికి అనారోగ్యంగా ఉన్నందుకు సుజాత ధవళేశ్వరం వెళ్లిన తర్వాత –

'మనకు అపకారం తలపెట్టటంలో ఆయన ఉద్దేశం వేరైనా, అతను చేసిన పని మనిద్దరినీ మరింత చేరువకు తీసుకొని రావటానికే ఉపకరించిందని మరచిపోకు.' అని ఉత్తరం రాశాడు కేశవమూర్తి.

'మద్రాసులో వుండగా తమ జీవితాలను ముక్కలు ముక్కలు కింద చితకగొట్టటానికి సీమంతం పన్నిన పన్నుగడ జ్ఞాపకం వచ్చింది' కేశవమూర్తికి.

'తరువాత డైరీలో వున్నది అతని జీవితాన్ని పూర్తిగా మార్చివేసిన సంఘటన....దానిని చదవటం సంగతి అలావుంచి, తలచుకోటానికే భయం వేసింది, కేశవమూర్తికి.'

ఈ విధంగా దీనిని ముఖ్యమైన సంఘటనగా రచయిత అనేక సందర్భాలలో భావిస్తుండటంవల్ల చర్చించటం అనవసరం.

'ఆకాశరామన్న' పేరుతో ఉత్తరాలు రాయటంద్వారా పాత్రల జీవితంలో అపార్థాలు సృష్టించటం అతిసాధారణ కల్పనే. తన భర్త మీద ఎన్నో అపవాదులు విసీ నమ్మని సుజాత 'కథ' కోసమే ఈ ఉత్తరాలను నమ్మినట్లుగా కనిపిస్తుంది.

మానవ సహజమైన బలహీనతవల్ల నమ్మి ఉంటుందని సమర్థించటానికి అవకాశం ఉన్నది. కాని, ఎంత బలమైన అనుమానమైనా సత్యం కాజాలదు. అందువల్ల ఆమెకు భర్తమీద కలగవలసింది తాత్కాలిక వైముఖ్యమే. తన అనుమానం, అదీ ఎవరో రాసిన ఉత్తరాలవల్ల కలిగిన అనుమానం శాశ్వతంగా భర్తకు దూరం కావాలనే నిర్ణయానికి, తన కాళ్ళ మీద తాను నిలబడి శేష

జీవితం గడపాలనే నిర్ణయానికి దారితీయటం అసంభవం కాదు గానీ, అసాధారణం. 'when in doubt, leave out.'24 అన్న సూక్తిని సుజాత పాటించిందని సమర్థించినా, తమ జీవితంలో ఎంతో విషాన్ని కుమ్మరించిన సీమంతాన్ని నమ్ముకొని హోటల్లో గది తీసుకొని ఉండటం మాత్రం సమర్థనీయం కాదు సీమంతం చేస్తానన్నపాటి సహాయం వెంకాయమ్మ కొడుకూ చేయగలడు.

అదీకాక సీమంతం పన్నుగడ కొంత ఫలించటం కూడా చాలావరకు యాదృచ్ఛికమే. రెండో ఉత్తరం చదువుకున్న తర్వాత నిజానిజాలు తేల్చుకోవటానికి కేశవమూర్తితోపాటే సుజాత ప్రయాణమయ్యే పక్షంలో, ఆమె మానం కొంతలో కొంత తగ్గే అవకాశం ఉండేది. ఆమె ఆ ఉత్తరాన్ని సుభాషిణికిగాని, కేశవమూర్తికిగాని చూపి ఉన్న పక్షంలో ఉత్తరం రాసిన వాడెవడో అప్పుడే తెలిసిపోయేది.

ఇకపోతే, సుజాత అనుమానాన్ని స్థిరపరిచిన రెండో ఉత్తరంలోని ప్రధానాంశం గూర్చి ఆలోచించటం అవసరం. కేశవమూర్తికి బొంబాయిలో సన్మానం ఏర్పాటు చేస్తున్నట్లు ముందుగా ధవళేశ్వరవాసులకు సుభాషిణి ఉత్తరాలు రాయటంవల్ల, సీమంతం సుజాతను నమ్మించటానికి అవకాశం కుదిరింది. ఈ అవకాశం కూడా చాలావరకు యాదృచ్ఛికమే. వాళ్ళకు రాసినట్లే కేశవమూర్తికి కూడా రావకపోవటంవల్లే సీమంతానికి ఈ అవకాశం లభించింది.

మామూలుగా తాము సన్మానించదలచుకున్న వ్యక్తి అనుమతిని తీసుకోవటం, అనుకూలమైన రోజును ముందుగానే నిర్ణయించుకోవటం కార్యనిర్వాహకులవిధి. చనువు, చొరవ ఉన్న పక్షంలో ఈ మామూలు విధానం అవసరం ఉండకపోవచ్చు. కాని. ఇతర ఆహూతులకంటే ముందుగానే, సన్మానం పొందే వ్యక్తికి ఆహ్వానపత్రం వెళ్ళటం ధర్మం. కనీసం ఇతరులతో పాటుగానైనా అతనికి చేరాలి. అంతేకాని, ఇతరులకు ఆహ్వానాలు పంపిన తర్వాత, కొన్ని రోజులకు ముఖ్యమైన వ్యక్తికి అత్యల్ప వ్యవధిలో టెలిగ్రాం

ద్వారా ఆహ్వానం పంపటం సమంజసమైన విషయం కాదు. అందులో ధవ శేశ్వరంలోని సీమంతంవంటి కేశవమూర్తిని వ్యతిరేకించే వ్యక్తికి ఆహ్వానం పంపిన సుభాషిణి, తనలాగే కేశవమూర్తిని అభిమానించే కన్యకామణికి ఆహ్వానం పంపకపోవటంలోని ఔచిత్యం ఏమిటి? కేవలం సీమంతం పథకం పారటానికే ఈ సన్మానం తంతు కల్పించబడినట్లుగా కనిపిస్తుండటంవల్ల సరిగ్గా ఇమడలేకపోయింది. ఈ సంఘటన చివరలో అకాశరామన్న ఉత్తరాలను చూసిన సుభాషిణి, వాటిలోని చేతి రాత సీమంతందేనని పోల్చగలిగింది. ఎన్నో సంవత్సరాలుగా సీమంతంతో సంబంధం ఉన్న కేశవమూర్తికి, అందులో సీమంతం రచనల రాతప్రతులను చదివి దోషాలను సవరించిన[25] కేశవమూర్తికి అతని చేతిరాతను గుర్తించటం పెద్దకష్టం కాదు. అంటే, సుజాత మొదటి ఉత్తరాన్నే భర్తకు చూపి ఉన్నా, ఏ కారణంవల్లనైనా కేశవమూర్తి దృష్టిలో పడి ఉన్నా సీమంతం పథకం ఈ మాత్రమైనా పారేది కాదు. అందువల్ల, ఒక నవలలోని ముఖ్య సంఘటనకు ఉండవలసిన బిగువు గానీ, ఔచిత్యంగానీ ఈ సంఘటనలో లేవని చెప్పవచ్చు.

అసలు ఈ సన్మాన ఘట్టానికి మూలం, అంతకు ముందే గోపీచంద్ రచించిన 'ప్రఖ్యాతుని భార్య'[26] అన్న కథ. ఈ కథలో కూడా నాయకుడు రచయితే. అతడు యువతులకు రచయితగా తనపట్ల ఉన్న అభిమానాన్ని దుర్వినియోగం చేస్తున్నాడని భార్య అనుమానపడేది. అసలు భర్త ఇతర స్త్రీలను గూర్చి కథలు రాయటమే ఆమెకు ఇష్టం లేదు. అతడు 'నిన్ను గురించి వ్రాస్తున్నాను. ఇంకా అనేక మంది స్త్రీలను గురించి వ్రాస్తున్నాను' అనేవాడు అభిమానులు అతనికి ఘనసన్మానం చేస్తారు. అతని గౌరవార్థం ఆ సభలో ఒక 'సోవనీర్'ను విడుదల చేస్తారు. కాని, రచయిత భార్య మాత్రం ఆ సన్మానానికి వెళ్ళకుండా పుట్టింటికి వెళ్లిపోతుంది. ఈ నవలలో కూడా సుజాతకు రచయిత అయన భర్త మీద అనుమానం కలుగుతుంది. సుభాషిణి ఏర్పాటు చేసిన సన్మానసభకు వెళ్ళకుండా బెంగుళూరు వెళ్లిపోతుంది.

సాధారణంగా బలమైన విశ్వాసాన్ని వ్యక్తులలో మార్పుకాదు. కాని

పరమేశ్వరశాస్త్రిలో మార్పు వస్తుంది. ఈ విషయం అతని మరణానంతరమే వెల్లడి కావటం దయనీయం. లక్షల ఆస్తిపరుడైనా పరమేశ్వరశాస్త్రి నిస్స హాయ జీవితాన్ని గడపవలసి వచ్చింది. ముఖ్యమైన పాత్ర కావటంవల్ల పరమేశ్వరశాస్త్రిని గూర్చి మరికొంత తెలుసుకోవటం అవసరం.

కఠిన బ్రహ్మచర్య దీక్షతో కాలం గడుపుతున్న పరమేశ్వరశాస్త్రికి సుందరమ్మవల్ల జీవితంలో కొత్త అనుబంధం ఏర్పడింది. నిష్ఠాపరుడైన బ్రహ్మచారికి తన జీవిత విధానమే, తన ఆలోచనా విధానమే సక్రమమైనదనే ధోరణి ఏర్పడుతుంది. అంతేకాదు, ఎదుటి వారిది సక్రమమైన విధానం కాదనే నమ్మకం కూడా ఏర్పడుతుంది. నిత్యవ్యవహారంలో కూడా గ్రాంథిక భాషను వాడే పరమేశ్వరశాస్త్రి రాసిన పుస్తకాలలో ఇతర రచయితల గ్రంథాలను ఖండించే పుస్తకాలు కూడా ఉండటం గమనార్హం. అతడు పరిస్థితుల ప్రభా వం వల్ల తప్పు చేయటం, ఆ తప్పు వల్ల అమాయకురాలైన సుందరమ్మ బలి కావటంతో తీవ్రసంక్షోభానికి గురయ్యాడు. అతనికి తన వ్యక్తిత్వం పట్ల అదివరకున్న విశ్వాసం పటాపంచలైంది.

ఒక జీవితాన్ని నాశనం చేసినందుకు మరొక జీవితాన్ని ఉద్ధరించటం ద్వారా ప్రాయశ్చిత్తం పొందవచ్చుననుకున్నాడు. ఇదే కులం గోత్రం తెలి యని సుజాతను పెంచుకోవటం వెనక ఉన్న కీలకం

పాండిత్యానికి, ఆస్తికి సంబంధించిన అహం తోడు కావటవల్ల తన అభిప్రాయాలే సమంజసమైనవనే పట్టుదల కూడా ఏర్పడింది. సుజాత కేశవ మూర్తిని పెళ్లిచేసుకుంటానన్న సందర్భంలో ఈ పట్టుదల వెల్లడవుతుంది. కేశవమూర్తి తన విశ్వాసాలకు విరుద్ధమైన ధోరణిలో రచనలు చేస్తున్నందు వల్ల, తనకులం వాడు కాకపోవటంవల్ల సుజాత అతణ్ణి పెళ్ళిచేసుకోకూడ దంటాడు.

అయితే, సుజాత దూరం కావటంతో తాను నమ్ముకున్న విలువలపట్ల అతనిలో పునరాలోచన చెలరేగింది. తన ఆస్తిని వాళ్లు కాదనటంతో ప్రేమ విలువ అతనికి చూచాయగా తెలిసింది. అతనికి పెళ్లి విలువ కూడా సుజాత ద్వారానే తెలిసింది. తానే పెళ్ళిచేసుకొని ఉండివుంటే సుందరమ్మను బలాత్కా

రించే అవసరం ఉండేది కాదు కనుక బ్రహ్మచర్య దీక్ష పట్ల పునరాలోచన కూడా ప్రారంభమయి ఉంటుంది. సీమంతాదుల పొగడ్తలు, వాళ్లు చేసిన సన్మానం అతణ్ణి కొంత మభ్యపెట్టాయి.

పరమేశ్వరశాస్త్రి ఆస్తికి వారసురాలైన సుజాతకు చెందకుండా చేసి, సంస్కృత కళాశాల స్థాపన సాకుతో అపహరించాలని సీమంతం ఉద్దేశం. ఈ ఉద్దేశం సహజమైందిగా కనిపిస్తుంది. ఆ ఆస్తిని సీమంతం స్వాధీనపరచుకోవటమంటే, అతణి పెళ్ళాడటానికి నిరాకరించిన సుజాతనూ, సుజాతను పెళ్ళాడిన కేశవమూర్తినీ జయించటమే. ఆ విధంగా, ఆ ఇంటి అల్లుడి స్థానాన్ని ఆక్రమించటమే.

పరమేశ్వరశాస్త్రి అనారోగ్యం నుంచి కొంత కోలుకున్న తర్వాత సుజాతతో ముభావంగా ఉండటమేకాదు, తనకు వంటచేసి పెట్టే కరటక శాస్త్రితో.

"నా ఆస్థి కొరకు వచ్చినదేమో, వాండ్లకు సూది మొన మోపినంతైన నీయ" అన్నాడు.

వీలునామా రాసేముందు.

"నేను నా ఆస్థి యావత్తూ సంస్కృత కళాశాల స్థాపనకు వ్రాయుదమని నిశ్చయించుకొంటి" అని స్పష్టంగా చెప్పాడు.

కాని, తన యావదాస్తినీ కేశవమూర్తికి చెందేటట్లుగా వీలునామా రాసి అందరినీ ఆశ్చర్యపరిచాడు. పరమేశ్వరశాస్త్రి మనస్తత్వాన్ని పరిశీలిస్తే ఈ చర్య సహజమైందిగానే కనిపిస్తుంది. పరమేశ్వరశాస్త్రి క్రమశిక్షణకు అలవాటుపడినవాడు కావటంవల్ల ప్రవర్తనలో నిజాయితీ అలవడింది. వ్యతిరేకించినా, సమర్థించినా త్రికరణశుద్ధిగానే చేశాడు. తనకు వంటచేసి పెట్టే విధవరాలు సుందరమ్మను ఒక బలహీన క్షణంలో వశపరచుకొని గర్భవతిని చేసినందుకు, అతడు జీవితాంతం పశ్చాత్తాపంతో కుమిలిపోయాడు. సుందరమ్మ పోలికలు ఉన్నందుకు సుజాతను పెంచుకున్నాడు. కులగోత్రాల హద్దుల్లోనైనా అతనిలో కొంత మానవతా దృష్టి కూడా కనిపిస్తుంది.

సీమంతానికి అతని మిత్రులకు, సంఘంలో మంచిపేరు లేకపోవటం వల్ల, వారి మాటల మీద పరమేశ్వరశాస్త్రికి గురి కుదరనట్లుగా ఉన్నది. కేశవ మూర్తి మీద హద్దుమీరి దుష్ప్రచారం చేయటంవల్ల కూడా పరమేశ్వరశాస్త్రి పునరాలోచనలో పడ్డట్లు కనిపిస్తున్నది. ఫలితంగా కేశవమూర్తిని గూర్చి స్వయంగా అంచనా వేసుకోవటానికి, అతని రచనలను చదివాడు. హేతువాద భౌతికవాదాలను సమర్థిస్తూ రచనలు ప్రారంభించిన కేశవమూర్తి క్రమంగా ఆధ్యాత్మికవాదంవైపు మొగ్గు చూపటం సహజంగా పరమేశ్వరశాస్త్రిని ఆకర్షించి వుంటుంది. కేశవమూర్తి తన ఆస్తిపట్ల ఆసక్తి చూపకపోవటంవల్ల కూడా అతని పట్ల పరమేశ్వరశాస్త్రికి సదభిప్రాయం ఏర్పడింది. కాని ఈ విషయాన్ని అతడు పైకి ఎవరితోనూ చెప్పలేదు. అట్లా చెప్పి ఉన్న పక్షంలో సీమంతాదుల ప్రతిఘట నకు గురయ్యేవాడు. అనారోగ్య పరిస్థితిలో, వృద్ధాప్యంలో వాళ్ళను ఎదుర్కొనే శక్తిసామర్థ్యాలు అతనిలో లేకపోవటంవల్ల తనలోని మార్పును రహస్యంగానే ఉంచాడు. ఈ రహస్యంలోనే అతని వ్యక్తిత్వరహస్యం కూడా ఇమిడి ఉన్నది. అతడు తన అభిమానం చూరగొన్న వారిని విశ్వసించగలడు తన విశ్వాసం చూరగొన్నవారికి సర్వస్వాన్ని అంకితం చేయగలడు. సుజాతకు కాక కేశవ మూర్తికి తన ఆస్తిని రాసి ఇవ్వటం పై అంశాన్ని బలపరుస్తున్నది. డెబ్బై అయిదు సంవత్సరాల వయసులో కూడా పరమేశ్వరశాస్త్రి అది వరకు స్థిరపడ్డ తన అభిప్రాయాలను మార్చుకోగల్గడం అపూర్వ విషయమే. పండిత పర మేశ్వరశాస్త్రితో గ్రాంథికం మాట్లాడించటంలో కీ.శే. కొక్కొండ వెంకట రత్నం పంతులు గారిని27 రచయిత దృష్టిలో పెట్టుకున్నట్లు కనిపిస్తుంది.

పరమేశ్వరశాస్త్రి స్వయంగా సంస్కృత కళాశాల స్థాపనార్థం తన ఆస్తిని రాసి ఇస్తున్నట్లు చెప్పాడు. కనుక, ఎవరికీ వీలునామాపట్ల కుతూ హలం కలగదు. వీలునామా వెల్లడయిన తర్వాత అనుకోని పరిణామానికి ఆశ్చర్యం కలుగుతుంది. ఈ హఠాత్పరిణామం కేశవమూర్తికి విజయాన్ని, సీమంతాదులకు ఘోరపరాజయాన్ని చేకూర్చినట్లుగా చిత్రించాడు రచయిత. పరాజయం పొందామని తెలిసిన తర్వాత కూడా సీమంతాదులు వీలునామా కాగితాల్ని నాశనం చెయ్యాలని ప్రయత్నిస్తారు. ఇది వారిలో మార్పు రాలే దనటానికి సంకేతం. అవకాశవాదం పరాజయం నుంచి గుణపాఠం నేర్చు కోదని సూచన.

పీలునామాతోపాటు రాసిన లేఖ చివరన పరమేశ్వరశాస్త్రి సుందరమ్మను గూర్చి ప్రస్తావించాడు. ఆ భాగాన్ని ప్లీడరుగారు చదవటం పూర్తి చేయగానే అక్కడకు సుందరమ్మగారు రావటం, 'అమ్మా' అంటూ వెళ్ళి సుజాత కౌగిలించుకొని విలపించటం, అసహజ చలనచిత్ర సంవిధానాన్ని గుర్తుకు తెస్తుంది. కాని సుందరమ్మ రాకవల్ల కేశవమూర్తి బలం పెరిగింది. విచ్ఛిన్నం చేయాలనుకున్న దుష్టశక్తుల ప్రయత్నాలు ఆయన కుటుంబం ఏకం కావటానికే దోహదం చేశాయని సూచన. రచయిత దృష్ట్యా—

కేశవమూర్తి విజయం అతని విశ్వాసాల విజయం. మొదట్లో వ్యతిరేకించిన సంప్రదాయం ఆ తర్వాత అతని భావాలను ఆమోదించింది. నిజమైన సంప్రదాయపు భవిష్యత్తును కాపాడే శక్తి అరవిందుని భావాలకే ఉన్నదని సూచన. ఆ విధంగా 'పీలునామా' ఒక తీర్పు కూడా.

ఈ నవలలోని కథాకథనం గూర్చి కొంత పరిశీలన అవసరం. గోపీచంద్ ఇతర నవలల్లో కథానాయకుడు కథ చెప్పటం లేదా రచయిత కథ చెప్పటం అనే రెండు విధానాలు అంటే ఆత్మాశ్రయ పరాశ్రయ విధానాలు గోచరిస్తాయి. ఈ నవలలో అలా కాకుండా, రచయిత చెప్పిన కథతో పాటు, కేశవమూర్తి. సుజాత, సుభాషిణి అనే పాత్రలు ఆత్మాశ్రయ పద్ధతిలో చెప్పిన కథ కూడా చోటుచేసుకున్నది. కేశవమూర్తి డైరీ ద్వారా, సుజాతా పరమేశ్వరశాస్త్రిల ఉత్తరాల ద్వారా కూడా మరికొంత కథను చెప్పటం జరిగింది. అంటే, మిశ్రమ కథాకథన విధానాన్ని రచయిత స్వీకరించాడన్న మాట. డైరీ ద్వారా, లేఖల ద్వారా ఆత్మాశ్రయ లక్షణాన్నే సాధించాడు, కనుక ఈ నవల పరాశ్రయ ఆత్మాశ్రయ విధానాల సమ్మేళనంగా చెప్పవచ్చు.

'"ఫలానా వ్యక్తికి ఇలా జరిగింది" అని మరొక వ్యక్తి అయిన కథకుడు చెప్పిన దానికంటే, అనుభవించే వ్యక్తే 'నాకిలా జరిగింది' అని చెప్పటం సమంజసంగానూ, సహజంగానూ ఉంటుంది.' అనే కారణం వల్ల ఈ విధానాన్ని అనుసరించినట్లు నవలకు ముందు రాసిన 'పరిచయం'లో రచయిత చెప్పుకున్నాడు.

కేశవమూర్తి తాను చెప్పిన కథలో చాలావరకు తమ మంచితనాన్ని

అమాయకత్వాన్ని మాటిమాటికి నిరూపించుకునే ప్రయత్నమే చేస్తాడు. సుజాత కేశవమూర్తికి తోడూనీడా కావటంవల్ల, ఆమె కూడా కేశవమూర్తి ఔన్న త్యాన్ని గురించే చెప్తుంది. కేశవమూర్తి శిష్యురాలు సుభాషిణి చెప్పిన కథ ఆకాశరామన్న సీమంతమేనని నిరూపించటానికి పనికివస్తుంది. పరమేశ్వర శాస్త్రి లేఖ, సుజాత జన్మరహస్యం వెల్లడిచేయటానికేకాక, సీమంతాదుల నీచత్వాన్ని, కేశవమూర్తి ఔన్నత్యాన్ని నిరూపించటానికి కూడా సహక రించింది. ఈ విధంగా కథ చెప్పినవాళ్ళంతా ఒక పక్షానికి చెందినవాళ్ళే. సీమంతం మొదలైన ఇతర పక్షం వాళ్ళకు తమ వాదాన్ని వినిపించుకునే హక్కు లేకుండా చేశాడు రచయిత. ఈ విధంగా రచయిత అనుసరించిన పాక్షిక విధానం పూర్తి ప్రయోజనాన్ని సాధించలేకపోయింది.

ఇక కేశవమూర్తి రాసుకున్న డైరీ విషయం. కొందరికి క్రమం తప్ప కుండా డైరీ రాయటం అలవాటుగా ఉంటుంది. మరికొందరు వీలైనప్పుడు, రాయాలనిపించినప్పుడు రాసుకుంటారు. మొదటి రకం వారి రాతల్లో డైరీ లక్షణం సమృద్ధిగా ఉంటుంది. ముఖ్యంగా డైరీ రాసుకున్న నాటి విశేషాలు కొన్నైనా చోటుచేసుకుంటాయి. కాని, రెండో రకం వారి రాతల్లో రాసిన నాటి విశేషాలు ఉండాలనే నియమంలేదు. గతకాలపు విశేషాలు చోటుచేసు కునే అవకాశం ఎక్కువ. కేశవమూర్తి డైరీ రెండో రకానికి చెందింది. అతడు రచయిత కావటంవల్ల రచనాశక్తి కూడా కనిపిస్తుంది. అందువల్ల నవలలోని ఇతర భాగానికి, డైరీలోని భాగానికి పెద్దగా తేడా కనిపించదు.

ఉదాహరణకు అగస్టు 16 నాడు కేశవమూర్తి తన డైరీలో రాసుకున్న వివరాలలో ఆనాటి విషయాల ప్రస్తావన ఏమీ లేకపోవటం గమనార్హం. సినిమా రంగంలో ప్రవేశించిన తర్వాత తన జీవిత విధానంలో వచ్చిన మార్పును గూర్చి రాసుకొన్నాడు 'వొకరోజు' కన్యకామణి వచ్చి సినిమాల్లో వేషం ఇప్పించమని కోరటం; మరో 'వొకరోజు' వాళ్ళ ఇంటికి భోజనానికి వెళ్ళటం, కన్యకామణి తల్లితో సాహిత్యచర్చ చేయటం; అరవిందుల ప్రస్తావన ఆ 'మరు నాటి' నుంచి కన్యకామణికీ తనకూ లైంగిక సంబంధం ఉన్నట్లుగా సినిమా రంగం అంతా 'చిలువలు పలువలు' ఊహించి చెప్పుకోవటం— మొదలైన అంశాలున్నాయి. కాని అగస్టు 16 నాడు జరిగిందేమిటో మాత్రం లేదు.

కేవలం గతంలోకి వెళ్ళటానికి డైరీని ఒక సాధనంగా ఉపయోగించుకోవటమే కనిపిస్తుంది. సుదీర్ఘమైన సంభాషణలవల్ల, ప్రచారాత్మక, జ్ఞానదాయక అంశాలు చోటుచేసుకోవటంవల్ల డైరీలోని వైయక్తిక లక్షణం దెబ్బతిన్నది.

సుజాత కేశవమూర్తులు ఒకరి తర్వాత ఒకరు కొంత కథను చెప్పటం— నవలలోని కథాకథనంలో రచయిత అనుసరించిన మరో పద్ధతి. సుజాతా కేశవమూర్తులకు శ్రోతలు లేరు. అంటే వాళ్లిద్దరూ పాఠకులను ఉద్దేశించే కథను చెప్పారు.

ధవళేశ్వరంలోకి సుజాత కొంత కథను చెప్పగానే, వరంగల్లులోని కేశవమూర్తి ఆ తర్వాతి కథను చెప్తాడు. సరిగ్గా అతడు ఆపిన చోటునుంచి మళ్ళీ సుజాత కథను కొనసాగిస్తుంది. ఆ తర్వాతి కేశవమూర్తి తన వంతు కథను చెబుతాడు.

ఇవి ఆ కథ ప్రారంభ వాక్యాలు :

'నాకు ఇంతవరకూ ఈ సంఘటన తలుచుకోటానికే భయంగా వుండేది. ఇతరులతో చెప్పుకోటానికి సిగ్గుగా వుండేది. ఇప్పుడెలాగూ సుజాత చెప్పటం ప్రారంభించింది గనుక కాస్త ధైర్యం వచ్చింది. ఈ సందర్భంలో నేను చెప్పుకోవలసిన విషయాలు కొన్ని వున్నాయి.'

తమ జీవితాలను మార్చివేసిన 'సంఘటన'ను గూర్చి ధవళేశ్వరంలోని సుజాత చెప్పటం ప్రారంభించిందని, వరంగల్లులోని కేశవమూర్తికి ఎట్లా తెలిసింది? కేశవమూర్తి రచయిత ప్రతినిధి పాత్ర కావటంవల్ల, ఇంకా సరిగ్గా చెప్పాలంటే రచయితా, కేశవమూర్తీ ఒక్కరే కావటంవల్ల వచ్చిన ఇబ్బంది ఇది. సాధారణంగా కథకుడైన రచయితలో కనిపించే 'సర్వజ్ఞత్వం' (Omniscience) కథానాయకునికి కొంత అబ్బినట్లు కనిపిస్తుంది. సర్వజ్ఞత్వం సామాన్య మానవ లక్షణం కాదనే విషయం గమనార్హం.

తర్వాత పునస్సమాగమం వరకు సుజాత కథను కొనసాగిస్తుంది.

ఇక నవలలో స్పృశించవలసిన మరొక అంశం కేశవమూర్తి 'తాత్త్విక పరిణామం.'

రచయిత కేశవమూర్తిని పరిణామశీలిగా చిత్రించదలచుకున్నాడు మొదట్లో కేశవమూర్తిని 'మార్క్సిజం' ఆకర్షించింది. అతడు కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వం తీసుకునేవాడే, కాని నాసరయ్య వంటి అరాచకవాదితో, ఎదుటి వ్యక్తి పట్ల శత్రుభావం ప్రదర్శించే అవివేకితో పరిచయం కలగటం వల్ల అతడు ఆ పార్టీకి దూరంగా ఉండిపోయాడు.

మద్రాసు వెళ్లే ముందు—

'సిద్ధాంత నిర్వచన, పార్టీ నిర్మాణం అనే గట్లను దాటి జీవితం ప్రవహిస్తూ వుంది....మనిషి నీతిగా బ్రతికితే చాలు....' అనే అభిప్రాయం వ్యక్తం చేశాడు. జీవితం సిద్ధాంతానికీ, ఆచరణకూ అతీతమైందనీ విశ్వాసాన్ని ప్రకటించాడు. 'నీతి' ప్రధానమైందని భావిస్తున్నాడు. కనుక, అతడు వైయక్తిక జీవితం మీదనే తన దృష్టిని కేంద్రీకరించాడని చెప్పవచ్చు. అప్పటికే అతనికి హేతువాదం మీద కూడా నమ్మకం కొంత సడలింది. మద్రాసులో కన్యకామణి తల్లితో మాట్లాడుతున్నప్పుడు—

'ఆనాటికి హేతువాదం మీద భక్తి కొంతవరకు సడలినా, మానవాభ్యుదయంలో 'సెన్టిమెంట్' యొక్క ప్రయోజనం పూర్తిగా గ్రహించినవాణ్ణి కాదు.' అనుకున్నాడు.

ఇక్కడ 'సెంటిమెంట్' మానవాభ్యుదయానికి సహకరించిందన్న విశ్వాసాన్ని వెల్లడించాడు. ఇది మార్క్సిజానికి, హేతువాదానికీ వ్యతిరేకం. అందువల్ల అతడు ఈ రెండూ వ్యతిరేకించే భావప్రపంచంవైపు తన దృష్టిని మరల్చాడని తెలుస్తున్నది. స్థూలంగా నాస్తికత్వం నుంచి ఆస్తికత్వం వైపు వచ్చాడని చెప్పవచ్చు. ముఖ్యంగా, తమ జీవితాన్ని విచ్ఛిన్నం చేయబూనుకున్న సంఘటన జరిగిన తర్వాత అతనికి జీవిత విధానాన్ని మార్చుకోవాలనే కోరిక కలిగింది. మొదటినుంచీ కేశవమూర్తిలో కనిపించే పరాధీన ప్రవృత్తితోపాటుగా, ఈ సంఘటనవల్ల కలిగిన భద్రతారాహిత్య భావంకూడా ఆధ్యాత్మికరంగంలోకి ప్రవేశించటానికి కారణాలుగా కనిపిస్తున్నాయి.

'జీవితంలోని ముఖ్యసూత్రం తాను ఎక్కడో మిస్ అయినట్లు' అనిపించింది. అందుకే తాను చేసిన పొరపాటేమిటో తెలుసుకోవటానికి అర

విందుల 'దివ్యజీవనం' అనే గ్రంథాన్ని చదివాడు. 'అరవిందుడు తన సిద్ధాంతంలో భౌతికవాదానికి కూడా ఉచితస్థానాన్ని ఇచ్చిన ఆధ్యాత్మికవేత్త. అందువల్ల ఆ గ్రంథం తెరిచీతెరవగానే ఆధ్యాత్మిక భౌతికవాదాలు వొకదానికి వొకటి వ్యతిరేకంకాదనే భావం కలిగి కేశవమూర్తి హృదయంలో చెలరేగివున్న ఘర్షణ విడిపోయి మనస్సు శాంతపడి వొక నూతనదృష్టికి అంకురార్పణం ఏర్పడింది.

ఇదివరకు కేశవమూర్తిని ప్రభావితం చేసిన మార్క్సువాద హేతువాదాల అవశేషాలను అతడు పూర్తిగా తొలగించుకోలేడు. అట్లాగే, అనుభవంలోకి వస్తున్న విజ్ఞానశాస్త్రాన్ని తృణీకరించలేడు. అందువల్ల అటు భౌతికవాదానికీ, ఇటు ఆధ్యాత్మికవాదానికీ సమన్వయం జరిగితే, దేన్నీ విడవవలసిన అవసరంగాని, సంఘర్షణకు గురికావలసిన అవసరంగాని ఉండదు. అదే అతనిలో ఏర్పడ్డ నూతనదృష్టి.

అతడు రామమోహనశాస్త్రి ద్వారా అరవిందుని తత్త్వం గూర్చి తెలుసుకున్నాడు.

చైతన్యం వేరు, పదార్థం వేరు కాదని, పదార్థంలోనే చైతన్యం నిగూఢంగా దాగి ఉన్నదని, నిగూఢంగా ఉన్నదే బహిర్గతం అవుతుందని, బహిర్గతమైన ప్రాణంలోనే, అంతర్గతంగా మనస్సు ఉన్నదని రామమోహనశాస్త్రి చెప్పాడు.[28] అతీత మానసిక ప్రవృత్తిని సాధించటానికి ముందు మానవుడు దాటవలసిన దశలను గూర్చి వివరించాడు. తర్వాత 'అతీత మానసిక చైతన్యం' గూర్చి వివరించాడు.

రామమోహనశాస్త్రి అరవిందతత్త్వం వివరిస్తున్నప్పుడు వచ్చికూర్చున్న లాయర్ ఆ తర్వాతి రోజు కేశవమూర్తితో రాత్రి తనకు నిద్రపట్టలేదనీ, రాత్రంతా అరవిందులు తనను విడిచిపెట్టలేదనీ చెప్తాడు. దీన్నిబట్టి అరవిందులు లేదా శ్రీమాత తమ భక్తులకు శక్తిని పంపుతుంటారని రచయిత సూచించాడు. ఒక్కోసారి ఈ శక్తి లేదా జ్ఞానం ఎక్కువైతే భక్తులు తట్టుకోలేరనీ, అందుకే, ఈ లాయర్ కూడా జ్ఞానాన్ని తట్టుకోలేకపోయాడనీ రచయిత చిత్రించాడు. ఇందుకు నిదర్శనం కనిపిస్తున్నది. తనకు సహాయంగా వచ్చిన శక్తి చాలా

అధికంగా ఉన్నదని ఒక శిష్యుడు తెలియజేసినప్పుడు, అరవిందులు ఈ విధంగా ఓదార్చారు. 'నీకు అంతబాధ కలిగినందుకు విచారిస్తున్నాం. శ్రీమాత నీకు బాధ కలిగించాలని అంత శక్తిని పంపలేదు. నీకు సహాయపడాలని పంపారు.'29

అలాంటి అనుభవాలను ఆధారంగా చేసుకొని లాయర్ పాత్రను రచయిత చిత్రించినట్లు కనిపిస్తున్నది.

తర్వాత అందరితోపాటు కేశవమూర్తి అరవిందుల దర్శనం చేసుకోవటానికి వెళాడు. అతీతమానసిక చైతన్యం సాధించటానికి కొన్ని మజిలీలను దాటవలసి ఉన్నట్లే మేడమీది అరవిందుని దర్శనం చేసుకొవటానికి కూడా మజిలీలు దాటాలి. కేశవమూర్తి చివరి మజిలీలో ఉండగా మదర్ అరవిందుల ఛాయాచిత్రాలు చూశాడు. ఆ ఛాయాచిత్రాలలో జీవచైతన్యం తొణికిసలాడింది తర్వాత కొన్ని క్షణాలకు అతనికి అరవింద దర్శనం లభించింది.

'.... మనిషిసైజులో వున్న అరవిందుల యొక్క మదర్ యొక్క చిత్తరువులు పెద్ద ఫ్రేములో బిగించబడి వున్నాయి అరవిందులూ మదర్ వొక కుషన్లో తలలు వంచుకొని కూర్చుని వున్నట్లు చిత్రకారుడు ఆ చిత్తరువులను గీశాడు.... అంతలో అరవిందుల చిత్తరువు కదిలింది. తలపైకెత్తి అతని వంకకు చూచింది. అరవిందుని ఆ కదలికకు మదర్ చలించింది. అరవిందులను తిలకించింది....'. అకస్మాత్తుగా అప్పుడు గ్రహించాడు కేశవమూర్తి అవి చిత్తరువులు కావనీ, అరవింద మదర్‌ల సజీవమూర్తులేననీ.

ఈ సందర్శన సన్నివేశాన్ని అత్యద్భుతంగా చిత్రించాడు రచయిత. అంతకుముందు తాను చూసిన ఫోటోలలోని మదర్ అరవిందులతో కేశవమూర్తి పూర్తి తాదాత్మ్యాన్ని పొందటంవల్ల, కేశవమూర్తి మదర్ అరవిందుల సజీవమూర్తులను కూడా ఫ్రేంలోని చిత్తరువులనే అనుకున్నాడు. ఇది అతని మనస్సుమీద అప్పుడప్పుడే పడుతున్న అరవిందుల భావాల ముద్రకు చక్కని ప్రతిరూపం.

దర్శనానికి పూర్వం, మొదటి మజిలీలో ఉన్నప్పుడు "దర్శనానికి వొచ్చిన వారందరి సంగతీ అరవిందులకు ముందుగా తెలుస్తుందా ?' అనే

ప్రశ్న అతని మనసులో ఉదయించింది. అందరి సంగతి కాకపోయినా తమకు దగ్గరగా ఉండే చిత్తసంస్కారం కలిగినవారి సంగతైనా తెలుస్తుంది అని పించింది. అకస్మాత్తుగా తన సంగతి తెలుస్తుందా అని అనుమానం వచ్చింది.'

అరవిందులు అతణ్ణి ప్రత్యేకంగా చూడటం కేశవమూర్తి చిత్తసంస్కారం ఉన్నవాడనటానికీ, అరవిందులు అతణ్ణి కరుణించారనటానికీ నిదర్శనంగా రచయిత విశ్వసిస్తున్నాడు.

పైచిత్రణ ద్వారా కేశవమూర్తి పాత్రను ఒకస్థాయికి తీసుకుపోయిన గోపీచంద్, ఆ తర్వాత ఆ స్థాయిని కొనసాగించలేకపోయాడు.

అరవిందుల దర్శనానికి ముందు కేశవమూర్తి ప్రవర్తనకు, దర్శనం చేసుకొన్న తర్వాతి కేశవమూర్తి ప్రవర్తనకు పెద్దగా తేడా లేకపోవటం గమనార్హం. పాండిచ్చేరీ నుంచి రాగానే తారసపడ్డ నాసరయ్య మద్రాసులో మద్యనిషేధం అమలులో ఉన్నందుకు కేశవమూర్తి పాండిచ్చేరి వెళ్లి తాగి వచ్చాడని ఆరోపించినప్పుడూ, 'అరవిందులకూ, మదర్‌కూ వున్న సంబంధాన్ని ఎంతో మకిలపరిచి' మాట్లాడినప్పుడూ, పూర్వం సీమంతం, కృష్ణమూర్తి మొదలైనవాళ్లు తన మీద నిందలు వేసి దూషించినప్పుడు ప్రవర్తించినట్లే ప్రవర్తించాడు. తనను నిందించినప్పుడు కాకపోయినా, అరవిందులను దూషించి నప్పుడైనా కేశవమూర్తి ఖండించి వుండవలసింది. నాసరయ్య వింటాడా ? అన్న ప్రశ్నతో గానీ, అతని ప్రతిక్రియతో గానీ కేశవమూర్తికి సంబంధం లేదు. కేశవమూర్తి విరాగి కాడు. తాను ఎవరివల్లనైతే ప్రభావితుడయ్యాడో, తాను ఎవరినైతే దైవం తర్వాత దైవమంతటి మహనీయుడని భావిస్తున్నాడో, ఆ అరవిందులను దూషిస్తుంటే 'మెదలకుండా' ఊరుకోవటం వ్యక్తిత్వం లేని వాడి లక్షణం.

పరమేశ్వరశాస్త్రి ఆస్తి మీద కేశవమూర్తి ఆశలేమీ పెట్టుకోలేదు. కాని, అనుకోకుండా పరమేశ్వరశాస్త్రి వీలునామా వల్ల అతనికి ఆస్తి సంక్రమించిన తర్వాత కేశవమూర్తి మనస్తత్వం ఎట్లా ఉన్నదో తెలుసుకోవటం అవసరం.

'వీలునామా'లో స్పష్టంగా రాయకపోయినా, వ్యక్తి స్వార్థానికి కాక

సమాజ ప్రయోజనం నిమిత్తమే తన ఆస్తి ఉపయోగపడాలనీ పరమేశ్వరశాస్త్రి ఉద్దేశం.

'సీమంతాది మహాశయులు సంస్కృత కళాశాల స్థాపన కార్యక్రమం బును నా వద్ద హెచ్చరించునాటికే నా మనస్సు మారియుండెను. అందువలన వారి కార్యక్రమము నాకేమాత్రము హితవును కలిగించలేదు. సాధనమును సద్వినియోగపరచగలిగిన ప్రతిభ నీ యొక్కనికే గలదను దృఢ విశ్వాసము నా కప్పటికే కలిగియుండెను.' అని లేఖలో పరమేశ్వరశాస్త్రి స్పష్టంచేశాడు.

ఈ అవగాహనతోనే కేశవమూర్తిని రచయితగా అభిమానించే సుభాషిణి పరమేశ్వరశాస్త్రి ఆస్తితో ఒక ఆశ్రమాన్ని స్థాపించి, తన లాంటి వాళ్ళ జీవితాలను చరితార్థం చేసుకునే అవకాశం కల్పించమని కోరుతుంది. కాని కేశవమూర్తి ఇందుకు అంగీకరించడు. అందుకు అతడు చెప్పే ఒక కారణం 'భౌతిక సాన్నిహిత్యం' పెడతోవలు పట్టిస్తుందని మరి మనసు పెడతోవలు పట్టకుండా ఆధ్యాత్మిక శిక్షణ ఇవ్వటానికీ, సమ్యక్ దృష్టి కలిగించటానికి కాక పోతే ఆశ్రమాలెందుకు ? అరవిందుల ఆశ్రమం తాను స్వయంగా దర్శించి నప్పుడు 'భౌతిక సాన్నిహిత్యం' కేశవమూర్తిని పెడతోవ పట్టించిందా ? అన్న ప్రశ్నలు కలుగుతాయి. ఎవరి వృత్తిలో వారుంటూనే అరవిందుని ఆధ్యాత్మికవాదాన్ని ఆచరణలో పెట్టవచ్చుననే వాదం కూడా లౌకిక దృష్టితో సమంజసంగా కనిపించినా, కొంత వివాదాస్పదమైనదే. వ్యక్తిగతమైనది కావటంవల్ల, సాధకుని ప్రవృత్తి మీద ఆధారపడ్డ విషయమిది. కొందరికి ఆధ్యాత్మిక సాధనకు వృత్తి అడ్డంకుగా అనిపించవచ్చు. మరికొందరికి ఆశ్రమ వాతావరణంలోనే సాధన సాధ్యం అనిపించవచ్చు. ఆధ్యాత్మిక రంగంలో ముందంజ వేయటానికి పుస్తకాలు కాక, గురువు గారి మార్గదర్శకత్వమే ముఖ్యమని ఆధ్యాత్మికవాదులు విశ్వసిస్తారు. అరవిందులకు కూడా ప్రారంభదశలో గురువున్నాడు.30

మొత్తం మీద తేలేదేమిటంటే కేశవమూర్తికి ఆశ్రమాన్ని స్థాపించటం ఇష్టం లేదని, మరి ఏ రూపంలో ఆ సంపదను సద్వినియోగపరచదలచుకున్నాడో స్పష్టంగా చెప్పవలసిని నైతిక బాధ్యత కేశవమూర్తి మీద ఉన్నదని భావించటంలో తప్పులేదు.

ఈ విషయంలో అతడు మౌనం వహించాడు.

నవలకు ముందు రాసిన 'పరిచయం'లో రచయిత మనిషికీ మనిషికీ మధ్యన అనేక కారణాలవల్ల గోడలు ఏర్పడుతున్నాయని చెప్తూ—

'ఈ వలయాలు పార్టీల పేరున, సంఘాల పేరున, గ్రూపుల పేరున మనుతున్నాయి. ఏ పేరున మనినా వలయం వలయమే.'

'ఈ వలయాల వారికి తమ వలయంలో పుట్టి పెరిగి దానినధిగమిం చిన వారి మీద ఎక్కువ పగ' అన్నాడు.

ఈ భావాలను నిరూపించటానికే నవల రాసినట్లున్నాడు. తమ నుంచి వేరై, తమకంటే గొప్పవాడైనందుకు కేశవమూర్తి మీద సీమంతాదులు పగ సాధిస్తారు.

రచయిత అరవిందుని తాత్త్వికభావౌన్నత్యాన్ని చిత్రించటమే ప్రధాన లక్ష్యంగా భావించాడు. కాని, రచయిత లక్ష్యం నెరవేరలేదు. రచయిత సమర్థించదలచుకున్న తాత్త్వికభావానికీ, దానితో ఏకీభవించలేని, లేదా దాన్ని వ్యతిరేకించే తాత్త్విక భావానికీ ఆయా ప్రతినిధి పాత్రల ద్వారా సంఘర్షణను సృష్టించి, ఆ సంఘర్షణలో రచయిత సమర్థించదలచుకున్న తాత్త్వికభావం లేదా ప్రతినిధి పాత్ర విజయం సాధించినట్లుగా, కళాత్మ కంగా చిత్రించి ఉంటే, రచయిత లక్ష్యం నెరవేరేది. రచయిత తన పాత్ర లను తాత్త్విక అవసరాలకు అనుకూలంగా ఉపయోగించుకోలేకపోయాడు. ఉదాహరణకు 'అరవిందుని భావాలన్నీ ఉపనిషత్తులనాటివి. అందులో ఆధు నికమైనదల్లా పదజాలం మాత్రమే'31 అని వాదించే భౌతికవాదులున్నారు. అలాంటి భౌతికవాదిగా సీమంతం పాత్రను కళాత్మకంగా రూపొందించి ఉంటే బాగుండేది.

కాని, సీమంతాదులు కేవలం అసూయతో, అర్థంలేని శత్రుత్వంతో

మాత్రమే కేశవమూర్తిని వ్యతిరేకించారు. ప్రధానంగా వారు తత్త్వాన్ని కాక వ్యక్తిని వ్యతిరేకించారు. అందువల్ల కేశవమూర్తి వ్యక్తిగానే విజయం సాధించాడు.

కేశవమూర్తి విశ్వసించిన అరవిందుని సిద్ధాంతం[32] ఆధ్యాత్మిక భౌతికవాద సమన్వయం మీద ఆధారపడి ఉన్నందువల్ల, ఆ పాత్ర అంతరంగంలో కూడా సమన్వయానికే తప్ప సంఘర్షణకు చోటులేకపోయింది.

చివరిదశలో కేశవమూర్తి గొప్పదనాన్ని గుర్తించిన రమణారెడ్డి బృందం వారు అతని నిజమైన అనుయాయులయ్యారు. ఇది కేశవమూర్తికి లభించిన మరో విజయమని రచయిత సూచించటంతో నవల పూర్తయింది.

పరమేశ్వరశాస్త్రి వీలునామా ద్వారా ఆస్తి సంక్రమించిన తర్వాత, నవలా ప్రారంభంలో మొదలుపెట్టిన 'పురుషోత్తముడు' అన్న నవలకు కేశవమూర్తి ముగింపు వాక్యాలను రాశాడు. ఇవి ఈ నవలకు కూడా ముగింపు వాక్యాలే. ఈ ఘట్టంలో కొంత అరవింద తత్త్వాన్ని కూడా వివరించాడు. అందువల్ల కేశవమూర్తి రచించిన 'పురుషోత్తముడు', గోపీచంద్ రచించిన 'పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా' రెండూ ఒకటేనని, కేశవమూర్తే పురుషోత్తముడనీ[33] సూచన.

నవలలో కనిపించే అరవిందుల తాత్త్విక సిద్ధాంత ప్రస్తావన ఇతరుల కోసం, ముఖ్యంగా పాఠకులకోసం ఉద్దేశించినట్లు కనిపిస్తున్నది. కేశవమూర్తి జీవితాచరణలో ఆ తత్త్వం ప్రతిఫలించలేదు. కనుక, రచయిత లక్ష్యం నెరవేరలేదు.

అందుకే, కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి[34] పొందినా, అగ్రశ్రేణి తెలుగు విమర్శకుల మన్ననకు మాత్రం ఈ నవల నోచుకోలేకపోయింది.

ఈ నవల 'విఫల ప్రయత్నము' అనీ35, 'ఏ విధంగా చూసినా సాధింపబడిన సాహిత్యపు విలువలు మృగ్యం'36 అనీ, 'ప్రయోగాత్మక రచనల్లో ప్రయోగాత్మక రచన'37 అనీ, ఆర్. ఎస్. సుదర్శనంగారు; 'సాహిత్య దృష్ట్యా పరమ అసహ్యమైన'38 నవల అనీ రాచమల్లు రామచంద్రా రెడ్డిగారు విమర్శించారు.

మూడవ ప్రకరణం

## సూచికలు

### 1. పరివర్తనం

1. గోపీచంద్ మొదటి నవల ప్రథమ ముద్రణ. జూన్ 1943.
2. పరివర్తనం, పుటలు 76, 77.
3. 'Isle of beauty,' Thomas Haynes Bayly.
4. 'భ్రాంతులు – విభ్రమాలు' నిర్వచనంకోసం ఈ సిద్ధాంత వ్యాసంలోని రెండవ ప్రకరణం చూడండి.
5. 'పరి'. పుట. 95.
6. 'యం యన్. రాయ్‌వ్యాసాలు,' అను. కె. రాధాకృష్ణమూర్తి పుట. 42.

### 2. మెరుపుల మరకలు

7. ఈ నవల 'ఆంధ్రప్రభ' దినపత్రిక ఆదివారపు అనుబంధాలలో 6-11-1960 నుంచి 12-3-1961 వరకు సీరియల్ నవలగా వెలువడింది. ప్రథమ ముద్రణ: దీప్తి కన్సరన్స్, వరంగల్, జూన్ 1961.
8. ఫ్రెంచి సాహిత్యంలో అంతర సంభాషణకూ, భాషకూ గొప్పపేరు పొందిన జీన్‌పాల్ సార్త్రే కథ 'Intimacy ప్రస్తావన ఇది. 'Intimacy is probably the most successful and the most entertaining interior monologue in French literature. Sartre's mastery of the Language is extra ordinary'. అంటున్నాడు, పుస్తకానికి ముందు పరిచయంలో హెన్రీపైర్.

—The wall and other stories, Jean poul Sartre, translated by Lloyd Alexander.

9. Ambivalence : Simultaneous existence of contradictory and contrasting emotions towards the same person. (In Psychoanalysis it is held that any object or person may have (according to some writers must have) both of two opposite affective values. e. g. Love and hate).

— Dictionary of Psychology, P. 11.

10. The term anti-novel was first used in 1957 by Jean poul Sartre in an introduction to Nathaalre Sarranti's 'Portraite d'unin Connu' (First Published 1947, 'Portrait of a man unknown' 1958) — The new Encyclopaedia Britanica, Vol. I. (1974)

11. 'Literature has never really explored even their Surfaces'

—Twentieth Century French Literature : Harry T. Moor, 1969, Anti-literature, Literature, p. 117.

12. 'యోగసూత్ర సిద్ధాంతము', పుట 27, టంగుటూరి ప్రకాశం.

13. 'That which separates you from God is mind', Siva-nanda, 'Mind - its mysreries and Control'.

14. 'tran e and ecstasy are of a temporary nature, though during their continuance one can experience Supreme bliss. They are usually, however experienced with out any spiritual significance. Moreover neither are at the command of the aspirant. Samadhi is essenti-

ally a spiritual condition which is wooed and induced after great effort. An advanced yogi develops the capability to attain it at will.

—'Mahayogi Sri Aurobindo', P. 213, R.R. Diwakar.

15. 16. 'Sidhi is final attainment, reaching a point of perfection, fulfilment. Sidhi in spiritual life usually means the freedom of the Soul (Moksha or Mukthi) even while living (Jeevanmukthi). It is the last but the most important of the four objects of the traditional Indian system of life, namely religion (Dharma), possessions and wealth (Artha), fulfilment or desires (Kama) and liberation of Soul (Moksha)

—Mahayogi Sri Aurobindo, Pages 210, 211,
R. R. Diwakar.

17. 'బయట మేఘాలు ఒకదాన్నొకటి ఒరుసుకుంటున్నాయి. ఒకదానితో వొకటి ఘర్షణపడుతున్నాయి....వర్షబిందువుల రూపంలో స్వేద జలాన్ని రాలుస్తున్నాయి. ఉండివుండి వొక్క మెరుపు మెరిసింది...." మె. మ.. పుటలు 169, 170.

18. 'రచయితగా గోపీచంద్', పుటలు 13, 14, దోనేపూడి రాజారావు.

19. The Razor's edge, Pages 152, 153.

20. Ibid. P. 188.

## 3. పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా

21. ప్రథమ ముద్రణ సెప్టెంబర్ 1961, నవోదయ పబ్లిషర్స్, విజయవాడ-2.

22. పం. ప. వీ., పుట 66.

23. 'రాక్షసుడు చిత్రీకరింపబడినంత నల్లగా వుండడు' (ఆంగ్లసూక్తి)

24. 'అనుమానం వచ్చినప్పుడు వదిలిపెట్టు' (ఆంగ్లసూక్తి)

25. సీమంతం తన రచనలను 'కేశవమూర్తితో దిద్దించుకునేవాడు." పం. ప. పీ., పుట 38.

26. 'యువ' మాసపత్రిక, జూన్ 1960.

27. 'బిచ్చెపు మచ్చుకంటీ। తండులంబులు నిండుకున్నయవి' అనేవారట.

28. పం. ప. పీ., పుట 243.

29. 'శ్రీ అరవిందులు', పుట 105, నవజాత (అను మంగమ్మ).

30. 'Mahayogi Sri Aurobindo' P. 165, R. R. Diwakar.

31. భారతీయ తత్వశాస్త్రము, పుట 205, ఏటుకూరి బలరామమూర్తి.

32. చూ. ఈ సిద్ధాంత వ్యాసం 'ప్రభావం పరిణామం' ప్రకరణంలో ఆధ్యాత్మికవాద ప్రభావం.

33. 'ఈ అంశాన్ని సుభాషిణి పాత్ర ద్వారా రచయిత ముందే సూచించాడు. 'మహా మేధావులు' అనేది సుభాషిణి, 'కరుణామూర్తులు' అనేది కన్యకామణి, 'పరమ అలౌకికులు' అనేదాన్ని నేను (సుజాత), 'మన ముగ్గురం అనుకున్నదీ సత్యమే. ఈ మూడు గుణాలూ ముప్పేటలుగా పెనవేసుకున్న వ్యక్తే పురుషోత్తముడు' అని నిగ్గు తేల్చేది సుభాషిణి.' —పం.ప.పీ., పుటలు 190, 191.

34. 1963లో ఈ నవలకు కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి లభించింది. రచయిత మరణానంతరం లభించిన అవార్డు ఇది

35. 'సాహిత్యంలో దృక్పథాలు,' పుట. 134.

36. 37. Ibid పుట. 136.

38. 'సారస్వత వివేచన' పుట. 49.

నాల్గవ ప్రకరణం

నవలికలు

# 1. పిల్లతెమ్మెర

పెళ్లికి ముందు పెళ్లి తర్వాత వ్యవస్థాపరమైన కట్టుబాట్లను ఉల్లంఘిం చిన స్త్రీ శమంతకమణి. ఆమె మనస్సు ఎప్పుడూ నిత్యనూతనమైన సుఖాన్ని కాంక్షించటమే, అందుకు కారణం. ఆమెదొక ప్రత్యేక వ్యక్తిత్వం.

సాధారణంగా ఒక అనాథబాలిక పరుల పోషణలో పెరుగుతున్నప్పుడు తనకు తానే ఎన్నో కట్టుబాట్లను విధించుకుంటుంది. తల్లిదండ్రులెవరో తెలియని శమంతకమణి ఒక పోలీసు సబిన్స్పెక్టరు పోషణలో పెరుగుతున్నప్పుడు కూడా ఎలాంటి కట్టుబాట్లకు లొంగలేదు. పిల్లలులేని కాలంలో తనను పెంప కానికి స్వీకరించిన పోషకునికి తర్వాత పిల్లలు కలగటంతో తన కాళ్లమీద తాను నిలబడవలసిందేనన్న అవ్యక్తభావం, ఆమెలో సహజంగా వున్న స్వేచ్ఛాప్రవృత్తిని ప్రోత్సహించింది. తాను అనాథననే భావాన్ని జయించ టానికి కూడా ఆమె ఈ స్వేచ్ఛాప్రవృత్తిని ఆశ్రయించింది.

సబిన్స్పెక్టరు పోలీసు మనస్తత్వంతో శమంతమణిని అదుపులో పెట్ట డానికి చేసిన ప్రయత్నం ఆమెలోని స్వేచ్ఛాప్రవృత్తిని పెంచటానికి తోడ్పడిందేగాని తగ్గించలేకపోయింది.

యౌవనం జీవితంలో మలుపులకు కారణమౌతుంది అని శమంతకమణి లాంటి వాళ్లకు అగ్నిపరీక్షగా పరిణమించటం సహజమే. తన స్త్రీత్వ సౌందర్యంతో స్వచ్ఛమైన సరళప్రేమాస్పద వ్యక్తిత్వంతో ఎవరినైనా ఆకర్షించ గల శక్తిని శమంతకమణికి యౌవనం ప్రసాదించింది. తనలో ఈ శక్తి

ఉన్న సంగతి ఆమెకు కొంత ఆలస్యంగానే తెలిసి ఉండవచ్చు. తొలి యౌవనాన్ని మాత్రం బాల్యలక్షణాలే పాలించాయి.

పెళ్లికి ముందు ఒక కుర్రవాడితో లేచిపోయి రెండు నెలల తర్వాత ఏసినిమాకో షికారుకో వెళ్లివస్తున్న దానికి మల్లే తిరిగి ఇంటికి వచ్చిన సన్నివేశం, శమంతకమణిని గూర్చి ఆలోచించటానికి ఆమెను అర్థం చేసుకోవటానికి తోడ్పడుతుంది.

సాంఘిక నియమాల ప్రకారం కుర్రవాడితో లైంగిక సంబంధం తప్పని తెలిసే లేచిపోయింది. అయితే, కేవలం లైంగిక వ్యామోహంతో ఆ పని చేసినట్లు అనిపించినా, తర్వాతి సన్నివేశాలను చూస్తే అట్లా అనిపించదు. ఈ దశలో గుర్తించవలసిన ముఖ్యమైన అంశం, ఆమె చాలా సహజంగా తిరిగి రావటం. ఆమెలో అపరాధ భావమేమీ లేదు. తాను చేసిన పనిలో తప్పేమీ కనిపించదు।

ఆమెను పోషకుడు కొట్టాడు, ఏడ్చింది. బయటకు వెళ్లగొట్టాడు, బజారులో నిలబడింది. ఆమె జీవలక్షణాన్ని ఈ సన్నివేశంలో చక్కగా చిత్రించాడు రచయిత. శమంతకమణి తన అనుభవంలోకి వచ్చే దేన్నైనా స్వీకరిస్తుంది. ఏ క్షణానికి ఆ క్షణమే ముఖ్యమనుకొని జీవిస్తుంది

తన ప్రవర్తనను మార్చుకొనలేకపోతే, సబిన్స్పెక్టరు ఇంటినుండి వెళ్లగొడతాడనీ అప్పుడు తాను వీథినపడవలసి వస్తుందనీ, ఆమె ఎప్పుడూ ఆలోచించినట్లుగాని, అందుకు మానసికంగా సంసిద్ధమయినట్లుగాని, మనకు ఎక్కడా కనిపించదు. అందుకు కారణం, ఆమెకు వీథి కొత్తది కాకపోవటమే!

తనకు తెలియని వయసులో తన ప్రమేయం లేకుండా ఏర్పడిన ఒక అదుపు, తొలగిపోయినందుకు బహుశ ఆమె సంతోషించే ఉంటుంది

తల్లి ఆదేశానికి కట్టుబడి, శమంతకమణిని కాపాడే బాధ్యత తనమీద ఉన్నదని భావించి, ఆమెను రామనాథం పెళ్లిచేసుకున్నాడు. ఈ చర్య అతని సంస్కారంలో ఒక ముఖ్యమైన భాగమైన అభ్యుదయదృష్టిని వెల్లడిచేస్తుంది.

రామనాథం ఒక అరుదైన ఆస్తికుడు. ఆమె ఇంటి పక్కనే ఉంటూ, ఆమె ప్రవర్తనను కళ్ళారా చూసి కూడా జీవిత భాగస్వామినిగా అంగీకరించాడు. హృదయపూర్వకంగా ప్రేమించాడు.

శమంతకమణి మనసునకు కొంత నిలకడ చేకూర్చటానికి, ఆమె దృష్టిని భగవంతుని పరం చేయాలని ప్రయత్నించాడు.

ఇది రామనాథం విశ్వాసానికి సంబంధించిన విషయం. అంతేకాదు, ఈ విధంగానైనా తనకూ శమంతకమణికీ మధ్యన ఉన్న సంబంధం స్థిరత్వాన్ని పొందుతుందని కూడా అతడు ఆశించాడు. అయితే, ఆమె స్వేచ్ఛాప్రవర్తిని అదుపు చేయటానికి ప్రయత్నించకపోవటంలో విశాల హృదయం, అపురూపమైన సంస్కారం కనిపిస్తాయి. కేవలం ఆస్తికునిలో ఈ లక్షణాలు కనిపించవు. సంస్కరణాభిలాషి అయిన ఆస్తికునిలో మాత్రమే ఇవి కనిపిస్తాయి.

మరో అంశం ఏమిటంటే, శమంతకమణిలో తల్లి లక్షణాన్ని రామనాథం చూడటం తల్లిలో ఉన్న 'దైవపర్వతం' శమంతకమణిలో కూడా నిద్రాణ స్థితిలో ఉన్నదని అతని భావం.

ఇక శమంతకమణి దృష్టిలో రామనాథంతో పెళ్లి యాదృచ్ఛికమే. అందుకు ఆమె ప్రమేయమేమీ లేదు. శమంతకమణి వివాహాన్ని కాదనలేదు, కాని గుర్తించలేదు కూడా. వివాహమైనా, మరేదైనా తన స్వేచ్ఛకు అడ్డు వస్తున్నదని ఆమె భావించిన మరుక్షణం, ఆ అడ్డంకుకు అతీతంగా మారటానికే సహజంగా ప్రయత్నిస్తుంది. ఆ ప్రయత్నంలో ఎన్ని కష్టాలను అనుభవించవలసి ఉంటుందో ఎంత సాంఘిక నిందను భరించవలసి వస్తుందో అవి ఆమె దృష్టిలో ఉండవు.

రామనాథంతో ఏర్పడిన అనుబంధంలోని కొత్త అనుభవం మాత్రమే శమంతకమణికి కావాలి. శమంతకమణి మానసిక ప్రవృత్తి రామనాథాన్ని, తన జీవితంలో తారసపడ్డ ఒక కొత్త పురుషుడుగానే అంగీకరిస్తుందిగాని, శాశ్వత జీవనసహచరుడుగా మాత్రం కాదు.

ఆమెను నాటకరంగం ఆకర్షించింది. ఆమెలోని కళాత్మక ప్రతిభను గుర్తించి ప్రోత్సహించటానికి పూనుకున్నాడు, శచీంద్రుడు.

శచీంద్రుడు రాజకీయాల్లో తిరిగినా కళాహృదయం కోల్పోనివాడు స్వయంగా నాటకాలు రాసి ప్రదర్శనలు నిర్వహించటమే ఇందుకు నిదర్శనం మానవుడికి ఆర్థికపుష్టి కలిగించటం అతని రాజకీయ విశ్వాసం. లలితకళలను ఈ లక్ష్యాన్ని సాధించుకోవటానికి వినియోగించుకుంటున్నాడు. ఈ విధంగా అతని స్వభావంలో మార్క్సిజానికి సంబంధించిన రాజకీయ ఆదర్శం కళాత్మక ఆవేశం రెండూ చోటుచేసుకున్నాయి. ఇందువల్ల ఒక విషయాన్ని అతడు తన బాధ్యతగా స్వీకరిస్తే చాలు, అది అతని జీవితలక్ష్యమై కూచుంటుంది.

ఆర్థిక దృష్టి పునాదిగాగల మార్క్సిజం పట్ల అచంచల విశ్వాసంతో పాటు, మనిషిని నడిపించేది లైంగికప్రవృత్తేనని చెప్పే ఫ్రాయిడ్ విశ్వాసాలు కూడా అతనిలో చోటుచేసుకున్నాయి. ఇది అతనిలోని అంతర్వైరుధ్యానికి నిదర్శనం.

శమంతకమణిని మద్రాసుకు తీసుకు వచ్చే ముందు ఆమెలో తన ప్రతిభకు మెరుగులు పెట్టుకునే ఓర్మి ఉన్నదా? లేదా? అని అతడు ఆలోచించకపోవటం, అతడు తన ఆవేశానికి బానిస అన్న విషయాన్ని వెల్లడిస్తున్నది. పైగా తాను శమంతకమణిని అధోగతిపాలు కాకుండా ఉద్ధరిస్తున్నట్లుగా భ్రమించాడు. అతనిలో హద్దుమీరిన ఆత్మవిశ్వాసం ఉందన డానికిది నిదర్శనం. శమంతకమణిని నాట్యతారను చేయాలనే నిర్ణయం తీసుకున్న తర్వాత శచీంద్రుడు తన ఉద్దేశాన్ని రామనాథంతో చర్చించి ఉంటే అతడు మొదట్లో వ్యతిరేకించినా తర్వాత అంగీకరించి ఉండేవాడని ఊహించటానికే ఎక్కువ అవకాశాలు ఉన్నాయి. నాటకాల్లో శమంతకమణి నటించటానికి రామనాథం అంగీకరించటం ఇందుకు నిదర్శనం.

రామనాథంతో చెప్పకుండా శమంతకమణిని మద్రాసు తీసుకు వెళ్లటం వల్ల శచీంద్రుడి చర్యకు ఇతర కారణాలున్నాయని ఊహించవచ్చు.

నాటకాలలో పాత్రధారణ చేస్తున్న సమయానికి కొంతముందు నుంచీ రామనాథం శమంతకమణి దృష్టిని భగవంతుని వరం చేయటానికి కృషి చేస్తున్నాడు. దీన్ని శచీంద్రుడు తన లక్ష్యానికి, నాస్తిక దృష్టికి పోటీ

భావించాడు. ఈ చర్యతో శచీంద్రుడు స్పర్ధాళువుగా బయటపడుతున్నాడు శమంతకమణి తన భర్తతో కలిసి ఉండగా తానామెను నాట్యతారగా తీర్చి దిద్దిన పక్షంలో ఆమెను ఉద్ధరించిన పూర్తి కీర్తి తనకు దక్కదని కూడా శచీంద్రుడు భావించాడు.

డ్యాన్సుమాష్టారు సాంప్రదాయిక విశ్వాసాలున్నవాడు. నృత్యకళ పట్ల అతని విశ్వాసాలు పూర్తిగా శాస్త్రీయమైనవే. అందువల్ల జీవితంపట్ల కూడా అతనికి సాంప్రదాయిక విశ్వాసాలే ఉన్నాయి. అయితే స్త్రీని సానుభూతి పూర్వకంగా అర్థం చేసుకునే శక్తి అతనికి వృత్తిద్వారా లభించింది.

పదేళ్ళక్రితమే తన మిత్రుడైన శచీంద్రునికి రాజకీయ రంగంలోకాక 'కళారంగం'లో కృషి చేయమని సలహా ఇచ్చాడు. మార్క్సిజంపట్ల, దాని రాజకీయ కార్యక్రమాలపట్ల అతనికి అప్పుడున్న వైముఖ్యం ఇప్పటికీ అలాగే ఉన్నది.

శచీంద్రుడు వివాహిత అయిన శమంతకమణిని తన వద్దకు తీసుకువచ్చి నాట్యం నేర్పమని కోరినప్పుడు అతనికి కలిగిన సందేహాలు సముద్రం ఒడ్డున వ్యక్తంకావటం సమంజసంగా ఉన్నది. డ్యాన్సుమాష్టారుకు సముద్రమంటే ఇష్టం. తన కష్టసుఖాలు దానితో చెప్పుకునేవాడు. సముద్రం నిరంతరం చలన శీలమైనది కావటంవల్ల, తాను ఆరాధించే నృత్యంకూడా చలనశీలమైంది కావటం వల్ల సముద్రాని చూస్తే అతనికి ఆత్మీయుణ్ణి చూసినట్లుగా ఉండేది. ఇప్పుడు తన ఆత్మీయమిత్రుడు శచీంద్రుడు తోడుగా ఉండటంవల్ల వాతావరణం ఇంకా అహ్లాదదాయకంగా ఉంది. అంతేకాదు కదలికలవరం కూడా మనసులో ఉంది. శమంతకమణి ఎవరు ? ఆమెకు శచీంద్రునికీ వున్న సంబంధం ఏమిటి? ఆమెపట్ల అతని శ్రద్ధకు కారణం ఏమిటి ? మొదలైన ప్రశ్నలు ఈ సందే హాలు వృత్తి ధర్మానికి అతీతమైనవి. డ్యాన్సుమాష్టారు ప్రశ్నించాడు. ఆమె తనకు ఒక విధంగా బంధువేనని, వివాహితేనని పొడిపొడిగా జవాబిచ్చాడు తర్వాత అన్నీ చెప్పివేయటం మంచిదని మరికొన్ని వివరాలు చెప్పాడు. ఆమె భర్త ఇచ్ఛకు విరుద్ధంగా తన నాటక సమాజంలో చేరి నాటకాలలో నటించేదని తర్వాత తమ రాజకీయ పార్టీలో కూడా చేరిందని చెప్పాడు ఆమె ప్రతిభ ఒక్క నాటక రంగానికి పరిమితం చేయకుండా నాట్యం నేర్పించాలని

తద్వారా సమాజానికి ఎక్కువ సేవ చేసే అవకాశం ఉంటుందనే తన అభిప్రాయమని చెప్పాడు. ఈ సన్నివేశంలో శచీంద్రుడు రామనాథం పట్ల డ్యాన్సు మాష్టారుకు చులకన భావం కలిగించటానికి ప్రయత్నించట గమనార్హం.

"ఆమెను ఎలా సుఖపెట్టాలో అతనికి తెలియదు. ఎప్పుడూ ఇంటి పట్టున వుండమంటాడు" అని చెప్పాడు.

దీన్నిబట్టి రామనాథంపట్ల శచీంద్రుని కున్న స్పర్ధ కేవలం భావాలకు సంబంధించింది కాదనీ, శమంతకమణికి సంబంధించింది కూడాననీ వెల్ల డయింది.

డ్యాన్సుమాష్టారు ఇరకాటంలో పడ్డాడు. భర్త అనుమతిలేకుండా వివాహిత స్త్రీకి నాట్యం నేర్పటానికి అతని సంప్రదాయం అంగీకరించలేదు. శచీంద్రుని మాట కాదనటానికి స్నేహబంధం అంగీకరించలేదు. స్త్రీవ్యక్తిత్వ వికాసానికి దోహదం చెయ్యాలనే కాంక్ష శచీంద్రునివైపే మొగ్గు చూపింది.

ఈ దశలో శచీంద్రునికి శమంతకమణిపట్ల ఉన్నది అవ్యక్త ఆకర్షణ మాత్రమే, ఆమెపట్ల అతనికి దురాలోచన ఉండే పక్షంలో మిత్రుని దగ్గరకు తీసుకొని వచ్చేవాడు కాదు.

లోకం దృష్టిలో శమంతనిమణి శచీంద్రునితో లేచి వచ్చింది. శమం తకమణికి ఈ అంశం ఆలోచనలోనే లేదు. ఆమె నిజానికి తన కళాత్మక ప్రతిభను పెంపొందించుకోవటానికి రాలేదు!

రామనాథంతో కొంతకాలంగా, నిలకడగా కాపురం చేయటం ఆమెకు విసుగు కలిగించింది. అందుకే, కొత్త జీవితానుభవంతో సంపర్కం కోసం ఎదురుచూస్తున్న శమంతకమణిని, సహజంగా మద్రాసులో ఎన్నో అందాలు ఆహ్వానించాయి. కొత్త స్నేహితులు లభించారు. సినిమాలకు, షికార్లకు అంతే లేదు.

ఈ కొత్త పరిచయాలన్నీ ఒక ఎత్తు, డ్యాన్సుమాష్టారుతో పరిచయం ఒక ఎత్తు.

డ్యాన్సుమాష్టారు, మృణాళినీ నాట్యరంగానికి అంకితమైపోయి సేవ చేస్తుండటం ఆమెను ఆకర్షించింది. అంతేకాదు, వాళ్లు వివాహం చేసుకోక పోయినా భార్యాభర్తలుగా ఉంటున్నారని నమ్మటమే కాదు, మృణాళినితో తన అభిప్రాయాన్ని చెప్పింది కూడా.

ఏ జంటను చూసినా వాళ్ళ మధ్యన లైంగిక సంబంధం ఉందని, శమంతకమణి ఊహిస్తుంది. ప్రతి జంట మధ్యన లైంగిక సంబంధం అనివార్యంగా ఉండాలని ఆమె కోరుకోవటమే ఈ ఊహ వెనుక ఉన్న రహస్యం మనోవిజ్ఞానశాస్త్రం దృష్ట్యా ఇది ప్రక్షేపణ (Projectoon) తంత్రం.2

ఆమె సుఖానికి వెలిగా బ్రతుకలేదు.

ఒకరట్లా బతుకుతూవుంటే చూడలేదు!

శమంతకమణి వాళ్ళను భార్యాభర్తలుగా చూసే— వరకు వాళ్ళలో ఏ ఒక్కరికీ అలాంటి అభిప్రాయం లేదు. ఆ తర్వాత మాత్రం వాళ్ళలో ఆ అభిప్రాయం అంకురించి క్రమంగా వికసించింది.

శమంతకమణి డ్యాన్సు నేర్చుకోవటానికి రాలేదనీ, రోజూ ఆమె గదికి చాలామంది మగవాళ్లు వచ్చిపోతున్నారనీ మృణాళిని డ్యాన్సుమాష్టారుకు తెలియజేసింది. అంతేకాదు, ఆమె శచీంద్రుని ప్రవర్తనను కూడా శంకించింది.

ఈ సన్నివేశంలో మృణాళిని పాత్ర స్పష్టమైన రూపురేఖలు దిద్దుకొని కనిపిస్తుంది. 'ఓరగా' చూసైనా ఎదుటి మనిషి లక్షణాలను పసిగట్టగలిగేశక్తి ఆమెలో ఉన్నదని వెల్లడయింది. దీన్నిబట్టి మృణాళిని శమంతకమణి డ్యాన్సు మాష్టారుతో మాట్లాడే మాటలను ప్రవర్తించే తీరును గమనిస్తున్నదని చెప్ప వచ్చు. మృణాళినికి ఈ పట్టింపు దేనికి? అన్న ప్రశ్న ఎదురైనప్పుడు. డ్యాన్సుమాష్టారుపట్ల ఆమెకున్న ఆకర్షణే అని సమాధానం చెప్పుకోవలసి ఉంటుంది.

రామనాథం రాక నవలలో ముఖ్యమైన ఘట్టం.

ఆవేశపరుడైన శచీంద్రుడు, స్వేచ్ఛా ప్రవృత్తిగల శమంతకమణి జీవితంలో జోక్యం చేసుకోవటం ప్రమాదకరమని రామనాథం గుర్తించాడు.

శచీంద్రుడు తన భావాల కనుగుణంగా ఆమెను నడిపించాలనుకుంటున్నాడు. శమంతకమణిది ఒకరు నిర్దేశించిన బాటలో నడిచే తత్త్వం కాదు. ఆమె బాటలో ఆమెను నడవనిచ్చే విశాల హృదయం కానీ, ఆమెను క్షమించే ఔదార్యం కానీ ఉద్రేకి అయిన శచీంద్రునిలో లేవు.

అతని ఉద్దేశం ఏదయినా, శమంతకమణి మాత్రం శచీంద్రునికి తనతో శారీరక సంబంధం అనివార్యమయ్యే పరిస్థితిని కల్పిస్తుంది. ఫలితంగా శమంతకమణి కష్టాల్లో చిక్కుకుంటుందని రామనాథం భావించాడు.

ఈ విషయాన్ని డ్యాన్సుమాష్టారుతో చెప్పటంలోనే కాదు, ఆ తర్వాత శమంతకమణి ఇంటికి వెళ్లి ఆమెతో రెండు రోజులు గడిపి వెళ్ళటంలో కూడా రామనాథం సహృదయత అర్థమవుతున్నది. శమంతకమణి తనను వదిలేసి వచ్చిందని రామనాథం అనుకోలేదు. కారణం, తనను శాశ్వతంగా వదలి పెట్టాలనే ఉద్దేశంతో శమంతకమణి మద్రాసు రాలేదని అతనికి తెలుసు. వెళ్ళే ముందు తనతో ఊరికి వచ్చెయ్యమని రామనాథం శమంతకమణిని కోరక పోవటం కూడా గమనార్హం.

కొంతకాలపు ఎడబాటు తర్వాత, రామనాథం సాంగత్యంలో కొత్తదనం చవిచూసే ప్రవృత్తి శమంతకమణిది. రామనాథం ఆమె స్త్రీత్వాకర్షణకు అధీనుడనే విషయం ఇక్కడ స్పష్టమైంది.

శమంతకమణి రామనాథంతో శాశ్వతంగా విడిపోయిందని, ఇక ఆమె కేవలం తాను నిర్దేశించిన లక్ష్యానికే పరిమితమని భ్రమించిన శచీంద్రునికిది ఆశాభంగాన్ని కలిగించింది. రామనాథం నుండి తాత్కాలికంగానైనా ఆమెను విడదీయటం ద్వారా విజయాన్ని సాధించానని భావించిన శచీంద్రుడు ఈ విషయం తెలుసుకొని ఆందోళన చెందాడు. రామనాథం రాకపట్ల తన అభ్యంతరాన్ని వెల్లడించే ప్రయత్నంలో శచీంద్రుడు కూడా శమంతకమణి స్త్రీత్వ ఆకర్షణకు లోనయ్యాడు. నాట్యతారగా తీర్చిదిద్దాలన్న అతని నిజాయితీని శంకించే వీలులేదు. ఈ దశలో ఆమెలో లైంగిక సంబంధం కోరికకు

విరుద్ధం కాకపోయినా యాదృచ్ఛికమని చెప్పవచ్చు. రామనాథంపట్ల అతనితో ఉన్న స్పర్ధ కూడా లైంగిక సంబంధానికి దారితీసిందని చెప్పవచ్చు.

కేవలం శమంతకమణి కళాత్మక జీవితాన్ని ప్రోత్సహించే సహ కళాకారుడు మాత్రమే కాక ఆమె సాంసారిక జీవితాన్ని తీర్చిదిద్దే జీవన సహచరుడు కూడా తానేనని శచీంద్రుడు భావించాడు. స్నేహం స్థానాన్ని క్రమంగా పురుషాధికారం ఆక్రమించింది.

అతడు తన బాధ్యత రెట్టింపయిందని ఎప్పుడైతే భావించాడో అప్పుడే తన ఆర్థిక, సాంఘిక సమస్యలను రెట్టింపు చేసుకున్నాడు.

ఇది శమంతకమణి చుట్టూ బిగుసుకుంటున్న ఉచ్చు.

తన జీవితంలో తారసపడ్డ పురుషుల్లో ముఖ్యులైన ఇద్దరు తన ఆకర్షణకు లొంగిపోయిన తర్వాత, శమంతకమణి దృష్టి డ్యాన్సుమాష్టారు మీద పడటం సహజమే.

పెళ్లి కాని మృణాళినితో డ్యాన్సుమాష్టారు లైంగిక సంబంధం పెట్టుకున్నాడని శమంతకమణి గట్టిగా నమ్మింది కనుక అతని పట్ల ఆమెకు కుతూహలం ఏర్పడటం అసహజం కాదు.

కేవలం తన అందంతో, కబుర్లతో ఆకర్షించలేనని భావించి, నృత్యం ద్వారానే అతణ్ణి ఆకర్షించగలననే నిర్ధారణకు శమంతకమణి వచ్చింది. అతడు కొత్త పాఠంలోని ముఖ్యసూత్రాలను అందించగానే, అత్యద్భుతమైన నృత్యాన్ని ప్రదర్శించింది. అతడు నేర్పిన విద్యనే అతనిపైన ప్రయోగించింది. డ్యాన్సుమాష్టారు దృష్టి నాట్యానికి సంబంధించిన శాస్త్రీయ అంశాల మీద కాక, ఆమె శారీరక సౌందర్యం మీద కేంద్రీకృతమయింది

అతనికి 'మన్మథుని ప్రణయచేష్ట' స్ఫురణకు వచ్చింది. 'ఉబికి తగ్గుతున్న ఆమె వక్షం' మీదా 'కడుపు మీది మడతల' మీదా అతని దృష్టి నిలిచింది.

ఇది నాట్యం వల్ల కలిగే రసానందం ఎంత మాత్రం కాదు. అతనిలో

నిద్రాణస్థితిలో ఉన్న లైంగిక ప్రవృత్తి జాగృతం అయిన సన్నివేశం ఇది. డ్యాన్సు మాష్టారి—

'—చెంతన కూర్చొని, చంద్రుని కిరణాలకు వలె చల్లగా వున్న తన వ్రేళ్ళతో' అతని చెక్కిళ్ళ నిమిరి.

"నాకు నిజంగా డ్యాన్సు నేర్చుకోవాలని వుంది మాష్టారు" అన్నది.

"ఇవాల్టికి చాలు"

'మీ ఇష్టం మాష్టారు'

నృత్యం మొదటి ఆయుధం అయితే, స్పర్శ రెండో ఆయుధం. తనను స్పృశించిన శచీంద్రుడు నిగ్రహం కోల్పోయిన విషయం ఆమెకు తెలియనిది కాదు.

"మీ ఇష్టం మేష్టారూ" అన్న శమంతకమణి మాట ఆమె పరాజయాన్ని సూచిస్తుంది. శమంతకమణి ప్రదర్శించిన నాట్యకౌశలం ఆమె ప్రతిభకు హద్దు. శమంతకమణిలో ఒక అంశం మీద తన దృష్టిని కేంద్రీకరించి, పూర్తి ప్రావీణ్యాన్ని సాధించాలనే స్వభావం గాని ఆ అంశం లోతులు శోధించాలనే తత్త్వం గాని లేదు. తనపూర్తి ప్రతిభను ఒక సమ్మోహనాస్త్రంగా డ్యాన్సు మాష్టారు మీద ప్రయోగించింది.

కాని అతడు ఈ బలహీనమైన క్షణాన్ని జయించాడు.

ఈ అంశం అతడు మృణాళినికి మానసికంగా దగ్గరౌతున్నాడనే విషయాన్ని నిరూపిస్తున్నది. అతని చూపు శమంతకమణి మీద, మనను మృణాళినిమీద కేంద్రీకృతం అయ్యాయి.

శమంతకమణి తన ప్రయత్నం విఫలమైన తర్వాత, డ్యాన్సుమాష్టారును మరే విధంగాను ఆకర్షించే యత్నం చేయలేదు. ఇది శమంతకమణి నిగ్రహశక్తికి నిదర్శనం. ఆమె వ్యక్తిత్వంలో ఇప్పటివరకు వెల్లడి కాకుండా నిగూఢంగా ఉన్న అంశం.

డ్యాన్సుమాష్టారుకు నాట్యంపట్ల ఉన్న శాస్త్రీయ దృష్టి, వ్యవస్థలోని

సాంప్రదాయికమైన విలువలపట్ల గౌరవాన్ని సూచిస్తున్నది. అందుకే లైంగిక వాంఛ కలిగిన వెంటనే డ్యాన్సుమాష్టారు దృష్టి సంప్రదాయానికి ప్రతీకగా ఉన్న మృణాళిని మీద పడింది.

మృణాళినిలో డ్యాన్సుమాష్టారు పట్ల ప్రేమభావం అంకురించటానికి దోహదం చేసింది శమంతకమణే! దీని వికాసం మాత్రం విచిత్రంగా జరిగిందని చెప్పవచ్చు. శమంతకమణి డ్యాన్సుమాష్టారును ఆకర్షించటానికి ప్రయత్నిస్తుందనే విషయం పసిగట్టిన వెంటనే, ఆమె ప్రభావంలోకి అతడు లొంగిపోకుండా ఉండటానికి మృణాళిని కొంత ప్రయత్నించింది.

శమంతకమణి ప్రభావంలో చిక్కుకున్నవాడు భగ్నహృదయుడు కాక తప్పదని తాను తెలుసుకోవటంతో మాష్టారును రక్షించుకోవలసిన బాధ్యత తన మీద ఉన్నదని మృణాళిని నిర్ణయించుకున్నది.

శమంతకమణీ శచీంద్రులు భార్యాభర్తలుగా వ్యవహరింపబడటాన్ని తెలుసుకొని డ్యాన్సుమాష్టారు దిగ్భ్రాంతి చెందాడు. ఆ పరిణామం మృణాళిని ఊహించిందే కనుక ఆమెకు ఆశ్చర్యం కలుగలేదు. రామనాథం పరిస్థితిలో వచ్చే కొత్త మార్పేమీ లేదు. మృణాళిని భయం మాష్టారును గూర్చే. శమంతకమణి కారణంగా వాళ్ళ మధ్య కొంత కాలంగా తెర జీరాడుతున్నది. ఆ మౌనానికి తన బాధ్యత ఉన్నందుకు మృణాళినికి డ్యాన్సుమాష్టారు క్షమాపణ కోరుకున్నాడు. ఇది వాళ్ళ మధ్యన సంబంధాలలో మార్పును సూచిస్తున్నది. మృణాళిని వ్యక్తీకరించిన ముగ్ధప్రణయభావ సంకేతాలను అర్థం చేసుకొని, డ్యాన్సుమాష్టారు నూతనానుభూతికి లోనయ్యాడు.

శమంతకమణిని 'పిల్లతెమ్మెర'గా మృణాళిని వ్యాఖ్యానించిన సన్నివేశం కూడా ఇదే. రచయిత మృణాళినిని నవలకు వ్యాఖ్యాతగా రూపొందించటం ద్వారా ఆమెకు ప్రత్యేక స్థానాన్నిచ్చారు.

చల్లగా ఉంటూనే, వెచ్చని కోరికల్ని రెచ్చగొట్టే గాలి పిల్లగాలి. చల్లని సాయంత్రమో, వెన్నెలరాత్రో పచ్చని పైరు మీదుగానో పూలతోటలలో నుండో, వీస్తూ కొత్త అనుభూతుల్ని కలుగజేసేది పిల్లతెమ్మెర. స్వేచ్ఛ దాని సర్వస్వం.

దానినెవరూ బంధించలేరు. దాన్ని తమ ఇష్టం ఉన్న దిశకు మళ్లించ లేరు

అయితే పూవులని భ్రమించి ముళ్ళమీదుగా పీస్తే ఒళ్ళంతా గాయాలతో నిండిపోతుంది పిల్ల కాల్వగా భ్రమించి మురుగు కాల్వ మీదుగా పీస్తే దుర్గంధ భూయిష్ఠమౌతుంది. నదీ సైకతంగా భావించి ఎడారిలోకి పరిగెత్తితే, ఆ భయంకరమైన వేడికి నామరూపాలు లేకుండాపోతుంది.

అలాగే ఝుంఝూనిలం దాడిచేసినప్పుడు, ఊపిరి కోల్పోతుంది.

మృణాళిని శమంతకమణిని పిల్లతెమ్మెరగా వ్యాఖ్యానించటంలో పై భావాలన్నీ ఉన్నాయి. ఈ సన్నివేశం ఆనంద విషాదాల కేంద్ర బిందువు.

డ్యాన్సుమాష్టారు మృణాళినుల మధ్య కళాసేవకోసం ఏర్పడ్డ ఆదర్శాను బంధం ప్రణయంగా పర్యవసించింది ఇది నవల ప్రారంభంనుండి మధ్య భాగం వరకు వచ్చిన క్రమపరిణామం. ఇది ఆనందదాయక పరిణామం. వివాహానికి నాంది, శమంతకమణి జీవితంలో కృష్ణపక్షం ప్రారంభమైన దశ కూడా దాదాపు ఇదే. మొదటి సగభాగంలో ఆమెలో మనం చూసే ఆనందం చిలిపితనం, స్వేచ్ఛా ప్రవృత్తి ఇక నుంచి వ్యతిరేక దిశవైపు ప్రయాణించటం కనిపిస్తుంది. ఇది విషాదానికి నాంది.

శమంతకమణి ఆలోచనలో, అభివ్యక్తిలో కొంత బరువు, కొంత గాంభీర్యం కనిపించసాగాయి. ఆమెలో, ఇంత జీవితం చూసిన తర్వాత, అనేక అనుభవాలను పొందిన తర్వాత తన హద్దులకు సంబంధించిన ఆత్మజ్ఞానం సాధించిన తర్వాత సువేదనాత్మకంగా జీవితాన్ని సమీక్షించుకునే గుణం చోటు చేసుకున్నది. ఇది ఆమెలో పరిపక్వత చోటు చేసుకుంటున్న దశ. అయితే, శమంతకమణి వంటి వ్యక్తి క్రమోన్మీలనం చెందటానికి పరిస్థితులు కూడా అనుకూలించటం అవసరం.

పరిస్థితులు ఆమెకు వ్యతిరేకంగా ఉన్నాయి.

ఆమె మృణాళిని భావాలను నిజంచేస్తూపోయింది. శమంతకమణి గర్భవతి అయింది.

ఆమె కొన్ని నెలల పాటు డ్యాన్సు నేర్చుకోవటానికి వీలులేకుండా పోతుంది. కనుక శచీంద్రునికి ఇది ఎంత మాత్రం ఇష్టంలేని పరిణామం.

ఆ గర్భానికి కేవలం తాను మాత్రమే కారకుడయ్యే పక్షంలో అతనికి కొంతలో కొంత తృప్తి ఉండేది. కాని రామనాథం కూడా కారకుడు కావచ్చు కనుక అశంతృప్తి, తాను ఎవరికోసమైతే సాంఘిక నిందను భరిస్తున్నాడో ఎవరికోసమైతే తన కుటుంబాన్ని నిర్లక్ష్యంగా చేస్తున్నాడొ ఎవరినైతే తాను భార్యగా భావిస్తున్నాడో, ఆమె గర్భంలో తన శిశువు కాకుండా పరాయి వ్యక్తి శిశువు కూడా పెరిగే అవకాశం ఉండటం శచింద్రునికి ఆందోళన కలిగించే విషయము.

శమంతకమణి ప్రసవించింది.

ఆ పసివానిలో శచీంద్రునికి రామనాథం పోలికలు కనిపించాయి.

శచీంద్రునిలో రామనాథంపట్ల ఏర్పడిన స్పర్ధ ద్వేషంగా రూపొందింది. ఆమె నాట్యరక్షణకు తనవల్ల అవరోధం కలగలేదని తనకుతాను నచ్చచెప్పుకోవటానికి ఈ భావం పనికివచ్చింది. అతని ఆర్థికసాంఘిక సమస్యలు, ఈ ప్రసవం దాదాపు ఏకకాలంలో సంభవించటంవల్ల, అతనిలో సంఘర్షణ పరాకాష్ఠకు చేరుకుంది.

ఇటు మాతృత్వం శమంతకమణి వ్యక్తిత్వానికి నిండుదనాన్ని ప్రసాదించింది. మొదటిసారి ఒక శాశ్వతమైన అనుబంధం ఆమె అనుభూతిలోకి వచ్చింది- ఈ పసివాడి కారణంగానే.

ఆమెకు తన బాబులో డ్యాన్సుమాష్టారు పోలికలు కనిపించాయి :

ఈ సన్నివేశం శమంతకమణి వ్యక్తిత్వ వికాసంలోని మలుపుకు వ్యాఖ్యానం. అప్పటివరకు లేడికి లేచిందే పరుగు అన్న తత్త్వంతో జీవించిన శమంతకమణి, తన కోరికల్ని అదుపులో పెట్టుకోవటానికి ప్రయత్నించని శమంతకమణి, డ్యాన్సుమాష్టారు తన ఆకర్షణకు అతీతుడని తెలుసుకోగానే తన వైఖరిని మార్చుకున్నది. డ్యాన్సుమాష్టారు పట్ల ఉన్న లైంగిక ఆకర్షణను జయించే ప్రయత్నంలో తనకూ ఆతనికీ మధ్యన కొత్త అనుబంధాన్ని సృష్టించు

కౌగలిగింది. తాను మాతృమూర్తిగా మారిపోయింది ఇది డ్యాన్సుమాష్టారు వ్యక్తిత్వాన్ని అలంకరించే మణికిరీటం.

మనోవైజ్ఞానిక పరిభాషలో ఇది 'ప్రక్షేపణం' శచీంద్రునికి బాబులో రామనాథం పోలికలు కనిపించటం కూడా ప్రక్షేపణే. తనలోని వ్యాకులతను జయించటానికి తన తప్పును రామనాథానికి అంటగట్టాడు. బాబులో పోలిక లున్నా అతనికి కనిపించవు !

శమంతకమణి ప్రసవించిన తర్వాత ఐదారు నెలలలో శచీంద్రుని ప్రవర్తనలో చాలా మార్పు వచ్చింది. శమంతకమణిని కొట్టటం, మానసికంగా హింసించటం ప్రారంభించాడు. అతని 'ఆదర్శం' అవేశానికి బానిస, ఏదో రకంగా ఆమెమీద ఆధిక్యాన్ని సాధించాలని చేసే ఈ ప్రయత్నం అతనిలోని న్యూనతా భావానికి నిదర్శనం. ఈ న్యూనత మొదటిసారి ఆమె అద్భుతమైన నటనాకౌశలం చూసినప్పుడు అతనిలో అంకురించింది.

తన హింసాత్మక చర్యలవల్ల శమంతకమణిలో మార్పేమీ లేకపోవటం వల్ల తిరిగి రాకూడదనే నిర్ణయంతో వెళ్లిపోయాడు.

ఆమె విషయంలో అతడు పొందిన పూర్తి ఓటమి నుండి పుట్టిన తాత్కాలిక నిర్ణయమది. శేషజీవితం తన కుటుంబం అభివృద్ధికోసం పాటుపడటంలో గడపాలని అనుకోవటం, శమంతకమణి విషయంలో తన లక్ష్యాన్ని చేరుకోలేకపోవటాన్ని పరిహార (Compensation) తంత్రం[3] సహాయంతో మానసికంగా నష్టపూర్తి చేసుకోవటానికి మాత్రమే.

శచీంద్రునిలో నవలను పరాకాష్ఠకు తీసుకువెళ్లిన, సంఘర్షణను రగిలించిన అంశాలు :-

1. రామనాథంతో ఏర్పడిన అజ్ఞాత మానసిక స్పర్ధ, శమంతకమణి అతనితో సంబంధాన్ని కొనసాగించటం మూలంగా పెరగటం.

2. శమంతకమణికి లొంగిపోయి ఆమెతో సంబంధం పెట్టుకోవటం వల్ల బీజప్రాయంగా ఉన్న న్యూనతా భావం పెరగటం, ఆమెతో సంబంధం పెట్టుకోవటంవల్లనే, తాను 'ఆదర్శం' నుంచి చ్యుతి పొందినట్లుగా భావించటం.

3. తన అధికారానికి లొంగి, తన ఆధిక్యాన్ని విశిష్టతను గుర్తించ

కుండా శమంతకమణి 'ఆమెకు పరిచయస్థులైన అందరితోపాటే తననూ చూడటం.'

4. రోజు రోజుకు అతని సాంఘిక ఆర్థిక సమస్యలు తీవ్రతరం కావటం.

5. శమంతకమణి గర్భవతి కావటం.

ఆమెకు పుట్టిన బాబులో తన పోలికలు కనిపించక పోవటం, పైగా రామనాథం పోలికలు కనిపించటం, దీనివల్ల అతనిలోని సంఘర్షణ బద్దలైంది. దానిలో సంస్కారం ఏర్పరచిన హద్దులు చెరిగిపోయినై. అందుకే ఆమెను హింసించాడు.

పై అంశాలకు అదనంగా తాను తన భార్యబిడ్డలకు తీరని ద్రోహం చేశాన్న పశ్చాత్తాప భావం ఏర్పడింది.

కాని శమంతకమణిని విడిచి వెళ్ళాలనుకునే సరికి, జీవితం అతణ్ణి 'తరిమి తరిమి వెక్కిరిస్తున్నట్లు అనిపించింది.'

ఆమె తనకన్నా చిన్నది కనుక, ఆమె ఏదైనా తప్పుచేస్తే క్షమించ వలసిన బాధ్యత పెద్దవాడైన తన మీద ఉందని భావించి, పెద్దతనపు ముసుగును ధరించి శమంతకమణి ఇంటికి వెళ్ళాడు.

"నన్ను క్షమించు శమంతకమణి'' అన్నాడు. ఆమెను క్షమించటానికి వెళ్లినవాడు, తననే క్షమించమని అర్థించాడు.

ఆమె క్షమించదగిన తప్పేమీ చేయలేదని, అతని అంతరంగానికి తెలుసుననటానికీ, పైగా అతనిలోనే అపరాధ భావం ఉన్నదనటానికి ఈ ప్రవర్తన తిరుగులేని సాక్ష్యం.

క్షమించటం ద్వేషించటం వంటివి శమంతకమణికి తెలియవు.

ఆమెకు తెలిసిందొక్కటే - 'నిండు కౌగిలిలో హద్దులులేని సంయోగంలో అన్నింటినీ మరచిపోవటం!'

ఆమె చిరునవ్వు నవ్వింది. ఇది ఆమె తన భావాన్ని వ్యక్తం చేసే భాష

ఏ నవ్వైతే తనను తన ఆదర్శం నుండి పతనం చేసిందని అతడు భావించాడో మళ్ళీ అదే నవ్వు ఎదురయ్యేసరికి అతడు చలించాడు. ఒకసారి ఇలాంటి బలహీనమైన క్షణంలో లొంగిపోయి, న్యూనతా భావంతో బాధపడు తున్న అతడు, ఈసారి జయించాలనుకున్నాడు. అయితే, మళ్ళీ తాగకూడ దనుకుంటూ మళ్ళీ మళ్ళీ తాగే తాగుబోతు తీసుకునే నిర్ణయం లాంటిదే ఇది. తన బలహీనతను ఆమె గుర్తించిందనే ఉక్రోషంవల్ల, ఆమె ఆహ్వానాన్ని తిరస్కరించటం ద్వారా ఆధిక్య భావాన్ని పొందాలనే భావంవల్ల, హింసిం చటం ద్వారా, లైంగికానందానికి ప్రత్యామ్నాయమైన ఆనందాన్ని పొందా లనే తపనవల్ల, సహజమైన ఉద్రేకం గట్లు తెగటంవల్ల, అతడు వివశు డయ్యాడు. "వశం తప్పిన శరీరంతో ఆమె మీదకు వెళ్ళాను. గొంతు పట్టు కున్నాను అంతే...." అని డ్యాన్సుమాష్టారుతో చెప్పుకున్నాడు. 'వశం తప్పిన శరీరంతో' అన్న విషయం అత్యంత ప్రధానమైంది, ఎందుకంటే వశం తప్పిన శరీరంలో అతని చేతులూ ఉన్నాయి. అలాగే, ఆమె మీదికి వెళ్ళటం కూడా ముఖ్యమైన అంశమే!

ఆ వశం తప్పిన చేతులకు ఆమె గొంతు దొరికింది.

అంతే, ఆమెకు మృత్యువుతో సంయోగం!

ఒకవేళ ఆ చేతులకు పూర్వం మాదిరిగా ఆమె చెయ్యో లేక స్తనాలో దొరికి ఉంటే—

అతనికి ఆమెతో సంయోగం!

ఆ ఆవేశంలో చంపడానికీ, రమించటానికి పెద్ద తేడా లేదు.

చావుకూ బతుక్కూ మధ్యన ఎంత చిన్న తేడా ఉన్నదో, ఒక ఆవేశ పరుని ద్వారా అద్వితీయంగా చిత్రించాడు రచయిత. శచీంద్రుడు ఒక పథకం ప్రకారం చేసిన హత్య కాదనే విషయం కూడా ఈ చిత్రణలో రచ యిత వ్యక్తీకరించాడు.

శమంతకమణి దయనీయంగా మరణించింది.

'పిల్లతెమ్మెర' శాశ్వతంగా స్తంభించింది.

అబల, అమాయకురాలు, సంఘానికి అతీతమైన స్వభావం కలది శమంతకమణి. అరమరికలు లేకుండా అందరినీ ప్రేమిస్తూ, బతికినంతకాలం స్వేచ్ఛగా బతికింది.

ఆమె తన జీవితంలో దేన్నీ సమస్యగా భావించలేదు. అన్నింటినీ తేలికగానే భావించింది. ఆమెకొక లక్ష్యమంటూ లేదు. జీవితం ఎటు తీసుకుపోతే అటు వెళ్లింది. సంఘటనలు ఎటు మళ్లిస్తే అటు మళ్లింది.

చూడగానే, పురుషుల కామప్రవృత్తిని తెచ్చగొట్టే శారీరక సౌందర్యం ఆమెలో ఉండటం, ఆమె తప్పుకాదు. మన స్తత్వంలో ఉన్న స్వేచ్ఛా ప్రవృత్తిని జయించే శక్తి, ఆమెలో లేదు.

మృణాళిని చెప్పినట్లుగా, శమంతకమణిని అవకాశం ఉన్నవాళ్ళంతా వాడుకున్నారు.

రామనాథం, శచీంద్రుడూ నిర్దేశించిన లక్ష్యాలను సాధించటానికి ఆమె కొంత యత్నించింది. ఆ లక్ష్యాల సాధన ఆమె మానసిక ప్రవృత్తినీ సంతృప్తిపరచలేకపోయింది.

ఆమె అంతర తృష్ణను తీర్చేవి నిత్యనూతన అనుభవాలు, అనుబంధాలు మాత్రమే !

మొదటిసారి ఆమెను అంతర్ముఖురాల్ని చేసింది. డ్యాన్సుమాష్టారే ! ఆమె అతని దగ్గర నేర్చుకున్నది నాట్యం మాత్రమే కాదు, మంచితనం అన్న విలువను కూడా.

ఈ మంచితనం అనే విలువతో కొలుచుకున్నప్పుడు ఆమెకు తన జీవితంలో లోటు కనిపించింది. ఆమెలో మంచితనానికి కొదువలేదు. కాని, ఆమె చుట్టూ తిరుగుతూ ఆమె జీవితంతో ఆడుకుంటున్న వాళ్ళలో మంచితనం కనిపించలేదు. లోకం దృష్టిలో ఆమె అందర్నీ చెరుస్తున్న స్త్రీ.

ఈ సత్యం ఆమెకు ఆవేదన కలిగించింది.

ఎవరివల్ల తాను సత్యాన్ని తెలుసుకున్నదో ఆ డ్యాన్సుమాష్టారి ముందు, ఆమె కన్నీరు పెట్టుకుంది.

పైకి ఎంత నవ్వుతూ కనిపించినా, ఆమెలో అంతర్వేదన ఉన్నది. ఇందుకు కారణం తాను అనాథననే సత్యం ఆమెకు తెలుసు. తనకెవరూ లేరనే భావం, తాను అందరిదాన్ని కావాలనే భావానికి దారితీసింది. చిన్నప్పటి నుంచి పెరిగి పెద్దయ్యే వరకు అప్పుడప్పుడు సబిన్స్పెక్టరు కొట్టిన దెబ్బలు, తిట్టిన తిట్లూ, కలిగించిన వేదన ఆమె అంతరంగపు పొరలలో ఉన్నవి చివరి రోజుల్లో శచీంద్రుడు పెట్టిన హింస ఈ వేదనను తట్టిలేపింది.

"మానసికంగా ఏదో పెద్ద విచారంలో మునిగి వున్నట్టు వున్నాయ్. శ్మశానవాటికకు తరలిపోతున్న గుంపులుగుంపులుగా కనిపించి చూడలేక పోయినాను" అంటూ అజంతా గుహలలోని బొమ్మలను గూర్చి శమంతక మణి చేసిన వ్యాఖ్యానం, నిజానికి ఆమెకే వర్తిస్తుంది. ఆమె తనలోని విచారాన్ని ఆ బొమ్మల్లో దర్శించింది. ఆనందించాలన్న ఆమెలోని కోరిక ఈ విచారాన్ని జయించటానికే!

ఎంత జీవితేచ్ఛ ఉన్నా, ప్రేమ రాహిత్యంలో సుదీర్ఘ జీవితం గడపటం శమంతకమణికి నరకప్రాయమే. తాను విశ్వసించి, ప్రేమించినవాడి రూపంలో మృత్యువు సమీపించినప్పుడు నిస్సహాయంగా నిలబడిపోయింది.

మృత్యువు కూడా శమంతకమణి స్త్రీత్వ ఆకర్షణకు లోనైంది! అందుకే, మృత్యువు ఆమె జీవితాన్ని ఉదాత్తం చేసింది. శచీంద్రుని ప్రమేయంతో నాటకరంగంలో ప్రవేశించిన శమంతకమణి, అతని దర్శకత్వంలోనే జీవన రంగం నుంచి నిష్క్రమించింది. తోటలో క్షణకాలం వీచిన 'పిల్లతెమ్మెర' పరిసరాలను పరిమళభరితం చేసి అనంతవాయువుల్లో కలిసిపోయింది!

ప్రధాన కథ మృత్యువువైపు పరుగుతీస్తే ఉపకథ దాంపత్య జీవితం వైపు నడిచింది.

హైదరాబాదులోనే సాంస్కృతిక జీవితాన్ని దర్శించిన తర్వాత, డ్యాన్సుమాష్టారులో 'నృత్యం' పట్ల ఉన్న శుద్ధ శాస్త్రీయదృష్టి తగ్గిపోయింది. అంటే మృణాళిని అభిప్రాయానికి చేరువ అయ్యాడు. ఈ అంశం ఇదివరకే శమంతకమణి వల్ల మానసికంగా సన్నిహితం అయిన ప్రేమికులను ఇంకా సన్నిహితం చేసింది.

వారు పెళ్లిచేసుకున్నారు శమంతకమణి-ఎన్నటికీ వాడిపోని తన స్నిగ్ధ బాల్యచ్ఛాయకు వారసుడైన బాబును వాళ్ళకు పెళ్లికానుకగా వదలి వెళ్లింది!

వారు తమ స్కూలుకు 'శమంతకమణి నృత్య ప్రదర్శనశాల' అని నామకరణం చేశారు.

ఇది శమంతకమణి పట్ల ఉన్న గౌరవభావానికీ, తమ వివాహానికి కారకురాలైనందుకు కలిగిన కృతజ్ఞతా భావానికీ నిదర్శనంగా వాళ్ళు శాశ్వతంగా నిర్మించిన స్మారక చిహ్నం

సంఘం నిర్దేశించే చట్రం, వ్యక్తుల అపరిపక్వ మనస్తత్వం వల్ల ఇంకా సంకుచితమైపోతుంది. ఫలితంగా వ్యక్తిత్వ వికాసానికి తోడ్పడవలసిన స్వేచ్ఛా ప్రవృత్తి విషాదాంతమౌతుంది. ఇది శమంతకమణి సంబంధించిన ప్రధాన కథ ద్వారా రచయిత ఇచ్చే సందేశం.

సంస్కారం, పరస్పర అవగాహన, ఒక నిర్దిష్టమైన లక్ష్యం ముప్పేటలుగా అల్లుకున్నప్పుడు సంఘం నిర్దేశించే సూత్రాలకు అనువుగా వ్యక్తులు ప్రవర్తించినపుడు జీవితం మోదాంతమౌతుంది. ఇది మృణాళిని డ్యాన్సు మాష్టారుల వివాహం ద్వారా రచయిత వ్యక్తంచేసే ఉద్దేశం.

# 2. గడియపడని తలుపులు

'గడియపడని తలుపులు'4 నవలికలోని కథానాయిక కోటేశ్వరమ్మ. ఆమె జీవితచిత్రణే నవలికలోని ప్రధాన ఇతివృత్తం.

ఆమె జీవితంలో ప్రమేయం ఉన్న ముఖ్యవ్యక్తులు ఇద్దరు. ఒకడు, శ్రీనివాసరావు. రెండోవాడు కథకుడు.

అనుకోకుండా ఆమె జీవితంలో తారసపడి ఆమెపాలిటి మృగతృష్ణగా భాసించి, ఆమెను దేవతగా భావించి ఉన్మాది అయినవాడు శ్రీనివాసరావు.

ఇద్దరి సమస్యల్ని పరిష్కరించలేక, వారిమధ్య సతమతమై కోటేశ్వరమ్మ అవసానదశలో ఆమెకు ఆత్మీయుడైన స్నేహశీలి కథకుడు.

ఎవరో ఎవరి తలుపో తట్టటంతో నవలిక ప్రారంభమయింది. అంటే తలుపు గడియపడి ఉందన్నమాట. ఇంట్లోని వ్యక్తి జవాబు అవతలి వ్యక్తికి వినిపించకపోవటంతో రెండోసారి గట్టిగా చెప్పవలసి రావటం, ఆ తర్వాత తలుపుతీసిన వ్యక్తి తలుపు తట్టిన వ్యక్తిని చూసి ఆశ్చర్యపోయి ''నీవా'' అనటం, ఆ ఆశ్చర్యంలోనుంచి తేరుకోకుండానే వచ్చిన వ్యక్తిని మననం చేసుకుంటున్న ధోరణిలో పరిచయంచేయటం అతిసహజంగా ఉంది. కథనం ఆత్మాశ్రయ పద్ధతిలో సాగుతుంది.

తలుపు తీసినవాడు కథకుడు, వచ్చినవాడు శ్రీనివాసరావు. శ్రీనివాసరావు వ్యవస్థాపరమైన నీతినియమాల పట్ల గౌరవం ఉన్నవాడు. అంతేకాకుండా అతడు అమాయకుడు. అమాయకత్వం కారణంగానే పుస్తకాలషాపులోనే కాదు, పుగాకు వ్యాపారంలోనూ అతనికి నష్టం వచ్చింది.

తాను అచ్చువేయించిన పుస్తకాలకు లౌక్యం తెలియని కారణంగా పాఠ్యపుస్తకాలుగా, ప్రభుత్వ ఆమోదముద్రను సాధించలేకపోయాడు. సిఫార్సుద్వారా ఈ పని సాధించటం అక్రమంగా భావించాడంటే, అతడు నీతినియమాలను ఎంత సున్నితమైన దృష్టితో చూస్తాడో అర్థం చేసుకోవచ్చు.

హైదరాబాద్ రాకముందే కోటేశ్వరమ్మతో, అతనికి కొంత పరిచయం ఉన్నది. ఆమెను గూర్చి ఎన్నో అపవాదులు విన్నాడు. కాని, ఆమెను నన్ని హితంగా చూసినప్పుడు, అవన్నీ అబద్ధాలేననే నిర్ధారణకు వచ్చాడు. ఒక వ్యక్తిమీద ఉన్న ఆరోపణ కేవలం అపవాదేనని రుజువైతే ఆ వ్యక్తిమీద గౌరవం కలుగుతుంది. క్రమేణా పెరుగుతుంది.

అలాంటి గౌరవమే కోటేశ్వరమ్మ మీద శ్రీనివాసరావుకు కలిగింది. శ్రీనివాసరావులో 'ఒకదాని నుంచి వొకదానికి అల్లుకుపోయే స్వభావం' ఉంది. ఉన్నదానికంటే ఎక్కువ ఊహించుకొని హర్మ్యాలు నిర్మించుకుంటూ పోతాడు.

శ్రీనివాసరావులో ఈ స్వభావం ఉందని కథకుడే కాదు కొద్ది పరిచయంతో కోటేశ్వరమ్మకూడా తెలుసుకున్నది అందుకే అతణ్ణి ప్రభావితుణ్ణి చెయ్యటానికి ''కొన్ని అబద్ధాలు'' కూడా చెప్పింది.

ఆమె భర్తను వదిలివేయుటానికి గల అసలు కారణం. అతడు భోగాలకు దాసుడు కాడని. ''ఈయన ఎంతో దొడ్డవాడు, నాబోటిది నమ్మలేనంత క్షమాబుద్ధి గలవాడు నిరంతరం నా శ్రేయస్సే కాంక్షించేవాడు. అటువంటి ఈయన్ని నేను విడిచిపెట్టాను ఎందుకో తెలుసా? భోగాలకు దాసుడు కాడని, భగవంతుడు ఇచ్చినదానితో తృప్తిపడతాడని'' కోటేశ్వరమ్మ కథకునితో చెప్పింది. కాని, శ్రీనివాసరావుతో ఆమె చెప్పిన కారణం, తనను తన భర్త చాలా కష్టపెట్టేవాడనీ అందుకే విడిచిపెట్టాననీ.

''విడిచిపెట్టిందంటే, తప్పక విడిచిపెట్టింది. అతను ఆమెను చాలా కష్టపెట్టేవాడు. అయినా ఆమె వోర్చుకొని కాపురం చేసింది. తరువాత అతను మరొక స్త్రీని ప్రేమించాడు. ఆమెను ప్రేమించటం మొదలుపెట్టినాక అతనిలో చాలా మంచి మార్పు వొచ్చింది. ఆమెను హృదయపూర్వకంగా ప్రేమించటంవల్ల తన భర్తలో ఈ మార్పు వచ్చిందనీ, ఆ కొత్తమనిషి నిష్కళంక ప్రేమే తన భర్తలో వచ్చిన మార్పుకి కారణమనీ కోటేశ్వరమ్మ గ్రహించింది. వెంటనే తన ప్రేమలో ఏ మూలలో ఎంతో కొంత మలినం దాగివుండబట్టే తన భర్త ఇన్నాళ్లూ అలా ప్రవర్తించాడని ఊహించుకుంది.

వారిద్దరూ వివాహం చేసుకొని, సుఖంగా జీవయాత్ర చెయ్యటానికి తోడ్పడటమే తన విధ్యుక్తధర్మం అనుకుంది. ఇక వారిద్దరికీ ఆటంకంగా నిలబడటం తగదనుకుంది. భర్త సుఖంకోరి అత్యద్భుతమైన త్యాగం చేసింది'' అన్నాడు, శ్రీనివాసరావు కథకునితో, ఈ మాటల్లో కోటేశ్వరమ్మ చెప్పిన అబద్ధంతో పాటు, శ్రీనివాసరావు అల్లుకున్న 'విధ్యుక్తధర్మం' 'త్యాగం' కూడా ఉన్నాయి.

అంతేకాకుండా, కోటేశ్వరమ్మ తనదగ్గరకు పనులు చేయించుకునే ఉద్దేశంతో వచ్చే పెద్దమనుష్యులతో వ్యవహరించిన తీరు శ్రీనివాసరావును ఆకర్షించింది.

ఒక పెద్ద ధనవంతుడు ఫ్యాక్టరీ లైసెన్సు ఇప్పించమని వచ్చాడు. ''నీకెందుకు లైసెన్సు ఇప్పించాలి. ఇంకా బీదవాళ్లను హింసించే అవకాశం నీకు కల్పించటానికే గదా ?''

ఈ మాటల్లో కొంత నిజాయతీ లోపించిందని స్పష్టంగా తెలుస్తుంది. ఆమె చేసిపెట్టే ప్రతిపని, బీదవాళ్లకు మేలుకలగాలనే దృష్టితో, కనీసం కీడు కలగరాదనే దృష్టితోగాని ఈ పనులను చేసిపెట్టటం లేదన్నది పచ్చినిజం. శ్రీనివాసరావు ఎదురుగా జరిగిన మరొక సంఘటన— ఒక పెద్ద మనిషికి కోటేశ్వరమ్మ ఏదో పని చేసిపెట్టింది. అతడు ప్రతిఫలంగా డబ్బు ఇవ్వబోతే ఆమె తిరస్కరించింది. అతడు మరీ ప్రాధేయపడితే తీసుకొని, అతనిముందే బీదవాళ్లని పిలిచి ఆ డబ్బును పంచిపెట్టింది.

''మీకు తృప్తిగా వున్నదా ? ఇక వెళ్లండి'' అని చెప్పి ఆ పెద్దమనిషిని పంపించివేసింది. ఇది అక్షరాలా నాకళ్ల ముందు జరిగిన సంఘటన !' అంటూ ఎంతో ఆశ్చర్యంతో ఆరాధనాభావంతో కథకునితో వర్ణించి చెప్పాడు శ్రీనివాసరావు.

నిజానికి కోటేశ్వరమ్మ శ్రీనివాసరావును ప్రభావితుణ్ణి చేయటానికి చేసిన నటనే ఇది. ఆమె డబ్బును, కీర్తిని సంపాదించాలనే ఈ పనులు చేసిపెడుతున్నది. వారు డబ్బు తెచ్చి ఇచ్చిన ప్రతిసారీ ఆమె బీదలకు పంచి పెట్టటం లేదు. పెద్దమనుష్యులతో చాకచక్యంగా వ్యవహరించిందని అతడు

భావించాడు. కాని, నిజానికామె శ్రీనివాసరావుతోనే చాకచక్యంగా వ్యవహరించింది. ఆమె నటనను కనిపెట్టక పోవటంలో, అబద్ధాలను పసికట్టక పోవటంలో శ్రీనివాసరావు అమాయకత్వమే వెల్లడవుతున్నది.

కథకుడు లోకజ్ఞానం తెలిసినవాడు మాత్రమే కాదు, క్రియాశీలి కూడా. ఎదుటివాళ్ల తత్త్వాన్ని అర్థం చేసుకునే ప్రతిభ వారితోపాటు పయనించగల దక్షత ఉన్నవాడు. మంచి స్నేహశీలి కూడా.

"అన్యాయం జరగకుండా చూచుకోవటానికైనా నేడు రికమండేషన్ అవసరం అవుతూవుంది." అని శ్రీనివాసరావుకిచ్చిన సలహా కథకుని లోకజ్ఞానాన్ని వెల్లడి చేస్తున్నది.

కథకుడు ఎక్కువ స్నేహబంధాలున్నవాడు కాదు. ఎక్కువ స్నేహితులు ఉన్న వ్యక్తిలోకంటే, తక్కువ స్నేహితులున్న వ్యక్తిలో గాఢ స్నేహం కనిపిస్తుంది. కథకునికి శ్రీనివాసరావు నిర్మలమూర్తి కావటం వల్ల అతణ్ణి ఆకర్షించాడు. కోటేశ్వరమ్మ తన మనస్తత్వంలోని వైచిత్రి కథకుణ్ణి ఆకర్షించింది.

కోటేశ్వరమ్మలో లైంగిక స్వేచ్ఛాప్రియత్వం కనిపించదు. కాని, మానసికానుబంధానికి ఆమె ఇచ్చే విలువ గొప్పది.

భర్తను వదిలి బయటి ప్రపంచంలోకి వచ్చిన కొత్తలో ఆమె దృష్టి ప్రధానంగా డబ్బు సంపాదన మీదే ఉన్నందువల్ల, ఆమెను ఒంటరితనం బాధించలేదు. కాని, డబ్బుతో భోగాలను అనుభవించాలని కోరుకునేటప్పటికి తానెంత ఒంటరిదో ఆమెకు తెలిసివచ్చింది. తాను చేజేతులా కోల్పోయిన భర్తను తిరిగి పొందలేదు.

అందుకే, ఆమె భర్త ఫోటోతో అనుబంధం పెంచుకున్నది. ఈ మానసిక అనుబంధమే క్రమంగా ఆరాధనాభావంగా మారింది. తన భర్త స్వభావం ఉన్న శ్రీనివాసరావును చూడగానే ఆమె ఆకృష్టురాలు కావటమే. భర్త ఫోటో ఆమె సర్వస్వం కాదన్న అంశాన్ని నిరూపిస్తున్నది.

ఒంటరితనం ఆమె ఎదుర్కొనే పెద్ద సమస్య. జీవించి ఉన్న భర్త ఫోటో ఆమె ఒంటరితనాన్ని తొలగించలేదు. అందుకే, ఆమె కథకునితో—

"ఈ ఏకాంత జీవితాన్ని మరిచిపోవటానికే నేను విచ్చలవిడిగా తిరుగుతున్నానా అని అనిపిస్తూ వుంటుంది" అన్నది.

ఆమె అన్వేషణాశాలిని, దేనికోసమో, ఎవరికోసమో అన్వేషిస్తూ 'విచ్చలవిడిగా' తిరుగుతున్నది. అర్థం చేసుకోలేని లోకులు ఆమె మీద అపనిందలు వేశారు.

ఆమెలో హుందాతనం ఉన్నది. ఉన్నతవర్గాల వారితో పరిచయం మూలంగా ఆ హుందాతనం మెరుగులు దిద్దుకున్నది. ఈ హుందాతనం ఆమె మీద ఉన్న అపవాదులను కొంత కప్పిపుచ్చగలదు. అవసరమైతే ఆమె అబద్ధాలు చెప్పగలదు. నటించగలదు. వీటిని అస్త్రాలుగా ప్రయోగించి శ్రీనివాసరావును ఆమె ఆకర్షించాలనుకున్నది. కాని, శ్రీనివాసరావులో లైంగిక ఆకర్షణకు బదులుగా ఆమెపట్ల గౌరవభావం ఏర్పడింది.

ఆ గౌరవం క్రమంగా ఆరాధనగా మారి, అతడామెను దేవతగా భావించటానికి కారణమైంది.

ఒక అర్ధరాత్రి శ్రీనివాసరావు పక్కన పడుకొని కోటేశ్వరమ్మ దుఃఖించింది. మేల్కొని, తన పక్కన కోటేశ్వరమ్మ పడుకుందని తెలుసుకోగానే అతని "శరీరం జలదరించింది." రక్తం ఒక్కసారిగా వేడెక్కి గబగబా ప్రవహించటం మొదలుపెట్టింది. హృదయం రెపరెప కొట్టుకుంది.

అంతే, అతడు వశం తప్పాడు.

"నా ఒంటరితనం నన్ను భయపెడుతూవుంది" అన్నది. అతడు ఓదార్చటానికి ఆమెను సందిట్లోకి తీసుకున్నాడు.

ఫలితం సంభోగం!

శ్రీనివాసరావు ఊహించని పరిణామమిది. ఈ కొత్త అనుభవానికి అతడు తట్టుకోలేకపోయాడు. అతనిలో ఆమెపట్ల పెరుగుతున్న ఆరాధనాభావం ఈపనితో భగ్నమయింది. అతడు నేలకు దిగివచ్చాడు. ఈ సంభోగం ఫలితంగా అతడు ఆమె స్త్రీత్వ ఆకర్షణకు గురిఅయ్యాడు. కాని, ఈ పరిణామాన్ని సాంఘిక నీతి నియమాల దృష్ట్యా ఆమోదించలేక, తిరిగి తన

మనసును కొత్త ఆరాధనా లక్ష్యం పైన కేంద్రీకరించే ప్రయత్నం చేశాడు. బ్రహ్మానందస్వామి ఆశ్రమంలో చేరిపోయాడు. అతడెక్కడికి వెళ్ళాడో తెలియక కోటేశ్వరమ్మా—కథకుడూ ఆందోళన చెందారు.

ఈ సంభోగం నెరపినందుకు కోటేశ్వరమ్మకు పశ్చాత్తాపం కలిగినట్లుగా కనిపించదు. అతడు తనకు చెప్పకుండా వెళ్ళినందుకు, వెంటనే అతణ్ణి కలుసుకోవటానికి తహతహలాడినట్లుగా కనిపిస్తుంది. ఈ దశలోనే కోటేశ్వరమ్మ నవలలో మొదటిసారి పాఠకులకు కనిపిస్తుంది.

ఒక విందులో కథకుడూ, కోటేశ్వరమ్మా కలుసుకుంటారు. ఆమెపట్ల కథకునికీ పాఠకులకూ ఏర్పడిన ఆసక్తికి రచయిత తెరతీయటంగా, ఈ సన్నివేశాన్ని భావించవచ్చు. ఆమెను చూస్తున్న సమయంలో లోకం మాటలకు తన ప్రత్యక్షానుభవానికిగల తేడాను కథకుడు గుర్తిస్తాడు. తన దగ్గరకు కథకుణ్ణి రప్పించటంలో కోటేశ్వరమ్మ హుందాతనాన్నీ, తెగువనూ ప్రదర్శిస్తుంది.

కథకుడు ఆమె దగ్గరకు వచ్చిన తర్వాత, హాల్లో ఉన్న వాళ్ళలో శ్రీనివాసరావు కనిపిస్తాడేమో నన్నట్టుగా, కళ్ళతో వెతికి, మనోనేత్రంతో సమన్వయం చేసుకొని, దుర్భర ఏకాంతం నుంచి నిస్సహాయంగా పలికినట్టుగా ''ఆయన వెళ్ళిపోయాడు'' అన్నది. తనతో శాశ్వతంగా ఉంటాడనుకున్నవాడు వెళ్ళిపోయాడనే బాధ, వెళ్ళేటప్పుడు కనీసం తనతో చెప్పి వెళ్ళలేదనే నిరాశా, ఏకకాలంలో ఈ మాటల్లో స్ఫురిస్తాయి. అప్పుడే, తనపట్ల శ్రీనివాసరావుకు బాధ్యతలు ఏర్పడ్డాయనే భావంతో ఆలోచించటం కూడా కనిపిస్తుంది.

కథకుడు శ్రీనివాసరావు పాఠ్యగ్రంథాల పనిమీద వచ్చాడనే విషయాన్ని చెప్పి ఆమెకు వాస్తవిక దృష్టి ఏర్పరచటానికి యత్నిస్తాడు.

తన పలుకుబడి తగ్గిపోయిందనే నిజాన్ని దాపరికం లేకుండా ఆమె కథకుడితో చెప్తుంది; కథకుడు తనకు దగ్గరివాడేనన్న భావంతో ప్రవర్తిస్తుంది. ఈ సాన్నిహిత్యం అతడు శ్రీనివాసరావుకు ఆత్మీయుడు కావటం వల్ల, తనకూ ఆత్మీయుడే నన్న భావం నుంచి పుట్టింది.

శ్రీనివాసరావు పాఠ్యపుస్తకాల పనిలో విఫలమయ్యాక . కోటేశ్వరమ్మ అతనికి తెలియకుండానే సహాయం చెయ్యటానికి ప్రయత్నించింది. తాను అట్లా ప్రయత్నించటం శ్రీనివాసరావుకు ఇష్టం ఉండదనే అతనికి తెలియనీయలేదు. తమ అనుబంధం మామూలు వ్యవహారాల స్థాయిని మించిందనే శ్రీనివాసరావు భావిస్తుండవచ్చునని ఆమె అనుకోవటం ఇందుకొక కారణం. అతనికి ఇష్టంలేని పని చేయకుండా వదిలేయవచ్చు గదా! తనకు ఇష్టమైన వాడికి పరోక్షంగా సహాయం చేయటం ద్వారా తృప్తిపడాలనుకోవటమిది ఇలాంటి పనుల నెన్నిటినో ఆమె ప్రతిఫలాపేక్షతో సాధించింది. ఆ అసంతృప్తిని ఈ పనిద్వారా పరిహారాత్మకంగా మాపుకోవాలని ప్రయత్నించింది.

శ్రీనివాసరావు సొంత ఊరు వెళ్లలేదని తెలుసుకున్న తర్వాత కథకుడు కోటేశ్వరమ్మను రెండోసారి కలుసుకుంటాడు. ఈ రెండుసార్లూ అతడామె ప్రమేయంతోనే కలుసుకున్నాడు. బెనారస్ చీర కట్టుకోవటం, పెద్ద బొట్టు పెట్టుకోవటం ద్వారా ఆమె హైందవ సాంప్రదాయిక స్త్రీత్వం ప్రదర్శించింది. కథకుణ్ణి ఆశ్చర్యపరిచింది. ఇది విందులో ఆమె ప్రదర్శించిన నవనాగరిక నారీత్వానికి భిన్నమైన రూపం. ఈ రెండో రూపమే ఆమెకు మానసికంగా సంతృప్తినిచ్చేది. కారణం, లోకుల విమర్శకు ఆమె ఇచ్చే కనీసపు జవాబు ఇది కావటమే! కథకుడు లోకుల మాటలు వినివుంటే, ఈ రూపం అతనికి జవాబు చెప్తుంది. అతని ఆశ్చర్యాన్ని చూసి ఆమె నవ్వటం నిర్దేశంగా కాదు.

దూరంగా సోఫాలో కూర్చున్న కథకుణ్ణి దగ్గరగా కుర్చీలో కూర్చోమనటం సాన్నిహిత్యం కోసమే.

పబ్లిక్ గార్డెన్‌కు కథకుడితో వెళ్ళటం కొత్త అనుభూతి కోసం, ఒంటరితనాన్ని మరిచిపోవటంకోసం.

''శ్రీనివాసరావు ఎక్కడికి వెళ్లింది చెప్పరూ?'' అని దీనంగా అడగటం, కథకుడు తెలిసీ తన నుంచి దాస్తున్నాడేమోనన్న అనుమానంతో కాదు, అతనికి తెలిసి ఉంటే ఎంత బాగుండేదీ అనే ఆశతో! తాను, శ్రీనివాసరావును ప్రేమిస్తున్నానని చెప్పింది. రెండోసారి కూడా కథకుడితో ఆమె దాపరికం

లేకుండా ప్రవర్తించింది. ఆమె ప్రేమ ఆమెకే ఆశ్చర్యంగా ఉన్నది. ఆ వయసులో ఎంతో జీవితాన్ని, అనుభవాలలో వైవిధ్యాన్ని చవిచూసిన తాను శ్రీనివాసరావును ప్రేమించటమేమిటని ఆశ్చర్యపడ్డది.

తాను శ్రీనివాసరావుతో పరిచయం పెంచుకున్న తర్వాత అంటే కొత్త మైకంలో పడ్డ తర్వాత మద్యం మానివేసినట్లు కథకునితో చెప్పింది.

శ్రీనివాసరావుకు ఇష్టంలేని పనికావటం వల్ల కూడా మద్యపానం మాని వేసి ఉండవచ్చు. అంటే, అతనికోసం ఆమె త్యాగాలు చెయ్యటం ప్రారంభిం చింది.

ఏకాంత జీవితాన్ని మరిచిపోవటానికే విచ్చలవిడిగా తిరుగుతున్నట్లు ఆమె అనుకోవటం దయనీయంగానే ఉంది. ఏ స్వేచ్ఛనైతే కోరి భర్తను వదిలి వచ్చిందో, ఆ స్వేచ్ఛ ఇప్పుడామెకు సంకెళ్ళు వేసింది. ఒక గమ్యం లేకుండా చేసింది. మనిషికి గమ్యం లేకుండాపోవటం పెద్ద శిక్ష. కథకుడికి భర్త ఫోటోను చూపించింది. ఇంకా జీవించి వున్న భర్త ఆమెకు అప్పుడే ఫోటోగా మారిపోయాడు.

శ్రీనివాసరావు పట్ల ఆమె పెట్టుకున్న ఆశలను తొలగించటం మంచి దన్న ఉద్దేశంతో—

''అతడు ఇటువంటి వ్యవహారాలకు విముఖుడు. పైగా భార్యాపిల్లలు గంపెడు సంసారం గలవాడు'' అని కథకుడు అన్నప్పుడు—

''సంసారం లేనివారెవరున్నారు? నేను ఒక్కదాన్ని తప్ప.'' అని కన్నీరుమున్నీరుగా ఏడ్చింది.

ఇది స్త్రీ తన ఆవేదనను వ్యక్తీకరించే సహజ ధోరణి. అంతేకాకుండా తన స్థానాన్ని ఆక్రమించిన ఒక స్త్రీ తన భర్తతో సుఖపడుతున్నప్పుడు, తానూ ఒకరి భార్య స్థానాన్ని ఆక్రమించి ఎందుకు సుఖించరాదన్న భావం అవ్యక్తంగా ఆమెలో ఉన్నది.

బ్రహ్మానంద స్వామి సన్నిధిలో—

'పరవశత్వంతో భజన నడుపుతున్న' శిష్యుని అవతారంలో శ్రీనివాస రావు కథకుడికి కనిపిస్తాడు. స్వామి భక్తి భావాన్ని ఆశ్రయించి అల్లుకు పోతున్నాడని, కథకుడు గ్రహిస్తాడు. తన భార్యాబిడ్డలను రక్షించుకోవటానికి 'ఆ పరాత్పరుడే ఉన్నాడ'ని తాను తిరిగి సంసారంలో అడుగుపెట్టే అవ కాశం లేదని శ్రీనివాసరావు కథకునితో చెప్పాడు. స్వాముల వారి బాధ్యత లన్నీ తానే స్వీకరించటం ద్వారా అతడు కావాలని సంకెళ్ళు వేసుకున్నట్లుగా కనిపిస్తుంది. అంటే, అతని ఈ దీక్ష ఎప్పుడో భగ్నమౌతుందనే భయం ఏ మూలో ఉందన్న మాట. అల్లుకుపోయే స్వభావం ఉన్నవాళ్ళు అల్లుకుపోవటానికి ఆధారభూతమైన ఆశ్రయం తమను నిరాకరించే పక్షంలో తిరిగి సంక్షోభంలో పడిపోతారనే అవగాహన వల్ల కూడా కథకునికి శ్రీనివాసరావు భక్తిభావం పట్ల గౌరవం కలుగలేదు.

మళ్ళీ, యాదగిరి క్షేత్రంలో బ్రహ్మానందస్వామి ఆశ్రమంలో శ్రీనివాస రావుకు కోటేశ్వరమ్మ తారసపడటం అతని 'సాధన'కు పరీక్ష.

కోటేశ్వరమ్మను చూడగానే తానామెను ప్రేమిస్తున్నట్లు స్పష్టంగా గ్రహించాడు. శ్రీనివాసరావు అతడు వెంటనే కథకుని దగ్గరకు పరుగెత్తుకు వచ్చి ఆమె నుంచి తనను కాపాడమని మొరపెట్టుకున్నాడు. అతనిలో నీతి నియమాల పట్ల చెక్కుచెదరని విశ్వాసం ఉన్నా, ఆత్మనిగ్రహం లేదనటానికి ఇదొక నిదర్శనం. అంతేకాదు, అదే రోజు రాత్రి చీకట్లో దాహం వేసిన కార ణంగా మంచినీళ్ళు త్రాగి, తిరిగి వస్తున్న కోటేశ్వరమ్మను ఢీ కొన్నప్పుడు పడిపోతున్న ఆమెను పట్టుకున్నాడు. ఆమె నిగ్రహం కోల్పోయి, 'రస వాహిని'గా మారిపోయింది.

అతడు ఈ పరిస్థితిలో నిగ్రహం కోల్పోకుండా ఉండే అవకాశంలేదు.

భర్తను వదిలివేసినప్పటి నుంచి ఆమెకు నిగ్రహం అలవాటయింది. అతణ్ణి ఆశ్రమంలో చూసినప్పుడు ఆమె మనస్సు ఏ రకం ఆందోళనకూ లోను కాలేదు. ''అందరినీ చూచినప్పుడు ఉన్నట్టే వుంది, శ్రీనివాసరావును చూచి నప్పుడు కూడా.''

దీన్నిబట్టి శ్రీనివాసరావుతో పోల్చిచూస్తే కోటేశ్వరమ్మని గ్రహస్థాయి గొప్పదేనని చెప్పవచ్చు.

కోటేశ్వరమ్మను చూడగానే అతడు చలించాడు. అతని స్పర్శకు లోనై ఆమె చలించింది.

ఇద్దరిలో అధ్యాత్మిక సాధనపట్ల సహజమైన కోరిక కనిపించదు. వాస్తవ జీవితాన్ని మరచిపోవటానికి పలాయనవాద మనస్తత్వంతో అధ్యాత్మిక సాధనకు శరణుజొచ్చినవారే ఇద్దరూ.

కోటేశ్వరమ్మ 'స్వామివారి చూపుల్లో వున్న కాంతికి 'మోహ' పడ్డది ఆ చూపులు ఆమెను 'మధుర స్రవంతి'లో ముంచెత్తినాయి

ఈ మోహం అధ్యాత్మిక మోహం కాదు అలాగే మాధుర్యమూ అధ్యాత్మికమైనది కాదు. కాని, తాత్కాలికంగా రూపాంతరం పొంది అధ్యాత్మిక భ్రాంతిని కలగజేశాయి.

స్వామి ముందు ఇద్దరూ దోషులుగా నిలబడ్డారు. ఇద్దరినీ స్వామి తన ఆశ్రమం నుంచి బహిష్కరించాడు. అధ్యాత్మిక రంగంలో ఇద్దరు పొందిన పరాజయాన్ని ఇది సూచిస్తున్నది.

ఈ బహిష్కరణను కోటేశ్వరమ్మ సహజమైన పరిణామంగానే ఆమోదించింది కాని, శ్రీనివాసరావు దీన్ని అవమానంగా భావించాడు. అతని ఆత్మాభిమానానికి గట్టి దెబ్బతగిలింది.

ఒకప్పుడు కోటేశ్వరమ్మతో శారీరక సంపర్కం ద్వారా పతితుణ్ణయినానని భావించిన శ్రీనివాసరావు ఈ సంఘటన ద్వారా అధఃపతితుణ్ణయినానని భావించి ఉంటాడనటంలో సందేహం లేదు.

మొదటి పాపాన్ని క్షాళన చేసుకోకముందే రెండో పాపాన్ని చేయవలసిరావటంతో అతడు మానసికంగా క్రుంగిపోయాడు.

ఈ సంఘటనకు, దీని పర్యవసానానికి, ఇద్దరిలో కలిగిన ప్రతిక్రియ

ఒక్కటే. ఇద్దరూ వేరువేరుగా తీర్థయాత్రలు సేవించటానికి బయలుదేరి వెళ్లిపోతారు.

ఇది వారి మనస్తత్వంలో ఉన్న సామ్యం.

తీర్థయాత్రల్లో వారు దర్శించాలని కోరుకున్నది దేవుణ్ణికాదు— తాము ప్రేమించిన వ్యక్తులనే, ఇద్దరి కోరిక ఒకటే, కాని ఇద్దరి బలహీనతల స్థాయిలో మాత్రం అంతరం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది.

పరవంచనే కాదు. ఆత్మవంచనను కూడా తెలుసుకోలేని అమాయకుడూ, నిర్మలమూర్తీ శ్రీనివాసరావు. కోటేశ్వరమ్మ పట్ల అతనికున్న ప్రేమ సాంప్రదాయిక నీతినియమాల మాటున చిక్కుకున్నది. శ్రీనివాసరావులోని అపరాధ మనస్తత్వం అతని ప్రేమకు న్యాయమైన స్థానాన్ని కల్పించలేదు. అతని భావావేశం అతణ్ణి నిలకడగా ఆలోచించనీయలేదు. ఏదైనా ఒక గట్టి నిర్ణయాన్ని తీసుకోవటానికి అవసరమైన చిత్తస్థైర్యం, నిగ్రహం అతనిలో లేవు. అతనిలోని అల్లుకుపోయే మనస్తత్వం, ఎన్నో భ్రమల వలయాలను సృష్టించింది. ఆ వలయాలను ఛేదించుకొని అతడు బయటపడే అవకాశం తక్కువ. కోటేశ్వరమ్మలోలాగే అతనిలోనూ ఆరాధనాతత్త్వం ఉన్నది. అందుకే, ఆదిలో కోటేశ్వరమ్మను దేవతగా భావించాడు. 'ఉదాత్తీకరణం' వైపు కొంత మొగ్గు చూపించినా, అతడు తీర్థయాత్రల్లో నిరంతరం అన్వేషించింది మాత్రం కోటేశ్వరమ్మనే. ఆమెపట్ల ఉన్న మోహాన్ని అతడు జయించలేకపోయాడు. ఆ విధంగా అతడు మోహమనేరాటకు కట్టివేయబడ్డాడు తాడు అనుమతించినంత మేర అతడు పరిభ్రమించగలడు. ఈ పరిభ్రమణం హద్దు మీరితే మతిభ్రమణం తప్పదు.

అందుకే, అమాయకుడైన ఉద్వేగి ఉన్మాదిగా మారిపోయాడు.

కోటేశ్వరమ్మలో మొదటి నుంచి 'విజిగీష' కనిపిస్తుంది. వివాహబంధాన్ని అతిక్రమించటంలో ఆ విజిగీష బహిర్గతమై వ్యవహారజ్ఞానాన్ని పొంది పలుకుబడినీ డబ్బునూ సంపాదించటంతో పరాకాష్ఠను అందుకున్నది.

పలుకుబడి తగ్గసాగింది. ఒంటరితనం క్రమంగా ఆమెను కబళించటానికి పూనుకోవటంతో గతంలోకి దృష్టిని సారించింది.

కోటేశ్వరమ్మకు సాంఘికనీతి పట్టింపులేదు. అందుకే ఆమెలో అపరాధ మనస్తత్వం లేదు. కాని, దీని స్థానంలో భర్తను వదిలివచ్చిన పశ్చాత్తాప మనస్తత్వం కొంత ఉన్నది.

అయితే, తాను భౌతికంగా పొందని కోరికకు మానసికంగా ఉన్నత రూపం ఇచ్చే అద్భుతమైన శక్తి ఆమెకు ఉన్నది. ఇదే, ఆరాధనాతత్త్వంగా రూపొందింది. భర్త ఫోటోలో దేవుణ్ణి చూడగలిగింది. శ్రీనివాసరావులోనూ, స్వామిజీలోనూ భర్తను చూడగలిగింది.

ఆమె హృదయపూర్వకంగా శ్రీనివాసరావును ప్రేమించగలిగింది. తన ప్రేమను వెల్లడించగలిగింది. చిత్తస్థైర్యం, నిగ్రహం ఆమెలో ఉన్నాయి. అందుకే ఊహించని సంఘటనలను ఎదుర్కొని నిలదొక్కుకోగలిగింది. స్థిరమైన నిర్ణయం తీసుకోగలిగింది. ఆమె ప్రధానంగా అన్వేషణాశాలిని. డబ్బూ, పలుకుబడి శ్రీనివాసరావు, స్వామిజీ ఆమె అన్వేషణలో మజిలీలు. తన అన్వేషణ హద్దును గుర్తించే అసాధారణ శక్తి కూడా ఉన్నది. తాను పోగొట్టుకున్న వాటికోసం అన్వేషించటం వృథా అని ఆమె తెలుసుకోగలిగింది. ఎప్పుడైతే ఆమెకు జీవిత లక్ష్యం లేకుండా పోయిందో, జీవించడంలో అర్థం లేకుండాపోయింది. అప్పుడు కోటేశ్వరమ్మలో అవసానదశ ప్రారంభమైంది. ఆస్తికులందరిలో వలెనే, అవసానదశలో ఆమెలోనూ భగవద్భక్తి పెరిగింది. ఒంటరితనం ఇష్టంగా మారింది. ఆమె జ్ఞాన మార్గంలో భాగవతాన్ని శ్రద్ధగా అధ్యయనం చేయటం ఇందుకు నిదర్శనం. ఆమెలోని భక్తికైనా, జ్ఞానానికైనా అంచు మాత్రం మృత్యువాంఛే.

కోటేశ్వరమ్మ శ్రీనివాసరావుల ప్రేమగాథకు సాక్షి కథకుడు. అతడు మధ్యవర్తి. ఇద్దరు కలవటంలోగాని, విడిపోవటంలో గాని అతనికి ప్రమేయం లేకపోవచ్చు. కాని, ఇద్దరికీ మూడో వ్యక్తి ఆత్మీయుడూ మాత్రం. కథకుడే.

కథకునిలో మంచి పరిశీలనా శక్తి ఉంది. కోటేశ్వరమ్మను మొదటి సారి చూడగానే, ఆమె చూపుల్లోని విపరీతమైన దైన్యాన్ని చూడగలిగాడు. ఆమె కళ్ళల్లోని అన్వేషణను పసిగట్టగలిగాడు.

ఆమె చూపుల్లో దైన్యానికి మూలం ప్రేమ రాహిత్యమే. కళ్ళల్లోని అన్వేషణ ప్రేమరాహిత్యాన్ని దూరం చేసే శక్తికోసం అలాగే, శ్రీనివాసరావులోని అమాయికత్వాన్ని, 'అల్లుకుపోయే తత్వాన్ని', ఆత్మవంచనా ధోరణిని కథకుడు ఎప్పుడో గుర్తించాడు.

తన స్త్రీత్వ ఆకర్షణకు గురికానందుకు కోటేశ్వరమ్మకు కథకుని పట్ల అసాధారణ గౌరవం ఏర్పడింది. ఆమె తన జీవితంలో అనుభవించి ఎరుగని స్నేహ మాధుర్యాన్ని చవిచూసి, ఆమెకు అవసానదశలో ఆత్మీయుడైనాడు. అంతేకాదు, తాను దిక్కులేని చావు చావబోవటం లేదనే ధైర్యాన్ని, తనకు ఉత్తరక్రియలు చేసేవాడొకడున్నాడనే సంతృప్తిని కోటేశ్వరమ్మకు కలిగించాడు. ఆమెను అంతవరకూ బాధించిన ఒంటరితనాన్ని పారద్రోలినవాడు కథకుడే.

భోగాలను అనుభవించాలని కోరుకున్నప్పుడు కోటేశ్వరమ్మకు ఎదురైన ఒంటరితనం, మరణించాలని కోరుకున్నప్పుడు ఎదురుకాలేదు. ఇది జీవితం ఆమెతో చేసిన క్రూరమైన పరిహాసం.

చివరిదశలో దాదాపు విరాగిగానే ఆమె జీవించింది. ఆమెకు మరణం ఆసన్నమయింది. శరీరం అదుపు తప్పింది. కథకుని సహాయంతో లేచి కూచుని—

''మిమ్మలను వొదిలి వెళ్ళటం ఒక్కటే కొంచెం కష్టంగా వున్నది.'' అన్నది.

స్నేహానుబంధాన్ని అమూల్యంగా భావించిన వ్యక్తి వ్యక్తీకరించిన ఆవేదన ఇది. ఆమెకు తాను చనిపోతున్నానన్న బాధలేదు. కాని కథకుణ్ణి విడిచిపోతున్న బాధ మాత్రం ఉన్నది.

ఎన్నో బాధ్యతలను మోసిన కథకునికి తన ఉత్తరక్రియల బాధ్యత కూడా అప్పగించింది. ఆ విధంగా, అతనికి కొడుకు స్థానాన్ని ఇవ్వటం ద్వారా మరణానంతరమైనా మాతృత్వాన్ని పొందగలుగుతాననే అవ్యక్త కాంక్షను, తృప్తిని తనలో పదిలపరచుకున్నది.

శ్రీనివాసరావును మాత్రం ఆమె గుర్తుచేసుకోలేదు. అతనికి సంబంధించిన ఆకర్షణ ఆమెలో జీర్ణమైపోయింది.

భర్త ఫోటోకు చివరిసారి నమస్కరించి,

"ఆయన ఎప్పుడు నన్ను దగ్గరకు తీసుకున్నా పొలాలకూ, పచ్చి గడ్డికీ, పుగాకుకూ సంబంధించిన వాసన ముక్కుపుటాలను గిలిగింతలు పెడుతూవుండేది. అది వ్యవసాయానికి సంబంధించిన వాసనేమో అని అనుకునేదాన్ని, కాదు. స్వాములవారి దగ్గర కూడా అటువంటి వాసనే వస్తూవుండేది. ఇప్పుడు నాదగ్గర నాకు అటువంటి వాసనే తగులుతూవుంది" అన్నది.

తాను ఆరాధించిన భర్త, తాను ఆధ్యాత్మిక ఆరాధనగా భ్రమపడి మోహించిన స్వామీజీ తనలోనే ఉన్నారన్న విషయాన్ని ఆమె గుర్తించగలిగింది. ఇది ఒక రకంగా తనకూ, తాను ప్రేమించిన వ్యక్తులకూ మధ్యన ఆమె సాధించిన అద్వైతం।

భర్త ఫోటోలో ఆమె దర్శించిన వెలుగు తనలోని వెలుగే. చీకటి వెలుగు !

ఆమె మరణించింది. తుది ఘడియల్లో ఆమె మృత్యువు తన ఇచ్ఛకు లోబడిన పరిణామం అన్నంత హుందాగా ప్రవర్తించింది.

ఈ విధంగా మృత్యుఘడియల్లో సైతం తన వ్యక్తిత్వ వైశిష్ట్యాన్ని ప్రదర్శించిన వ్యక్తి, కోటేశ్వరమ్మ.

ప్రేమరాహిత్యానికిలోనై, ఒంటరితనపు చిత్రహింసకు లోనై పరిపూర్ణత్వం కోసం ప్రయత్నించిన అన్వేషణాశాలిని కోటేశ్వరమ్మ పొందిన ప్రతిఫలం మృత్యువు.

అమాయకుడూ, ఆవేశపరుడూ అయిన శ్రీనివాసరావు అనుకోకుండా జీవితంలో కోటేశ్వరమ్మకు తారసపడి, ఆకృష్టుడై పొందిన శాపం ఉన్మాదం.

ఇద్దరూ పరిస్థితుల ప్రభావానికి లోనై ఆధ్యాత్మిక గృహంలోకి ప్రవేశించనైతే ప్రవేశించారు. కాని, భౌతికలోకపు తలుపులు మూసి గడియ పెట్ట లేక పోయారని రచయిత విశ్వాసం.

# 3. శిథిలాలయం

'శిథిలాలయం'[5] నవలిక శిథిలిసౌధ వర్ణనతో మొదలవుతుంది. 1948 సెప్టెంబరులో, పోలీస్‌యాక్షన్ తర్వాత, హైదరాబాద్ నగర స్వరూపంలోనూ, స్వభావంలోనూ మార్పురావటం ప్రారంభమైంది. అంతవరకు అధికారజ్వాలతో దేదీప్యమానంగా వెలిగిన నిజాం రాజభవనం 'శిథిలాలయం'గా మారసాగింది. జల్సాలతో ఖుషీలతో కులికిన నవాబులు, జాగీర్దారులు క్రమంగా మార్పుకు తలవంచక తప్పలేదు. తమ పెద్దపెద్ద మేడల్ని అద్దెలకిచ్చేసి ప్రజలకు దూరంగా ఉండే మేడలకు వెళ్లిపోయారు. అద్దెలకిచ్చుకోవటం తమ అంతస్తుకు అవమానం కనుక పదిమందికి తెలియకుండా ఉండటానికి సాధ్యమైనంతవరకు గుమాస్తాల మీద ఆధారపడేవాళ్లు. ఇలాంటి మేడలు సాధారణంగా పాతబడి పోయి, ఆలనాపాలనా లేకుండా ఉండేవి.

అలాంటి ఒక మేడ వర్ణనతో నవల ప్రారంభమవుతుంది. ఆ మేడలో టీకొట్టు, చేనేతబట్టల షాపు, గడియారాలషాపు, క్షవరశాలా, భీమాకంపెనీ అద్దెకు ఉంటున్నాయి. ఇవన్నీ ప్రజల వివిధ అవసరాలను తీర్చేవి. అదివరకు నగరంలో స్థిరపడ్డవాళ్లేకాక, ఇతరులు కూడా స్థిరపడుతున్నారు. ఆంధ్రా జిల్లాలనుంచి ఉద్యోగాలకోసం వచ్చినవాళ్లు కూడా వారిలో ఉన్నారు. ఆ మేడలో మార్వాడీ కుటుంబం కాక, సర్కారు జిల్లాలనుంచి ఎగుమతి అయిన 'పచ్చళ్లషాపు' కూడా ఉన్నది. ఆ పక్కగదిలోనే పైబట్టలతో హైదరాబాద్ వచ్చి చిన్న ఉద్యోగం సంపాదించుకున్న కథానాయకుడు పీతాంబరరావు ఉంటున్నాడు.

తల్లిదండ్రులులేని పీతాంబరరావు జీవితంలో స్థిరపడటానికి చదువు ఆర్థిక సుస్థిరత–ఈ రెండూ ముఖ్యమనుకుంటాడు. చదువు, కేవలం పరీక్షల చదువు కావటం వల్ల అతని బుద్ధి వికసించటానికి ఏమాత్రం దోహదం చేయ లేదు. న్యాయవట్టా సాధించి, ప్రాక్టీసు పెట్టి డబ్బుగడించాలని అతని ఆశయం.

జీవితానికి ఆర్థిక సుస్థిరత అవసరమనే విషయం నిజమే కాని, అదే ప్రధానం అనుకోవటం భ్రమే అవుతుంది.

తాను స్వగ్రామం వెళ్లినప్పుడల్లా "నన్ను తీసుకుపోవా బావా" అనే అమ్మాయి, తనకోసమే కన్నులు కాయలు కాచేటట్లు ఎదురుచూస్తున్నదను కోవటం కూడా కొంతవరకు భ్రమే. ఆ అమ్మాయి మాటల్లో తనను పెళ్లి చేసుకోవాలనే కోరికకంటే లోకం చూడాలనే కోరిక బలీయమని పీతాంబర రావు గ్రహించలేకపోయాడు.

నిర్మలాదేవిని పెళ్లిచేసుకోవటం ద్వారా పీతాంబరరావు తల్లిదండ్రులు లేకపోవటంవల్ల కలిగిన భద్రతారాహిత్యాన్ని దూరం చేసుకున్నాడు. ఒంటరి తనం కూడా దూరమైంది దైనందిన జీవితానికి ఒక క్రమం ఏర్పడింది.

కాని, ఆర్థిక పుష్టిని సాధించటానికి పూనుకోవటంతో భార్యను నిర్లక్ష్యం చేయక తప్పలేదు. వివాహపు తొలిరోజుల దాంపత్యాన్ని నిర్మలాదేవి మనో భావాలను పరిగణనలోకి తీసుకోకపోవటమంటే ఆ సమయంలో అత్యవసర ప్రాముఖ్యం గల విషయాన్ని నిర్లక్ష్యం చేయటమే నని అతడు గుర్తించలేక పోయాడు

ఉద్యోగంచేసి, సాయం కళాశాలలో చదువుకొని, సభలకూ, సమావేశా లకూ వెళ్లి అలసి సొలసి ఇంటికి చేరుకొని నిద్రమత్తులోనే ఇంత తిని నిద్ర పోవటం అతని కార్యక్రమమైంది. తనకోసం పగలంతా ఎదురుచూసే భార్య ఉన్నదనీ యాంత్రిక నగర జీవనవలయంలో చిక్కుకున్న తాను ఆమెతో ప్రేమనురాగాలను పంచుకోలేకపోతున్నాననీ అతడు గ్రహించలేకపోయాడు. ఈ దశలో ఉద్యోగం వేటలో వచ్చిన నారాయణరావు అనే పీతాంబరరావు మిత్రునికి ఉద్యోగం కంటే ముందు నిర్మలాదేవి దొరికింది.

నిర్మలాదేవి పీతాంబరరావును వదిలి నారాయణరావుతో వెళ్ళిపోవటం నవలలో ప్రధాన సంఘటన.

దీనితో, నిర్మలాదేవికి పీతాంబరరావుకు మధ్యన ఉన్న అంతరం బహి ర్గతమయింది. ఇది వివాహ వ్యవస్థ పట్ల ఆలోచనలు రేకెత్తించిన సంఘటన.

మొదటి పరిచయంలోనే నిర్మలాదేవి కుగ్రామంలో ఉండటం ఇష్టం లేక విశాల ప్రపంచాన్ని చూడాలనే కాంక్షను వ్యక్తం చేసింది. అందుకు పీతాంబర రావుతో వివాహం ఒక మెట్టుగా ఆమెకు ఉపకరించింది. పీతాంబరరావు సహక రించే పక్షంలో అతనితో కలిసి జీవిస్తూనే ఆమె లోకాన్ని చూసి ఉండేది. తన లక్ష్యాన్ని చేరుకొని ఉండేది. కాని, పీతాంబరరావు జీవిత విధానం అందుకు అవరోధమయింది. వివాహం బంధమే అయింది.

నారాయణతో లైంగిక సంబంధం పూర్తిగా లైంగిక సంతృప్తికోసం ఉద్దేశించింది కాదు. వైవాహికబంధాన్ని అతిక్రమించటానికి, సంసార పంజరం నుంచి విశాల విశ్వగగనంలోకి ఎగరటానికి మాత్రమే ఉద్దేశించింది.

ఇది ప్రమాదకరమైన ప్రయత్నమే. జీవితంలో ఉన్నతిని సాధించాలను కునే వ్యక్తి తెగించక తప్పదు. తెగింపువల్ల వచ్చే సమస్యలను ఎదుర్కొన కనూ తప్పదు.

నారాయణతో నిర్మలాదేవి వెళ్ళిపోవడాన్ని పీతాంబరరావు వంటి దుర్బల హృదయుడు తట్టుకోలేడు. అతడు కష్టపడి అమర్చుకున్న సంసారం, కలలుగన్న జీవితం ఒక్కసారిగా ముక్కలైపోయింది. మళ్ళీ పాత జీవితమే. అదే, ఒంటరితనం, అదే భద్రతా రాహిత్యం రెట్టింపు శక్తితో అతని మీద దాడిచేశాయి. అతడు రెండో పెళ్ళి చేసుకోవచ్చు. కాని అతనికి తనపట్ల అప నమ్మకం ఏర్పడింది. ఏ స్త్రీని పెళ్ళిచేసుకున్నా నిర్మలాదేవి లాగే లేచిపోతుం దనే భావన అతనిలో చోటుచేసుకోవటంతో పిరికివాడయ్యాడు వికాసోన్ము ఖంగా ఉన్న అతని హృదయ కుసుమానికి చీడపట్టింది

సంవత్సరం తర్వాత ఆమె పీతాంబరరావు దగ్గరకు వచ్చింది. కాని, తిరిగి అతనితో కాపురం చేయటానికి కాదు.

లేచిపోయిన ఏస్త్రీ అయినా, భర్త దగ్గరకు తిరిగి రావటానికి వెనుకాడు తుంది. కాని, ఈ సన్నివేశంలో నిర్మలాదేవిలో 'తొట్రుపాటు గాని' 'బెరుకు' గాని కనిపించవు. అంతేకాదు. ఆమె 'కొంటెనవ్వు' కూడా నవ్వగలిగింది

తొట్రుపాటు, బెరుకు తప్పు చేసిన వారికి ఉంటాయి. నిర్మలాదేవిలో అలాంటి అపరాధ భావం లేదు. ఆమెలోని ఆత్మవిశ్వాసం ఈ సన్నివేశంలో

చక్కగా వెల్లడయింది. తన 'కొంటెనవ్వు' ద్వారా ఆమె పీతాంబరరావు మానసిక వాతావరణంలోని బిగువును సడలించటంతోపాటు, తన మాటల ద్వారా ఆ సన్నివేశానికి సరసత్వాన్ని కూడా ప్రసాదించింది.

కాని, ఆమెకు విరుద్ధంగా పీతాంబరరావు తడబడ్డాడు. అతణ్ణి భయం ఆవహించింది.

'ఆమె ముందు తనేదో తక్కువవాణ్ణి అనే భావం' కలిగింది. అతని లోని న్యూనతా భావం ఈ విధంగా వెల్లడయింది.

అనాథశరణాలయంలో చేరి చదువుకోవటానికి గాను పీతాంబరరావు సహాయాన్ని కోరింది. సహజంగా పీతాంబరరావు తనకోపాన్ని అసహనాన్ని వ్యక్తం చేశాడు. తన భార్యను లేపుకుపోయిందేకాక, ఇప్పుడు ఆమెను వది లేసిన నారాయణను గుర్తుకు తెచ్చుకొని "వాడేమయ్యాడు ?" అని అరిచాడు.

"పాపం ఆయనకుండే ఇబ్బందులు ఆయనకున్నాయి." అన్నది. అతని భార్యవల్ల సమస్యలు రెచ్చిపోకుండా ఉండటానికి తానే అతణ్ణి తనతో సంబం ధం వదులుకొమ్మని నచ్చజెప్పింది.

ఇది జీవితం పట్ల నిర్మలాదేవికి ఏర్పడ్డ గాఢమైన అవగాహన. ఆమెకు అంతకుముందే తెలుసు, నారాయణ తనతో ఎక్కువకాలం ఉండడని.

వ్యక్తులను అర్థంచేసుకొని, సరిగ్గా అంచనా వేయటం ఒక కళ. నిర్మలా దేవి పీతాంబరరావును అర్థంచేసుకున్నది. భవిష్యత్తుపట్ల పీతాంబరరావుకున్న భావాలే అతని హద్దులు. ఆమె అతని మార్గాన్ని అనుసరించలేదు. అందుకే, నారాయణ అవసరమయ్యాడు. నారాయణకు ఆమె అంటే 'మోహం' ఉన్నది. ఆమెపట్ల తన బాధ్యతను కూడా విస్మరించి ఉండడు. కాని, అతని భార్య ఆ ప్రేమకు, ఆ బాధ్యతాస్పృహకు ఆటంకం. నిర్మలాదేవిపట్ల నిజమైన ప్రేమే ఉన్న పక్షంలో నారాయణ మరో స్త్రీని పెళ్ళాడేవాడే కాదు. నిర్మలా దేవే తన సమ్మోహన శక్తితో నారాయణను బంధించి ఉండగలిగేది. కాని, ఆమెకా అవసరంలేదు. నారాయణతో ఉన్న బంధాన్ని తెంచుకోవటం ద్వారా జీవితంలో మరో అడుగు వేయదలచుకున్నది. వేసింది కూడా.

ఆమె సులభంగా బంధాలను తెంచుకోగలదు. కొత్త అనుబంధాలను అంతే సులభంగా ఏర్పరచుకోగలదు.

నారాయణ దగ్గరి నుంచి ఆమె తిరిగి వచ్చిన తర్వాత.

'అతని హృదయానికి అర్థంలేని' ఆహ్లాదం కలిగింది. కారణం, ఆమె తనతో ఉండిపోవటానికే వచ్చిందని పీతాంబరరావు అనుకున్నాడు. ఉండి పోవాలని కోరుకున్నాడు. అదీకాక, తనకంటే గొప్పవాడు కావటం వల్లే నారాయణతో వెళ్లిపోయిందేమోననే బాధ ఇప్పుడు దూరమైంది. ఆమె నారాయణను వదలటంవల్ల అతడూ తనబోటివాడే అయ్యాడు తిరిగి తన దగ్గరికే రావటంవల్ల ఆమె పశ్చాత్తాపపడి ఉంటుందని ఊహించాడు. ఆమెకు తాను తప్ప మరి దిక్కు లేదన్న భావమూ కలిగింది. కాని, అనాథశరణాలయం సంగతి చెప్పి ప్రతినెలా పదిపదహేను రూపాయలు పంపమని ఆమె కోరే సరికి 'అతని తల తిరిగింది' కాని, తనమీదే ఆధారపడవలసివచ్చినందుకు కొంత సంతృప్తి కూడా కలిగింది.

మొదటి నుంచీ పీతాంబరరావులో వ్యక్తిత్వం లేకపోవటం కనిపిస్తుంది. అందుకే అతడు ఎవరినీ సరిగ్గా అర్థంచేసుకోలేకపోయాడు. దుర్బల హృదయుడు కావటంవల్ల గట్టి నిర్ణయాన్ని తానై తానుగా తీసుకోలేకపోయాడు. ఎదుటివాళ్ళను తన దారిలో నడిపించలేకపోయాడు. భార్య ఏ కారణంవల్ల నారాయణతో వెళ్లిపోయిందో అర్థం చేసుకోలేకపోయాడు. అందుకే అతడు జీవితపు పరిధిని పెంచుకోలేకపోయాడు అతని మనసుకూ మాటకూ పొందిక లేకపోవటం కూడా కనిపిస్తుంది. లోన ఇష్టపడతాడు, పైకి వ్యతిరేకిస్తాడు.

ఆర్థికంగా ఆమె తనమీద ఆధారపడటం తృప్తిని కలిగించింది కాని, పైకి 'నేను ఎందుకివ్వాలి' అంటాడు.

'ఆమె నోటివెంట భర్త అనే మాట' వచ్చిన తర్వాత తనకూ ఆమెకు మధ్యన 'అగాధం' గానీ 'గోడలు' గానీ ఉన్నట్లనిపించలేదు. కాని వెంటనే

"ఇకనుంచీ నువ్వుగడప యెక్కకూడదు" అని శాసించి ఒక గోడను సృష్టించాడు. తనలోని స్తబ్దతను బద్దలుకొట్టటానికి ఏం చెయ్యాలో తోచని

పరిస్థితిలో నిర్మలాదేవి కనిపించింది. ఆర్థిక సహాయం చేయటం ద్వారా తిరిగి జీవితానికి చేరువకావచ్చునని అతడు అవ్యక్తంగా భావించాడు. బాధ్యతా రహితంగా జీవిస్తున్న అతనికి ఒకకొత్త బాధ్యత లభించింది. తిరిగి వచ్చిన భార్యను స్వీకరించాలనుకున్నాడు. కాని, విశాలహృదయంతో, కాదు- సంకుచిత హృదయంతోనే. కొంత తృప్తికోసం, మరికొంత సంసారాన్ని ఈదడం కోసం. ఇది స్వార్థమే. మరో పెళ్లి చేసుకోలేదు కనుక, నిర్మలాదేవినే కోరుకున్నాడు.

పీతాంబరరావు మొదటి నుంచి ఒంటరితనానికి అలవాటైనవాడు. పెళ్లి తర్వాత కూడా మానసికంగా ఒంటరివాడే, కనుక భార్యతో అనుబంధాన్ని పెంచుకోలేకపోయాడు. కాని, ఆమె హఠాత్తుగా అతని జీవితం నుంచి నిష్క్రమించేసరికి, సాహచర్యాన్ని కోల్పోయాడు. సాంసారిక జీవితానికి దూరమయ్యాడు. అతనికి స్నేహితులు కూడా లేరు. స్నేహితుడనుకున్న నారాయణరావు తన భార్యను లేవదీసుకువెళ్ళాడు. ఆ విధంగా మైత్రిమీద అపనమ్మకం ఏర్పడిన కారణంగా, కొత్తగా ఏర్పడిన కారణంగా ఎవరితోనూ స్నేహం చేయలేదు.

ఆమె అతని బాధను సహృదయంతో అర్థంచేసుకున్నది. అతడామెను జాలిపడి పెళ్ళిచేసుకున్నాడు. నిజానికి ఆమెకే అతడంటే జాలి మరో అమ్మాయిని పెళ్ళిచేసుకొమ్మన్నది. అతడు వినలేదు. అందుకే తనకు అందజేస్తున్న ఆర్థిక సహాయానికి కృతజ్ఞతతోనైనా, రోజూ వండిపెట్టటం ద్వారా తన పరిధిలో అతనికి సహాయం చేయాలనుకున్నది. అతడు తిరస్కరించాడు. నిజానికి ఈ తిరస్కారం వెనుక ఆమోదం ఉంటుంది. ఆమె చొరవ తీసుకొని సహాయంచేసి ఉంటే అతడు కాదనేవాడుకాదు. కాని, ఈ సహాయం తనతో కలిసి జీవించాలనే కోరికకు దారితీయవచ్చునని ఆమె ప్రయత్నించలేదు.

రోజురోజుకూ తాను సంకుచితమవుతున్నాననీ, ఆమె పరిధి రోజురోజుకూ విస్తృతమవుతున్నదనీ గ్రహించగలిగాడు. తనను వదిలిపెట్టిన తర్వాతే ఆమెలో ఈ మార్పు వచ్చిందని కూడా గమనించాడు. ఆమె జీవిస్తున్నదని, తాను మరణిస్తున్నానని కూడా భావించాడు.

నిర్మలాదేవి పీతాంబరరావు జీవితంలో ఏర్పరిచిన లోటు వల్ల అతని జీవితం మరణసదృశమే అయింది.

నిర్మలాదేవి రెండోసారి అతని గుమ్మంలో అడుగు పెట్టి, అప్పుడప్పుడే కుదుటపడుతున్న అతని మనసును, ఒంటరితనానికి తిరిగి అలవాటుపడుతున్న బతుకును కదిలించింది. ఇందువల్లే జీవితంలోని శూన్యాన్ని నింపుకోవటానికి అనుకూలమైన మానసిక వాతావరణం ఏర్పడింది. నిర్మలాదేవి వెళ్లిపోయిన తర్వాత జీవితంలో తాను ఒక్క అడుగు కూడా ముందుకు వెయ్యలేదని అతడు గుర్తించాడు.

రైల్వేస్టేషన్‌కు వెళ్ళాడు దగ్గరోనే ఉన్న బస్సుస్టాప్‌కు వెళ్ళాడు. బస్సు స్టాప్‌లోనే అతడు 'సీనా' అనే పడుపుగత్తెను చూశాడు. ఆకృష్టుడయ్యాడు. నిర్మలాదేవి కూడా మొదటిసారి తనను తీసుకువెళ్ళమని బస్సుస్టాండులోనే పీతాంబరరావును కోరటం గమనార్హం. ఇదంతా ప్రయాణ సన్నాహం. జీవితంలో మలుపుకోసం ప్రయత్నం.

సీనా పడుపుగత్తె అని తెలిసే అతడు అనుసరించాడు. కేవలం లైంగిక వాంఛతో కాదు. తాను కోల్పోయిన నిర్మలాదేవిని వెతుక్కోవటానికి, జీవితంలో ఏర్పడిన శూన్యాన్ని పరిహారాత్మకంగా భర్తీ చేసుకోవటానికి, మరో స్త్రీ మాత్రమే తొలగించగలిగిన సందేహాలను తీర్చుకోవటానికి. అంటే, స్త్రీని సంతృప్తిపరిచే లైంగిక పటుత్వం తనలోలేని కారణంగానే నిర్మలాదేవి వెళ్లిపోయిందేమోననే అంతరాంతరాల్లోని సందేహం తీర్చుకోవటానికి అతడామెను అనుసరించాడు. "నీకేం? నువ్వు బంగారానివి" అని, అతని పురుషత్వాన్ని మెచ్చుకొని సీనా యోగ్యతాపత్రం ఇవ్వటంతో పీతాంబరరావులో ఆత్మవిశ్వాసం కలిగింది.

వేశ్యావృత్తికి శతాబ్దాల 'అమూల్యమైన' చరిత్ర ఉన్నది. ప్రభుత్వాలు ఈ వృత్తిని నాశనం చేయటం మాట అలా వుంచి అదుపుచేయటంలో కూడా విఫలమయ్యాయి. చివరకు దీన్ని 'Necessary evil'[6] అని ప్రకటించిన సందర్భాలు కూడా ఉన్నాయి. నిరుద్యోగం, దారుణమైన ఉద్యోగ పరిస్థితులు, తల్లిదండ్రుల నిర్దాక్షిణ్య వైఖరి, జనసమ్మర్దంవల్ల సాంకర్యం అనివార్యమయ్యే

జీవన పరిస్థితులు; అవినీతికరమైన పట్టణ ప్రాంత పరిస్థితులు ధనవంతుల నీతిబాహ్య విశృంఖల జీవిత విధానం, తార్పుడుగాళ్ళ కుతంత్రాలు, వ్యభి చారుల దుష్ప్రవర్తన మొదలైనవి స్త్రీలను వేశ్యావృత్తికి లోబరచే కారణాలు.

ఇతర సంస్థానాల్లో ఉన్నట్లుగానే హైదరాబాద్ సంస్థానంలో కూడా నిజాం పరిపాలనా కాలంలో వేశ్యలు కొందరికి మాత్రమే అందుబాటులో ఉన్నారు. చాలావరకు నృత్యం, సంగీతం వేశ్యవృత్తులుగా ఉండేవి. నృత్య కార్యక్రమం కాగానే నవాబు గారు నర్తకితో పాటు ఏకాంత మందిరంలోకి వెళ్లిపోయేవాడు. దీన్నే 'ముజ్రాకె బాద్ హుజ్రా' అనేవారు. పెట్టుబడిదారీ వ్యవస్థ స్థిరపడటంతో జనసంఖ్య పెరిగిపోవటంతో, పరిశ్రమలు అభివృద్ధి చెందటంతో వేశ్య అందరికీ అందుబాటులోకి రావలసివచ్చింది. వేశ్య తన శరీరంతో చేతగాని కుటుంబ సభ్యులనూ, ప్రభుత్వ యంత్రాంగాన్ని, దళారు లనూ పోషిస్తూ, విటులను ఆనందపరుస్తుంది. పెట్టుబడిదారీ వ్యవస్థలో వేశ్య గురయినంత దోపిడీకి మరెవరూ గురికారు.

పెట్టుబడిదారీ వ్యవస్థ సృష్టించిన వేశ్యల్లో నీనా ఒకతె. నాగరిక జీవి తపు నిత్యావసర వస్తువుల్లో నీనా ఒకతె, పోలీసుల లూటీకి, లాఠీకి గురయ్యే నిస్సహాయలలో నీనా ఒకతె.

నీనా ఒంటరిది అనాథ కావటంవల్ల బతకటంకోసం వేశ్యగా మార వలసివచ్చినట్లున్నది. పై మెరుగులన్నీ ఆ వృత్తికి సంబంధించినవే. కవ్వింపూ, మాటతీరూ, ప్రవర్తనా ఆ వృత్తికి సంబంధించినవే, అయినా ఆమె హృదయంలోని ప్రేమ మాత్రం ఆ వృత్తికి సంబంధించింది కాదు. అనాథ కావటంవల్ల మొదటి నుంచీ ప్రేమకోసం తపించిన యువతి కావటం వల్ల, అమాయకుడైన, గ్రామీణ మనస్తత్వం ఉన్న పీతాంబరరావు సాంగ త్యంతో, తనలాంటి అనాథుడైన పీతాంబరరావు సాంగత్యంలో వినూత్నమైన అనుభూతిని చవిచూసింది.

పీతాంబరరావుకిది అరుదైన అనుభవం. తనలోని న్యూనతను తొల గించుకొని పూర్తి ఆత్మవిశ్వాసం పొందటానికే ఆమెను తిరిగి కలుసుకో గోరాడు. కేవలం వ్యాపారసరళిలో ఆమెతో సంబంధం పెట్టుకోవటం అతనికి

ఇష్టం లేదు. మళ్ళీ ఆమెను కలవాలని అతడు కోరుకోవటం కూడా ఆ న్యూనతా భావాన్ని పూర్తిగా తొలగించుకొని ఆత్మవిశ్వాసాన్ని పెంచుకోవటానికే.

''వడ్డించి తగలెయ్యి''

''ఏం పచ్చడి నీ మొహం పచ్చడి'' అంటూ భార్యతో మాట్లాడిన వాడు, ఒకవైపు వ్యభిచారానికి పాల్పడకూడదని పశ్చాత్తాపపడుతూనే, నీనా విషయంలో—

మాట్లాడకుండా వెళ్ళటం, ఆమెను అవమానపరచటం అవుతుందనుకున్నాడు. ''ఆమెను అవమానించే హక్కు, ఆమె మనస్సుకి కించిత్తు కష్టాన్ని కలిగించే హక్కు తనకు ఏమి వుంది?'' అంటూ సుకుమారంగా ఆలోచిస్తాడు. నూతన స్త్రీ సంపర్కం పురుషుడిలో తెచ్చే మార్పిది. ఇంతకు పూర్వం అతనిలో లేనిది, ఎదుటి వ్యక్తిని గూర్చి సున్నితంగా ఆలోచించగలిగే సంస్కారం. నీనా సంపర్కంతో అతనికది అలవడింది అతడు నీనాను వ్యభిచారిణిగా చూడలేదు. వ్యక్తిత్వం ఉన్న స్త్రీగానే చూశాడు.

నీనాతో లైంగిక సంపర్కం జరిగిన ఈ సన్నివేశం ముఖ్యమైనదే. ఇప్పుడు 'నైతికంగా' పీతాంబరరావు నిర్మలాదేవితో సమానమయ్యాడు. సంసారి వ్యభిచారి కావటం ఎంత సులభమో కూడా అతనికి తెలిసివచ్చింది. పీతాంబరరావు అంతకుముందెప్పుడూ అక్రమ సంబంధాలకు పెట్టుకోవాలని కోరుకోలేదు. ఇదంతా యాదృచ్ఛికంగా జరిగిపోయిన వ్యవహారం. నిర్మలాదేవిని గూర్చి సానుభూతితో ఆలోచించటానికి తోడ్పడిన అంశం ఇది.

'తప్పు చెయ్యటం కన్నా క్షమించలేకపోవటం పెద్ద తప్పా?' అన్న ప్రశ్న ఉదయించటానికి జీవితంలో వ్యక్తులు చేసిన తప్పులపట్ల సానుభూతి కలగటానికి అనేక అంశాలు తోడ్పడతాయి. ఔదార్యం, మానవతాదృక్పథం వంటివి ముఖ్యమైన విలువలు. పరిస్థితుల ప్రాబల్యాన్ని అర్థం చేసుకోగలిగే శాస్త్రీయ దృష్టి కూడా ముఖ్యమైనదే. నిర్మలాదేవి చేసినతప్పే తాను కూడా చేసిన తర్వాత ఆ తప్పు అతనికి చిన్నదిగా కనిపించింది. నిర్మలాదేవి మీద సానుభూతి కలిగింది. ఆమెను క్షమించగలిగే మానసిక వాతావరణం ఏర్పడ

సాగింది. తనను తాను సానుభూతి పూర్వకంగా అర్థం చేసుకోవలసివచ్చింది. కనుక, నిర్మలాదేవిని సానుభూతిపూర్వకంగా అర్థం చేసుకునే ప్రయత్నం చేశాడు. తనను తాను క్షమించుకోవలసి ఉన్నది కనుక నిర్మలాదేవిని క్షమిస్తే బాగుండుననే దృక్పథం ఏర్పడింది. ఈ కొత్త మానసికానుభవానికి పునాది మాత్రం తానే!

ఈ స్థితిలో అతనికి జీవితంపట్ల తండ్రి అభిప్రాయాలు గుర్తుకు వచ్చాయి.

ఏ కోర్కెనూ అణచుకోకుండా అతని తండ్రి జల్సారాయుడిగా జీవితాన్ని అనుభవించాడు. సాంఘిక నీతిని ఎప్పుడూ అతడు గౌరవించలేదు. ఈ సందర్భంలో తండ్రి గుర్తుకు రావటానికి కారణం, తన నైతిక పతనానికి తండ్రి ప్రభావమే కారణమేమోననే అవ్యక్త భావమే.

వ్యక్తికి జీవితంపట్ల జిజ్ఞాస ఉంటే, ప్రతి సన్నివేశం నుంచి, ప్రతి పరిచయం నుంచి, సహేతుకమైన ప్రతి ఆలోచన నుంచి అనుభవం సంపాదించగలదు. కాని, పీతాంబరరావులో ఆత్మవంచనా శీలం కారణంగా ద్వంద్వ ప్రవృత్తి చెలరేగక తప్పలేదు,

వ్యక్తి ప్రవర్తన అతని అసలైన ఆలోచనా ధోరణిని బయట పెడుతుంది. అతడు మళ్ళీ నీనాకోసం బస్సు స్టాపులో వెతుకుతాడు. ఆమె కనపడక పోయేసరికి అతనికి నిరాశ కలుగుతుంది. కారణం సుస్పష్టమే. అతడామెను వాంఛిస్తున్నాడు. ఆమె తనను పొగుడుతుంటే, ఆత్మన్యూనతాభావాన్ని దాచేసుకొని అవధులులేని ఆనందాన్ని పొందాలని కోరుకుంటున్నాడు. నిరాశతో ఇంటికి తిరిగి వచ్చే సరికి నీనా అతనికోసమే ఎదురుచూస్తున్నది. అతనికి చాలా సంతోషం కలిగింది. తనకోసం ఒక స్త్రీ రావటం అతనికి చాలా సంతృప్తిని కలిగించింది. అతనికి తన పురుషత్వాన్ని గూర్చి గర్వం కలిగింది.

పీతాంబరరావు మానసిక స్థితిని స్పష్టంగా వెల్లడించే ఉద్దేశంతో రచయిత ఈ ఘట్టంలో వారిద్దరి సంభాషణను, చర్యలను చాలా వివరంగా వర్ణించాడు. అతడు ఆత్మీయులతో చెప్పుకునే జీవిత రహస్యాలను ఈ కొత్త

వ్యక్తితో చెప్పుకున్నాడు. అతడు దుర్భర ఏకాంతం కారణంగా మరో వ్యక్తి సంపర్కంకోసం ఎంతగా తహతహలాడుతున్నాడో, ఎదుటి వ్యక్తి సానుభూతికోసం, ప్రేమకోసం ఎంతగా దప్పిగొని ఉన్నాడో ఈ రసవత్తర మైన సన్నివేశంలో వెల్లడయింది.

మొదటిసారి వీరి కలయిక, సీనా వృత్తికీ, పీతాంబరరావు అవసరానికీ సంబంధించిందే. అయినా, ఇద్దరిలోన్నూ కొత్త అనుభవపు ఛాయలు తొంగి చూశాయి.

సంభోగ సమయంలో పీతాంబరరావు తనకు సంబంధించిన విషయా లన్నీ ఆమెతో చెప్పాడు. కాని, చెప్పినట్లు అతనికి గుర్తులేదు. ఆమె ప్రవ ర్తన కూడా ఇంచుమించు అలాగే ఉన్నది.

అతని ప్రవర్తనలో కాముకుని లక్షణాలకంటే ప్రేమికుని లక్షణాలే ఎక్కువ. ఇందులో ఆశ్చర్యంలేదు. కాని జీవితంలో ఎంతో మంది పురుషుల సాంగత్యాన్ని రుచిచూసిన సీనా పీతాంబరరావుపట్ల ఆకృష్టురాలు కావటమే ఆశ్చర్యం. వ్యభిచారంవల్ల లైంగిక కామం తీరుతుంది. ఆర్థిక సమస్యా కొంతవరకు తీరవచ్చు. మాతృత్వం కూడా సిద్ధించవచ్చు. కాని ప్రేమ మాత్రం చాలా అరుదుగా లభిస్తుంది. ఏ వ్యభిచారిణి అయినా మౌలికంగా స్త్రీ, ఏ కోరికా తీరకున్నా అది లోటే. ఒకరికి భార్యగా ప్రేమమయ జీవితం గడపాలనుకునే సీనా కోరిక సాధారణంగా తీరేది కాదు. జీవితాంతం తనతో కలిసి జీవించేవాడు సీనాకు లభించటం కష్టమే. అందుకే కామాతురతతో వచ్చే విటులకన్నా, మానసిక సంతృప్తికోసం, కొన్ని నిమిషాలపాటు ప్రేమించటానికి అన్నట్లు వచ్చే వాళ్ళంటేనే సీనాలాంటి వ్యభిచారిణికి యిష్టం. కారణం, తన కోరిక కూడా అదే కాబట్టి. సీనా పీతాంబరరావుపట్ల ఆకృష్టురాలు కావటానికి కారణం ఇదే.

మొదటిసారి సీనా ప్రదర్శించిన జాణతనం, మాటకారితనం వృత్తికి సంబంధించినవే. పోలీసువారు పీతాంబరరావు దగ్గర డబ్బు వసూలు చేసు కున్న తర్వాత, క్షమాపణ చెప్పుకోటానికి సీనా రావటానికి ఆమెలోని సంస్కారమే కారణం.

భార్యాభర్తల మధ్య ఉండేది కేవలం లైంగిక సంబంధం మాత్రమే కాదు. శారీరక మానసిక అవసరాల్లో ఇది ఒక్కటి మాత్రమే. వాళ్ళకు ప్రతి క్షణం సమస్యల రూపంలో జీవితం ఎదురౌతుంది. జీవితాన్ని తమ అదుపులో పెట్టుకోవటానికి భార్యాభర్తల మధ్యన మానసికమైన పొందిక అవసరం. వైయక్తిక జీవితానికి, సాంసారిక జీవితానికి మధ్యన సంఘర్షణ ఏర్పడకుండా ఈ 'పొందిక' చూస్తుంది; ఈ 'పొందిక' ఉన్నంత కాలం వివాహం విచ్ఛిన్నమయే అవకాశం తక్కువ.

సీనాకు అతనితోనే ఉండిపోవాలనీ, అతడు జబ్బు పడ్డప్పుడు ముసలివాడైనప్పుడు సేవ చేయాలని ఉంది! ఇది, ఆమెలోని ప్రేమమయ హృదయానికి, కలిసి జీవించాలనే కోరికకు నిదర్శనం.

సీనా పీతాంబరరావుతో సంసారజీవితాన్ని కాంక్షించినప్పుడు, పీతాంబరరావు 'గాబరా' పడ్డాడు. కారణం, సంఘం ఏమనుకుంటుందోనన్న భయం. సంఘం నింద తప్పదనుకున్నప్పుడు సీనాతో కలిసి ఉండటం కంటే నిర్మలాదేవినే తిరిగి స్వీకరిస్తే మంచిదనే భద్రతతో కూడిన భావం కలగటం కూడా మరొక కారణం. ఒకసారి జీవితంలో దెబ్బతిన్నవాడు ముఖ్యమైన నిర్ణయాలు తీసుకోవలసివచ్చినప్పుడు అతిజాగ్రత్తగా ఆలోచిస్తాడు.

సీనా వెళ్లిన వెంటనే అతనికి కుక్క ఏడుపు వినిపించింది. 'యమభటుడు' కనిపించటంవల్ల కుక్క అలా ఏడుస్తున్నదని పల్లెప్రజలు చెప్పుకొవటం అతనికి జ్ఞాపకం వచ్చింది. అతని జీవితం మృత్యువుకు అభిముఖంగా వెళ్తున్నదనే విషయాన్ని పరోక్షంగా సూచించాడు. రచయిత. ఇంతకు పూర్వమే, ఆమె జీవిస్తూ వుంది, తాను మరణిస్తున్నాడు అనుకున్నాడు. నిర్మలాదేవి జీవిస్తున్నది. కనుక తనను మృత్యుముఖంనుంచి కాపాడి, కొత్త జీవితాన్ని ప్రసాదించగలుగుతుందని అతడు విశ్వసించాడు.

నిర్మలాదేవిని స్వీకరించటానికి నిర్ణయించుకున్న తర్వాత ఆమెలో అతనికి ఏ తప్పూ కనిపించలేదు. అందుకే ఆమెతో ''నా జీవితాన్ని నేను చేతులారా పాడు చేసుకున్నాను అనీ, నిన్ను అనాథను చేశాను'' అనీ అన్నాడు.

తనతో మాట్లాడటానికి గదికి రమ్మని చెప్పి, మరో మంచి ఇంట్లో కొత్త జీవితం ప్రారంభించాలని ఆశించాడు.

''మానవ జన్మ ఎత్తింతర్వాత హాయిగా బ్రతకటం ధర్మం'' అనే అవగాహనను కూడా వ్యక్తంచేశాడు. ఇది అతడు అనుసరించదలచుకున్న కొత్త జీవిత విధానం.

నిర్మలాదేవి వచ్చిన తర్వాత, తనవల్ల జరిగిన పొరపాట్లకు అతడు క్షమాపణ వేడుకొని.

"తప్పు చెయ్యటం కంటే, తప్పును క్షమించలేకపోవటం పెద్దతప్పని నేను గ్రహించాను. ఇక మనిద్దరం ఏ పొరపాటూ లేకుండా కలిసి జీవిద్దాం'' అన్నాడు. మనస్ఫూర్తిగా ఆమెతో కలిసి జీవించాలనే కాంక్ష, భర్తగా తన సామర్థ్యాన్ని నిరూపించుకోవాలనె తపన అతని మాటల్లో. ప్రవర్తనలో వెల్లడయ్యాయి. ఇది ఒకరకంగా మార్పే. కాని కేవలం ఉపరితలంలోనే.

నిర్మలాదేవి తప్పకుండా తనతో జీవించటానికి అంగీకరిస్తుందనే విశ్వాసం ఆధారంగా వచ్చిన మార్పిది. ఆ విశ్వాసం సడలిన మరుక్షణం కూడా ఈ మార్పు నిలుస్తుందా ? అన్నది ప్రశ్న. నిర్మలాదేవి పట్ల విశ్వాసం ఏర్పడటానికి కారణం ఎప్పుడూ అతడు నిర్మలాదేవిని గూర్చి లోతుగా ఆలోచించకపోవటమే. ఆమె జీవిస్తూ వుందని గ్రహించగలిగాడు కాని, ఆమె తనకు అనుకూలమైన స్వతంత్ర జీవితాన్ని పొందగలిగినందువల్లే జీవిస్తూ వుందని గ్రహించలేకపోయాడు. మైదానంలో ప్రవహిస్తున్న నది తిరిగి ఇరుకుదారుల వైపు పయనించజాలదని గ్రహించలేకపోయాడు.

''నాకు ఎవ్వరికీ భార్యగా వుండాలనే అపేక్షలేదు. నేను బ్రతికితే స్వతంత్రురాలిగానే బ్రతకగలను. ఆ స్వాతంత్ర్యం లేకపోయిననాడు నేను మరణిస్తాను" అన్నది. అంతేకాదు. భార్యను కోల్పోయిన నారాయణరావుతో చెప్పిన జవాబు కూడా ఇదేనని చెప్పింది.

ఇది అతడు ఊహించని జవాబు.

అతణ్ణి తిరిగి అనాథుణ్ణి చేసిన జవాబు.

విశృంఖల జీవితంలో విసిగెత్తిన సీనా, బంధాన్ని కోరుకుంటున్నది. ఒక బంధాన్ని కోల్పోయిన పీతాంబరరావు మరో అనుబంధాన్ని కోరుకుంటు న్నాడు. వారు భార్యాభర్తలలాగే కాపురం చేయటానికి ఉద్యుక్తులు కావటం గమనార్హం. సాంప్రదాయిక వివాహ బంధం విచ్ఛిన్నమయినప్పుడు, మానసిక మైన హౌంటికతో కలిసి జీవించటానికి స్త్రీ పురుషులు పూనుకోవటం ఒక పద్ధతి అని రచయిత సూచిస్తున్నాడు.

ఇది సంప్రదాయం మీద తిరుగబాటే.

ఒక దుర్బల సుకుమార హృదయుడు, గత్యంతరం లేని పరిస్థితిలో తీసుకున్న నిర్ణయం, నిజానికిది సంస్కరణ భావంతో ప్రేరేపితం కాలే దన్నది సుస్పష్టం. ఆమెను స్వీకరించటమన్నది అతని తక్షణ మానసికా వసరం. కాని వ్యభిచారిణి కూడా మామూలు స్త్రీయే అన్న అవగాహననూ, ఆమె గత జీవితంపట్ల సానుభూతినీ తన జీవితంలోను, మనసులోను ఏర్పడిన శూన్యాన్ని నింపుకోటానికి అంగీకరించటంలో ఆచరణాత్మక దృష్టినీ పీతాంబర రావు ప్రదర్శించాడు.

పీతాంబరరావు సీనాను స్వీకరించటంతో ముగిసిన నవలికను—

"తరువాత ఏమయిందో తెలుసుకోవాలనే కుతూహలం ఉన్నవారికోసం మాత్రమే" అంటూ మరికొంత సాగదీశాడు, రచయిత. రచనాశిల్పం దృష్ట్యా ఇది ఉత్తమ పద్ధతికాదు. కాని, ఈ పొడిగింపు ద్వారా రచయిత కొంత ప్రయోజనాన్ని సాధించాడని చెప్పవచ్చు. ఎందుకంటే నిర్మలాదేవి భవిష్య త్తులో అంచెలంచెలుగా ఎదిగిపోతుందనటానికి ఎన్నో ఆధారాలున్నాయి. అలాగే విపరీత ఘటన సంభవించకపోతే పీతాంబరరావు సీనాల దాంపత్యం సంతృప్తికరంగా ఉంటుందనే విషయం కూడా సుస్పష్టమే. కారణం, పీతాంబరరావుకు ఏది అవసరమో సీనాకు తెలుసు. అందువల్ల అతనితో జీవించటం, ఆమెకు సమస్య కాదు. ముందు పీతాంబరరావును ఏక వచనంలో సంబోధించిన సీనా, కలిసి జీవించటం ప్రారంభించిన తర్వాత బహువచనంతో పీతాంబరరావును సంబోధించటం, అనురాగం పెరిగిందన టానికి గుర్తుకాకపోవచ్చు గాని, ఆమెలో దాంపత్య జీవితానికి అనుకూలమైన మార్పు వచ్చిందనటానికి మాత్రం గుర్తే.

ఇకపోతే, పీతాంబరరావు విషయం.

నిర్మలాదేవిని చూసిన అధికార దృష్టితో నీనాను చూడలేదు. వివాహం ప్రసాదించిన హక్కులున్నా, తనను వదిలేసి నిర్మలాదేవి వెళ్ళిపోతే ఆక్రోశాన్ని ప్రదర్శించటం తప్ప ఏమీ చేయలేకపోయాడు. ఇక నీనా వెళ్లిపోతే ఆ మాత్రం ఆక్రోశం కూడా ప్రదర్శించలేడు. ఈ బంధాన్ని రక్షించుకోవటం అతని సామర్థ్యానికి అగ్నిపరీక్ష.

జాతీయ స్థాయికి ఎదిగిపోయిన నిర్మలాదేవి అధ్యక్షత వహించే సభకు పీతాంబరరావు ప్రేక్షకుడుగా వెళ్లటం ధ్వనిగర్భితంగా కూడా ఉన్నది. ఆమె జీవితానికి అతడు ఆది నుంచీ ప్రేక్షకుడే!

నిర్మలాదేవి తన ఇంటికి వచ్చే సమయంలో అతడు కావాలని వెళ్ళిపోయాడు చివరిసారి విడిపోయినప్పుడు ఆమెపట్ల అన్యాయంగా ప్రవర్తించటంవల్ల ఏర్పడిన అపరాధ భావనే అందుకు కారణం.

ఆమెను చూడటం కేవలం రెండోసారైనా నిర్మలాదేవి పట్ల నీనా వ్యక్తం చేసిన సుహృద్భావం ఆమెలోని అవగాహనాశక్తికి తిరుగులేని సాక్ష్యం. నిర్మలాదేవి వారి పిల్లల చదువుకోసం డబ్బివ్వటం తనకు పీతాంబరరావు చేసిన మేలుకు కృతజ్ఞతను తెలుపుకోవటం మాత్రమేకాక, వారి భవిష్యత్తుపట్ల బాధ్యతను వహించటం కూడా. అంతేకాదు. తనలో తీరకుండా ఉండిపోయిన మాతృత్వకాంక్షను తీర్చుకునే ప్రయత్నం కూడా.

ఇక నవలిక పేరును గూర్చి.

'శిథిలాలయం' వివాహ వ్యవస్థకు సంకేతం. సాంప్రదాయిక నైతిక విశ్వాసాల మీద ఆధారపడిన వివాహ వ్యవస్థ, ఇరవయ్యో శతాబ్దంలో వస్తున్న సాంఘిక ఆర్థిక మానసిక పరిణామాల దృష్ట్యా మార్పుకు లోనుగాక తప్పదని గోపీచంద్ భావించాడు. పురుషాధిక్యాన్ని ఎదిరించి, ఆత్మగౌరవంతో కూడిన స్వతంత్ర జీవితాన్ని గడపటానికి ఆధునిక స్త్రీ ప్రయత్నించటంతో, భార్యాభర్తల మధ్యన సంఘర్షణ చెలరేగుతుందనీ, ఆ సంఘర్షణ ఫలితంగా,

వివాహబంధం కొన్ని మార్పులకు లోనుకావటం గాని, విచ్ఛిన్నం కావటం గాని జరుగకతప్పదని రచయిత సూచిస్తున్నాడు. అందువల్ల ఇప్పుడున్న వివాహ వ్యవస్థ శిథిలాలయం వంటిది

వ్యక్తి మనసులో దేవుడున్నప్పుడు, ఆలయంలోనూ ఉన్నాడు. వ్యక్తి మనసులో దేవుడులేనప్పుడు ఆలయంలో ఉన్నా, లేకున్నా ఒక్కటే. భార్యాభర్తల మనసుల్లో పొందిక ఉన్నప్పుడు, వివాహ బంధానికి విలువ ఉన్నది. పొందికలేనప్పుడు వివాహబంధం అవసరంలేదని ఈ నవలలో ప్రతిపాదించారు

స్త్రీ పురుషుని ప్రపంచంలో జీవిస్తుంది. వేశ్య పురుషుని లైంగిక ప్రపంచంలో జీవిస్తుంది. ఇప్పటి వివాహ వ్యవస్థ ఇలా కొనసాగినంతకాలం వ్యభిచారం కూడా తోడునీడలాగా కొనసాగక తప్పదు.

జాతీయ పునరుజ్జీవనంలో భాగంగా, మానవతాదృక్పథంతోనూ సంఘ సంస్కరణ దృక్పథంతోనూ వ్యభిచార వృత్తికి వ్యతిరేకంగా సాగిన ప్రచారం తెలుగు రచయితలను చాలాకాలం క్రితమే ఆకట్టుకున్నది. కందుకూరి వీరేశలింగం పంతులుగారు తెలుగునాట ఈ ఉద్యమానికి జీవం పోశారన్నది జగమెరిగిన సత్యమే. గురజాడ7 వంటి ఉద్దండులు తమ రచనలలో ఈ సమస్య లోతుపాతులను తరచిచూసే ప్రయత్నం ఇదివరకే చేశారు.

వ్యభిచారవృత్తిని ఇతివృత్తపరంగా స్వీకరించటంవరకు బాగానే ఉంటుంది. కాని, నిర్వహణలో రచయిత సులభంగా కొన్ని ప్రలోభాలకు గురిఅవుతాడు. అందులో ముఖ్యమైంది శృంగార సన్నివేశాలను హద్దు మీరి వర్ణించటంద్వారా పాఠకులను ఆకట్టుకోవాలనే ప్రలోభం. నిజానికిది రచన ప్రయోజనాన్నే దెబ్బతీస్తుంది. గోపీచంద్ ఈ నవలికలో నిగ్రహాన్ని పాటించి ఆశించిన ప్రయోజనాన్ని సాధించగలిగాడని చెప్పవచ్చు

'శిథిలాలయం' నవలికలో పీతాంబరరావు దగ్గరకు నిర్మలాదేవి తిరిగి వచ్చినప్పటి సన్నివేశానికి, గోపీచందే రచించిన 'పునస్సమాగమం' అన్న కథానిక మూలం.

'శిథిలాలయం' నవలికను గోపీచంద్ తన మరణానికి ముందు రచించాడు. అంతకుముందే 'పునస్సమాగమం' కథానికను రచించాడు.

'పునస్సమాగమం'లో—

కథానాయకుని భార్య కామరాజుతో లేచిపోతుంది. నాలుగు సంవత్సరాలను నాలుగు మధురక్షణాలుగా గడిపి, భర్తను చూడటానికి వస్తుంది. ఆమె 'సడలి నలిగి వుంది కాని, అందంగా వుంది. కళ్ళు మెరుస్తున్నాయి. అతి సుకుమారంగా వుంది.' "ఎందుకొచ్చావ్?" అనీ "సిగ్గులేదూ" అనీ భర్త చీదరించుకుంటాడు. ఆమెకు మాత్రం అతనిమీద జాలి కలుగుతుంది. భర్త క్రోపాన్నీ, చీదరింపునూ లెక్కచేయక ఆమె అతణ్ణి సమీపిస్తుంది. అతణ్ణి ఓదార్చుతుంది. ఈ విధంగా వాళ్ళు తిరిగి ఒకటి కావటంతో కథానిక ముగుస్తుంది.

కథానికలోని భార్యలాగే 'శిథిలాలయం'లోని నిర్మలాదేవి కూడా కొంత కాలం నారాయణతో గడిపి భర్త దగ్గరకు వస్తుంది. కథానికలోని భార్యలాగే నిర్మలాదేవి 'కొంచెం నలిగి వుంది, గాని ముఖంలో ఒక వింత కాంతి వెలుగుతూ వుంది. కండ్లు మిలమిల మెరిసిపోతున్నాయి.' కథానికలో భర్త అడిగినట్లే, 'శిథిలాలయం'లో పీతాంబరరావు భార్యను 'ఎందుకు వచ్చావ్' అని అడుగుతాడు.

కథానికలో భార్య లేచిపోయిన తర్వాత, 'లేచిపోవటం' అంత బ్రహ్మాండమైన విషయంగా అతనికి కనబడలేదు.

నవలికలో కూడా పీతాంబరరావుకు '....తీరా ఆలోచిస్తే ఆమె చేసిన పనివల్ల ఏర్పడ్డ అగాధం అతనికి ఏమీ కనుపించలేదు. అంతా మామూలుగానే ఉంది.' అనిపించింది.

కథానికలో భర్త "వెళ్లు, వెళ్లిపో" అంటూనే భార్యను స్వీకరిస్తాడు. నవలికలో 'ఇక నుంచి నువ్వీ గడప యెక్కగూడదు' అంటూనే తిరిగి నిర్మలాదేవిని స్వీకరించాలని కోరుకుంటాడు.

కథానికలో భార్య, లేచిపోయిన తర్వాతే 'పది జన్మలకు సరిపడా' అనుభవాన్ని సంపాదించింది. నవలికలో నిర్మలాదేవి కూడా నారాయణతో లేచిపోయిన తర్వాతే అనుభవం సంపాదించింది. వ్యక్తిత్వాన్ని సంతరించుకున్నది.

పై విధంగా కథానికలోని భర్త పాత్రలో కనిపించే ద్వంద్వ ప్రవృత్తి పీతాంబరరావుతో, కథానికలోని భార్య వ్యక్తిత్వ వైశిష్ట్యం నిర్మలాదేవిలో స్పష్టంగా కనిపిస్తున్నాయి.

కథానిక చివర భర్త తన దుఃఖాన్నీ, ఒంటరితనాన్నీ దూరం చేసుకోవటానికి భార్యను స్వీకరించినట్లే, నవలిక చివరన పీతాంబరరావు సీనాను స్వీకరించాడు.

అయితే లేచిపోయిన భార్యను భర్త స్వీకరించటం, కొంత జీవితానుభవాన్ని సంపాదించి, తద్వారా వ్యక్తిత్వాన్ని సంతరించుకున్న భార్య తిరిగి దాంపత్యజీవితంలోకి అడుగుపెట్టటం అన్న అంశాలను రచయిత కథానికలో సూచనప్రాయంగా వ్యక్తంచేశాడు. ఈ విషయంలో 'నవలిక' ద్వారా రచయిత ఆశించే ప్రయోజనం విస్తృతమైంది. కథానికలోని భార్యకు భిన్నంగా నిర్మలాదేవి సంతరించుకున్న స్వతంత్ర వ్యక్తిత్వం, 'సీనా' అన్న, కథానికలో లేని పాత్ర చేరుకున్న జీవితగమ్యం రచయిత ఆశించిన ప్రయోజనాన్ని స్పష్టం చేస్తున్నాయి.

# 4. గతించనిగతం

'హుస్సేన్‌ఖాన్ అనాడే పాకిస్తాన్ నుంచి హైదరాబాద్‌లో దిగాడు అతడు హైదరాబాద్ సంస్థానం సైన్యంలో సిపాయిగా పనిచేస్తూ ఉండేవాడు విలీనానికి ముందు కాశీంరజ్వీ నాయకత్వంలో రజాకార్ ఉద్యమంలో పని చేశాడు వారితో కలిసి దుండగాలు కూడా చేశాడు. అందువల్ల పోలీసు యాక్షను పిదప, భారత ప్రభుత్వం రజాకార్ ఉద్యమనాయికులతోపాటు తనను కూడా పట్టుకొని ఎక్కడ శిక్షిస్తుందో అని భయపడి పాకిస్తాన్ పారి పోయాడు.'

ఇది 'గతించనిగతం' నవలికలోని ముఖ్యమైన ప్రారంభవాక్యాలు. అందువల్ల కథాకాలం కంటే ముందు తెలంగాణా గ్రామాలు ఏరకమైన దోపిడీకి గురయ్యాయో అతి సంక్షిప్తంగా తెలిపి, రజాకార్లను గూర్చి, వాళ్లచేసిన దుండగాలను గూర్చి క్లుప్తంగా వివరించిన పిదప నవలికను పరిశీలించటం సమంజసంగా ఉంటుంది.

ఆ రోజుల్లో జమీందారీ జాగిర్దారీ భూస్వామ్యం కారణంగా సన్నకారు రైతులు, రైతు కూలీలు అష్టకష్టాలకు లోనయ్యారు. భయంకరమైన వెట్టి చాకిరీ అమలులో ఉన్నది. చిన్నచిన్న నవాబులు, దొరలు, పటేల్ పట్వారీలు, పోలీసులు అమాయక గ్రామీణుల మీద తిరుగులేని అధికారాన్ని నెరపుతున్నారు.

'మరొక ప్రాంతంలోనైతే పంట పండించుకున్నందుకు రైతు శిస్తు కడతాడు. ఈ రాజ్యంలో మాత్రం శిస్తులు కట్టేందుకే పంట పండించుకో వలసినట్లుంది. పంట కళ్ళాలనుంచే లెవీగల్లా పేరుతో రైతు పండించిన ధాన్యం దొరగడీకో, పటేల్ గరిశకో చేరిపోతుంది. రశీదులుండవు ఒక మారు సర్కారుకు కట్టినదాన్నే మళ్ళీ కట్టమంటారు పట్వారీలు.'[8]

'బాంచెను, కాల్మొక్కుత దొరా' అన్న మాటలు సర్వసాధారణంగా వినబడేవి. ఆ రోజుల్లో దొరల దౌర్జన్యం మూర్తీభవించినవాడు విసునూర్ దేశముఖ్ రామచంద్రారెడ్డి పగలేకాక, రాత్రిపూట కూడా పెద్ద లాంపుల వెలుతురులో రైతు కూలీలచేత పని చేయించేవాడు. ఆడకూలీలు తమ పిల్లలకు పాలిచ్చి వస్తామంటే – 'నూరు బొద్దు గిన్నెలు తెప్పించి ఆడవాళ్ళను వాటిలో చనుపాలు పిండమంటాడు. ఆ పాలను పొలంలో చల్లిస్తాడు, చల్లిస్తున్న రక్తమూ స్వేదమూ చాలదన్నట్లు.'9

తెలంగాణా ప్రజల్లో చైతన్యంకోసం కృషి చేసిన సంస్థలో 'ఆంధ్ర మహాసభ' ముఖ్యమైంది. వెట్టిచాకిరీ, మామూళ్ళు వంటి వాటికి వ్యతిరేకంగా పోరాడి, 'గ్రంథాలయోద్యమం, రాత్రి పాఠశాలలు, సాహిత్య సాంస్కృతిక రంగాల్లో కృషి — మొదలైన అన్ని జీవనరంగాల్లోకి విస్తరించి క్రమంగా గొప్ప రాజకీయోత్యమంగా పరిణమించింది.'10 అయినా నిజాం అధికారానికి తిరుగులేని రోజుకావటంవల్ల, ప్రజల మౌలిక సమస్యలు అలాగే ఉన్నాయి. పోలీస్‌యాక్షన్ తర్వాతకూడా పరిస్థితులు మారలేదు. 'విసునూరి దేశ్‌ముఖ్ పొలంలో బావి తవ్వుతుంటే, అందులో రాయి పడిందట. గ్రామస్తులనందరినీ పిలిచి తన బావిలో రాయిపడి తనకు నష్టం వచ్చిందని, అందుకని గ్రామస్తులంతా తలాయింత పద్దువేసుకొని తనకు నష్టపరిహారం చెల్లించాలని గోళ్ళూడగొట్టి వసూలు చేసాడట.'11 అందుకే దొరల దౌర్జన్యాలను ఎదిరించటానికి తెలంగాణా రైతాంగ పోరాటం చారిత్రకంగా అవసరమైంది.

ఆ రోజుల్లో ప్రతి సామాన్య ముస్లింకు అనల్‌మలిక్ – అంటే నేనే రాజును అనే అహంకారం ఉండేది. రాజమతానికి చెందినందుకు అధికార దర్పం ఉండేది. ముందుగా మజ్లిసె ఇత్తెహాదుల్ముసల్మీన్' అన్న సంస్థ సాంఘిక, సాంస్కృతిక కార్యక్రమాలకొరకు అవతరించింది. దీన్ని బహదూర్ యార్ జంగ్ రాజకీయ సంస్థగా రూపొందించాడు.12

స్వాతంత్ర్యానికి ముందు బ్రిటిష్ ప్రభుత్వం భారత సంస్థానాలు ఇష్టపడితే అటు పాకిస్తాన్‌గానీ, ఇటు భారతదేశంలోగానీ చేరవచ్చుననీ లేదా

స్వతంత్ర సంస్థానంగా రూపొందవచ్చునని చట్టం13 చేయటంతో, నిజాం హైదరాబాద్‌ను స్వతంత్ర సంస్థానంగా ఉంచటానికే పూనుకున్నాడు ఇది ప్రజల అభీష్టానికి విరుద్ధం కనుక ఉద్యమం ప్రారంభమయింది.

ఈ ఉద్యమాన్ని అణచివేయటానికి నిజాం పూనుకున్నాడు. నిజాం అండదండలతో ఇత్తెహాదుల్ముసల్మీన్ సంస్థ, వారి రజాకార్లు తెలంగాణా గ్రామాల మీద దాడి చేశారు. వీరి నాయకుడు నరరూప రాక్షసుడైన ఖాసిం రజ్వీ. వీడి చేతిలోనే పోలీస్ మిలిటరీ అధికారులు ఉండేవారు. ఫీల్ట్ మార్షల్‌గా చెలామణి అయిన రజ్వీ సలహా మేరకు నిజాం తన మంత్రుల్ని కూడా మార్చేవాడు. రజ్వీ ఉపన్యాసాలలోని మతద్వేషవిషం సామరస్యంతో జీవించాలని కోరే ముస్లింలను కూడా రెచ్చగొట్టింది. వారు గ్రామాలకు గ్రామాలనే తగలబెట్టారు. పగలు గ్రామాలమీదపడి దురంతాలు చేయటం, రాత్రి తమ శిబిరాలకు వెళ్లిపోవటం నిత్యకృత్యమయింది. హిందూ యువకులను తప్పకుండా వారు హతమార్చేవారు. ఆస్తులను దోచుకునేవారు తమకు అనుమానం ఉన్నవారిని సజీవదహనం చేసేవారు. బతికి ఉండగానే గోతిలో వేసి పూడ్చిపెట్టేవారు. ఆడవాళ్ళను వాళ్ళ భర్తల ఎదుటే మానభంగాలు జరపడం అతిసాధారణ వ్యవహారంగా మారింది. స్త్రీలను నగ్నంగా ఊరేగించటం వారితో నగ్నంగా బతుకమ్మ ఆడించటం వంటి వాటికి లెక్కలేదు. అందుకే 'రజాకార్ నైజాం పోలీసులు జరిపిన అమానుష చిత్రహింసలకు ఎక్కువగా గురైంది, బలైంది స్త్రీలే'నని14 అంటున్నారు పుచ్చలపల్లి సుందరయ్య గారు.

కొన్నివేల మంది ఉద్యమకారులను ప్రభుత్వం జైళ్ళల్లో కుక్కింది. కమ్యూనిస్టులు కాంగ్రెస్ వాదులు, కవులు, కళాకారులు చేసిన త్యాగాలు చరిత్రాత్మకమైనవి.

మహమ్మదీయులలో కూడా రజాకార్లను వ్యతిరేకించే వారు లేక పోలేదు. షోయబుల్లా ఖాన్ అనే యువకుడు 'ఇమ్రోజ్' అనే పత్రికను స్థాపించి రజాకార్లను నిశితంగా విమర్శించారు. అందుకే రజాకార్లు అతణ్ణి నిర్దాక్షిణ్యంగా చంపేశారు.15

చివరకు 18—9-48 నాడు భారత సైన్యం హైదరాబాద్‌లోకి ప్రవే శించటంతో రజాకార్ల ఆటకట్టింది. 'బంగాళాఖాతం' అరేబియా సముద్రం లోని జల తరంగాలు మా నిజాం ప్రభువు పాదాలను కడుగగలవు'16 అన్న రజాకార్లు కుప్పకూలిపోయారు.

అమాయకుల ప్రాణాలను బలిగొన్న యమకింకరుల సంస్థగా, తర తరాల మత సామరస్యపు తోటను ఇనుప కాళ్ళతో నలిపివేసిన రాక్షస సంస్థగా, గుడిసెలనూ, గృహాలనూ, దహించివేసి వేల కుటుంబాల జీవితాల్లో నిప్పులు చెరిగిపోసిన పాపిష్టి సంస్థగా కన్నెలనూ, కడుపుతో ఉన్న స్త్రీలనూ ముగ్ధలనూ ముసలి వాళ్ళనూ విచక్షణారహితంగా మానభంగం చేసిన పాశ విక సంస్థగా, ఒక మానవతా విధ్వంసక సంస్థగా రజాకార్ల సంస్థ చరిత్రలో మాయని మచ్చగా స్థిరపడిపోయింది.

ఆ రోజుల్లో భవిష్యత్తుకు గ్రహణం పట్టింది. జన జీవనాన్ని సుడిగాలి చుట్టింది. ప్రతి ఊరూ ఒక జైలుగా, ప్రతి వాగూ ఒక రక్తపుటేరుగా మారి పోయాయి. కాలం ఒక సుదీర్ఘ కాళరాత్రిగా మారిపోయింది.

నిరాశా నిస్పృహలే ఉచ్ఛ్వాస నిశ్వాసాలుగా, చావుబతుకులే హృదయ స్పందనలుగా, తెలంగాణా గడిపిన రోజులవి. నీళ్ళలో రాజకీయ విషం కలి సిన రోజులవి. గాలిలో మత ద్వేషం వీచిన రోజులవి.

అనుభవిస్తేనే తప్ప అర్థంకాని రంపపుకోతను, ఒక్క రచయిత మాత్రమే అక్షరాల్లోకి అనువదించగలడు. అందుకే ఆంధ్ర అన్నయ్యలు 'త్వమేవాహం' అని ధైర్యాన్నిచ్చారు. 'తెలంగాణా'! అని కేకేసి పిలిచారు. 'ఖబడ్దార్! నిజాం పాదుషాహే! అని ముసలి నక్కను హెచ్చరించి తమ్ముని వీపుతట్టారు.

ఎన్నో దేవాలయాలు నాశనమయ్యాయి. వేల ఎకరాల వ్యవసాయ భూమి దురాక్రమణ దార్ల ఖబ్జాలోకిపోయింది. వందల మంది హిందువులు నిర్బంధ మతాంతరీకరణకు లోనయ్యారు. ఇప్పటికీ ఆ దౌర్జన్యాల విష ఫలితా లను అనుభవిస్తున్న కుటుంబాలు గ్రామీణ ప్రాంతాల్లో ఎన్నో ఉన్నాయి.

ఈ నవలలోని హుస్సేన్ ఖాన్ కాశింరజ్వీ నాయకత్వంలోని రజాకార్ల సంస్థలో చేరి తన బంధువు ప్రోత్సాహంతో అనేక దారుణాలు చేశాడు. పోలీస్ యాక్షన్ జరిగిన వెంటనే చాలా మంది రజాకార్ల లాగానే హుస్సేన్ఖాన్ కూడా ప్రాణ భయంతో పాకిస్తాన్కు పారిపోయాడు. తాను మహమ్మదీయుడు కావటంవల్ల ఆ ప్రభుత్వం తనను ఆదరిస్తుందనుకున్నాడు. కాని అది భ్రమే నని తేలింది. నాలుగు సంవత్సరాల తర్వాత తిరిగి హైదరాబాద్కు వచ్చాడు. అతనికి గణనీయమైన మార్పు కనిపించింది. ముఖ్యంగా తన నెవ్వరూ పట్టించు కోలేదు. 'షెర్వాణీ తొడుక్కొని పైజమా వేసుకొని టోపీలు ధరించిన మను ష్యులు' అతనికి తక్కువ కనిపించారు. 'లాల్చీ తొడుక్కొని, బిళ్ళ గోచీ పెట్టుకొని, జరీ అంచు ఉత్తరీయం వేసుకొని కేకలు పెట్టుకుంటూ దూలూ రైమూ లేకుండా పరిగెత్తే మనుష్యులు' గుంపులు గుంపులుగా కనిపించారు.

పోలీస్ అక్షన్ తర్వాత నాలుగు సంవత్సరాలకు హుస్సేనుఖాన్ వచ్చాడు. అంటే సెప్టెంబర్ 1948లో పాకిస్తాన్ పారిపోయినవాడు 1952లో. తిరిగి హైదరాబాద్లో కాలు పెట్టాడు. ఇప్పుడు అతనికి కనిపించిన వాళ్ళలో చాలా మంది ఆంధ్ర ప్రాంతం నుండి ఉద్యోగాలు చేయటానికి తెలంగాణాకు వచ్చిన వాళ్ళే.

'పోలీస్ చర్య తర్వాత, పరిపాలనా సౌలభ్యంకోసం కోస్తా జిల్లాల నుండి అప్పటి సంయుక్త మద్రాస్ రాష్ట్రంలోని ఇతర జిల్లాల నుండి[17] అనేక మంది అధికారులు, ఉద్యోగులు తెలంగాణాకు రావటం జరిగింది. అదివరకు హైదరాబాద్లో రాజమతానికి చెందిన వాడైన హుస్సేన్ఖాన్ను ఈ దృశ్యం బాధాకరంగా ఉండటం సహజమే. కాని 'రాజీపడి' దగ్గర్లోని తన గ్రామానికి బయలుదేరాడు.

'తెలంగాణా రైతాంగ పోరాటం'[18] ముగిసి అప్పటికి సంవత్సరం కావస్తున్నది కనుక గ్రామాల్లో కూడా రాజీ వాతావరణం ఏర్పడినట్లున్నది. ప్రజలంతా ఎవరి పనుల్లో వాళ్ళు నిమగ్నులయ్యారు. అందుకే అతణ్ణి ఎవరూ పట్టించుకోలేదు. దీంతో అతడు కొంత ఆశాభంగం చెందినా, తన అక్రమా లకు గురైన వాళ్ళు తనను పోలీసులకు అప్పగిస్తారేమోననే భయం తొలగి పోయింది. బస్సు దిగి తన ఊరి వైపు నడవసాగాడు.

స్వాభావికంగా మంచివాడైన హుస్సేన్‌ఖాన్‌ను పరమత ద్వేషం రాక్షసునిగా మార్చేసింది. ఆ మత్తులో అతడు చేయగూడని రాక్షస కృత్యా లెన్నో చేశాడు. అందులో పార్వతి అనే కన్నెను మానభంగం చేయటం ఒకటి.

ఇలాంటి రాక్షస కృత్యాల ప్రభావానికి ఎదుటి వాళ్లు ఎంతగా గురైనారో హుస్సేన్ ఖాన్ కూడా అంతగానే గురైనాడు.

ఇదీ నవలికలోని కొత్తదనం

పార్వతి జీవితం నాశనం కావటానికి, ఆమె మరణానికి దిక్కుమాలిన చావుకు కూడా అతడే బాధ్యుడు ఈ రెండు మరణాలు అతనికి కనువిప్పును కలిగించి, మతం మీద అతడు పెట్టుకున్న భ్రమలను పూర్తిగా తొలగించి, అతనిలో పశ్చాత్తాపాన్నీ సత్పరివర్తనను కలిగించాయి.

ఈ విధంగా ఆ రెండు మరణాలకు విలువ చేకూరి అవి త్యాగాలుగా భాసించి, మానవత్వాన్ని వెలిగించాయి.

గర్భవతి అయిన పార్వతమ్మను హిందువులు వెలివేస్తే ఒక ముస ల్మాన్ దాదా ఆశ్రయం ఇచ్చాడు.

"తజాకార్లు వచ్చినప్పుడు ఆడవాళ్ల మానాన్ని కాపాడటానికి ఒక్క వేలు కూడా కదల్చని పిరికినాయాళ్ళు ఆ పిల్లను వెలివేశారు."

అంటూ మతాన్ని, నైతికమైన విలువలనూ అమాయకుల మీద బల హీనతల మీద ఆయుధాలుగా ఝుళిపించే వాళ్ళు ఎంత పిరికిపందలో దాదా మాటల్లో వ్యక్తం చేశాడు రచయిత.

హిందూ అనాథ స్త్రీని తన కూతురుగా భావించి ఒక మహమ్మదీయుడు ఆశ్రయం ఇవ్వటం, ఛాందస మత విశ్వాసాలను దెబ్బతీయటమే. అట్లే పార్వ తమ్మ తనను చెరచిన హుస్సేన్‌ఖాన్‌నే భర్తగా భావించటం, పాతివ్రత్యానికి అరుదైన ఉదాహరణ.

పాకిస్తాన్ నుండి నిరాశలో తిరిగివస్తున్న అతడు పార్వతమ్మ మర ణానికి కారకుడయ్యాడని తెలుసుకొని చాలా క్రుంగిపోయాడు. తాను పశు

త్వంలో చేసిన పని ఎంతటి విషమ సమస్యగా పరిణమించిందీ ఎలా ఒక నిండు ప్రాణాన్ని బలితీసుకున్నదీ తెలుసుకోగలుగుతాడు. తానూ ఒక తండ్రినయ్యాననే భావం పురుష సహజమైన గర్వాన్ని కలిగించినా, అతణ్ణి పెంచే అవకాశం లేకపోవటం, మళ్ళీ నిరాశనే కలిగించింది. అన్నింటికి మించి దాదా తనను అసహ్యించుకున్నట్లే, తన కొడుకు కూడా పెరిగి పెద్దవాడైన తర్వాత తనను ద్వేషిస్తాడేమోనన్న భావం అతణ్ణి ఇంకా క్రుంగదీసింది. హుస్సేన్‌ఖాన్ హృదయ మున్నవాడేననీ, పరిస్థితుల ప్రభావం వల్లా, బంధువు దుష్ప్రభావం వల్లా ఆ నీచకృత్యాలను చేశాడని ఈ సన్నివేశంద్వారా స్పష్ట మవుతుంది.

అతడు గ్రామానికి చేరుకోవటంతో కథలో రెండవ ఘట్టం ప్రారంభ మౌతుంది.

గ్రామానికి వెళ్లగానే అతనికి తెలిసిన విషయాలు దిగ్భ్రాంతినీ, దుఃఖాన్నీ కలిగించాయి. తాను ఏ బంధువునైతే నమ్మి తన తల్లిని అప్పగించి పాకిస్తాన్ వెళ్ళాడో, ఆ బంధువే తన తల్లి దగ్గర వున్న డబ్బును నగలను లాక్కొని నిలువనీడ లేకుండా చేయటమేకాక, ఇంటిని కూడా కాజేశాడని తెలుసుకున్నాడు. ఈ బంధువు ప్రోద్బలం వల్లనే రజాకార్ ఉద్యమంలో ఎన్నో ఘోరకృత్యాలు చేశాడు హుస్సేన్‌ఖాన్. తాను ఏ తల్లి కోసమైతే దేశా నికి తిరిగి వచ్చాడో, ఆ తల్లి దిక్కులేని చావు చచ్చినందుకు ఎంతగానో దుఃఖించాడు.

తనవల్ల అపకారం పొందిన దానయ్య అనే హిందువు, అవసాన దశలో తన తల్లిని పోషించాడని తెలుసుకొని ఆశ్చర్యపోయాడు.

పాకిస్తాన్ తన దేశమని మోసపోవటం, తన మతం వాడైన మహమ్మ దీయుడు బంధువని మోసపోవటం అవినాభావ సంబంధమున్న అంశాలు అతని తల్లి మాటల్లో జీవితానుభవం నేర్పిన పాఠం ఉన్నది.

''దూరపు కొండలు నునుపు'' కాని యువకర్త కం అర్థంచేసుకునే స్థితిలో లేదు. అతని బంధువు మోసం చేసిన సంఘటన, మానవత్వం మతాతీతమైన అంశమని హుస్సేన్‌ఖాన్‌కు అర్థమయింది. కాని దాని కతడు చాలా మూల్యం

చెల్లించవలసివచ్చింది. అల్లే, దోపిడీ స్వభావానికి స్వపరమతాల విచక్షణ లేదని కూడా అతనికి తెలిసింది. దోపిడీ చేయదలచుకున్నవాడు అవకాశం కోసం చూస్తుంటాడు. హుస్సేన్‌ఖాన్ తిరిగి రాడనే నమ్మకంతో అతని బంధువు తన మీద ఆధారపడి ఉన్న ముసలిదాన్ని దోచుకున్నాడు.

దానయ్య ద్వారా విషయాలన్నీ తెలుసుకున్న ఖాన్ తన బంధువును చావబాదాడు. హుస్సేన్‌ఖాన్‌లోని ఆవేశాన్ని గుడ్డిగా నడిపించి ఒకప్పుడు లాభపడ్డ అతని బంధువే ఆ ఆవేశానికి గురికావటం చక్కని కల్పన.

ఈ సన్నివేశం పోలీస్ యాక్షన్ తర్వాత తెలంగాణా గ్రామాల్లోని పరిస్థితులను కూడా సూచించేదిగా ఉన్నది.

హుస్సేన్‌ఖాన్ చేతిలో దెబ్బలుతిన్న అతని బంధువు.

''చూడు నిన్నేం చేస్తానో రేపిపాటికి నిన్ను జైల్లో వేయించకపోతే నా పేరు మారుపేరున పిలువు దానయ్య భాయీ, వీడు నన్ను కొట్టిన కొట్టుడు నువ్వు చూశావుగా ? నువ్వు పోలీసు వాళ్ళ దగ్గర సాక్ష్యం చెప్పాల్సి వుంటుంది.'' అన్నాడు దానయ్యతో.

''నేను సాక్ష్యం చెప్పవలసి వుంటే చాలా సంగతులు చెప్పవలసి వుంటుంది భాయీ అన్నాడు దానయ్య.

''అంతే నంటావా దానయ్యా భాయీ ?'' అని నీరసంగా అడిగాడు బంధువు.

ఆ చుట్టు ప్రక్కల గ్రామాలను ఆ బంధువు హుస్సేన్‌ఖాన్ లాంటి వాళ్ళ సహాయంతో దోచుకున్నాడు. హుస్సేన్‌ఖాన్ లాంటి వాళ్లు కూడా తమ స్థాయిలో తాము దోపిడీ చేశారు. నాయకుడూ, అనుచరులూ దోషులే. నాయకుడు పెద్ద దోషి. అనుచరుడు చిన్న దోషి. నాయకుడు ధైర్యంగా ఊళ్ళోనే ఉన్నాడు. అనుచరుడు భయపడి పాకిస్తాన్ పారిపోయాడు. నాయకుడు అనుచరుని ఆస్తిపాస్తులను కూడా దోచుకున్నాడు. అయినా హుస్సేన్‌ఖాన్‌నే జైల్లో వేయించటానికి పూనుకున్నాడు. అంటే ఈ బంధువు కోర్టులూ, జైలు శిక్షలూ, దావాలూ, డిక్రీలూ, వాయిదాలూ, తీర్పులూ మొదలైన వ్యవహారాల్లో రాటుదేలి

కోర్టు పక్షిగా మారాడన్న మాట. అందుకే అతి సులభంగా హుస్సేన్‌ఖాన్ ఇంటిని దొంగ పత్రం సహాయంతో తన పేరిట మార్పించుకున్నాడు. అంతకు ముందు నిజాం హయాంలో కూడా ఇలాంటి పనులు చేసివుంటాడు. కొత్త ప్రభుత్వం హయాంలో కూడా అవి కొనసాగుతున్నాయన్న మాట.

''దానయ్య భాయీ'' అని మర్యాదను ప్రదర్శించటంలో వెనుకాడకుండానే ''సాక్ష్యం చెప్పాల్సి వుంటుంది" అంటూ అధికారయుక్తంగా చెప్పాడు. ఇది 'అనల్‌మల్లిక్' (నేనేరాజును) అనే పాత అహంకారాన్ని ప్రదర్శించటమే.

చాలా విషయాలు చెప్పవలసి వుంటుందని దానయ్య హెచ్చరించటంతో, 'అంతేనంటావా దానయ్య భాయీ !' అని నీరసంగా అడిగాడు. నీరసంగా అడగటానికి మొదటి కారణం తానూ దోషి కావటం ఒక కారణం కాని, అంతకంటే పెద్ద కారణం, కొత్త ప్రభుత్వం మూలంగా గ్రామాల మీద ముస్లింల పట్టు సడలటం అందుమూలంగా అతడు రాజీపడటానికి వెనుదీయలేదు.

దానయ్య చిన్నపాటి కాంగ్రెస్ నాయకునిగా కనిపిస్తున్నాడు. అందుకే తాను కోల్పోయిన యాభై ఎకరాల భూమిని తిరిగి ప్రభుత్వం నుండి రాబట్టుకోగలిగాడు.

''అందుకు మనకేం హక్కున్నది ? మనం మాత్రం తప్పులు చెయ్యటం లేదా ?" అన్నాడు దానయ్య. అతని మాటలు ఖాన్‌కు పార్వతిని జ్ఞాపకం చేశాయి. 'లేడి వెంట పడిన వన్యమృగం' లాగ తానామె వెంట పడటం, ఆమె తననొక భూతాన్ని చూసినట్లు చూసి ఒకమూల నక్కటం, తాను నిర్దాక్షిణ్యంగా మానభంగం చెయ్యటం అన్నీ గుర్తుకొచ్చాయి. వెళ్ళిపోతున్నప్పుడు, ఆమె తన పాదాల మీద పడటం గుర్తుకువచ్చింది.''

ఆ తర్వాత తల్లి గుర్తుకువచ్చింది. ఆమె మతసామరస్యం జీర్ణించిన వృద్ధురాలు, అనుభవజ్ఞురాలు. రజాకార్ల హింసాకాండలో. దోపిడీల్లో తన కొడుకు పాల్గొనటం ఆమెకు ఇష్టంలేదు. కొడుకు సంపాదించిన పాపపు సొమ్మును ముట్టుకోవటానికి వెనుకంజ వేసింది. కొడుకు పాకిస్తాన్ వెళ్ళటం

ఆమెకేమాత్రం ఇష్టంలేదు. తన శ్రామిక జీవితం తనకు చెప్పిన పాఠాన్ని వినిపించింది.

"ఎవ్వరూ అన్నం వూరికే పెట్టరు. ఎవ్వరి రెక్కల మీద వాళ్ళం బ్రతకాల్సిందే బేటా" అని. కాని ఈ మాటలేవీ ఖాన్ తలకెక్కలేదు.

ఇక్కడ నవలలోని పూర్వాపర సంఘటనలకు ఎంతో సునాయసంగానూ, ప్రస్తుత వాతావరణానికి భంగకరం కాకుండానూ లంకెవేశాడు, రచయిత. ఖాన్ చేసిన ఘోరాల ప్రభావం అతనిమీదే ఒక్కుమ్మడిగా పడటం, ఫలితంగా పశ్చాత్తాపం బలపడి, పరివర్తనా రూపొందటం రచయిత ఉద్దేశించిన పరిణామం.

తనకోసం తల్లి ఒక పెట్టెను వదలిపెట్టిపోయిందని దానయ్య చెప్పితే, అతనికి ఆశ్చర్యం ఆనందం కలిగాయి. ఇది నవలికలో కుతూహలాన్ని రేకిత్తించే అంశం. దానయ్య వెంట అతని ఇంటికి వెళ్లి ఎంతో కుతూహలంతో ఆ పెట్టెను తెరచి చూశాడు. అందులో ఒక చిన్న జలతారు కోటు, చిన్న జలతారు టోపీ ఉన్నాయి! వాటిని చూడగానే అవి తన చిన్నప్పటి దుస్తులని గుర్తుపట్టాడు!

ఇది హృదయాన్ని కదిలించే సన్నివేశం అంతేకాదు. మానవత్వాన్ని గొప్ప శిల్పంతో అనుభూతం చేసిన సన్నివేశం కూడా. ఖాన్ ఎంత పెద్దవాడైనా, తల్లి దృష్టిలో చిన్నవాడే!

పాకిస్తాన్ నుంచి తనకోసం తప్పకుండా తిరిగి వస్తాడనే ఆశతోనే ఆమె బతికింది. తల్లి చచ్చినా, తల్లిలోని ఆశా చావ లేదనటానికి ఈ కానుకలే సజీవ సాక్ష్యాలు.

అతడు దూరమైన తర్వాత తల్లి ఎప్పుడూ అతని పసితనాన్నే గుర్తు చేసుకునే దన్నమాట. ఆమె అతనికి ఆ దుస్తులు వారసత్వంగా అప్పగించి పోవటం అంటే, తాను ప్రేమించిన అతని బాల్యాన్ని, నిర్మలమూ, మధురమూ అయిన అతని బాల్యాన్ని అతనికే అప్పగించి పోవటమన్నమాట. మనుష్యులనూ మనసులనూ ముక్కల కింద విడగొట్టే, మత ద్వేషాన్ని జయించమని చెప్పటమన్నమాట.

ఈ సందేశంలో తల్లి తన కొడుకును అనునయంతో క్షమించటం కూడా ధ్వనిస్తూ ఉన్నది.

ఇది తల్లి ప్రేమకు గోపీచంద్ గీసిన సాహితీ వర్ణ చిత్రం: తల్లి ఖాన్ కిచ్చే సందేశం బాల్యంలోకి ఎదగమని అతడు పెరిగి పెద్దవాడయిన కొద్దీ పతనంవైపే పయనిస్తూ వచ్చాడనీ, అతని బాల్యమే నిసర్గమైనది, స్వచ్ఛమైనది అని కూడా ఆమె ఉద్దేశ్యం.

'Except ye be converted, and become as little children ye shall not enter into the kingdom of heaven'[19] అని ఆ ఆస్తికురాలైన వృద్ధమాత కూడా విశ్వసించి ఉంటుంది.

తల్లి ప్రేమ అతణ్ణి పసివాణ్ణి చేసింది. అతడు పసివాడైపోయి, తల్లి ఒడిలోకి ఒదిగిపోయినట్లు భావించాడు. ఇది ఖాన్‌లో క్రమపరిణామం చెందిన పరివర్తనకు తారస్థాయి. అసాధారణమైన సంఘటనలతో, కల్పనలతో సాధించవలసిన పరివర్తనను, ఎంతో సునాయాసంగా, సహజంగా సాధించటం గోపీచంద్ ప్రత్యేకత.

తల్లి మాతృదేశానికి ప్రతీక కూడా కావటంవల్ల, విదేశం మీది మోజుతో వెళ్లిన హుస్సేన్‌ఖాన్ తిరిగి రావటం దేశభక్తికి విజయం.

తల్లి అందజేసిన సందేశం మూలంగా అతని వ్యక్తిత్వానికి పరిపూర్ణత సిద్ధిస్తుంది. ఆ పరిపూర్ణతకు మరోపేరే మానవత్వం.

ఈ విధంగా మతం పేరుతో దుండగాలు చేసి రాక్షసుడుగా మారి, మతం మీది భ్రమలతో పాకిస్తాన్ వెళ్ళిన హుస్సేన్‌ఖాన్ నిరాశతో తిరిగి రావటం పాక్షిక హింసాత్మక మతైక దృష్టికి మొదటి పరాజయం మునలి సాహేబు, దానయ్యలు భిన్నమతాల నుంచి మానవత్వానికి ప్రాతినిధ్యం వహించి, వ్యతిరేక శక్తులకు గుణపాఠం చెప్పటంతో హుస్సేన్‌ఖాన్‌లో మతాతీత దృష్టికి ప్రాతిపదిక ఏర్పడింది. తల్లి జీవితానుభవం నుండి పొందిన ప్రజ్ఞానం, దూరదృష్టి అతనిలో మానవత్వాన్ని రూపొందించింది. ఈ విధంగా ప్రధాన పాత్రలో మూడు దశలను మంచి శిల్పంతో రచయిత మేళవించాడు.

ఇవి నవలిక చివరన ఉన్న వాక్యాలు.

'చంద్రుడు మబ్బుతెరను చీల్చుకొని బయటకు వచ్చి ప్రకాశిస్తున్నాడు. దూరపు పొలంనుంచి తిరిగి వస్తున్న ఎడ్లమెడల్లో గంటలు మ్రోగుతున్నాయి. అవి దేవాలయంలోని గంటలవలె వినిపించినై. ఒక ముసల్మాను భక్తుడు మసీదులో నిలబడి 'అల్లా' అని పెద్దగా కేకవేసి భగవంతుణ్ణి పిలుస్తున్నాడు. ఆ కేక తల్లి గోవును చూచి 'అంబా' అని అరచిన లేగదూడ అరుపు వలె విని పించింది. ఎక్కడనుంచో బతకమ్మ పాట వినిపిస్తూ వుంది.'

హిందువులూ, ముస్లింలూ ఆరాధనా భావంతో చూసే 'చంద్రుడు' మత ద్వేషపు మబ్బు తెరలను చీల్చుకొని తెల్లని స్వచ్ఛమైన మానవతా జ్యోత్స్నను కాస్తున్నాడు. గుడి గంటల లాగా వినిపించిన ఎడ్లమెడలలోని గంటల చప్పుడు గ్రామీణ వ్యావసాయిక జీవితంతో ముడిపడి వున్న ఆస్తిక భావాలు ప్రతిధ్వని 'అల్లా అరుపు' లేగదూడ తల్లికోసం చేసే అంబారావం లాగా విని పించటం, దేవతగా మారిన తల్లికోసం తల్లి కోరిక ప్రకారం బాలుడై పోయిన హుస్సేన్‌ఖాన్ పిలుపు, తాను తల్లి ఆదేశాన్ని శిరసావహించానని చెప్ప టానికి కాబోలు! బతకమ్మ పాట – తన పార్వతి! బతుకును పాటగా మార్చి ఆ పాట కొంక తీపి గురుతును కూర్చి మాయమైపోయిన పార్వతి, మళ్ళీ ఇన్ని నాళ్ళకు తానొక మనిషైన తర్వాత తనలో జీవం పోసుకున్నది.

మతం, గ్రామీణ జీవితం, ఆత్మీయగతం–అన్నీ సమ్మేళనం చెంది హుస్సేన్‌ఖాన్‌లో ఒక సంస్కారంగా రూపొందాయి. అతనిలోని 'గతం' గతించలేదు. అంటే, స్వచ్ఛమైన బాల్యం గానీ, ఒకప్పటి మంచితనం గానీ పార్వతి స్మృతిగానీ నశించలేదు.

'గతించని గతం' నవలిక కంటే చాలా ముందే గోపీచంద్ రచించిన "రెండు జీవాలు నిండుహృదయాలు"20 అన్న కథ ఈ సందర్భంలో గుర్తుకు రాక తప్పదు. వారి వారి గ్రామాల్లో మతకలహాలు చెలరేగినప్పుడు భారత దేశాన్ని బాగుచెయ్యాలంటే మత దృష్టితో చూడడంవల్ల లాభం లేదు. అన్ని మతాల్లో ఉన్న బీదవాళ్ళకి సహాయం చెయ్యగలిగినప్పుడే మొత్తం దేశం బాగు పడుతుంది. అన్న నిర్మాణాత్మకమైన అవగాహనతో జిజయా అనే ముస్లిం

యువతి, కమలాకరం అనే హిందూ యువకుడు కృషిచేస్తారు. కాని ఇద్దరూ మత ద్వేషానికి బలైపోతారు. ఫలితంగా కమలాకరం అన్నలో మానవత్వం ఉదయిస్తుంది

ఈ కథలో మత ద్వేషమే ప్రధానపాత్ర వహించింది. కాని నవలికలో నిజాం రాజకీయపరమైన కుట్రకు మతద్వేషం తోడయింది. ఒక పథకం ప్రకారం హింసాకాండ చెలరేగింది. కథలో మతద్వేషం గుడ్డి వరదగా పొంగిపొరలిన వాతావరణం కనిపిస్తుంది. మరి నవలికలో మత ద్వేషం చల్లారిన తర్వాత, రాజకీయ సంక్షోభం సద్దు మణగిన తర్వాత, ఒకప్పుడు వ్యక్తులు ఆవేశంలో చేసిన అన్యాయాల, అక్రమాల ఫలితాలు ఎంత ఘోరంగా ఉండగలవో, ఎంత ఆత్మహత్యా సదృశంగా ఉండగలవో చెప్పటం జరిగింది.

''ద్వేషాలులేని, వర్గాలులేని మానవ సంఘంకోసం పాటుపడాల''నే జిజియా సందేశంలోను, కమలాకరం అన్నలో వచ్చిన పరివర్తనలోనూ గోపీచంద్ మతానికి విలువ ఇవ్వకుండా, మానవత్వమే మహనీయమైన ఆదర్శమని చాటి చెప్పాడు. 'గతించనిగతం'లో మత స్వేచ్ఛను అంగీకరిస్తూనే, మతాతీతదృష్టిని, వర్గాతీతదృష్టిని అలవరచుకున్నప్పుడే మానవత్వం సాధ్యమని హుస్సేన్ ఖాన్ పాత్రద్వారా గోపీచంద్ సందేశాన్ని అందజేశాడు. ఈ సందేశంలో ఎం.ఎన్. రాయ్[21] ప్రభావంతోపాటుగా, ఆధ్యాత్మికవాద ప్రభావం కారణంగా మతంపట్ల ఏర్పడిన పూజ్యభావం కూడా స్పష్టమవుతున్నది. ఈ విధంగా గోపీచంద్ విషయంలో ఎం. ఎన్. రాయ్ భావాలు కూడా 'గతించనిగతమే'.

నాల్గవ ప్రకరణం

## సూచికలు

1. 'పిల్లతెమ్మెర' నవలికను గోపీచంద్ 'శాయన్న' అనే కలం పేరుతో రచించాడు. నవంబర్ '60, డిసెంబర్ '60, జనవరి '61 నెలల్లో యువ మాసపత్రికలో ఇది సీరియల్‌గా వెలువడింది. పుస్తకరూపంలో తొలి ముద్రణ 1961. నవోదయ పబ్లిషర్స్, విజయవాడ.

2. 'అపసామాన్య మనో విజ్ఞానము', పుట. 159.

3. 'మానసికంగా ఉద్భవించే కొన్ని ప్రేరకాలు వాస్తవికతలో వాటి గమ్యాలనుచేరుకోలేవు. అందువల్ల ఒకవ్యక్తి మానసికంగా కుంఠనాన్ని, వ్యాకులతను పెంపొందించుకుంటాడు. కుంఠనము, వ్యాకులత అతనిలో మూర్తిమత్వం పెరుగుదలను అవరోధిస్తాయి. అందువల్ల వ్యక్తి ఈ కుంఠనంతోను, వ్యాకులతతోను ఒకరకమైన రాజీ కుదుర్చు కుంటాడు. దీనివల్ల అతనిలో కొన్ని వినూత్న ప్రేరకాలు బయలుదేరి వాటి గమ్యాలకు చేరతాయి. ఇది కొంతవరకు వ్యక్తి కుంఠనానికి, మానసిక ఆందోళనకు పాక్షిక సంతృప్తిని చేకూరుస్తాయి. ఫ్రాయిడ్ తన దగ్గరకు వచ్చే రోగులు తమతమ శారీరకమైన మానసికమైన దుర్గుణతలను కప్పిపుచ్చుకోవటానికి ఈ రకమైన రక్షణతంత్రాన్ని ఉపయోగించడం గమనించాడు. వ్యక్తి తనలోని న్యూనతా భావాన్ని కప్పిపుచ్చుకోవటానికి ఈ రకమైన రక్షణతంత్రాన్ని ఉపయోగించు కుంటాడని అడ్లర్ అభిప్రాయపడినాడు.'

—అపసామాన్య మనోవిజ్ఞానము, పుట. 157.

4. 'గడియపడని తలుపులు' తొలి ముద్రణ : నవభారత్ బుక్ హౌజ్, విజయవాడ, 1961.

5. 'శిథిలాలయం' 'యువ' మాసపత్రిక, నవంబర్ 1962 (దీపావళి ప్రత్యేక సంచిక)లో వెలువడింది.

6. '....in 1972, in Berlin prostitution was declared a necessary evil.'

—World University encyclopedia, Vol. 12, p. 4126.

7. 'సంస్కర్త హృదయం' కథానిక.

8. వట్టికోట అళ్వారుస్వామి గారి నవల "ప్రజల మనిషి-ఒక పరిచయం," పుటలు 2,3. వరవరరావు.

9. Ibid, పుట. 3.

10. Ibid, పుట. 81.

11. Ibid, పుట, 67 (పాదసూచిక)

12. 'వీర తెలంగాణా : నా అనుభవాలు-జ్ఞాపకాలు', పుట. 11.

13. '....భారతదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని ప్రసాదించుటకు అనుగుణంగా పార్లమెంటు జూలై 18న ఒక చట్టాన్ని, రూపొందించింది. ఈ చట్టం— (6) 1947, ఆగస్టు 15 నుండి సంస్థానాలపై బ్రిటిష్ సార్వభౌమత్వం ఎలాంటిదీ ఉండదని, అవి వాటి ఇష్టానుసారం ఇండియాలో గాని, పాకిస్తాన్‌లోగాని విలీనం కావచ్చునని లేదా స్వతంత్ర రాజ్యాలుగా ఉండవచ్చునని నిర్ణయించింది.'

—భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర, మూడవ భాగం, పుట 317, ఆచార్య మామిడిపూడి వెంకట రంగయ్య.

14. వీర తెలంగాణా విప్లవ పోరాటం—గుణపాఠాలు, పుటలు 401, 402.

15. వీర తెలంగాణా : నా అనుభవాలు-జ్ఞాపకాలు, పుట. 69.

16. 'యాత్రాస్మృతి' డా. దాశరథి, 'ఆంధ్రజ్యోతి' వార పత్రిక, 14–10-83.

17. వీర తెలంగాణా : నా అనుభవాలు—జ్ఞాపకాలు, పుట. 107.

18 'తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటం', 1951 అక్టోబరు 21వ తేదీన ఉపసంహరించుకోబడింది.'

—వీరతెలంగాణా విప్లవ పోరాటం.

19. New Testament. Psalms, Proverbs. the Gospel according to St. Motthew Chapter 18 (3) (మీరు పరివర్తనం చెంది చిన్న పిల్లలుగా మారనట్లయితే స్వర్గసామ్రాజ్యంలోకి ప్రవేశించజాలరు.)

20. 'నరే కానివ్వండి', కథల సంపుటి, పుటలు 50—56.

21. 'మానవ స్వాతంత్ర్యమే ప్రధానమనుకున్నప్పుడు మత వ్యామోహం పనికి రాదు. జాతి ద్వేషం వుండకూడదు. వర్గ దృష్టి పనికిరాదు.'

—యం.యన్. రాయ్ వ్యాసాలు : నవ్య మానవవాదం, పుట. 283.
అనువాదం : కె. రాధాకృష్ణమూర్తి

ఐదవ ప్రకరణం

## అసంపూర్ణ నవలికలు

# 1. చీకటి గదులు

'చీకటి గదులు'1 అసంపూర్ణ నవల మాత్రమే కాకుండా, ఆత్మకథాత్మక నవల2 కూడా కావటం విశేషం. నవలా ప్రారంభంలో కథా నాయకుడైన గోపాలం వయస్సు ఏడేండ్లు. అంటే, దాదాపుగా నవలా ప్రారంభ కాలం క్రీ. శ. 1917 ప్రాంతంగా భావించవచ్చు.

అప్పటికే ఇంగ్లీషు విద్య పూర్తిగా ప్రాచుర్యం పొందింది. ఆంధ్ర ప్రాంతం నుంచి పై చదువులకు ఇంగ్లండు తదితర విదేశాలకు వెళ్లి వచ్చే వారి సంఖ్య బాగా పెరిగింది. సంపూర్ణపారతంత్ర్యమే తమ లక్ష్యమని ప్రకటించిన బాలగంగాధర్ తిలక్ వంటి అతివాదులకే కాంగ్రెస్ సంస్థలోనూ, విద్యాధికులలోనూ పలుకుబడి ఉన్నది. రాజకీయ నాయకులకు ఒకవైపు రాజకీయ సంస్కరణల పేరుతో మభ్యపెడుతూ, మరోవైపు దమననీతిని ఉపయోగిస్తూ ప్రభుత్వం పాలన సాగిస్తున్నది.

రవాణా సౌకర్యం మెరుగుపడటంతో, ప్రభుత్వ ప్రోత్సాహంతో పరిశ్రమలు తలెత్తినాయి. పరిశ్రమల మూలంగా, గ్రామీణ జీవనంపట్ల ప్రభుత్వ నిర్లక్ష్యం కారణంగా వృత్తులు దెబ్బతిన్నాయి. ముఖ్యంగా వ్యవసాయరంగం నష్టపోయింది. మొదటి ప్రపంచ యుద్ధం కారణంగా దేశప్రజలు ఆర్థిక పరిస్థితి దిగజారిపోయింది. సన్నకారు రైతులు శిస్తులు చెల్లించే స్థితిలో కూడా లేరు.

ఈ నవల గ్రామీణ శిథిలదృశ్య వర్ణనతో ప్రారంభమవుతుంది. ఆంగ్లేయుల పాలనా వ్యవస్థకు అనుకూలంగా అక్కడక్కడా చిన్న చిన్న బొస్లు

టౌన్లకు కేంద్రాలుగా పెద్ద పట్టణాలు ఏర్పడ్డాయి. బతుకుతెరువుకోసం గ్రామీణులు తమ ఊళ్ళను వదిలేసి టౌన్లకు, పట్టణాలకు వలసవెళ్ళిపోతున్నారు. తరతరాల జీవిత విధానానికి అలవాటుపడినవారు, మార్పును ఇష్టపడనివారు, కూలుతున్న ఇళ్ళకు స్తంభాలు అడ్డుపెట్టుకొని కాలం గడుపుతున్నారు. వాళ్ళ జీవితాలలో కొత్తదనం చాలా అరుదుగా ప్రవేశించేది.

పెట్టుబడిదారీ విధానం మెల్లమెల్లగా ప్రబలుతుండటంవల్ల, భూస్వామ్య వ్యవస్థలో కొంత మార్పు అనివార్యమయింది.

కథానాయకుడు గోపాలం బాల్యం కొంత భాగం రామాపురం అనే గ్రామంలో గడచింది. రత్నమ్మకు గోపాలం కమలలపట్ల కూతురు సంతానమనే ప్రేమ మాత్రమే కాకుండా, తల్లిలేని పిల్లలనే జాలీ, తండ్రికి దూరమయ్యారనే బాధా ఉన్నాయి. అంతేకాదు, చనిపోయిన తన కూతురుపట్ల ఉన్న ప్రేమను ఆమె వీరిపట్ల కేంద్రీకరించింది.

రత్నమ్మ పెంపకం కారణంగా గోపాలంలో పెంకెతనం, ఎదుటివాళ్ళు తనను ప్రత్యేక దృష్టితో చూడాలనే భావం ఏర్పడ్డాయి. అమ్మమ్మలాగే ఇతరులు కూడా ముఖ్యంగా తాను ఇష్టపడేవారు, తమ ప్రేమను తన మీదే కేంద్రీకరించాలనే ధోరణి అలవడింది. బంధువులమ్మాయి సుశీలపట్ల అతని ప్రవర్తన దురుసుగా, పెంకెగా ఉండటానికి కారణం ఇదే. తాను ఎట్లా ప్రవర్తించినా, ఎదుటివాళ్లు సర్దుకుపోవాలనే ధోరణికి కూడా కారణం ఇదే.

సుశీలా గోపాలంలు చేసిన బొమ్మలపెళ్లి ధ్వన్యాత్మకంగా ఉన్నది. సుశీలా గోపాలంలకు ఆ బొమ్మలపెళ్లే మిగులుతుంది. అంతేకాదు, వాళ్లు ఇంటికి వచ్చేసరికి గోపాలం తండ్రి కృష్ణస్వామి రెండోపెళ్లి చేసుకోబోతున్నట్లు తెలుస్తుంది. ఈ పెళ్లి కూడా దమయంతి అకాలమరణంవల్ల విషాదాంతం అవుతుంది.

గోపాలానికి తన తల్లి జానకమ్మతో అనుబంధం ఆమె మృత్యువులోనే, అతనికి జ్ఞానం వచ్చేసరికి తల్లిలేని లోటును అమ్మమ్మ తీర్చే

ప్రయత్నం చేస్తున్నది. భద్రతారాహిత్యభావంతో బాధపడుతున్న గోపాలం సవతితల్లి దమయంతి రాకను ఆహ్వానించాడు.

కృష్ణస్వామికి ద్వితీయకళత్రంగా అడుగుపెట్టిన దమయంతి విద్యావతి, సంస్కారవతి. పెళ్లయిన కొన్ని గంటలకే ఆమె గోపాలాన్ని ఆప్యాయంగా చేరదీసి అతని ఏడుపును మానిపించి అనునయించింది. ఆమె ప్రథమ పరిచయం నవవధువుగా కాక, మాతృమూర్తిగా జరగటం ఆమె వ్యక్తిత్వానికి చక్కని వ్యాఖ్యానం. దమయంతి కృష్ణస్వామికి భార్యగాకంటె గోపాలం కమలలకు తల్లిగా వచ్చినట్లు కనిపించటం ఎంతో ఉచితంగావుంది

జానకమ్మ తల్లి రత్నమ్మ ఇంటి నుంచి వెళ్లిపోవటానికి దారితీసిన పరిస్థితులను దమయంతి తెలుసుకొంటుంది. కృష్ణస్వామి అన్న చంద్రశేఖరం తమ్ముని అప్పుతీర్చటంకోసం రత్నమ్మ కూడబెట్టిన డబ్బును అడిగినప్పుడు, ఆమె పిల్లల క్షేమం దృష్ట్యా ఇవ్వటానికి అంగీకరించదు. రత్నమ్మ రామయ్య సహాయంతో పసిపిల్లలను తీసుకొని ఎవరికీ చెప్పకుండా తన ఊరు చేరుకోవటం, అక్కడ ఒక గుడిసెలో కాపురం పెట్టటం మొదలైనవన్నీ హృదయ విదారకంగా ఉన్నాయి. ఒక అరవయ్యేళ్ళ వృద్ధురాలు, తను చనిపోయిన కూతురికోసం పిల్లలను పెంచి పెద్దచేయటానికి పూనుకోవటమే కరుణ రసాత్మకమైన అంశం. అందులో ఇబ్బందులు ఎదురుకావటంతో పాఠకుని సానుభూతి ఇంకా పెరుగుతుంది.

ఈ సంఘటన గోపీచంద్‌కు ఆత్మీయమైందిగా కనిపిస్తుంది. ఆయన రచించిన 'జీవనది'3 కథానికలో కూడా ఇదే సంఘటనను చిత్రీకరించాడు. కేవలం పాత్రలపేర్లలో మాత్రమే తేడా ఉన్నది.

రామాపురంలో వేరుగా ఉంటున్న రత్నమ్మను గోపాలం కమలలను తనతోపాటు ఉండేటట్లు చేయగలగటం దమయంతి సాధించిన ఘన విజయం. పిల్లల ఆస్తి మీద హక్కులేదంటూ కృష్ణస్వామి ద్వారా ఒక పత్రం రాయించి ఇవ్వటం ఆమె వ్యవహార దక్షతకు నిదర్శనం కావచ్చు, కాని రత్నమ్మలో విశ్వాస కల్పనకు మాత్రం ఆమె నిష్కల్మష ప్రవర్తనే దోహదం చేసింది.

కృష్ణస్వామి విషయంలో దమయంతి రాక, జానకమ్మలో తాత్కాలికంగా తెగిపోయిన జీవనాన్ని పునరుద్ధరించింది. అతడు తనకు అత్యంత ప్రియమైన 'బ్రాహ్మణేతరోద్యమానికి' పునరంకితం కావటానికి ఆమె పూర్తిగా సహకరించింది.

కృష్ణస్వామి నిర్వహించిన ఉద్యమంలో చారిత్రక దృష్టికి, సంఘ సంస్కరణ దృష్టికి మానవతా భావాలకు సమప్రాధాన్యం కనిపిస్తుంది. ఆర్యులు మధ్య ఆశియానుంచి వచ్చిన విదేశీయులు. వీరు బలవంతులు కావటంతో భారతీయులను జయించారు. మొదట్లో వర్ణరహితంగా ఉన్న ఆర్య సంఘంలో వర్ణవ్యవస్థ ఏర్పడింది. బ్రాహ్మణులు తమ అధికారాన్ని సుస్థిరం చేసుకోవటానికి రాజుల్ని నామమాత్రం చేయటానికి అనేక కుట్రలు పన్నారు. విశ్వామిత్రుడు, జనకుడు మొదలైన క్షత్రియులు బ్రాహ్మణ్యం సృష్టించిన అవరోధాలను అధిగమించగలిగారు. ఆ రకంగా బ్రాహ్మణ వ్యతిరేకతకు బీజాలు పడ్డాయి. ఇవి కృష్ణస్వామి భావాలు? ఈ భావాలలో చారిత్రక దృష్టి, హేతువాద దృష్టి స్పష్టంగా కనిపిస్తున్నాయి.

రాముడు కృష్ణుడు, భీష్ముడు, బుద్ధుడు మొదలైన వారి జీవిత చరిత్రలను అతడు తన భౌతిక బ్రాహ్మణేతర దృక్పథంతోనే వ్యాఖ్యానించాడు. చంద్రగుప్తుడు, శివాజీ హర్షవర్ధనుడు మొదలైన చరిత్రలో ప్రసిద్ధులైన వారిని కూడా అతడు ఆ దృష్టితోనే చూశాడు.

సాంఘిక వ్యవస్థలో హెచ్చు తగ్గులను కల్పించింది. బాహ్మణ్యమేనని, కృష్ణస్వామి గాఢ విశ్వాసం. ఆ హెచ్చు తగ్గులను సరిదిద్దటానికి నీచంగా చూడబడుతున్నవారు అగ్రవర్ణం వారి మానసిక వైఖరికి వ్యతిరేకంగా ఉద్యమం నిర్వహించాలని అతడు సంకల్పించాడు. ఆచరణలో పెట్టాడు. బ్రాహ్మణులు డబ్బు సంపాదించటానికి ఏర్పరిచిన ఆచారాలను తొలగించి 'స్వసంఘ పౌరోహిత్యం' వంటి కొత్త పద్ధతులను ప్రవేశపెట్టటం సాంఘిక సంస్కరణమే. సర్వసమానత్వమనే మానవతావాద సిద్ధాంతం ఆధారంగానే కృష్ణస్వామి ఈ ఉద్యమాన్ని ప్రారంభించాడనటంలో సందేహంలేదు. అతని దృష్టి వర్ణాల నుంచి వర్గాలపైకి ప్రాకలేదు.

గోపాలం రామాపురంలో గడిపిన బాల్యంలో సుశీలతో స్నేహం, హైస్కూలులో గడిపిన కాలంలో రాంబాబుతో స్నేహం ప్రాముఖ్యంగలవి. సుశీల పట్ల అతనిలో ఉన్న వ్యక్తావ్యక్త ప్రేమ ఆ తర్వాత రాంబాబు పట్ల ప్రసరించింది. రాంబాబుతో అతడు సుశీలతో ప్రవర్తించినట్లుగానే ప్రవర్తించటం గమనించదగ్గ అంశం. సుశీల కేవలం తనతోనే ఆడుకోవాలనే కోరుకున్నట్లే, రాంబాబు కూడా తనతోనే మాట్లాడాలని, తనతోనే కలిసి తిరగాలని కోరుకుంటాడు.

గోపాలం కాలేజీలో చేరిన తర్వాత బ్రాహ్మణేతరుడు కావటంవల్ల అద్దె ఇల్లు దొరకకపోవటం, ఆనాటి సాంఘిక పరిస్థితిని, కృష్ణస్వామి ఉద్యమంలోని సమంజసత్వాన్ని వెల్లడించే అంశం. ఆ తర్వాత హాస్టల్‌లో చేరి కార్యదర్శిగా ఎన్నిక కావటమేకాక, భవానీశంకరం అనే హాస్టల్ కమిటీ సెక్రటరీ చేస్తున్న అన్యాయాలను ఇతర విద్యార్థులతో కలిసి ఎదుర్కోవటం గోపాలంలోని నాయకత్వ లక్షణాలను, అన్యాయాన్ని సహించలేని ప్రవృత్తిని స్పష్టం చేస్తున్నాయి. నిస్సందేహంగా ఇది గోపాలం మీద వున్న తండ్రి ప్రభావాన్ని సూచిస్తున్నాయి.

కాలేజీలో అడుగుపెట్టిన మొదటి రోజున గోపాలం జీవితంలో విశిష్టమైనవి. ఇదివరకు అతనకి కేవలం తన తండ్రి భావాలతో మాత్రమే పరిచయం ఉండేది. తన తండ్రి చేపట్టిన ఉద్యమంలాంటి ఉద్యమాలకు అది తరుణం కాదు అనే పరంధామయ్య విమర్శ గోపాలం దృష్టిలోకి వచ్చింది. ఏ దేశభక్తుని తక్షణ కర్తవ్యమైనా స్వాతంత్ర్య సమరంలో పాల్గొనడమేనని పరంధామయ్య వాదించాడు. పరంధామయ్య ద్వారా గాంధీ సిద్ధాంతాలతో పరిచయం ఏర్పడినట్లే, శివకుమార్ ద్వారా కమ్యూనిస్టు భావాలతో పరిచయం ఏర్పడింది. అతడు శివకుమార్ పరంధామయ్యలకు బదులుగా హాస్టల్ సెక్రటరీగా ఎన్నికకావటమంటే ఒక విధంగా పరస్పర విరుద్ధ భావాల మధ్యే మార్గమే విశిష్టమైందిగా సూచించటమన్నమాట.

ప్రిన్సిపాల్ దంపతులు క్రైస్తవ మిషనరీల సేవాతత్వానికి ప్రతీకలు. సంకుచిత పరిధులనుదాటి సేవచేయగలిగే మానవస్వభావంపట్ల గోపాలానికి ఆదరాభిమానాలు కలిగాయి.

గోపాలం జీవితంలో ఆ తర్వాత విశిష్టపాత్రను వహించే సాహిత్య ప్రపంచంలోకి అడుగుపెట్టిన కాలం కూడా ఇదే. ఇందుకు తండ్రి రచనల ప్రభావమే మొదటి దశలో మార్గదర్శకత్వం చేసింది. ఆ తర్వాత అతడు తాను రాసిన కొన్ని కథలను, వ్యాసాలను సుశీలకు చదివి వినిపించాడు.

శివకామయ్యతో పరిచయం అతన్ని ఎక్కువగా ప్రభావితం చేసింది. ఇదివరకు అతనికి పరిచయమున్న ప్రధాన భావాల సంగమంగా శివకామయ్య అతనికి కనిపించాడు. శివకామయ్య గాంధీ సిద్ధాంతాలకు అంకితమైనవాడు. తన తండ్రి ఉద్యమంపట్ల పూర్తి సానుభూతి ఉన్నవాడు. అంతేకాక, ఆధ్యాత్మిక మార్గంలో నడిపించగల భక్తి భావం కూడా కలిగినవాడు కావటంవల్ల గోపాలం తన తండ్రి భావాల అదుపునుండి విముక్తిపొందటానికి శివకామయ్య కారకుడయ్యాడు. ఆ విధంగా శివకామయ్య గోపాలంలో మానసిక పరిణామానికి దోహదం చేశాడు. అతని గురుకులంలోనే చదువుకుంటున్న దుర్గ, గోపాలం జీవిత భాగస్వామిని అయ్యే అవకాశం ఉండటంతో శివకామయ్యవల్లే గోపాలానికి భావానుబంధం, వివాహబంధం ఏర్పడ్డాయని చెప్పవచ్చు. శివకామయ్యవల్ల అతని మనస్సు 'విశాలపడింది'.

ఈ దశలోనే జగదీశ్వరరావుతోను, అతని కూతురు కళ్యాణకింకిణితోను ఏర్పడిన పరిచయం గోపాలానికి ప్రయోజనకారిగానే ఉన్నది. జగదీశ్వరరావు శిథిలమైపోతున్న జమీందారీ వ్యవస్థకు ప్రతినిధి. ఆ వ్యవస్థకు సంబంధించిన బలహీనతలన్నీ అతనిలో చోటుచేసుకోవటం సాధారణమే. అయితే, గోపాలం తదితర విద్యార్థులతో భవానీశంకరానికి వ్యతిరేకంగా చేసిన పోరాటంలో పాల్గొనటం ద్వారా, కొత్త జీవితాన్ని పొందగలగటం అసాధారణ విషయం. జీవితంపట్ల ఆచరణాత్మక వైఖరిని అనుసరించటంవల్ల తన బలహీనతలకు సమర్థతతో అతిక్రమించగలగటంవల్ల జగదీశ్వరరావు, 'అసమర్థుని జీవయాత్ర'లోని సీతారామారావుకు భిన్నమైన పాత్రగా భాసించాడు.

అతడు కళ్యాణకింకిణిని పెంచటంలో కూడా జమీందారీ పద్ధతిని విడనాడి కాలానుగుణమైన మార్గాన్నే అనుసరించాడు.

కళ్యాణకింకిణిలో కనిపించే వివాహ వైముఖ్యం శిథిల జమీందారీ వ్యవస్థపట్ల విముఖంగా, మరో జమీందారీ కుటుంబంలోని వ్యక్తికి భార్యగా జీవించటంపట్ల విముఖంగా కనిపిస్తుంది. ఆమెలోని కళాత్మక హృదయం ప్రిన్సిపాల్ దంపతులతో జరిపిన పర్యటనవల్ల బలపడింది. గోపాలంలో మహమ్మదీయ సంస్కృతి దర్శనంవల్ల మతాతీత దృష్టి రూపొందటానికి ఈ పర్యటన దోహదం చేసింది. ఈ విధంగా అతని వ్యక్తిత్వం మరి కొంత సమగ్రతను సంతరించుకున్నదని చెప్పవచ్చు.

దమయంతి గోపాలం ఫీజుకోసం పుట్టింటివారు పెట్టిన నగను తాకట్టు పెట్టటం, గోపాలం తమ డబ్బుతో ఆ నగను విడిపించి ఆమెకు ఇవ్వటం దమయంతి దృష్ట్యా ముఖ్యమైన సంఘటన.

గోపాలం, తల్లిగా తాను నిర్ణయించిన హద్దును అతిక్రమించాడని ఆమె భావించింది. ఏ డబ్బునైతే ఆమె తాకకూడదని భావించిందో, ఆ డబ్బును తన నగ రూపంలో తాకవలసివచ్చినందుకు తీవ్రమైన మానసిక సంక్షోభానికి గురయింది. ఈ సంఘటన ఆమెకు జీవితంపట్ల పరాజయ భావాన్ని, తీవ్రమైన నిరాశను కలిగించింది.

చిన్ననాటి స్నేహితురాలు సుశీలకు వివాహమైందన్న వార్త గోపాలానికి 'కష్టం' కలిగించటం పాఠకుల్ని ఆశ్చర్యపరుస్తుంది. సుశీలపట్ల తన కున్నదనుకునే అధికారభావానికి దెబ్బతగలటం, తాను ఆశించిన స్థానాన్ని మరెవరో ఆక్రమించుకున్నారనే స్థానభ్రంశత్వ భావానికి గురికావటం మూలంగా గోపాలం బాధపడ్డాడు. అవ్యక్తంగా వున్న లైంగిక భావాలు కొంత స్పష్టమైన రూపాన్ని ధరించి, వెంటనే నిరాశకు లోనైన ఘట్టం ఇది. ఈ సందర్భంలో అతడామెకు రాసిన లేఖ నిస్సారంగా వుండటం అతని నిరాశకు నిదర్శనమైతే, సుశీల అతనికి రాసిన జవాబు ఆమెకు అతనిపట్ల వున్న అనురాగానికి సరళమైన సహజమైన వ్యక్తీకరణ.

వెంటనే అతడు సుశీలను చూడటానికి బయలుదేరటాన్ని కూడా అర్థం చేసుకోవచ్చు. వివాహితురాలైన సుశీలను చూడాలనే కోరికతోపాటు, తన

స్థానం ఆక్రమించిన ఆమె భర్తను చూడాలనే కుతూహలం అతనిలో చోటు చేసుకున్నాయి.

ఇద్దరి ప్రవర్తనలోనూ, బాల్యజీవితాన్ని ఒకసారి గుర్తు చేసుకొని మరిచిపోవాలనే అవ్యక్తవాంఛ కనిపిస్తుంది.

సుశీలను భార్యగా కోరటం వెనుక గోపాలంలో లైంగికవాంఛ కంటే బలీయమైన కారణం మరొకటుంది. సుశీల తన భార్య అయితే జీవితం ఏ సమస్యలు లేకుండా వుంటుందని, ఆమె చెప్పినట్లుగా తాను వింటే చాలు, ఏ బాధ్యతా లేకుండా సంసారం గడపొచ్చని అనుకొనివుంటాడు. ఇది తండ్రి నుంచి సంక్రమించిన స్వభావంగా చెప్పుకోవచ్చు. స్థూలంగా సుశీల అండతో గోపాలం భద్రతాభావం పొందగోరాడు.

ఆర్థికంగా చితికిపోయిన జగదీశ్వరరావును ఆదుకోవాలనే ఆదర్శ భావంతో, తన ఆశయాలకు అనుగుణంగా నడుచుకుంటుందన్న విశ్వాసం తోను పరంధామయ్య కళ్యాణకింకిణిని పెళ్ళిచేసుకున్నాడు.

కళ్యాణకింకిణి రవీంద్రుని గురువుగా భావించే కళాహృదయంతో పాటుగా, కళాభినివేశం కూడా ఉన్న యువతి. పరంధామయ్య గాంధీగారి సిద్ధాంతాలను ఆదర్శంగా భావించి, అహర్నిశలు స్వాతంత్ర్యోద్యమంలో కృషిచేస్తున్న దేశభక్తుడు. దంపతుల మధ్య పరస్పర సానుభూతికి కొరత లేకపోయినా, ఒకరు మరొకరికోసం తమ లక్ష్యాలను మార్చుకోలేని పరిస్థితి వల్ల కూడా దాంపత్య జీవితానికి అవరోధాలు ఏర్పడవచ్చుననటానికి కళ్యాణ కింకిణి, పరంధామయ్యలే నిదర్శనం.

పిన్సిపాల్ గారి భార్య దృష్టిలో—

'దురదృష్టవశాత్తూ దృఢమైన నమ్మకాలు వున్నవాడు' పరంధామయ్య, 'నమ్మకాలకు అతీతమైన మానసిక స్థాయి కలిగింది కళ్యాణకింకిణి' అందు వల్ల వాళ్ళ మధ్యన అన్యోన్య దాంపత్యానికి అవకాశంలేదు.

స్వాతంత్ర్య సమరంలోకి ఆకృష్టుడైన యువకుని స్థాయి గాని, అతని ఆదర్శాలతో తాదాత్మ్యంగాని తల్లిదండ్రులకు, భార్యకులేని సందర్భాలతో,

ఆనాటి కుటుంబం తాత్కాలికంగా సంక్షోభానికి గురయిందనటానికి పరంధామయ్య కుటుంబం ఒక నిదర్శనం. భర్త భావాలతో తాదాత్మ్యం లేకపోవటం, వయసుకు సంబంధించిన కోరికలు తీరకపోవటం కళ్యాణకింకిణి అసంతృప్తికి కారణాలు, పరంధామయ్య తల్లీ చెల్లెలూ మానసికంగా కింది స్థాయికి చెందినవారు కావటంలో కళ్యాణకింకిణి సమస్యలను అర్థంచేసుకోలేకపోయారు. జమీందారీ వాసనలు వదలకపోవటంవల్ల కూడా కింకిణి గ్రామీణ వ్యావసాయిక కుటుంబ వాతావరణంలో ఇమడలేకపోయింది. రవీంద్రుని సాన్నిధ్యంలో కొంతకాలం గడపాలనే కళ్యాణకింకిణి కోరికను అంగీకరించటం, ఆమెను గోపాలంతో శాంతినికేతనానికి పంపించటం పరంధామయ్య విశాల దృష్టికి నిదర్శనం. కళ్యాణకింకిణితో ఎడబాటు అతనికి 'కష్టం' కలిగించటం, తప్పకుండా వాళ్ళు తిరిగి కలుసుకుంటారని ఆశించటానికి ఒక సూచన. అయితే, స్వాతంత్ర్యోద్యమంలో ఆలమునకలు కావటానికి కూడా అవకాశం పెరిగింది. ఇక కళ్యాణకింకిణి ఎడబాటుకు సంబంధించిన భావమే లేదు. తానిన్నాళ్ళుగా ఎదురుచూస్తున్న కళాత్మక జీవన సమాగమ కాంక్షే ఆమెలో నిండిపోయింది.

ఈ ఘట్టంలో పరంధామయ్య కుటుంబచరిత్రను దాదాపు అరవై పుటల్లో రచయిత విపులంగా వర్ణించటంవల్ల కొంత గ్రంథం పెరిగిందనే చెప్పాలి. పరంధామయ్య తండ్రీ, పెద తండ్రీ వేర్లు పడటం, పెద తండ్రి భార్య బాపమ్మ ఔన్నత్యం, తల్లిలోని సంకుచిత ప్రవృత్తి, చెల్లెలు తన కాపురాన్ని సరిగ్గా నిర్వర్తించుకోకపోవటం—మొదలైన అంశాలను అంత వివరంగా కాకుండా సందర్భోచితంగా సంక్షిప్తంగా ప్రస్తావించివుంటే బాగుండేది. రామాపురం వర్ణనతో ఆగిపోయిన గ్రామీణ చిత్రణను కొనసాంచాలనే రచయిత కోరిక కూడా, ఈ విపుల వర్ణనకు కారణంగా కనిపిస్తుంది.

తన తల్లి వడ్డీ వ్యాపారం చేస్తున్నదని తెలుసుకుని పరంధామయ్య బాధపడ్డాడు. బీదవాళ్లు, ముఖ్యంగా హరిజనులు తన తల్లి దగ్గర తాకట్టు పెట్టుకున్న వస్తువులను అప్పు వసూలు చేయకుండానే తిరిగి ఇచ్చివేశాడు. ధనవంతులు బీదవారికి ధర్మకర్తలనే గాంధీభావాన్ని వెల్లడిచేసే సంఘటనగా దీన్ని చెప్పుకోవచ్చు. కాని అతని తల్లి వడ్డీ వ్యాపారం మాత్రం మానలేదు!

గ్రామీణ ప్రాంతాల్లో వ్యవసాయం ప్రధాన వృత్తిగా వుండే కుటుంబంలో వడ్డీ వ్యాపారం ఉపవృత్తిగా వుంటుంది.

గోపాలం చెల్లెలు కమల పెళ్లి జరిగింది. గోపాలం కమలలను పెంచి పెద్దచేయటం, కమలకు పెళ్లి చేయటం అనే రెండు పెద్ద బాధ్యతలను దమయంతి నిర్వహించింది.

దమయంతి తన కన్నవారింటి నుంచి డబ్బు తెప్పించి కుటుంబంకోసం ఖర్చుచేసింది. తన భర్త సంపాదనాపరుడేననే భావం ఇతరులకు కలగజేయటానికే ఈ విషయాన్ని రహస్యంగా వుంచింది. ఆమె దృష్టిలో కుటుంబ బాధ్యతలకు తన ఉనికికి అవినాభావ సంబంధం వుంది. ఇన్నేళ్లుగా ఇతరులకు సేవ చేయటంలోని మాధుర్యానికి అలవాటుపడ్డ దమయంతికి తనకు భవిష్యత్తులో కలగబోయే సంతానంపట్ల విరక్తి భావం కలగటంలో అసహజమేమీ లేదు.

దమయంతికి కొడుకు పుట్టటం, ఆ తర్వాత ఆమె మరణించటం-ఈ అసంపూర్ణ నవలకు వింత సమగ్రతను చేకూర్చిన అంశాలు.

గోపాలం నగను తాకట్టు విడిపించి ఇచ్చింది మొదలు మనోవ్యథను పెంచుకున్న దమయంతికి, కమల వివాహంతో, తన బాధ్యత తీరిపోయిందనిపించింది. కమల పెళ్ళి అప్పును తీర్చటానికి పట్టుబట్టటంతో ఆమె మనోవ్యథ పెరిగి కీళ్ళవ్యాధిగా పరిణమించింది. మరణించాలనే ఆమె మనస్ఫూర్తిగా కోరుకోవటంవల్లనే ఏ వైద్యమూ పనిచేయలేదు.

దమయంతి పుట్టినింటికి గర్వకారణురాలు. మెట్టినింటికి ఆశ్రయమిచ్చిన పచ్చని చెట్టు. రత్నమ్మ ఆమె వృత్తిలో తన కూతురును రెండోసారి కోల్పోయింది! తల్లి ప్రేమకోసం తల్లడిల్లిన గోపాలం దమయంతిలో తల్లినే కాదు, ఒక దేవతను చూసుకున్నాడు గోపాలానికి ఆమె మరణం అశనిపాతం. ఆమెలేని ఇంటిని అతడూహించలేడు. కృష్ణస్వామి భార్యనే కాదు. తల్లినీ పోగొట్టుకున్నాడు!

దమయంతి తన గుర్తుగా విడిచిన శిశువు తాను అనుసరించిన ఆదర్శం నిరంతరం ఆ ఇంట్లో కొనసాగాలనే ఆమె ఆకాంక్షను సజీవ సంకేతం.

దమయంతి మరణవార్త విని శివకామయ్యతోపాటు దుర్గ రావటంవల్ల 'ఆ ఇంట్లోకి వెలుగు ప్రవేశించింది!' శివకామయ్య రాక ఆ విషాద వాతావరణంలోని బిగువును సడలించటానికి సహకరించింది. దమయంతి స్థానం మరొకరు ఆక్రయించటానికి వీల్లేనిదైనా ఆమె బాధ్యతలను నిర్వహించగల అర్హత గోపాలం కాబోయే భార్యకు ఉంటుంది. ఆ రకంగా దుర్గరాక వెనుక ఉన్న ఆంతర్యం, గోపాలం కాబోయే భార్యగా స్పష్టమైన రూపుదిద్దుకోవటానికే.

ఇక సుశీల—

''ఆమె అతని వీపు నిమురుతూ'' ఎంత పిచ్చివాడవయ్యా నువ్వు'' అంది.

ఆ మాట అచ్చంగా దమయంతి అన్నట్లు అనిపించింది, గోపాలానికి.

పై మాటలు సుశీలా గోపాలంల మధ్యన కొత్త అనుబంధానికి నాంది పలుకుతున్నాయి. గోపాలం హృదయానికి సంబంధించినంతవరకు దమయంతి స్థానాన్ని సుశీల ఆక్రమించుకోవటానికిది సూచన. దమయంతి బతికి వున్నప్పుడు గోపాలాన్ని పెళ్లిచేసుకొమ్మని కోరింది. ఆమె చనిపోయిన తర్వాత సుశీల గోపాలాన్ని పెళ్లిచేసుకొమ్మని కోరటం గమనార్హం. గోపాలం భార్య స్థానాన్ని పొందటానికి దుర్గ అన్ని అర్హతలూ కలిగి ఉన్నదనే నిర్ణయానికి కూడా సుశీల రాగలిగింది.

అంటే, అతని అంతరంగంలోని సుశీల స్థానంలో దుర్గ, దమయంతి స్థానంలో సుశీల ప్రవేశిస్తున్నారు! గోపాలానికి ఈ మార్పును అంగీకరించి, స్థిరపరచుకోవటానికి కొంత వ్యవధి అవసరం.

గోపాలం తాకట్టు విడిపించి ఇచ్చిన గొలుసును దమయంతి మళ్ళీ అతనికే వదిలేసి వెళ్లిన ఘట్టంలో, ఆ గొలుసునేం చేయాలో తోచని పరిస్థితిలో—

'సుశీల వుంటే యెంత బావుండేది' అనుకున్నాడు, గోపాలం.

ఇది, దమయంతిని అడుగలేదు కనుక సుశీలను అడగాలనుకోవటం,

లేదా దమయంతినే అడుగుతున్నట్లుగా భావించి సుశీలను అడగటం; దమయంతి స్థానంలో సుశీల స్థిరపడుతున్నదనటానికిది నిదర్శనం.

దమయంతి మరణం అందరి కంటే కృష్ణస్వామిని ఎక్కువగా నిస్సహాయుణ్ణి చేసింది. రత్నమ్మ ప్రబోధంతో కుటుంబ ఆర్థిక పరిస్థితిని చక్కదిద్దటానికి తిరిగి ప్లీడరుగా ప్రాక్టీసు ప్రారంభించి నిత్యజీవితానికి దగ్గరైన కృష్ణస్వామిని దమయంతి మరణం చైతన్యరహితుణ్ణిగా చేసింది. ఆమె మరణశయ్య మీద ఉన్నప్పుడు. ఎవరో చెప్పగా ఒక బైరాగి ఇచ్చిన తాయెత్తును తెచ్చి దమయంతికి ఇవ్వటం మొదలైన చర్యలు, అతడన్ని రోజులుగా గిరిగీసుకున్న పరిధి కొంత సడలిందనటానికి సూచనలు. ఆమె మరణానంతరం—

"ఈ ప్రపంచానికేమైనా అర్థం వుందంటావా ?" అన్న మౌలిక ప్రశ్న కూడా కృష్ణస్వామి వేసుకున్నాడు,

ఇది అతనిలో భౌతిక నాస్తికవాద దృక్పథంపట్ల పునరాలోచన ప్రారంభమైందనటానికి సంకేతం. ఇది పునరాలోచన మాత్రమే. ఇప్పటి విషాద మానసిక వాతావరణం కరగిపోయి, దమయంతి లోటు తీర్చగల కుటుంబ వాతావరణం ఏర్పడితే. తిరిగి పాత జీవిత విధానానికే కట్టుబడవచ్చు. కాని, పరిధి సడలటంవల్ల మనసు విశాలపడే అవకాశం 'అవతలి వైపు'ను సానుభూతితో చూడగల దృక్పథం ఏర్పడతాయని రచయిత ఉద్దేశం.

దమయంతి మరణం గోపాలాన్ని ఎక్కువగా క్రుంగదీసింది. కాని, గోపాలం మాటిమాటికి దుఃఖించటం సానుభూతిని ఆశించటం- మొదలైనవి ఆ పాత్ర వ్యక్తిత్వాన్ని దెబ్బతీసేవిగా కనిపిస్తాయి.

అతడు రూపొందించుకునే తాత్విక విశ్వాసాన్ని ఈ మరణం కొంత ప్రభావితం చేస్తుందనేది నిర్వివాదం.

గోపాలం ఇంతవరకు చూసిన జీవితం వైవిధ్యంతో వుంది. అతని అనుభవాల గుచ్ఛంలో రకరకాల పూలు ఉండే మాట నిజం. ఎవరు చెప్పే సిద్ధాంతాన్నైనా తన జీవితానుభవాల వికషోపలం మీద గీసి చూసుకాని

త్రణీకరించటమో, అందులోని తనకు నచ్చిన అంశాన్ని మాత్రం స్వీకరించి, తక్కినదాన్ని వదిలేయటమో చేస్తాడు, గోపాలం.

అతణ్ణి తాత్త్విక ప్రపంచంలోకి ముందు ఆకర్షించినవాడు కృష్ణస్వామి. ఆ తర్వాత రాంబాబు తండ్రి పద్మనాభశాస్త్రి, పరంధామయ్య శివకుమార్‌లు తమ తమ విశ్వాసాలతో అతణ్ణి కొంతవరకు ఆకర్షించారు. చిన్నప్పుడు రాంబాబు ప్రేరణతో మొదలైన సాహిత్య పఠనం, రవీంద్రుని వద్ద ఆగిపోయింది. అతణ్ణి గాఢంగా ప్రభావితం చేసిన చివరి వ్యక్తి శివకామయ్య.

"నా దగ్గర బయలుదేరి నీ దగ్గరకు వస్తున్నాడు" అని శివకామయ్యతో కృష్ణస్వామి అన్నమాట అక్షరాలా నిజం. తన తండ్రిలోనూ కమ్యూనిజంలోనూ ఉన్న తిరుగుబాటు తత్త్వం, గాంధీతత్త్వం, అలౌకికానందాన్ని ప్రసాదించే ఆధ్యాత్మికతత్త్వం— ఈ మూడింటి త్రివేణీ సంగమంగా శివకామయ్య గోపాలానికి దర్శనమివ్వటంతో ప్రస్తుతానికి ఇక్కడ ఆగిపోయాడని చెప్పవచ్చు. దమయంతి మరణంవల్ల కలిగిన నిరాశ అతణ్ణి భవిష్యత్తులో శివకామయ్యకు ఇంకా సన్నిహితుణ్ణి చేస్తుంది.

"ఆలోచించటం కంటే జీవితాన్ని వచ్చింది వచ్చినట్లు స్వీకరించటం మంచిది బాబు."

ఇది దమయంతి సందేశం

పరాయివాళ్ళను తన వాళ్ళ కంటే, తన కంటే ఎక్కువగా ప్రేమించమని దమయంతి జీవితమిచ్చే మరో సందేశం. ఈ ఆదర్శాన్ని గోపాలానికి అడుగడుగునా గుర్తుచేయటానికి దమయంతి కొడుకు ఉండనే వున్నాడు.

ఇప్పటి వరకు స్థూలంగా గోపాలం సమన్వయవాది.

*గోపీచంద్ ఈ నవలను ఎలా ముగించి వుండేవాడు?* అన్నది పరిశీలించవలసిన అంశం.

ఈ నవలను 'యువ' మాసపత్రికలో సీరియల్ నవలగా వెలువరించినప్పుడు దమయంతి మరణానికి సంబంధించిన కథాంశాన్ని 1962 మే సంచికలో ప్రచురించి, పత్రికవారు—

'చీకటిగదులు' నాలుగు భాగాల నవల. అందులో మొదటి భాగం ఈ సంచికలో సమాప్తం' అనే ప్రకటనను ప్రచురించారు.

నవలలో దమయంతి మరణానికి సంబంధించిన కథాంశం 442వ పుటలో వుంది. మొత్తం ముద్రిత అసంపూర్ణ నవలలోని పుటలు 520. అంటే మొదటి భాగం పూర్తి చేసిన తర్వాత రచయిత రెండవ భాగంలో కేవలం 78 పుటలను మాత్రమే రచించాడన్నమాట.

పుటలనుబట్టి మిగిలిపోయిన కథాభాగాన్ని ఊహించటం అంత ప్రామాణికం కాకపోయినా, సుమారు అంచనాకోసం అవసరమేననిపిస్తుంది. పత్రికలోని ప్రకటన ప్రకారం మొదటిభాగం 442 పుటలను ఆక్రమించింది. తర్వాతి మూడు భాగాలు మొదటి భాగమంత పెద్దవి కాకపోయినా, కనీసం ఒక్కొక్క భాగం 200 పుటలను ఆక్రమించినా 600 పుటలుండవచ్చు. రెండో భాగంలో 78 పుటల కథ ముద్రితం కనుక సుమారుగా 500 పుటల కథ మిగిలిందని చెప్పవచ్చు. అంటే మొత్తం నవల (442+500=842) సుమారు వెయ్యి పుటల దాకా వుండవచ్చు.

'గోపీంద్ ఇటీవలనే వెయ్యి పేజీల నవలను వ్రాయతలపెట్టినట్లు తెలుస్తున్నది'4 అన్న డి రామలింగంగారి మాటలు బహుశా 'చీకటి గదులు' నవలను ఉద్దేశించినవే కావచ్చు. 'తలపెట్టటం' నిజానికి భవిష్యత్తును సూచించినట్లు అనిపించినా, 'చీకటిగదులు'ను వెయ్యి పుటల దాకా పెంచే అవకాశాలు ఉన్న దృష్ట్యా ఈ ఊహకు ఎక్కువ అవకాశం వుంది.

ప్రస్తుతాంశం—మిగిలిన నవలను గోపీచంద్ ఎలా ముగించి వుండే వాడన్నది. గోపీచంద్ ఈ నవలకు సంబంధించి ఎలాంటి పథకాన్ని రాసి వుంచలేదు ఇక మిగిలింది అంతస్సాక్ష్యాలే. ఐదు ముఖ్యాంశాల ఆధారంగా ఊహించే అవకాశం లేకపోలేదు.

1) జరిగిన కథలో గోపాలం చుట్టూవున్న పాత్రల ప్రస్తుత మనస్తత్వాన్ని బట్టి, సూచనలను బట్టి రూపొందివుండే పరిణామాలను ఊహించటం.

*రాంబాబు :* గోపాలం బాల్యమిత్రుడు రాంబాబు స్వాములవారితో అదృశ్యమయ్యాడు. "అన్న ఎప్పటికైనా తిరిగి వస్తాడంటావా ?" అని రాంబాబు

చెల్లెలు శశికళ అన్నప్పుడు, "తప్పకుండా వస్తాడు" అంటాడు గోపాలం, ఎంతో ఆత్మవిశ్వాసంతో. శశికళ వేసిన రాంబాబు బొమ్మలోని ఆధ్యాత్మిక కాంతిని గమనించి, ఆ బొమ్మలోని రాంబాబే నిజమైన రాంబాబని గోపాలం అనుకుంటాడు. అందువల్ల తర్వాతి కథలో సాధనదశ పూర్తయిన తర్వాత ఒక ఆధ్యాత్మిక పురుషునిగా రాంబాబు దర్శనమిచ్చి ఉండేవారు. అతడు తర్వాత తన గురువైన స్వాములవారి స్థానాన్ని ఆక్రమించి ఉండేవాడు కూడా. గోపాలం శివకామయ్య మార్గంలో నడుస్తున్న దశలోనో, లేక కొత్త మార్గంకోసం అన్వేషిస్తున్న దశలోనో రాంబాబు దర్శనం పొంది వుండేవాడు. గోపాలం నిత్యాన్వేషిగా గోచరిస్తున్నాడు కనుక శివకామయ్యతో ఆగిపోయే అవకాశంలేదు. అందువల్ల రాంబాబు గోపాలం జీవితంలో కీలకమైన పాత్ర వహించి వుండే అవకాశమే ఎక్కువ. గోపీచంద్ అరవిందుల దర్శనంతో పొందిన ఉత్తేజాన్ని గోపాలం రాంబాబు దర్శనంతో పొందివున్నా ఆశ్చర్యం లేదు.

*పరంధామయ్య* : గోపాలాన్ని పరామర్శించటానికి వచ్చిన పరంధామయ్యలో కనిపించిన మార్పు, తర్వాతి దశలో అతనిలో రాగల మార్పును సూచించేదిగా వుంది. 'గాంధీగారి దగ్గరవున్న కొన్ని లక్షణాలు ఆయన శిష్యుడైన పరంధామయ్య దగ్గర కూడా వున్నాయ్. తన గొడవ తనదే గాని, ఎదుటి వారి స్వభావం, బాధలూ అతను చప్పున గ్రహించలేడు.' ఇది గోపాలం అభిప్రాయం. కళ్యాణకింకిణి విశ్వభారతికి వెళ్లిపోయిన తర్వాత పరంధామయ్య తన జీవన విధానాన్ని పునఃపరిశీలించుకోగలిగాడు. 'పరంధామయ్య పూర్వం కంటే నీరసపడిపోయాడు. ఇదివరకున్న నిగ్రహం అతనికి యిప్పుడున్నట్టు లేదు ప్రతి చిన్న విషయానికి ఆవేశపడటమే కాకుండా, ఆ ఆవేశాన్ని చటుక్కున యేదోవొక రూపంలో బహిర్గతం చేసుకోవటం అతనికి అలవాటైంది.' అని కూడా అనుకున్నాడు గోపాలం.

పరంధామయ్యలో ఇన్నినాళ్లు అణగిమణిగి వున్న హృదయం ఇప్పుడతని నడిపిస్తున్నదనటానికి పై కావ్యాలు నిదర్శనం. 'విశ్వభారతి'కి వెళ్లి కళ్యాణకింకిణితో కొంతకాలం గడిపి వచ్చిన పిదప, ఆమెను అక్కడకు పంపటం సరైన చర్యేనని నిర్ధారణ చేసుకున్నాడు. అంతేకాక, ప్రస్తుతం

ఆధ్యాత్మిక జీవితం గడుపుతున్న పెదతల్లి బాపమ్మ దగ్గరకు వారానికి ఒక సారైనా వెళ్లి, 'ఆమె కన్నుల్లోని కాంతిని, ముఖంలోని ప్రశాంతత'ను దర్శించి, ఉలౌకికానందం పొందగలుగుతున్నాడు. దీన్నిబట్టి పరంధామయ్య భవిష్యత్తులో గోపాలంతోపాటు ఆధ్యాత్మికమార్గంలో నడిచే అవకాశం వుంది. అయితే, పరంధామయ్య గాంధీతత్వానికి దూరమౌతున్నాడా? అన్న ప్రశ్న కూడా ప్రస్తుతదశలో పరిశీలించదగిందే. పరంధామయ్య గాంధీ తత్వానికి దూరం కావలసిన అవసరం లేదు. గాంధీగారు రవీంద్రునికి గానీ, ఆధ్యాత్మికమార్గానికి గానీ వ్యతిరేకులు కారు అందులో రోజు రోజుకు స్వాతంత్ర్య సమరం లక్ష్యంవైపు సాగుతున్న దశలో పరంధామయ్య దూరం కావటంలో అర్థంలేదు. అంతేకాదు, తన గాంధీయ విశ్వాసాల మూలంగా పరంధామయ్య శివకామయ్యకు సన్నిహితుడు అందువల్ల భవిష్యత్తులో అతడు రవీంద్రుని భావాలను హృదయపూర్వకంగా అర్థంచేసుకున్న గాంధీయ భావాలు గల ఆధ్యాత్మిక సాధకునిగా రూపొందేవాడని, ఒక సమన్వయ వాదిగా గోపాలం సహచరుడుగా శేషజీవితం గడిపి వుండేవాడని ఊహించ వచ్చు.

*శివకుమార్* : గోపాలం మరో మిత్రుడు శివకుమార్, మార్క్సిస్ట్ భావాల కారణంగా కమ్యూనిస్టు పార్టీ సభ్యుడయ్యాడు. విద్యార్థిదశలోనే, అన్యాయాలను సహించలేదు. పార్టీకోసం కాలేజీ చదువు మానేసిన వ్యక్తి.

అతడు నవలలో చివరిసారి కనిపించినప్పుడు గనుల కార్మికులతో పనిచేస్తున్నాడు. శ్రమకు తగ్గ ప్రతిఫలం రాక, ఆకలితో అలమటిస్తున్న కార్మికులతో కలిసి న్యాయంకోసం పోరాడుతున్నాడు

గోపాలాన్ని పరామర్శించి, వెళ్ళటానికి ఉద్యుక్తుడు కాగానే.

"పిల్లేదు నిన్ను తనివితీరా చూచినట్లే లేదు. నీతో తనివితీరా మాట్లాడి నట్లేలేదు. మళ్ళీ ఎప్పుడు కలుస్తామో.... అసలు కలుస్తామో లేదో...." అని బలవంతంగా ఆపాడు, గోపాలం,

మరునాడు ఉదయం తన దగ్గర సెలవు తీసుకొని శివకుమార్ వెళ్లి పోగానే.

"ఇతన్ని మళ్ళీ చూస్తానా?" అని అనుకున్నాడు గోపాలం. అలా అనుకోవడంతో అతని కళ్లలో నీళ్ళు గిర్రున తిరిగినాయి.

గోపాలం ప్రవర్తనలోను, మాటల్లోను శివకుమార్ మరణాన్ని శంకించటం స్పష్టంగా కనిపిస్తున్నది.

అతనిలోని ఆవేశగుణం అతని మరణానికి దారితీయవచ్చుననీ ఊహించవచ్చు.

పుటకతో ప్రత్యేక హక్కులను అనుభవించే వర్గంపట్ల శివకుమార్‌లో కసి వుంది. అతనిలో వర్గద్వేషం ఇంకా పెరిగే అవకాశమే ఉంది.

కార్మికులకు జరిగే అన్యాయాలను సహించలేక, వాళ్ళకు నాయకత్వం వహిస్తున్న శివకుమార్ ఆ యాజమాన్యంతో ఘర్షణకు దిగటంతో వాళ్ల అతణ్ణి హత్య చేయించటం అసంభవమేమీకాదు.

*కళ్యాణకింకిణి* : గోపాలం సహాయంతో దుర్భరజీవితంనుండి బయటపడి ప్రస్తుతం విశ్వభారతిలో ఉన్న కళ్యాణకింకిణి, తర్వాతి కథలో, చిత్రలేఖనంలో నిష్ణాతురాలై, తన కళాత్మక జీవితానికి గట్టి పునాదులు వేసుకొని, తిరిగి పరంధామయ్య దగ్గరకు రావటం సహజమే. చదువు పూర్తికాగానే తిరిగి ఆమెను తీసుకువచ్చే బాధ్యత గోపాలం మీదనే ఉన్నది.

దమయంతి మరణవార్త తెలియగానే, గోపాలం దుఃఖంలో పాలుపంచుకుంటూ ఆర్తితో గూడిన లేఖను తప్పకుండా రాసి ఉండేది.

*శశికళ* : కళ్యాణకింకిణిలాగే చిత్రకళారంగానికి చెందిన మరో పాత్ర శశికళ.

ఒకే రంగానికి చెందిన వారైనా వారిద్దరిలో తేడా ఉన్నదనీ పెరిగిన వాతావరణంవల్లా కుటుంబ నేపథ్యంవల్లా వారికి సంక్రమించిన ప్రవృత్తులే ఈ తేడాకు కారణమనీ భావించాడు, గోపాలం.

గోపాలం ఈ ఇద్దరినీ తన చెల్లెళ్లుగానే చూసుకుంటున్నాడు. అందువల్ల భవిష్యత్తులో కళ్యాణకింకిణి శశికళల కలయిక సంభవం. పద్ధతి ప్రకారం

చిత్రలేఖనంలో కృషిచేసిన కళ్యాణకింకిణి నుంచి శిల్ప కళా రహస్యాలు తెలుసుకొని, శశికళ తన ప్రతిభకు వన్నెదిద్దుకొని ఉండేది.

వీళ్ళిద్దరూ చిత్రలేఖన రంగంలో సమష్టి కృషి జరిపివుండే అవకాశం కూడా లేకపోలేదు.

సుశీల : గోపాలం హృదయానికి సంబంధించినంతవరకు, సుశీల, దమయంతి స్థానాన్ని స్వీకరించటం నవల చివరలో కనిపించే చెప్పుకోదగ్గ పరిణామం. ఈ అంశమే తర్వాత క్రమంగా పరిణామం చెంది ఉండేది. లౌకిక జీవితంలో గోపాలం మార్గదర్శకురాలిగా కూడా ఆమె రూపొంది ఉండేది.

గోపాలం ఆమెతో—

"అతడు నిన్ను కష్టపెడుతున్నాడా ?" అనడిగాడు. సుశీల మనసు తత్తరపడింది. ఆమె బిత్తరపోయింది.

"నేను కష్టాలను భరించగలను గోపాలం. నేను కోరేది మాత్రం నీవు సుఖంగా వుండాలని" అన్నది సుశీల.

సుశీల దాంపత్యజీవితం సుఖప్రదంగా లేదనే విషయం నవల చివరి భాగంలో స్పష్టంగా వెల్లడయింది. భర్త ఆమెను కష్టపెడుతున్న విషయాన్ని ఆమె పరోక్షంగా అంగీకరించింది.

భౌతికంగా తన భర్తకు ఎలాంటి లోటు చేయకపోయినా గోపాలాన్ని ప్రేమిస్తుండటంవల్ల ఆమె తన భర్తకు మానసికంగా సన్నిహితం కాలేక పోయింది. ఆమె భర్త నెలకు ఇరవై రోజులు క్యాంప్‌కు వెళ్ళవలసి రావటం వల్ల కూడా, వాళ్ళ మధ్యన సాన్నిహిత్యం నెలకొనలేకపోయింది.

బహుశా గోపాలాన్ని చూసిన తర్వాత సూర్యారావుకు సుశీల తన కెందుకు సన్నిహితం కాలేకపోతున్నదో కారణం తెలిసి ఉండవచ్చు. అప్పటి నుండి ఆమెను కష్టపెడుతున్నాడని ఊహించటానికి వీలుంది. ఇంతేకాక, సుశీల చెంచుగూడెంలోని వారికోసం పాఠశాల నడపటం, వారి అభ్యున్నతి

కోసం పాటుపడటం, ఆమె భర్తకు అంగీకారయోగ్యంగా లేవు. ఈ అభిప్రాయ భేదాలు, ఒక వివాదంగా మారిఉండే అవకాశం లేకపోలేదు.

అడవిని కూడా నివాసయోగ్యం చేసుకున్న సుశీల, నరకంగా మారే సంసారాన్ని స్వర్గసీమగా మార్చుకొని ఉండేదనుకోవటమే సమంజసం.

కృష్ణస్వామి : కృష్ణస్వామి చెల్లెలు రుక్మిణమ్మ 'ఓర్వలేనితనం' తోను, రత్నమ్మను కష్టాల పాలుచేయాలనే కక్షతోను తిరిగి కృష్ణస్వామిని వివాహం చేసుకొమ్మని ఒత్తిడి చేయటం అసంభవమేమీ కాదు.

కాని దమయంతిపట్ల అతడు ప్రకటించిన కృతజ్ఞతా భావం ఆమెను బతికించుకోవటానికి పడిన ఆరాటం, ఆమె మరణం తర్వాత అతనిలో కనిపించే నిరాశా ధోరణి, అతడు విధురుడుగానే ఉండిపోయేవాడనటానికి సూచనలుగా కనిపిస్తున్నాయి. కాని, కృష్ణస్వామి రామస్వామిచౌదరిగారే కనుక. రామస్వామిగారు మూడో పెళ్ళిచేసుకున్నట్లుగానే కృష్ణస్వామి మరో పెళ్లి చేసుకోవచ్చు.

దుర్గ : శివకామయ్య గురుకులంలో పెరిగిన దుర్గకు గోపాలం పట్ల అభిమానం కలిగింది.

మానసిక అనుబంధం కాంక్షించే లక్షణం అనాథలలో సహజంగా ఉండేదే.

దుర్గకు గోపాలం పట్ల ఉన్న అభిమానాన్ని శివకామయ్య గమనించాడు. అందుకే కృష్ణస్వామి కుటుంబాన్ని పరామర్శించటానికి తనతోపాటు దుర్గ వస్తానని అన్నప్పుడు కాదనలేదు.

సుశీల ఈ విషయాన్ని స్పష్టంగా గోపాలంతో చెప్పింది. "నువ్వంటే ఆ పిల్లకు చాలా యిష్టం—ప్రేమ" అన్నది.

ఆ ఇంటి కుటుంబ నిర్వహణ భారం, దమయంతి కొడుకును పెంచే బాధ్యత తాత్కాలికంగా వృద్ధురాలైన రత్నమ్మ మీదపడ్డాయి. ఆమె ఎంతో

కాలం ఈ బరువు బాధ్యతలు మోయలేదు. అందువల్ల గోపాలం వివాహం చేసుకోవటం అత్యవసరం. ఆ ఇంటి పరిస్థితులను చక్కదిద్దగల లక్షణాలు దుర్గలో ఉన్నాయి. తల్లిలేని పిల్లవాణ్ణి, అనాథ అయిన దుర్గ పెంచటంలో ఔచిత్యం కూడా వుంది.

శివకామయ్య వెళ్తూ—

"నీవు కాలేజీలో చేరగానే ఆశ్రమానికి ఒకసారి రా" అని గోపాలంతో చెప్పటంలో ఉద్దేశం ఈ వివాహ విషయం ప్రస్తావించటానికే అయిఉంటుంది.

పై సూచనలను అనుసరించి తర్వాతి కథలో గోపాలం దుర్గలకు తప్పకుండా వివాహమై ఉండేదని చెప్పవచ్చు.

గోపాలం దుర్గను వివాహం చేసుకోవటమంటే తాత్త్వికంగా శివకామయ్యకు మరింత దగ్గర కావటమే,

*ప్రిన్సిపాల్ దంపతులు :* గోపాలం భావవికాసంలో ప్రిన్సిపాల్ దంపతులకు, ముఖ్యంగా ప్రిన్సిపాల్ సతీమణికి తగిన పాత్ర ఉన్నది. స్వాతంత్ర్యం లభించేవరకు వీరు భారతదేశంలో ఉండి, ఆ తర్వాత తమ దేశానికి వెళ్లిపోయి ఉండేవారు. గోపాలం కళ్యాణకింకిణుల జీవితాలలోని ముఖ్యపరిణామాలపట్ల ప్రిన్సిపాల్ సతీమణికి ఆసక్తి ఉంది.

*రత్నమ్మ :* తన కూతురు చనిపోయిన తర్వాత గోపాలం కమలలను పెంచటానికే ఆమె జీవించింది. ఆ తర్వాత ఆమెకు దమయంతి ప్రేమాదరణలు కొత్త జీవితాన్నిచ్చాయి. దమయంతి మరణంవల్ల రెండోసారి విపరీతమైన దుఃఖానికి గురైన రత్నమ్మ ఎక్కువకాలం జీవించి ఉండేదికాదు.

ఇంకా—కవిరాజుగారి జీవితంలో 1932 నుంచి మరణించేవరకు కనిపించే ముఖ్యాంశాలు అన్నీ కాకపోయినా కొన్నైనా ప్రతిఫలించేవి. నవలలోని మొదటి భాగం దమయంతి మరణంతో పూర్తయినట్లు, అచ్చైన నవలలో ఆరవ ప్రకరణం నుంచి మొదలైన రెండో భాగం ('యువ' పత్రికను బట్టి) కృష్ణస్వామి మరణంతో అంతమై ఉండేది.

ఇదివరకు చెప్పినట్లుగా ఉన్నవవారు గోపీచంద్‌ను అధ్యాత్మికరంగం లోకి ఆకర్షించినట్లుగా, శివకామయ్య గోపాలాన్ని, ఇతరులను ఆధ్యాత్మిక మార్గంలో నడిపించేవాడు. ఉన్నవవారి జీవితంలోని స్వాతంత్ర్యోద్యమ ఉజ్వలఘట్టాలను కూడా రచయిత పొందుపరిచి ఉండేవాడు. 'క్విట్ ఇండియా' ఉద్యమ సందర్భంలో 'అజాద్ హింద్ ప్రభుత్వం' అనే పోటీ ప్రభుత్వాన్ని నడపటం.[5] స్వాతంత్ర్యానంతరం స్వాతంత్ర్య సమరయోధుల సంక్షేమానికి కృషిచేయటం[6] వంటివి శివకామయ్య జీవితంలో చోటుచేసు కొని ఉండేవి.

(2) ఇప్పటివరకు నవలలో నామమాత్రంగా పేర్కొనబడిన కొన్ని పాత్రలను భవిష్యత్తులో వివరంగా పరిచయం చేయాలనే దృష్టి రచయితకు ఉన్నదని ఊహించటంలో అసందర్భం ఏమీలేదు. ఉదాహరణకు, మొదట్లో పరంధామయ్యను మాత్రమే పరిచయంచేసి, అవకాశంరాగానే, అతని కుటుం బాన్ని గూర్చి దాదాపు అరవై పుటలలో రచయిత వివరించాడు.

దమయంతి మరణించినంత మాత్రాన ఆమె పుట్టింటితో సంబంధం తెగిపోలేదు. దమయంతి కొడుకుకు సంబంధించిన కొంత భూమికి, డబ్బుకు కృష్ణస్వామితోపాటు, దమయంతి అన్న శోభనాచలపతి కూడా గార్డియన్‌గా ఉన్నాడు. శోభనాచలపతిని గూర్చి మాత్రమే రచయిత కొంత చెప్పాడు. ఇకముందు కుటుంబం గూర్చి ఆ కుటుంబసభ్యులను గూర్చి సవివరంగా తెలియచేసే అవకాశం లేకపోలేదు.

సుశీల భర్త సూర్యారావు, దుర్గా, ఇద్దరూ తల్లితండ్రులు లేనివాళ్లే. వాళ్ళ గత చరిత్రను గూర్చి రచయిత పెద్దగా రాయలేదు. వారిని గూర్చి ముమ్ముందు వివరంగా రాయాలని రచయిత ఉద్దేశించి ఉండవచ్చు.

వివాహం తర్వాత గోపాలం చెల్లెలు కమలకు తన పుట్టింటిమీద తేలికభావం కలిగిందని చెప్పాడు. ఆమె అత్తవారింటిని గూర్చి ఏమీ చెప్ప లేదు. కథానాయకుని చెల్లెలి మెట్టినిల్లు కావటంవల్ల రచయిత ఆ కుటుం బాన్ని గూర్చి చెప్పిఉండేవాడు.

బృహన్నవలలోని కథలో గతం కూడా ఎక్కువ చోటు చేసుకుం

టుంది. 'చీకటిగదులు' గతంలోకి వెళ్ళటానికి పై అంశాలుకూడా దోహదం చేస్తాయి.

(3) చారిత్రక నిర్మాణాల, పుణ్యక్షేత్రాల వర్ణనలన్నీ, పురాత నౌన్నత్యాన్ని, సాంస్కృతిక వైభవాన్ని చాటిచెప్పే స్థలాల వర్ణనలన్నా రచయితకు ఇష్టం. 'మెరుపుల మరకలు'లో తిరుపతిక్షేత్రం, తాజ్‌మహాల్ మొదలైన కట్టడాలు, హిమాలయాలు, గంగానది మొదలైనవాటి వర్ణన. 'గడియపడని తలుపులు'లో యాదగిరిగుట్ట మహిమ వర్ణన. 'పండిత పర మేశ్వరశాస్త్రి వీలునామా'లో మైసూరు, పాండిచ్చేరీలోని అరవిందాశ్రమం వర్ణనలు, 'చీకటిగదులు' లో ఓరుగల్లు వర్ణన రామప్పదేవాలయం వర్ణన కనిపిస్తాయి. అంతేకాక 'చీకటిగదులు'లో కాకతీయుల చరిత్రకూడా దర్శన మిస్తుంది. ఆయా సందర్భాలలో కృష్ణస్వామి వ్యాఖ్యానాలతో వివిధ కాలాలకు చెందిన చారిత్రక పురుషుల వృత్తాంతాలు కూడా నవలలో కనిపిస్తాయి.

అలాగే ఈ నవలలోని మిగిలిపోయిన కథలో ఇంకా అలాంటి వర్ణన లకు అవకాశం లేకపోలేదు. గోపాలం కళ్యాణకింకిణిని చేర్చటానికి వెళ్లి నప్పుడు మాత్రం రవీంద్రుని విశ్వభారతిని అక్కడి విద్యావిధానాన్ని, కలకత్తానగర చరిత్రను, వంగజాతిని గూర్చి వివరంగా వర్ణించి ఉండేవాడు.

అలాగే సందర్భోచితంగా పుణ్యక్షేత్రాల, నదీనదాల వర్ణనలు, ఆధ్యా త్మిక కేంద్రాల వర్ణనలు కూడా చోటుచేసుకొని ఉండేవి. గోపీచంద్‌కు సిద్ధాంతాల చర్చ అన్నా, సమకాలీన ఉద్యమాల చర్చ అన్నా ఇష్టమే.

ఇప్పటివరకు జరిగిన కథలో స్వాతంత్ర్యానికి ముందున్న రాజకీయ వాతావరణమే స్పష్టంగా ఉన్నది. రానురాను ఉద్యమం తీవ్రరూపం దాల్చటం సంభవం కనుక ఆ ఉద్యమ తీవ్రత నవలలో చోటుచేసుకొని ఉండి ఉండటం సహజం.

అనేక భావాల మధ్యన తులనాత్మక పరిశీలనకు కూడా అవకాశం ఉన్నది. తన తండ్రి హేతువాద నాస్తికభావాలు, శివకామయ్య రాజకీయ తాత్వికభావాలు, శివకుమార్ కమ్యూనిస్టు భావాలు మొదలైనవి కూడా

అనేక సందర్భాలలో చర్చకు వచ్చి ఉండేవి. కాంగ్రెసు, జస్టిస్ కమ్యూనిస్టు పార్టీల కార్యక్రమాలు చర్చకు వచ్చిఉండటం సహజమే. అయా రాజకీయ నాయకుల వ్యక్తిత్వాలను వివరించే ఉద్దేశం కూడా రచయితకు ఉండేదని చెప్పవచ్చు. అలాగే వివిధ లలితకళలను గూర్చి కూడా రచయిత సందర్భోచితంగా వివరించి ఉండేవాడు.

(4) 'చీకటిగదులు' ఆత్మకథాత్మక నవల.

ఈ నవలలో గోపీచంద్ కుటుంబ జీవితం చాలా వరకు ప్రతిబింబించింది. ఈ అంశాన్ని 'ఆత్మకథాత్మక లక్షణాలు' అన్న ప్రకరణంలో నిరూపించటం జరుగుతుంది. ఇక్కడ మాత్రం ఈ నవల ముగింపును ఊహించటానికి మాత్రమే; గోపీచంద్ జీవితంలోని ముఖ్య ఘట్టాలను పేర్కొనటం జరుగుతుంది.

నవలలో గోపాలం బి.ఎ. చదువుతుండగా సవితి తల్లి దమయంతి మరణించింది. నిజ జీవితంలో కూడా 1932లో అంటే గోపీచంద్ బి.ఎ. చదువుతుండగానే అతణ్ణి పెంచి పెద్దచేసిన చంద్రావతిగారు మరణించారు.

చంద్రావతిగారు మరణించిన తర్వాత గోపీచంద్ జీవితంలోని ముఖ్య ఘట్టాలు.

1) 1932లో శకుంతలగారిని వివాహమాడడం;

2) వివాహానంతరం న్యాయవాద వృత్తిని చేపట్టి, తన ప్రవృత్తి కది సరిపడక పోవటంతో వదిలివేయటం,

3) అదివరకే తండ్రిగారి భావాలచేత ఆకృష్టుడైన గోపీచంద్ హేతువాదిగా రూపొందటం;

4) తన విశ్వాసాలను, సమర్థించుకోవటానికే సమకాలీన జీవితాన్ని ప్రతిబింబించటానికీ అదివరకే సాహిత్యరంగంలో ఉన్న సంబంధాన్ని పటిష్ఠపరచుకోవటం;

5) మార్క్సిజంపట్ల గోపీచంద్‌కు అభిమానం ఏర్పడటం;

6) ఎం.ఎన్. రాయ్ ప్రభావంతో రాడికలిస్టుగా రూపొంది రాడికల్ డెమ క్రటిక్ పార్టీ కార్యదర్శిగా రాజకీయ రంగంలో కృషి చేయటం;

7) 1939 సినిమా రంగంలోకి ప్రవేశించటం;

8) 1943లో తండ్రి కవిరాజుగారు మరణించటం;

9) కథానికా రచయితగా కీర్తిప్రతిష్ఠలు సంపాదించిన తర్వాత 'పరి వర్తనం' నవలతో నవలా రచయితగా గుర్తింపును పొంది, 'అసమర్థుని జీవయాత్ర' మనోవైజ్ఞానిక నవలలో తెలుగు సాహిత్యంలో శాశ్వత స్థానాన్ని సంపాదించుకోవటం;

10) భౌతిక ఆధ్యాత్మిక భావాల సమన్వయాన్ని కాంక్షించటంవల్ల క్రమంగా అరవిందులవైపు ఆకృష్టులు కావటం;

11) 1953లో ఆంధ్రరాష్ట్రం అవతరించగానే సమాచారశాఖ డైరెక్టర్ పదవిని చేపట్టటం; 1956లో ఆంధ్రప్రదేశ్ అవతరించగానే సమాచార పౌర సంబంధ శాఖలో సంయుక్త నియంత్రణాధికారిగా పదవీ బాధ్యతలు స్వీకరించటం;

12) 1957లో ఆకాశవాణిలో గ్రామస్థుల కార్యక్రమాల ప్రయోక్తగా నియమితులై చివరి క్షణం వరకు (1962) ఆ పదవిలోనే పనిచేయటం—

పై ఘట్టాలలో కనిపించే హేతువాదం మార్క్సిజం ఎం.ఎన్. రాయ్ విశ్వాసాలు నవలలోని గోపాలం జీవితంలోని అవసరమైన మార్పులతో చోటు చేసుకొని ఉండేవి.

పై ఘట్టాలతో పాటుగా రచయిత సమకాలీన రాష్ట్ర రాజకీయ సాంఘిక పరిస్థితులను కూడా విపులంగా చిత్రీకరించి ఉండేవాడు.

మూడో వంతు మాత్రమే పూర్తయిన నవల ముగింపును గూర్చి ఊహించటం సాహసమే. కాని, ఇది ఆత్మకథాత్మక నవల కావటంవల్ల కథా నాయకుని జీవితంతో ముడిపడి ఉన్న ఘట్టాలను ఊహించటానికి వీలు కలుగుతున్నది.

ఈ నవల పూర్తయి ఉండేనాటికి గోపీచంద్ జీవితం ముగిసి ఉండేది కాదు. కనుక, గోపాలం కథ కూడా అసంపూర్ణంగానే ఉండిపోయేది.

ఆత్మకథాత్మక నవలకు సంఘటనాత్మకమైన ముగింపు కంటే, తాత్వికమైన ముగింపే సమంజసమైంది. కనుక 'చీకటిగదుల' నవల కూడా, గోపాలం జీవితాన్వేషణలో తాత్కాలికంగా ఒకచోట ఆగిపోవటంతో, పూర్తయి ఉండేది.

విజ్ఞానశాస్త్ర ప్రభావంవల్ల రోజు రోజుకూ పెరుగుతున్న భౌతిక దృక్పథం వల్ల 'చీకటి గదులు'గా మారిపోతున్న ప్రజల జీవితాలలోకి భౌతిక ఆధ్యాత్మిక వాదాల సమన్వయం అనే కాంతిని పంపే ప్రయత్నం రచయిత లక్ష్యంగా కనిపిస్తున్నది. గోపీచంద్ నవలా రచనకు పూనుకున్న కాలం నాటికి సాంఘిక రాజకీయ పరిస్థితులు నిరాశాజనకంగా ఉండటం స్వాతంత్ర్యోద్యమ కాలంలోను, స్వాతంత్ర్యం వచ్చిన కొత్తలోను ప్రజలు ప్రభుత్వం మీద పెట్టుకున్న ఆశలు వమ్ముకావటంవల్ల కూడా ప్రజల జీవితాలు 'చీకటి గదులు'గా మిగిలిపోతున్నాయని సూచన.

శివకామయ్య గురుకులానికి మొదటిసారి వెళ్ళిన గోపాలానికి కలిగిన అనుభూతిని ఇక్కడ గుర్తుచేసుకోవడం అవసరం.

ప్రపంచంలో వున్న వైరుధ్యాలనన్నింటినీ కరిగించి, అఖండజ్యోతిగా వెలయించే గమ్యస్థానం ఎక్కడో వున్నదనిపించింది అప్పటికప్పుడే వొకదానినొకటి తేజోవంతంగా చేసుకుంటున్న వైరుధ్యపుటంచులనున్న ని వెలుగులు అతనికి స్పష్టంగా కనుపింపజొచ్చినై.

పైకి పరస్పర విరుద్ధంగా కనిపిస్తున్న ఆధ్యాత్మిక భౌతికవాదాల సమన్వయంపైన గోపాలం దృష్టి కేంద్రీకృతమై ఉన్నదనటానికి ఈ అనుభూతి బలమైన సాక్ష్యం. గోపాలంలోని ఈ మానసిక వాతావరణాన్ని ఇంకా తేజోవంతం చేయటానికి శివకామయ్య ప్రయత్నిస్తాడు.

సంఘంలోని చీకటిని తొలగించటానికి భక్తిమార్గం తప్ప వేరే మార్గం లేదని శివకామయ్య అభిప్రాయం. భౌతికవాదం పరిమితమైనదని

భావించిన గోపాలం శివకామయ్య చూపిన మార్గంలో పయనించి ఆధ్యాత్మిక భౌతికవాదాల సమన్వయాన్ని సాధించిన అరవిందునిపై తన దృష్టిని కేంద్రీకరించవచ్చు.

రచయిత దృష్టిలో ఈ 'స్థాయి' అందరూ పొందలేరు. గోపాలం చుట్టూ ఉన్న వారిలో, ఇక ముందు ప్రవేశించే వారిలో అనేకులు గోపాలంతో పాటు నడవలేకపోవచ్చు.

అలాంటి వారంతా చీకటిగదులుగా మిలిగిపోతారనే విమర్శ కూడా ఈ పేరులో గర్భితంగా ఉంది.

# 2. ప్రేమోపహతులు

సుందరీ జయరామారావులు భార్యాభర్తలు. భర్తకు ఇష్టమైన స్త్రీతో స్నేహం చేసి, అతనితో ఆ స్త్రీకి సంబంధం ఏర్పడటానికి సుందరి ప్రయత్నిస్తే, భార్యకు ఇష్టమైన పురుషునితో స్నేహంచేసి, ఆమెకు ఆ పురుషునితో సంబంధం ఏర్పడటానికి జయరామారావు ప్రయత్నించేవాడు.

పురుషుడు, ఒకరికంటె ఎక్కువ స్త్రీలతో సంబంధం పెట్టుకోవటం చట్టవిరుద్ధమే అయినా, పురుషాధిక్యం కారణంగా సమాజంలో చెలామణిలో ఉంది. స్త్రీకి కూడా ఇదే రకం స్వేచ్ఛ ఉండాలనే లైంగిక స్వేచ్ఛావాదులు కోరుతుంటారు.

పరస్పరం ఇష్టమున్న వ్యక్తులు, భార్యాభర్తలు కాకపోయినా లైంగిక సంబంధం పెట్టుకోవచ్చుననటం లైంగిక స్వేచ్ఛావాదం. కాని, సుందరీ జయరామారావుల జీవిత విధానంలో, అవతలి వ్యక్తి ఇష్టంతో సంబంధం లేదు అందువల్ల, సుందరీ జయరామారావులది కేవలం పాక్షిక లైంగిక స్వేచ్ఛావాదం అనుకోవచ్చు. చాలావరకు ఒక వ్యక్తిని చూసిన తర్వాత, ఆ వ్యక్తిలోని ఏదో ఒక ఆకర్షణకు లోనుకావటం, ఆ ఆకర్షణే ఇలాంటి లైంగిక సంబంధాలకు దారితీయటం స్వాభావికమైన విషయం. కాని, జయరామారావు కళ్యాణిని చూడకముందే ఆమె పట్ల తనకున్న 'ఇష్టాన్ని' భార్యతో ప్రకటించాడు. దీన్నిబట్టి, హృదయానుబంధంతో నిమిత్తంలేని కేవల కామేచ్ఛ మాత్రమే అతనితో ఉన్నదని స్పష్టమవుతున్నది.

సుందరికి భర్త 'నవ్య భావాలు' ఒంటబట్టటం వల్ల అతని సహాయంతో సదానంద్‌తో సంబంధం పెట్టుకున్నది.

సుందరి సహాయంతో, జయరామారావుతో సంబంధం పెట్టుకున్న కరుణాదేవి బదిలీ అయిపోయినప్పటి నుండి మరెవరూ దొరకనందువల్ల జయరామారావు దృష్టి కళ్యాణిమీద కేంద్రీకృతమైంది.

కళ్యాణి చిన్నప్పటి స్నేహితురాలు కావటంవల్ల, సుందరికి భర్త కోర్క తీర్చగలననే ధైర్యం ఉంది. అందుకే చాలాకాలం తర్వాత కలిసిన స్నేహితురాలిని స్టేషన్‌లో చాలా చనువుగా పలకరించి, ఇంటికి తీసుకువచ్చి ఎంతో ఆత్మీయతను ప్రదర్శించింది. తన భర్త స్టేషన్‌కు రాకపోయినందుకు, క్షమాపణ కోరుకున్నాడని చెప్పటం ద్వారా, అతని పట్ల కళ్యాణికి గౌరవ భావం ఏర్పరిచింది.

జయరామారావు పూర్వీకులు హైదరాబాద్‌లోనే స్థిరపడటంవల్ల, అప్పటి పాలకులైన మహమ్మదీయుల జీవిత విధానం అలవాటయింది.

'ఎప్పటికప్పుడు వీలైన అన్నివిధాల జీవితాన్ని అనుభవించటం'లో జయరామారావుకు ప్రగాఢ విశ్వాసం ఉంది. దీనికి తోడుగా అతడు అమెరికాలో కొంతకాలం గడిపిరావటంవల్ల పై దృష్టి బలపడటమే కాక, సుఖాన్ని అనుభవించటానికి భారతీయ జీవితంలో అడ్డంకులుగా ఉన్నవాటిని అతిక్రమించే దృష్టి కూడా ఏర్పడింది. అందుకే,

'ఏదో ఒక నెపంతో జీవితం అందించే అందాలను, ఆనందాలను వదులుకోవటం అతనికి వెర్రిగా కనిపిస్తుంది.'

భార్య తన కిష్టమైన వాడితో సుఖపడుతుంటే సహించగలడు కాని, తనకు మరో స్త్రీని కుదర్చకుండా తన సౌఖ్యం తాను చూసుకుంటుంటే మాత్రం సహించలేడు. ఇది అతని హద్దు.

అతడింటికి రాగానే, ప్రయాణం చేసివచ్చిన కళ్యాణితో "ఎంత సేపయింది వచ్చి ?" అన్నాడు.

నిజంగా ఆమె ఎప్పుడొచ్చిందో తెలుసుకోవాలనే కోరికతో కాదు, మామూలు మర్యాద పాటించటానికీ కాదు. ఆమెను మాట్లాడించాటానికి. ఆ ప్రశ్నకు జవాబు తెలిసీ సుందరి తాను చెప్పదు.

"ఆయనకు నువ్వు చెబితే వినాలనుంటే-నేను చెప్పి ఏం ప్రయోజనం ?" అంటుంది సుందరి.

"చెబితే మీనోటి ముత్యాలు రాలవు లెండి" అంటాడు.

'....కళ్యాణి కాయిద్దరు మనుషులూ చాలా విచిత్రంగానూ, విడ్డూరం గానూ కనిపించారు.'

ఈ భావం, వాళ్ళపట్ల ఆమెకు ఆసక్తి కలగజేయటం సహజం కళ్యాణిలో ఉండే పరపురుష భావననూ, సహజమైన బిడియాన్నీ తొలగించటం మొదటి కర్తవ్యంగా భావించిన సుందరి అందుకు అనుగుణంగా మాట్లాడింది, ప్రవర్తించింది. జయరామారావు క్రమంగా చొరవ తీసుకోవటంద్వారా కళ్యాణి చుట్టూ సాలెగూడు అల్లటం ప్రారంభించాడు.

రాగానే బహువచనంతో కళ్యాణి పట్ల గౌరవాన్ని ప్రదర్శించినవాడు, గంట గడవకుండానే ఏకవచనంతో సాన్నిహిత్యాన్ని ప్రదర్శించాడు. ఇది జయరామారావు చొరవకు, ఇలాంటి వ్యవహారాల్లో అతనికున్న అనుభవానికి నిదర్శనం

గ్రామీణ అమాయకత్వం, తల్లినుంచి సంక్రమించిన పాతివ్రత్య భావాలు కళ్యాణిని సాధారణ మధ్యతరగతి గృహిణిగా రూపొందించాయి. భర్త డాక్టరే అయినా, కాపురం చేస్తున్నది పెద్ద వూళ్ళోనే అయినా, ఆమెలో అంతగా మార్పు రాలేదు. నాగరికత పేరుతో జీవితపు ఉపరితలం మీద ప్రదర్శించబడే ఏ విషయాలూ ఆమెకు తెలియవు. తెలిసినా అవి తనకు సంబంధించినవి కావనుకున్నది. ఆమె చెవులకు రింగులే పెట్టుకోలేదు. దళసరి నూలు, పట్టుచీరలే తప్ప ఒంపుసొంపులను బహిర్గతంచేసే షిఫాన్ చీర కట్ట లేదు బయటకు వెళ్లినప్పుడు డబ్బును 'కొంగు బంగారంగా' తీసుకొనిపోవ టమే తప్ప, హ్యాండ్‌బ్యాగ్ చంకన వేసుకోవటం అలవాటు లేదు.

ఇంతేకాకుండా, కళ్యాణిలో మానసిక సునిశితత్వం పాలు ఎక్కువ. పరపురుషులు చూస్తుండగా స్నానాల గదిలోకి వెళ్ళటానికి సంకోచిస్తుంది. స్నానం చేస్తూ, సుందరి తమతో మాట్లాడుతుంటే కళ్యాణికే సిగ్గువేసింది. స్నానంచేసి, తను ముందు నుంచి అర్ధనగ్నంగా వెళ్లిన సుందరిని చూసి జయరామారావు——

"సుందరి శరీరం మీరు చూసి వుండరు. ఆమె ముఖం కంటే శరీరం ఎరుపెక్కువ, నునుపు కూడానూ" అన్నప్పుడు కళ్యాణి శరీరం జలదరిం

చింది. బహుశా ఆమెకు. తన శరీరాన్నే అతడు వర్ణిస్తున్నాడన్న భావం కలిగింది. జయరామారావుకు కావలసింది కూడా మనసుకు గిలిగింతలు పెట్టే ఈ జలదరింపే!

"మీరు ఏం చేస్తుంటారు" అని అడిగాడు.

"వంట చేస్తుంటాను" అన్నది. అతడు విరగబడి నవ్వాడు. ఆమె ఏ సందర్భంలో ఏం చేస్తుందో అతడు అడగలేదు. మామూలుగానే అడిగాడని గుర్తుంచుకుంటే, ఆమె ఏ జవాబు చెప్పినా అతడు విరగబడి నవ్వేవాడేనని తెలుస్తుంది.

ఆమె భర్త ఆఫీసు పనిలో ఉన్నప్పుడు, కళ్యాణి ఏం చేస్తుంటుందో తెలుసుకోవాలని అడిగినప్పుడు "నిద్రపోతుంటాను" అన్నది. అతడు గునగునగా నవ్వాడు. విరగబడి నవ్వి, 'ఇంత పెద్దమనిషిని నేను నవ్వించగలిగాన'నే భావం ఆమెలో కలిగించాడు. గునగునగా నవ్వి ఆమె ఒంటరిగా పడుకున్న దృశ్యాన్ని తాను ఊహించగలిగానని భావయుక్తంగా ప్రకటించాడు. ఇదివరకు తన యింట్లో కొంతకాలం వున్న కళ్యాణి భర్త ప్రస్తావన రాగానే, "ఇక్కడున్నన్నాళ్ళు అతను లేకుండా సుందరి భోజనంచేసేది కాదు." అని తన భార్యకు, కళ్యాణి భర్తకూ అవినాభావ సంబంధం ఏర్పడిందని కూడా సూచించాడు. తనకూ కళ్యాణికీ కూడా అలాంటి సంబంధమే ఏర్పడిందని ఏకపక్షంగా సూచించటానికి అనువైన వాతావరణాన్ని సృష్టించటానికి అతడు చేసిన ప్రయత్నమిది.

కళ్యాణిని లొంగదీసుకోవటానికి భార్యాభర్తలు ఉపయోగించిన ఆయుధాల్లో—ఒకటి 'తెలివైన సంభాషణ'. సుందరి మొదటిదశలో తన భర్తకు కళ్యాణిపట్ల ఉన్న ఇష్టాన్ని కళ్యాణికి తెలిసేటట్లు ప్రవర్తించింది. రెండవ దశలో కళ్యాణికి తన భర్త పట్ల ఇష్టం ఏర్పడినట్లుగా ప్రవర్తించింది. రెండోది మొదటిదాన్ని సాధించటానికే మాటిమాటికి కళ్యాణికి జయరామారావుపట్ల ఇష్టమని వ్యంగ్యంగా చెప్పటంవల్ల, కళ్యాణిలో ఏ మాత్రమైనా మానసిక బలహీనత ఉన్నా లొంగిపోవచ్చునని సుందరి ఊహ పదేపదే చెప్పిన మాట. వ్యక్తి ఇష్టంలో ప్రమేయం లేకుండానే స్థిరపడవచ్చు లేదా అనుకూల వాతావరణం సృష్టించవచ్చు.

కళ్యాణి 'మనస్సు'ను తెలుసుకోవటానికి ఒకవైపు ప్రయత్నిస్తూనే, ఆమె మీద తమ భావాలను బలవంతంగా రుద్దటానికి సుందరి వెనుకాడలేదు.

కళ్యాణిని తన భర్తతో ఒంటరిగా వదిలివెళ్లటం, భోజన సమయంలో, ఆమెకు తన చీర కట్టించి భర్తకు దగ్గరగా కూర్చునేటట్లు చేయటం వంటివి, వాళ్లిద్దరి మధ్య సాన్నిహిత్యం నెలకొనటానికి సుందరి చేసిన ప్రయత్నాలు.

వాళ్లు ఆమె అందాన్ని పొగడటంవల్ల ఆమెలో అదివరకు లేని సౌందర్య దృష్టి ఏర్పడింది. సుందరి పడుకున్నప్పుడు నిలువుటద్దంలో తనను చూసుకోవటం, వాళ్లన్నట్లు నిజంగా తాను సౌందర్యవతినేమోననే భావంలోనే.

భోజనసమయంలో కళ్యాణికి పొలమారినప్పుడు, జయరామారావు ఎంతో చొరవతీసుకొని, చేతివేళ్లతో ఆమె గొంతును సవరించటంలోని ఉద్దేశం, ఆమెకు పరపురుష స్పర్శకు అలవాటుచేయటమే. మాటలు చేతలుగా మారుతున్నాయి :

'....కళ్యాణి శరీరం ఝల్లుమున్నది.'

'....సవరించటంలో ఆ వేళ్ళకున్న నేర్పు ఆమె శరీరం ఇట్టే గ్రహించింది.

ఇది శారీరకమైన ప్రతిక్రియ. మరి మనస్సు మాత్రం దీన్ని వ్యతిరేకించాలనీ, జయరామారావు చర్యకు అభ్యంతరం చెప్పాలనీ అనుకుంటుంది. మొహమాటం కొద్దీ ఆమె చేయలేని పనిని సుందరి చేస్తుంది. తన భర్తను '....మందలించినట్టుగా నటించింది' సుందరి.

అతడు తన అమాయకత్వాన్ని ప్రకటిస్తూ నేనేమైనా పొరపాటు చేశానా కళ్యాణీ? అలాచేసి వుంటే క్షమించు" అన్నాడు.

కళ్యాణి మౌనం వహించినా వారు ఆ విషయాన్నే చర్చించారు. గోరంతదాన్ని కొండంతగా చేయటంద్వారా, మామూలు విషయాన్ని సమస్యగా మార్చటం ద్వారా ఏ భావం కలగకూడదో ఆ భావం కలిగేటట్లుగా చేయటమే - ఈ చర్చ ద్వారా వారు సాధించదలచుకున్నది. అందుకే కళ్యాణికి,

'...జయరామారావు పొలమారినందుకు తనగొంతును సవరించటానికి బదులు తన్ను కౌగిలించుకున్నాడన్నట్లే అనిపించింది.'

తెలివైన మాటల ద్వారా మానసిక సాన్నిహిత్యాన్ని సాధించి, దగ్గరగా కూర్చోనేటట్లు చేయటం ద్వారా శారీరక సాన్నిహిత్యాన్ని సాధించి, పొగడటం ద్వారా సౌందర్యదృష్టిని కలిగించి, స్పర్శ ద్వారా కొత్త అనుభవానికి గురి చేసి వివాహిత స్త్రీలో సహజంగా ఉండే పరపురుషభావనను తొలగించాలని వారి ప్రయత్నం. వాళ్ల ప్రయత్నం ఒక పథకం ప్రకారం సాగుతోంది.

భోజనాల తర్వాత జయరామారావు ఆఫీసుకు వెళ్లిపోయాడు మంచం మీద పడుకున్న తర్వాత, సుందరి కళ్యాణికి—

'శరీరంలో ప్రవేశించి, మనస్సును కితకితలుపెట్టే 'ఉడుకులాం' పూసింది. మంచి గంధం రాసింది. ఆ మంచం మీదే ఆమెమీద చేయివేసి పడుకునీ, కళ్యాణి భర్త విశ్వేశ్వరరావు గూర్చి ప్రస్తావించింది సుందరి. ఇదంతా కళ్యాణిలో లైంగిక వాంఛ కలగటానికి చేసిన ప్రయత్నమే వాంఛ కలిగితే, ఆమె విశ్వేశ్వరరావును కోరుకొంటుంది. ఇపుడు భర్తఅందుబాటులో లేదు కనుక ఆమె దృష్టి జయరామారావు మీద పడాలని సుందరి యత్నం. జయరామారావుకు కళ్యాణిలాంటి సిగ్గుపడే పల్లెటూరి పిల్లలంటే ఇష్టమని ఒకటికి రెండుసార్లు చెప్పింది

జయరామారావు ఆఫీసుకు వెళ్ళటం కూడా నాటకంలో ఒక భాగమే. రెండు మూడు గంటల వ్యవధిలో కళ్యాణికి తనపట్ల అనుకూల భావం కలిగించటానికిగాను తన భార్యకు అతడిచ్చిన అవకాశమిది.

సుందరి అతడు రాగానే తన ప్రయత్నలోపమేమీ లేదన్నట్లుగా, "అరగంట నుంచీ మీకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాం'' అనటం.

''ఎవరు ఎదురు చూస్తున్నార''ని జయరామారావు ప్రశ్నించటంతో మళ్ళీ కళ్యాణి తెలివైన మాటల వలయంలో చిక్కుకున్నది.

జయరామారావు తన మనస్సు నిండా కళ్యాణే నిండిపోయిందన్నాడు.

అంతేకాదు, కళ్యాణి మీద ప్రేమతో ఆఫీసులో ప్రణయగీతం రాశానన్నాడు. ఈ మాటల్ని సుందరి ప్రోత్సాహపూర్వకంగా బలపరిచింది.

కళ్యాణి క్లిష్టపరిస్థితిలో చిక్కుకొన్నది. సాధారణంగా స్త్రీ మరో స్త్రీ నుంచి రక్షణ ఆశిస్తుంది. జయరామారావు తనతో సంబంధాన్ని ఆశిస్తున్న సమయంలో సుందరి కూడా తన భర్తను ప్రోత్సహించటంతో అనుకోని పరిస్థితి ఏర్పడింది అందుకే ఈ దశలో సదానంద్ రాక కళ్యాణికి సంతోషాన్ని కలగజేసింది

అందరూ సినిమాకు వెళ్ళారు. పగలుచేసిన ప్రయత్నం సఫలమైందో, కాలేదో తెలుసుకోవటానికే ఈ సినిమా కార్యక్రమం! వాళ్ళ పథకం ప్రకారం సినిమాలో సుందరి సదానంద్ ప్రక్కన కూర్చోవటంతో కళ్యాణి జయరామారావు ప్రక్కన కూర్చోవలసి వచ్చింది.

సుందరీ సదానందుల సాన్నిహిత్యం, చీకట్లో వారి చర్యలు వాళ్ళ మధ్యన ఉన్న లైంగిక సంబంధాన్ని కళ్యాణికి స్పష్టం చేసేవిగా ఉన్నాయి. వాళ్ళ సంబంధానికి జయరామారావు ఆమోదం ఉన్నదన్న విషయం కూడా కళ్యాణికి తెలిసేటట్లుగా వారు ప్రవర్తించారు ఇది కళ్యాణి జయరామారావుతో సంబంధం పెట్టుకోవటం తన కిష్టమేనని సుందరి సూచించటం. జయరామారావు సినిమాలోని కథానాయికను గూర్చి మాట్లాడుతూ, కళ్యాణి చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. కళ్యాణి 'తటాలున చెయ్యి లాక్కుని, ఒణికిపోతూ కూర్చుంది.'

ఆ స్పర్శను ఆమె శరీరమూ, మనసూ అంగీకరించలేదు. ఇంతకు పూర్వం జయరామారావు కళ్యాణి గొంతు సవరించినప్పుడు మొహమాటం కొద్దీ ఆమె ఏమీ అనలేకపోయింది. అందుకే ఇప్పుడు కూడా ఆమె ఏమీ అనబోదని అతడు ఊహించాడు. అతడనుకున్నట్లుగానే, ఆమె ఏమీ అనలేకపోయింది. కేవలం మనసులోనే బాధపడింది.

రెండోసారి కూడా తన స్పర్శకు అభ్యంతరం కనిపించకపోయేసరికి మూడోసారి మరీ చొరవతో ఆమె భుజం మీద చేయి వేశాడు.

ఈసారి కూడా కళ్యాణి అతణ్ణి ఏమీ అనలేకపోయింది. అసలు ఆ దుఃఖంలో ఈ వ్యవహారాన్ని మాటల్లో ఎట్లా ప్రస్తావించాలో కూడా ఆమెకు తెలియదు. అందుకే వెంటనేలేచి బాల్కనీలోకి వెళ్ళిపోవటం ద్వారా, ఆమె మొదటిసారి అతని చర్యలపట్ల తన తీవ్ర అభ్యంతరాన్ని ప్రకటించింది.

కళ్యాణి ప్రతిక్రియకు పునాది, ఆమెలోని సంప్రదాయబలం. ఆమె జీవితంలో పెనవేసుకుపోయిన నీతికి సంబంధించిన భావాలను, నాటకీయ సంభాషణలు, తెలివైన చర్యలు, కుట్రతో కూడిన పథకాలు మార్చజాలవు.

కాని, ఆమె నిస్సహాయ పరిస్థితుల్లో చిక్కుకున్నది. ఆమెలో ఎదుటి వాళ్ళను గౌరవదృష్టితో చూడగలిగే సంస్కారమే ఉన్నది. కాని, తనకు జరిగిన అవమానానికి ప్రతిక్రియ చేయగలిగే శక్తి ఆమెకు లేదు. తన దుఃఖం ద్వారా మాత్రమే ప్రతిక్రియ ప్రకటించగలదు. అంతకు మించి ఆమె ఏమీ చేయలేదు.

ఆమె బాల్కనీలోకి వెళ్లిన తర్వాత, సుందరి వెళ్ళి ఆమె దుఃఖానికి కారణం అడిగింది. అనునయిస్తున్నట్లుగా ఆమె వీపును తన చేత్తో నిమిరింది.

'ఆమె చేతి స్పర్శ జయరామారావు చేతి స్పర్శకంటే కనాకష్టంగా అనిపించింది. కళ్యాణికి.'

అంటే, కళ్యాణికి జయరామారావు స్పర్శకు సుందరి స్పర్శకు మధ్యన తేడా తెలిసింది. తెలిసేటట్లు వాళ్ళు చేయగలిగారు.

సుందరి జయరామారావుతో కోపాన్ని 'నటించటం', జయరామారావు 'తనకు తెలియకుండానే చేసిన పనికి దుఃఖాన్ని నటించి కళ్యాణితో క్షమా పణ వేడుకోవటం, మళ్ళీ అంతా హాల్లోకి వెళ్లిపోవటం నాటకంలోని సన్ని వేశాల లాగే చకచకా జరిగిపోయాయి.

ఇది సినిమాలో జరిగిన నాటకం. జరిగిన దానికి జయరామారావుకు బాధలేదు. పశ్చాత్తాపంలేదు. కోరిక తీరలేదు. కనుక అతనిలో పట్టుదల పెరుగుతుంది అతని పట్టుదల పెరిగే కొద్దీ, సుందరి బాధ్యత హెచ్చుతుంది.

అయితే, ఇద్దరికీ కూడా నిరాశ కలిగినట్లు లేదు. తప్పకుండా కళ్యాణిని

తమ దారికి తేవచ్చునన్న విశ్వాసమే వుంది. ఈ విశ్వాసానికి కారణం, పదునైన ఒక ఆయుధాన్ని వాళ్ళు ఇంకా దాచే ఉంచటం. అదే— కళ్యాణి భర్త విశ్వేశ్వరరావు వచ్చిన తర్వాత సుందరి అతణ్ణి తన వలలో వేసుకోవటానికి చేసే యత్నం.

ఇది వరకు కొన్ని రోజులు విశ్వేశ్వరరావు వీళ్ళతో గడపినప్పుడు, సుందరి కొంత ప్రయత్నం చేసినా, విశ్వేశ్వరరావు అమాయకత్వం వల్ల తెలుసుకోకపోవటమో లేక, అతడు చూసీ చూడనట్లుగా ఊరుకోవటమో జరిగి ఉంటుంది. అందుకే సుందరి—

''నన్ను గురించి విశ్వేశ్వరరావు గారు నీతో ఏం చెప్పారు?'' అంటూ ఆసక్తితో అడిగింది, నిజానికి అతడేమీ తన భార్యతో చెప్పలేదు. మొత్తం మీద సుందరీ జయరామారావుల సహకార పద్ధతి గూర్చి విశ్వేశ్వరరావుకు ఏమీ తెలియదు. తెలిసే ఉంటే భార్యను వీళ్ళ దగ్గరకు పంపించి ఉండేవాడు కాదు.

కళ్యాణి వంటి సాంప్రదాయిక స్త్రీయే తప్పకుండా తమకు లొంగితీరుతుందని వాళ్లు నమ్మినప్పుడు, వాళ్ళకు విశ్వేశ్వరరావు పట్ల ఇంకా ఎక్కువ నమ్మకమే ఉంటుంది. అందులో అది స్త్రీ చొరవతో నడిచే వ్యవహార కావటం వల్ల కూడా వాళ్లకా విశ్వాసం వుంది. విశ్వేశ్వరరావు సుందరితో సంబంధం పెట్టుకుంటే, కళ్యాణి చుట్టూ ఉన్న ఉచ్చు బిగిసేందుకు ఎక్కువ అవకాశం వుంది. అప్పటికీ ఆమె లొంగకపోతే కళ్యాణీ విశ్వేశ్వరరావుల మధ్యన అపార్థాలు సృష్టించవచ్చు. వాళ్ళలో ఎవరికోరిక తీరకపోయినా, కళ్యాణీ విశ్వేశ్వరరావుల జీవితాన్ని దుర్భరం చేయటం ద్వారా కొంత మానసిక సంతృప్తిని పొందవచ్చు.

కళ్యాణి ఏ విషయాన్నీ లోతుగా ఆలోచించే స్థితిలో లేదు. ఆమె నిస్సహాయురాలు, ఆమెకు ఆ రాత్రి వాళ్ళింట్లో గడపడమే ఒక పెద్ద సమస్య. అందువల్ల ఆమె ఆ రాత్రి ఏ అవాంఛనీయ సంఘటన జరగకుండా గడిచిపోతే అంతే చాలుననుకోవటం, ఆ తెల్లవారగానే తన భర్త అద్దెకు మాట్లాడిన ఇంట్లోకి వెళ్లిపోవాలనే నిర్ణయానికి రావటం సహజమే.

ఆ రాత్రి గదిలో పడుకున్నదన్న మాటేగాని, ఆమెకు అంతగా నిద్ర రాలేదు. కళ్యాణి నిద్రపోయిందనుకొని జయరామారావు సుందరిని ఆదేశిస్తున్నాడు——

''....ఆమె సంగతి నువ్వు రేపు తేల్చివెయ్యాలి.'' అంటూ, ఇంతేకాదు, కళ్యాణిని లోబరుచుకోవటం ఆమెకు ఇష్టం లేదంటూ, ఉక్రోశంతో సుందరికి తొడపాశం పెట్టాడు. ఆమె తొడ అదివరకే పచ్చి పుండై ఉన్నది కళ్యాణి వాళ్ళను పిశాచాలుగానే భావించింది. ఆ రాత్రంతా సుందరి ఏడుస్తూనే ఉన్నది. 'తనకన్న వారి ఊళ్ళో రాత్రుళ్ళు ఒక పిశాచం శ్మశానంలో కూర్చొని రోదిస్తూ ఉంటుందని' వినివున్న సంగతి కళ్యాణికి గుర్తుకు వస్తుంది.

ఈ దశలో రచయిత మృతి కారణంగా నవల అసంపూర్ణంగా మిగిలిపోయింది.

జయరామారావు దంపతుల లైంగిక ప్రవర్తనను గూర్చి తెలుసుకోవటం కొంత అవసరం.

సినిమా నుంచి ఇంటికి చేరుకున్న తర్వాత, భోజనాలు చేస్తున్నప్పుడు. ''తిండికి మాత్రం అందరు తయారే'' అన్నాడు జయరామారావు. అంతే కాదు, ''ఎవ్వరికయినా మరొకరి డబ్బు ఖర్చు పెట్టించడానికి ముందుగా అందుకుతగిన అర్హతను సంపాదించుకోవాలి. తేరగా దొరికిందని తింటే నరా ?'' అని కూడా అన్నాడు.

ఈ మాటల్లో కళ్యాణి తనకు లొంగిపోలేదనే ఆశాభంగంతోపాటు, ఆమెను బాధపెట్టాలనే తత్త్వం కూడా కనిపిస్తుంది. ఎదుటివాళ్ళను మానసికంగా హింసించటంలో అతనికేదో ఆనందం కలుగుతున్నట్లు స్పష్టమౌతున్నది. ఎందుకంటే, పై మాటలతోనే తృప్తిపడకుండా కళ్యాణి భోజనం చేస్తున్నంతసేపు అతడు ఎన్నో సూటిపోటి మాటలు అంటూనే ఉన్నాడు.

ఆ రాత్రి అతని తత్వం ఏమిటో స్పష్టమైంది.

సుందరికి తొడపాశం పెట్టాడు. రోజూ ఆ రకంగా ఆమెను హింసిస్తున్నాడు కనుకనే ఆమె తొడ పచ్చిపుండయింది.

భార్యను శారీరకంగా హింసించటం ద్వారా అతడు ఆనందాన్ని పొంద గలిగాడు. అంటే, జయరామారావులో ఎదుటి వాళ్ళను మానసికంగా, శారీర కంగా హింసించి ఆనందించాలనే తత్వం ఉన్నది. ముఖ్యంగా, శారీరకంగా హింసించటంలో అతనికి లైంగిక సంతృప్తి లభిస్తున్నది. ఈ తత్వాన్ని 'పర పీడనరతి'9 (SADISM) అంటారు. ఇదొక లైంగిక అనాచారం.

జయరామారావు తొడపాశం పెట్టినప్పుడు సుందరి ఆ ప్రదేశంలో పుండయింది. కనుక మళ్ళీ అక్కడ మాత్రం హింసించవద్దన్నది. అలా అంటూనే.

''మీరేమన్నా చెయ్యండి, మీ ఇష్టం వచ్చిందానితో ఒళ్లు హూనం అయ్యే టట్లు చెయ్యండి, కొట్టండి....'' అని ప్రతిమాలింది.

అంటే జయరామారావు తనకు శారీరకంగా హింసించాలని ఆమె కోరు తున్నదన్నమాట. మొదట్లో నిస్సహాయ స్థితిలో హింసను ఆమె భరించి ఉంటుంది. ఆ తర్వాత క్రమంగా అలవాటయింది. ఆ అలవాటులో ఆనందాన్ని కూడా ఆమె చవిచూస్తున్నది. ఆ బాధ దుర్భరమయ్యే పక్షంలో లేదా జయ రామారావుతో కాపురం నరకయాతన అయ్యే పక్షంలో ఆమె ఎప్పుడో అతణ్ణి వదిలేసి వెళ్లిపోయేదే.

ఈ విధంగా హింసకు గురికావటం ద్వారా ఆనందాన్నీ, లైంగికోద్రే కాన్నీ పొందటాన్ని 'స్వపీడనరతి'10 (MASOCHISM) అంటారు. ఇది కూడా ఒక లైంగిక అనాచారమే.

వాళ్ళు జీవిస్తున్నది మానవ జీవితం కాదు, పిశాచ జీవితమే. ఎదుటి వారిని మానసికంగా, శారీరకంగా హింసించటంలోనే వారికి ఆనందం. ఈ లక్షణం కేవలం జయరామారావులోనే కాదు. సుందరిలోనూ కనిపిస్తుంది. సదానంద్ భార్యను పరోక్షంగా ప్రస్తావించి, దూషించటంలో సదానంద్‌ను హింసించి ఆనందం పొందటం కనిపిస్తుంది.

వాళ్లు రాత్రి జీవించే జీవితమే నిజానికి యథార్థమైనది. పగలంతా వాళ్లు దేనికోసమో, ఎవరికోసమో నటించవలసిందే, కొత్త కొత్త ముసుగులు

ధరించవలసిందే. ఇతరుల ఎదుట భార్యాభర్తలుగా కూడా వారు నటించవల సిందే. లేని ఆవేశాలను గౌరవాభిమానాలను ఒకరి పట్ల ఒకరు ప్రదర్శించు కోవటానికి కూడా వారికి నటనే శరణ్యం. పగలంతా కృత్రిమ జీవితంలోని నటనవల్ల, ఆత్మవంచనవల్ల ఏర్పడిన విసుగును, జయరామారావు రాత్రి హింసా ప్రవృత్తిని ఆశ్రయించటం ద్వారా భర్తీ చేసుకుంటాడు. అతని హింసకు గురయ్యేది సుందరే కనుక, ఆమె తన మానసికమైన అలసటను, విసుగును, హింసను అనుభవించటంవల్ల భర్తీ చేసుకుంటుంది.

సుందరి కష్టాలు జయరామారావుకు ఇష్టమే. అతనికి సుందరి భావా లతో ప్రమేయం లేదు. ఆమె అతణ్ణి అనుసరించి చాలా దూరం ప్రయాణిం చింది.

వాళ్లు ఇదే జీవితాన్ని కొనసాగించటానికి ఈ విధానంలో ఉన్న ఆకర్షణే కారణం. భార్యాభర్తలుగా వాళ్ళు కోల్పోయిన సాన్నిహిత్యాన్ని, ఇతరుల సంపర్కంలో కొంత పొందగలుగుతున్నారు. ఈ పరస్పర సహకార పద్ధతి సహాయంతో వ్యక్తులనూ సంఘాన్నీ చాలా తెలివిగా మోసగించగలుగుతున్నా మనే భ్రమతో కూడిన సంతృప్తి కూడా వాళ్ళకు కలుగుతున్నది. తమ వలలో చిక్కుకున్నా, చిక్కుకోకపోయినా కొత్తవాళ్ళ చుట్టూ వల పన్నటంలో కూడా వాళ్లకు సంతృప్తి లభిస్తున్నది. వారు ఈ రకమైన జీవితాన్ని ఒక వ్యసనంగా మార్చుకున్నారు.

వారిలో మార్పురాదా? అన్నది ప్రశ్న. జీవితవిధానంలో మార్పు వచ్చినప్పుడు వారిలో మార్పు వచ్చే అవకాశం ఉన్నది. జీవిత విధానంలో మార్పురావాలంటే, కామం మీద కేంద్రీకృతమైన వారి దృష్టి, ప్రేమవైపు మళ్ళాలి. మరి ప్రేమవైపు వారి దృష్టి మళ్ళుతుందా? అన్న ప్రశ్నకు రచ యిత నవల పేరులోనే సమాధానం ఇచ్చాడు. వాళ్ళు "ప్రేమోపహతులు" అందువల్ల వారిలో మార్పు అసాధ్యం.

ఈ అసంపూర్ణ నవలలోని ఇతివృత్తం అపూర్వమైనది. స్వేచ్ఛా ప్రవృత్తి వేస్తున్న వెర్రితలలను ఖండించటానికి, ఆధునిక నాగరికత పేరుతో జరుగుతున్న ఆత్మవంచనను చిత్రించటానికి రచయిత ఎన్నుకున్న ఇతి

వృత్తం చాలా బలమైనది. ఈ నవలలో సుందరీ జయరామారావులు ప్రదర్శించిన "సంభాషణా చాతుర్యం" ప్రత్యేకంగా పేర్కొనదగింది. ఆ పాత్రల కృత్రిమ జీవితానికి అంతర్యానికి తగిన సంభాషణల్ని కల్పించటంలో రచయిత పూర్తిగా కృతకృత్యుడయ్యాడు. నిజానికి ఆ సంభాషణలే లేకపోతే ఆ పాత్రలకు కళాత్మక జీవితమే లేదు.

మనుష్యులు ఎంత చక్కగా నటించగలరో, ఎంత సిగ్గు లేకుండా ప్రవర్తించగలరో, దయాదాక్షిణ్యాలు లేకుండా అమాయకుల్ని ఎంతగా హింసించగలరో, 'నాగరికత' 'సంస్కారం' ముసుగులో ఎంత అనాగరకంగా, పైశాచికంగా ప్రవర్తించగలరో ఈ నవలలో చాలా నగ్నంగా చిత్రించాడు రచయిత.

ఈ నవలకు గోపీచంద్ రచించిన 'ఆత్మద్రోహులు'11 అన్న కథ ఆధారం.

## "ఆత్మద్రోహులు" కథా పరిచయం

రంగస్థల దర్శకుడు రవివర్మ, తన నాటకంలో నటించిన ఊర్మిళతో అనుబంధం పెంచుకుంటాడు. ఈ అనుబంధం అతనికే అవ్యక్తంగా ఉండటంవల్ల ఊర్మిళ తన కూతురువంటిదనుకుంటాడు. మరికొన్ని రోజులలోనే ఊర్మిళ, ఆమె భర్త తాండవకృష్ణ, పరస్పర సహకార పద్ధతిలో తమకిష్టమైన వారితో లైంగిక సంబంధాలు పెట్టుకుంటున్నారని రవివర్మ తెలుసుకుంటాడు. ఊర్మిళ తనతో కూడా లైంగిక సంబంధాన్నే కోరుకుంటున్నదని తెలుసుకొని, వాళ్లకు దూరం కావాలని ప్రయత్నిస్తూ ఉంటాడు. ఈ దశలో అతనికి తన నాటకంలో నటించటానికి వచ్చిన కళ్యాణకింకిణితో పరిచయం కలుగుతుంది. ఆమెపట్ల వాత్సల్యం కలుగుతుంది.

కళ్యాణకింకిణి ఊర్మిళా తాండవకృష్ణల ఇంటికి విందుకు వెళ్ళినప్పుడు వారి జీవిత విధానాన్నిచూసి అసహ్యించుకొంటుంది. తాండవకృష్ణ పన్నిన ఉచ్చును ఛేదించుకొని రవివర్మ దగ్గరకు వస్తుంది. వాళ్ళను పూర్తిగా మరిచిపొమ్మని రవివర్మకు సలహా చెప్పి వెళ్లిపోతుంది.

ఆమె వెళ్ళిపోయిన తర్వాత, రెండు సంవత్సరాలకు, రవివర్మ కళ్యాణకింకిణిని అత్యవసరంగా రమ్మంటూ టెలిగ్రామ్ ఇస్తాడు. ఆమె వచ్చే సరికి తన ఆస్తినంతా ఆమె పేరిటరాసి ఆత్మహత్య చేతుకుంటాడు. ఇదీకథ.

ఈ కథలోని కళ్యాణకింకిణిని, 'ప్రేమోపహతులు'లోని కళ్యాణిగా, ఊర్మిళా తాండవకృష్ణలను సుందరీ జయరామారావులుగా. ఊర్మిళతో లైంగిక సంబంధం ఉన్న కుర్షిద్‌ను సదానంద్‌గా రచయిత నవలలో ఊహిం చించాడు. కథలోని ముఖ్యమైన పాత్ర రవివర్మ నవలికలో లేకపోవటం గమనార్హం. 'ఆత్మద్రోహులు' కథ ప్రధానంగా కళ్యాణకింకిణీ రవివర్మల పరంగా నడుస్తుంది.

'ప్రేమోపహతులు' నవల ప్రధానంగా సుందరీ జయరామారావుల పరంగా నడుస్తుంది.

కథలోని రవివర్మవంటి పాత్రను నవలలో స్వీకరించకపోవటానికి కారణం. రచయిత ఇతివృత్తంలో ప్రధానమైన మార్పును ఉద్దేశించటమే.

భార్య, పిల్లలు లేకపోవటంవల్ల, వయస్సు పైబడటంవల్ల, తనను తండ్రిగా భావించే స్త్రీతో అనుబంధం కోరుకుంటున్నాననుకున్న రవివర్మకు, ఊర్మిళ మనస్తాపం కలిగించటం, కళ్యాణకింకిణిలో తన కూతురును చూసు కొనే ప్రయత్నంగా తన యావదాస్తిని ఆమె పేరిట రాసి, ఆత్మహత్య చేసు కోవటం 'ఆత్మద్రోహులు' కథలోని ప్రధానాంశాలు.

పరస్పర సహకారంతో ఇతరులతో లైంగిక సంబంధాలు పెట్టుకొనే సుందరీ జయరామారావు దంపతులకు అమాయకురాలు, సాంప్రదాయిక భావాలున్న కళ్యాణి తారసపడటాన్నీ, నాగరికులుగా, ఆధునికులుగా కని పించే ఆ దంపతుల నికృష్ట పైశాచిక జీవితాన్నీ ప్రధానంగా చిత్రించేది 'ప్రేమోపహతులు'.

'ఆత్మద్రోహులు' కథలోని కళ్యాణకింకిణి, లోకజ్ఞానంగల యువతే కాకుండా, ఒకరి రక్షణ అవసరం లేకుండా జీవించగలిగే శక్తియుక్తులు

కలిగిన స్త్రీ కూడా. అందువల్ల, ఆమె ఊర్మిళా తాండవకృష్ణల ఉచ్చులో చిక్కుకునే అవకాశం లేదు. అదీకాక వాళ్ళ సంగతి ముందుగానే చూచాయగా తెలిసినా, ధైర్యంతో వాళ్ల ఆహ్వానాన్ని ఆమోదించి వెళ్లింది. అందువల్ల ఆమెకు ఎదురయ్యే సమస్య పెద్దగా ఉండదు. ఈమెకు సమస్యను సృష్టించలేని ఊర్మిళా తాండవకృష్ణుల నికృష్ట జీవితాన్ని వివరంగా చిత్రించటంలో అర్థం లేదు.

అందువల్ల 'ప్రేమోపహతులు' నవలలో సుందరి జయరామారావుల జీవిత విధాన చిత్రణ ప్రాముఖ్యం వహించింది 'ఆత్మద్రోహులు' కథలోని కళ్యాణకింకిణి పట్టణ నాగరికత తెలిసిన యువతి కాని, కళ్యాణి పల్లెటూళ్లలో పుట్టిపెరిగిన సాంప్రదాయిక భావాలున్న యువతి కావటంవల్ల వైరుధ్యానికి, సంఘర్షణకూ అవకాశం లభించింది

'ప్రేమోపహతులు'లోని సుందరి జయరామారావులలో అపసామాన్య ప్రవర్తన లక్షణాలు కనిపించినట్లే, 'ఆత్మద్రోహులు' కథలోని రవివర్మలో కూడా కనిపిస్తాయి. రవివర్మది కొంత సంక్లిష్ట మనస్తత్వమనే చెప్పాలి. భార్య చనిపోయిన తర్వాత అతడు ఊర్మిళలో కూతురునూ, భార్యనూ చూసుకున్నాడు. ఇది 'ప్రక్షేపణ తంత్రం.' కూతురును చూసుకోవటం వరకూ బాగుంది. కాని, ఊర్మిళలో భార్యను కూడా చూసుకొనేసరికి అతని అంతరాత్మ ఎదురు తిరిగింది. ఊర్మిళ రవివర్మను తండ్రిగా కాక ప్రియునిగా భావించి తదనుగుణంగా ప్రవర్తించటంతో అతడు సంఘర్షణకు గురయ్యాడు. కళ్యాణకింకిణితో కూతురును చూసుకోవాలని ప్రయత్నం చేశాడు. కాని, అపరాధ భావం కారణంగా తనను తానే నమ్మలేకపోయాడు. ఈ విధంగా ఊర్మిళాతాండవకృష్ణలతోపాటు అతడూ కొంత వరకు ఆత్మద్రోహి కాక తప్పలేదు.

నవలలో రవివర్మ పాత్ర లేకపోవటంతో సుందరీ జయరామారావు పాత్రలతో రచయిత 'పుసోకిజం' 'శాడిజం' అనే అపసామాన్య ప్రవర్తన లక్షణాలను ప్రవేశపెట్టాడు ఈ లక్షణాలు ఊర్మిళా తాండవకృష్ణలలో లేనివి కావటంవల్లా కళ్యాణకింకిణికి భిన్నంగా కళ్యాణి లోకజ్ఞానం లేని

వివాహిత స్త్రీ కావటంవల్లా, రచయిత తన దృష్టిని ఒక నిరాశాజీవి మీద కాక, నికృష్టజీవుల మీద కేంద్రీకరించటంవల్లా వైవిధ్యాన్ని సాధించారు. నవలలోని పాత్రల సంభాషణలు ఉన్నత స్థాయికి చెందినవి కావటంవల్ల పాత్ర చిత్రణలో, వాతావరణ నిర్మాణంలో చక్కని భూమికను వహించాయి.

ఇక, ఈ నవలను రచయిత ఏ విధంగా ముగించి ఉండేవాడన్న అంశం పరిశీలించవలసి ఉన్నది.

'ప్రేమోపహతులు' అసంపూర్ణ నవలను శ్రీమతి లతగారు 'ఇది తులసివనం'12 అనే తమ నవలలో పూర్తి చేయటానికి ప్రయత్నించారు. ఆ ప్రయత్నాన్ని గూర్చి ఇక్కడే ప్రస్తావించటం సమంజసంగా ఉంటుంది.

'ఇది తులసివనం' నవలకు రాసిన ఉపోద్ఘాతం 'ఒక మాట'లో

"నేను గోపీచంద్‌గారూ 'గోపి' హోటల్లో కూర్చొని కాఫీ త్రాగుతూ, ఒక అమ్మాయి చెప్పిన తమాషా కథ విన్నాం.

''ఏమ్మా ఈ కథ వ్రాస్తావా ?'' అన్నారాయన.

''మీరు వ్రాయండి" అన్నాను నేను.

కాని, ఆ కథ పూర్తి చేయకుండానే చనిపోయినారు గోపీచంద్‌గారు–ఇపుడు అదే కథని పూర్తి చేశాను____" అన్నారు, లతగారు.

అయితే, 'ప్రేమోపహతులు' ఆగిపోయిన చోటునుంచి కాక రచయిత్రి మళ్ళీ మొదటినుంచి నవలను రచించారు.

కాని, పాత్రల పేర్లను, కథా స్థలాన్ని మార్చటం జరిగింది. మూలంలోని కళ్యాణి హైమవతిగా; సుందరి అహల్యగా; జయరామారావు వినాయకరావుగా; సదానంద్ మనోహరుగా; విశ్వేశ్వరరావు రామకృష్ణగా 'ఇది తులసివనం'లో రూపొందారు. మూలంలో కళ్యాణి నూజివీడు నుండి హైద్రాబాద్‌లోని జయరామారావు దంపతుల వద్దకు వస్తే, ఇందులో హైమవతి హైదరాబాదు నుండి విజయవాడలోని వినాయకరావు దంపతుల దగ్గరకు

వస్తుంది. ఈ విధంగా మూలంలో కథాస్థలంగా ఉన్న హైద్రాబాదుకు బదులుగా, ఈ నవలలో విజయవాడను కథాస్థలంగా స్వీకరించటం జరిగింది.

పాత్రల స్వభావాల్లో గాని, ప్రవర్తనలో గాని ఏమీ తేడా లేదు. మూలంలోని సన్నివేశాలే ఈ నవలలోనూ చిన్న చిన్న మార్పులతో ఉన్నాయి.

"ప్రేమోపహతులు" ఆగిపోయిన దగ్గర నుండి లతగారు రచించిన కథా భాగం సంక్షిప్తంగా ఈ కింది విధంగా ఉన్నది.

'ఇది 'తులసివనం'లో హైమవతి (మూలంలో కళ్యాణి) తాను అదివరకు తీసుకున్న నిర్ణయం ప్రకారం, తెల్లవారగానే తన భర్త అదివరకే అద్దెకు కుదిర్చిన ఇంట్లోకి వెళ్ళదలచుకున్నట్లుగా వినాయకరావు దంపతులకు తెలియజేస్తుంది. వినాయకరావు ప్రోత్సాహంతో అహల్య కాఫీలో యస్.యస్. మాత్రలు కలిపి హైమకు ఇస్తుంది. ఆ మందు ప్రభావంతో ఆమె తాను చెప్పినట్లు వింటుందని వినాయకరావు భావిస్తాడు. కాని, ఆ ఇంట్లోనుంచి వెళ్ళిపోవాలనే దృఢ నిశ్చయంతో ఉన్న హైమ సగం మత్తులోనే వీధిలోకి వచ్చేసి రిక్షాలో మనాతు పుస్తకాల షాపుకు పోతుంది. పరిస్థితి కొంతలో కొంత అర్థం చేసుకున్న మనారు, ఆమెను తన ఇంటికి తీసుకువెళ్ళి తన భార్య అరుంధతికి అప్పగిస్తాడు. మత్తులోని ప్రేలాపనలను బట్టి మనారు భార్య అరుంధతికి పరిస్థితిని పూర్తిగా అర్థం చేసుకొంటుంది. సాంప్రదాయిక భావాలతోపాటుగా ఆధునిక జీవితంలో పరిచయం ఉన్న అరుంధతికి, విద్యావంతురాలు, సంస్కారవంతురాలు అయిన అరుంధతికి, అహల్యా వినాయకరావుల జీవితం పరమ నికృష్టమైనదిగా తోచటంతో, వాళ్ళను పూర్తిగా అసహ్యించుకున్నది.

హైమ రిక్షాలో వెళ్ళిన తర్వాత కొంతసేపటికి అహల్య మనారు పుస్తకాల షాపుకు ఫోన్ చేసి, హైమ వాళ్ళింట్లో ఉన్న విషయం తెలుసుకున్నది. అదే విషయం వినాయకరావుతో చెప్పింది. మనారింటికి వెళ్ళి హైమను తీసుకు రమ్మని ఆదేశించిన భర్తతో తనకు అదివరకే, అరుంధతికి జరిగిన పోట్లాటను గూర్చి చెప్పి, తాను మనారింటికి వెళ్ళలేనని చెప్పింది అరుంధతి పాతివ్రత్యం గూర్చి తెలిసిన తర్వాత ఆమెపట్ల కూడా ఆకర్షణ కలిగి వెంటనే మనారింటికి పోతాడు, వినాయకరావు ఉద్దేశం తెలుసుకున్న అరుంధతి, అతణ్ణి

అవమానిస్తుంది. తన మీదపడటానికి యత్నించినప్పుడు, ఆమె తన మానవా తీత శక్తితో అతణి వీథిలోకి విసరేస్తుంది.

''ఇక్కడ మహానదులు ప్రవహిస్తున్నాయ్ ఇక్కడి గాలిలో గుడి గంటలు వినిపిస్తున్నాయ్.... ఇక్కడి మట్టిలో తులసివనాలు పెరుగుతున్నాయ్! ఇది తులసివనమండీ.... తులసివనం,'' అంటుంది అరుంధతి భర్తతో.

ఇది నవల ప్రయోజనాన్ని చాటి చెప్పే ముగింపు వాక్యాలు, మనారూ, అతని భార్య అరుంధతీ హైమను కాపాడటం ముగింపుకోసం చేసిన ముఖ్యమైన కల్పన.

ఎస్.ఎస్ మాత్రలను కాఫీలో కలిపి హైమకు ఇవ్వటం, ఆమె మత్తులో రిక్షా ఎక్కి అదివరకు తాను చూడని మనారు షాపుకు వెళ్ళటం, మనారులో పూర్తి మార్పురావటం, తన మీదకు రాబోయిన వినాయకరావును అరుంధతి వీథిలోకి విసిరేయటం-వంటి సంఘటనలు అసాధారణమైనవీ, అసహజమైనవీ.

నిజానికి మూలంలో కళ్యాణికి సదానంద్ మీద ఏ మాత్రం సదుద్దేశం కలగలేదు.

'....అతనూ ఈ రాశిలోవాడే' అనే అభిప్రాయానికి వస్తుంది. సదానంద్ భార్యపట్ల కళ్యాణికి గౌరవభావం ఉన్నమాట నిజమే. తనపట్ల ఆమెకు తప్పకుండా సానుభూతి కలుగుతుందని భావిస్తుంది. కాని 'ఆమె మాత్రం చేయగలిగిందేముంది?' అనుకుంటుంది కళ్యాణి తనను తానే రక్షించుకో గలుగుతుందని రచయిత సూచించడనటానికి ఈ రెండు అంశాలు సాక్ష్యాలు.

మూలంలో కళ్యాణికి వాళ్లింట్లో రాత్రి గడపటమే పెద్ద సమస్య జయరామరావు కళ్యాణి ఇష్టపడితేనే లైంగిక సంబంధాన్ని కోరుతున్నాడు. ఆమెకు తన పట్ల ఇష్టం కలగటానికి అన్ని ప్రయత్నాలు చేశాడు. కాని. ఆమెను బలవంతంగా అనుభవించాలని మాత్రం కోరుకోలేదు.

"రేపు నువ్వు ఆమెను ఒప్పించావా, ఒప్పించావు. లేకపోతే నీ సంగతి తేలుస్తాను" అంటాడు, సుందరితో ఆ రాత్రికి ప్రమాదంలేదని, ఈ మాటతో

కళ్యాణికి స్పష్టమయింది. ఆ మరునాడు. ఆమెను వశపరచుకోవటానికి వాళ్లు పూర్తి శక్తియుక్తులతో ప్రయత్నిస్తారు, కనుక అక్కడ ఉండటం ప్రమాద కరం. అందుకే,

'ఏమైనా సరే తెల్లవారి ఆ యిల్లు విడిచిపెట్టిపోవాలని నిశ్చయించు కుంది.'

'...అందుకు జయరామారావుగారు సుందరీ అంగీకరించకపోవచ్చు. వాళ్ళ అంగీకారంతో తనకేం పని? కాకపోతే వాళ్ళు తన భర్త వచ్చిన తరు వాత తన మీదలేనిపోని కొండాలు చెప్పే ప్రమాదం వుంది. అప్పుడు జరిగిం దంతా పూసగుచ్చినట్లు తను చెపుతుంది. తన మాట నమ్మక వీళ్ల మాట నమ్మ రాదా తన భర్త? అని కూడా అనుకుంటుంది.

కళ్యాణిది తిరుగులేని నిర్ణయమని, సుందరీ జయరామారావులు సృష్టించబోయే సమస్యల్ని ఎదుర్కొనే ధైర్యాన్ని కూడదీసుకున్నదని స్పష్టంగా తెలుస్తున్నది. ఆ రాత్రి సుందరీ జయరామారావుల సంభాషణ మెలకువతో విన్న తర్వాత కూడా ఆమె వాళ్ళ ఇంట్లో ఉండటంలో అర్థం లేదు

అద్దెఇంటిని కనుక్కోవటంలో ఆమె వాళ్ళ మీద ఆధారపడనవసరం లేదు. కళ్యాణి ప్రయాణమై వస్తున్నప్పుడే, భర్త ఆమెతో.

''నువ్వు వెళ్లి ఇల్లూగిల్లూ శుభ్రం చేయించి ఉంచు. నేను పనిపూర్తి చేసుకొని వస్తాను." అని చెప్పాడు. అందువల్ల, ఆ ఇంటి వివరాలను భర్త ఆమెకు పూర్తిగా తెలియజేసే పంపాడన్నది నిర్వివాదం. అసలు వాళ్లిద్దరు కలిసి రావలసిన వారే, చివరి దశలో ఆయనకు ముఖ్యమైన పని తగలటంతో కళ్యాణి ఒంటరిగా హైదరాబాదు రావలసివచ్చింది.

క్లిష్టపరితుల్లో గోపీచంద్ స్త్రీ పాత్రలు ధైర్యంతో ప్రవర్తిస్తాయి తప్ప నిరాశకు లోనుకావు. ఇందుకు 'గడియపడని తలుపులు' నవలికలో శ్రీనివాస రావు భార్య, 'పిల్లతెమ్మెర'లో శచీంద్రుని భార్య, 'అసమర్థుని జీవయాత్ర'లో ఇందిర పాత్రల చిత్రణ నిదర్శనం.

జయరామారావు దంపతులు మారే అవకాశం అంతగా లేదు. నవల పేరులోనే కాకుండా, నవలకు మూలమైన 'ఆత్మద్రోహులు' కథ పేరులో కూడా అలాంటి సూచనే ఉంది. అందువల్ల నవలా రచనలోని ఉద్దేశం చాలా వరకు నెరవేరింది. అంటే, 'ప్రేమోపహతులు' చివరి దశలోనే అసంపూర్ణంగా మిగిలిపోయింది.

చాలావరకు తన నవలల్లో కొన్ని విశ్వాసాలను ప్రతిపాదించటానికి, రచయిత ఒక పాత్రను సృష్టిస్తూ వచ్చాడు. 'పరివర్తనం'లో కిష్టుడు, 'అసమర్థుని జీవయాత్ర'లో రామయ్య తాత, 'మెరుపుల మరకలు'లో కమలాకరం, 'యమపాశం'లో గోపీకృష్ణ ఇలాంటి వారే. 'ప్రేమోపహతులు'కు మూలమైన 'ఆత్మద్రోహులు'లోని కళ్యాణకింకిణి రచయిత విశ్వాసాలను కూడా వ్యక్తంచేసే పాత్రగా కనిపిస్తుంది. 'ప్రేమోపహతులు'లో అట్లాంటి పాత్ర కనిపించదు. ఒకవేళ సుందరీ జయరామారావుల జీవిత విధానం నికృష్టమైనదని ఇంకా స్పష్టంగా చెప్పటానికి ఒక పాత్రను ప్రవేశపెట్టాలని రచయిత భావించి ఉంటే, ఆ పాత్ర కళ్యాణి భర్త విశ్వేశ్వరరావు అయి వుండే అవకాశం లేకపోలేదు.

# 3. యమపాశం

'యమపాశం'[13] నవలలోని కథానాయకుడు నారాయణరావు గ్రామీణ మధ్యతరగతికి చెందినవాడు. పట్టణంలోని కాలేజీలో చదువుకున్నాడు. పెళ్ళి తర్వాత పట్టణంలోనే ఉద్యోగం దొరకటంతో అక్కడే స్థిరపడిపోయాడు.

తన మనసును దేనిలో నిమగ్నంచేస్తే దానిలో ప్రావీణ్యం సంపాదించే తత్వం కలవాడు నారాయణరావు. విద్యార్థిదశలో కళాశాల సాంస్కృతిక కార్యక్రమాల్లో కూడా పాల్గొని పేరు తెచ్చుకున్నాడు. చివరకు తాను స్థిర పడ్డ ప్రభుత్వ గుమాస్తా ఉద్యోగాన్ని కూడా ఎంతో దీక్షతో, కార్యదక్షతతో నిర్వహిస్తున్నాడు. అతనిలో కనిపించే నిజాయితీకి, అమాయకత్వానికి కొంతవరకు కారణమైన గ్రామీణ మనస్తత్వమే, జీవితంలో ఎదురైన సమ స్యల్ని పరిష్కరించుకోవటానికి అవరోధమైంది.

అతడు చేస్తున్న గుమాస్తా ఉద్యోగం మరీ యాంత్రికమైంది. అతనికి మనుష్యులతో కాకుండా ఫైళ్ళతోనే సంబంధం. మనుష్యులతో సంబంధం వున్నా, ఎదుటివాడు మెత్తగా వుంటే పులి అవతారాన్ని, గట్టిగా వుంటే పిల్లి అవతారాన్ని ధరించే సూపరింటెండెంట్ వంటి వాళ్ళతోనూ, బతుకనేర్చిన తనంతో అధికారుల ప్రాపకం సంపాదించి పైకి వచ్చే శ్రీరాములు వంటి వాళ్ళతోనూ సంబంధం.

జీవితంలో కొత్తదనం లేకపోవటంవల్ల ఏర్పడిన అసంతృప్తితో అత డెంత తీవ్రంగా బాధపడుతున్నాడో శారద అనే అవివాహిత యువతి పాత్రను ప్రవేశపెట్టటంద్వారా రచయిత స్పష్టంచేశాడు. ఆమెకు సలహాలు చెప్ప టంతో మొదలైన పరిచయం, ఆమె తెచ్చుకునే టిఫిన్లు చొరవతో తినటం వరకు ఎదుగుతుంది. తమ పరిచయాన్ని ఇతరులు అపార్థం చేసుకుంటే రానాయణరావుకు లోలోన సంతోషమే కలిగిందని చెప్పొచ్చు. తాను శారదతో

పాటు టిఫిన్లు తింటున్న సంగతి భార్యతో చెప్పకుండా రహస్యంగా ఉంచటం లోనూ, తర్వాత తనను నిలదీసి ఈ విషయాన్ని భార్య అడిగినప్పుడు కూడా ఒప్పుకోకపోవటంలోనూ కనిపించే దాపరికం వెనుక అపరాధభావం కని పిస్తుంది. శారదతో కలిసి సినిమా చూగాలన్న నారాయణరావు కోరిక లైంగిక భావ ప్రపంచానికి చెందిందే. శారద ఇంటికి శ్రద్ధగా డ్రెస్ చేసుకొని పోవ టంలో, ఆమెతోపాటు ఒక యువకుడు వుండటంతో ఆశాభంగం చెందటంలో నారాయణరావు అంతర్యం స్పష్టంగా కనిపిస్తుంది. ఇంతకాలం అతనిలోని తీరని కోరికలు శారదను ఆశ్రయంగా చేసుకొని పైకి పాకే అసమర్థ ప్రయ త్నం చేశాయి.

కొంతకాలంక్రితం అతని బావమరిది గోపీకృష్ణ ద్వారా నారాయిణరావు కొన్ని కొత్త విషయాలు తెలుసుకున్నాడు. సంఘంలో అవినీతిపరురాలుగా పేరున్న ఒక స్త్రీతో గోపీకృష్ణ తమ సంస్థ వ్యాపారం గూర్చి చర్చించటం, ఆమెతో విస్కీ తాగటం నారాయణరావును ఆశ్చర్యపరుస్తుంది ఈ సంద ర్భంలో గోపీకృష్ణ అనుభవంలోకి వచ్చే కొత్త అనుభవాలపట్ల అనుకూల దృష్టి సానుభూతి అవసరమని నారాయణరావుకు సూచిస్తాడు. అంతేకాదు, సమకాలీన సాంఘిక జీవితం తన పరిధిని పెంచుకుంటున్నప్పుడు, మనిషి గిరిగీసుకొని జీవించటమంటే, జీవితంలో పాల్గొనకపోవటమేనని గోపీకృష్ణ భావం, కాని, గోపీకృష్ణ వాదం నారాయణరావుకు నచ్చలేదు. ఏ సంప్రదాయ వాదీ కొత్త భావాలను వెంటనే ఆమోదించడు.

నారాయణరావు ధర్మపత్ని రాజమ్మ. వివాహానికి ముందు రాజకుమారి! ధనిక కుటుంబానికి చెందింది, మొదటిసారి ఆమె నారాయణరావును 'ఒథెల్లో' వేషంలో చూసి ప్రేమించింది తల్లిదండ్రులు వద్దంటున్నా వినకుండా అన్న సహాయంతో పెళ్ళి చేసుకుంది. నారాయణరావును 'వేషం'లో చూసి ఆమె ప్రేమించటం మంచి వ్యంగ్యం. అసలురూపంలో మొదటిసారి చూసి వుంటే ప్రేమించి వుండేదికాదని రచయిత ఉద్దేశం.

ఇద్దరు ముగ్గురుపుట్టే వరకు జీవితం బాగానే గడిచింది. పట్టణంలో పుట్టి పెరిగిన స్త్రీ కావటంవల్ల, భవిష్యత్తులో రానున్న ప్రమాదాన్ని ముందు గానే పసిగట్టి, కుటుంబనియంత్రణ శస్త్రచికిత్స చేయించుకొమ్మని తన

భర్తకు సలహా ఇచ్చింది కూడా. కాని, సాంప్రదాయిక భావాల కారణంగా గ్రామీణ మన స్తత్వం కారణంగా నారాయణరావు ఆమె సలహాను ఆమోదించ లేదు.

జీవితంలో ఏర్పడిన చిక్కులు రాజమ్మకు చాలా బాధాకరంగా ఉన్నాయి. తీరనికోరికలు ఆమెను తీవ్రమైన అసంతృప్తికి గురిచేశాయి. తన ఇచ్ఛకు వ్యతిరేకంగా ఒకరి తర్వాత ఒకరుగా పుట్టుకొస్తున్న సంతానంమీద కోపం, తన మీద చికాకు, భర్తపట్ల అసహనం కలగసాగాయి.

నవల ప్రారంభంలో ఆకలితో ఆఫీసు నుంచి వచ్చిన భర్తకు రాజమ్మ భోజనం వడ్డించదు. ఆమె చాలా కోపంగా వున్నదనటానికిది సూచన ఆమె అతని గదిలోకి వెళ్ళి—

"అటు చావటానికీ యిటు బ్రతకటానికీ వీల్లేకుండా అయింది నా బ్రతుకు" అన్నది. ఆమె ఒక ప్రత్యేక సందర్భాన్ని సూచించటానికి యి తకు ముందు నాలుగైదుసార్లు ఈ మాటలను వాడి ఉన్నది.

ఆ సందర్భమే నెల తప్పటం !

రాజమ్మ కడుపులోని శిశువుతోపాటే నవలలోని ముఖ్యమైన సమస్య కూడా ఇప్పుడు జీవం పోసుకుంటుంది. నవలా ప్రారంభంలో రచయిత అనుస రించిన పద్ధతి అర్థవంతంగా వుంది నారాయణరావు తాను వచ్చేటప్పటికి పిల్లలు ఇంట్లో లేనందుకు బాధపడుతూ, పిల్లలపట్ల శ్రద్ధ కనబరుస్తాడు. కాని భార్య మాత్రం పూర్తి నిర్లక్ష్యాన్నే ప్రదర్శిస్తుంది. తాను గర్భంతో ఉన్నట్లు ఆమె తెలుసుకోవటమే దీనికి కారణం. అందులో ఎనిమిదవ శిశువు తన గర్భంలో వూపిరిపోసుకుంటుండటంతో ఆమె మరీ నిరాశా నిస్పృహలకు లోనై వుంది.

గర్భస్థ శిశువు ఇద్దరికీ పెనుభూతమైంది. తన భర్తను నిందించటంవల్ల సమస్య పరిష్కారం కాదని రాజమ్మ, సమస్య పట్ల తన వైఖరి మార్చుకోక తప్పదని నారాయణరావు నిర్ణయానికి రావటంతో ఎవరికి వారే గర్భ సావం కోసం ప్రయత్నాలు ప్రారంభించారు.

అంతవరకు జీవితం చేతిలో కీలుబొమ్మలుగా నడుచుకున్నవారు, ఒక్కసారిగా మేల్కొని, జీవిత సమస్యతో పోరాటానికి ఉద్యుక్తులుకావటం నిజంగా అపురూపమైన విషయం.

తెల్లవారగానే, నారాయణరావు అప్పు వేటకు బయలుదేరాడు. నారాయణరావుకు డబ్బు ఇవ్వగలిగే స్థితిలో వున్న మిత్రులు ముగ్గురు. కాని, ఆ ముగ్గురి నుంచీ ఆయన అప్పు సాధించలేకపోతాడు. ఈ ఘట్టాన్ని రచయిత విపులంగా రచించాడు. నారాయణరావు ఆశానిరాశలు చక్కగా ప్రతిబింబించిన సన్నివేశాలు చాలా వున్నాయి. ఈ సమస్యను నారాయణరావు తన జీవన్మరణ సమస్యగా భావించాడన్న భావాన్ని రచయిత పాఠకుడిలో కలిగించగలిగాడు. వందరూపాయలను కూడా స్నేహితుల నుండి అప్పుగా పొందలేకపోవటం దయనీయమే. కాని, అంతకంటే దయనీయం అతడు ఏకాకిగా మిగిలిపోవటం.

ఆ రోజు రాత్రి ఇంటికి వెళ్ళగానే తన భార్య మధ్యాహ్నమే ప్రైవేట్ నర్సింగ్ హోంలో చేరిందని కూతురు చెప్పింది.

నారాయణరావు కంటే రాజమ్మే ఎక్కువ ధైర్యాన్ని ప్రదర్శించింది. ఆమె ఉదయానికే ఒక నిర్ణయానికి వచ్చేసింది. అందుకే ఉదయం భర్తతో గాని, పిల్లలతోగాని పోట్లాటకు దిగలేదు. అంతేకాదు ఆమె భర్తతో చాలా నెమ్మదిగా మాట్లాడింది. ఈ మార్పుకు కారణం, ఆమె ఆలోచనా ధోరణిలో వచ్చిన మార్పే. అంతేకాదు, ఆమె తన దృష్టిని జీవితంలో తటస్థించిన ఆపదను తొలగించుకోవటం మీదే పూర్తిగా కేంద్రీకరించింది.

ఈ దశలో నారాయణరావులో వచ్చిన పరిణామం కూడా గమనార్హమే. అతడు అప్పువేటలో మొదట లాయరుమిత్రుణ్ణి కలుసుకొని అతని వద్ద మరో కొత్త వ్యక్తి ఉండటంతో అప్పు అడగలేక ''పని చూచుకొని వెళ్తూవెళ్తూ చూచిపోదామని వచ్చాను'' అని అబద్ధమాడి బయటపడతాడు. అలా అబద్ధమాడినందుకు తనమీద తనకే 'అసహ్యం' కలుగుతుంది. నిజానికి ఆ అసహ్యానికి కారణం తన ప్రవర్తనకాదు. అలా ప్రవర్తించటానికి దారి తీసిన పరిస్థితే. ఈ సందర్భంలో సత్యాసత్యాలకు సంబంధించిన అంశాలను

తనలో తాను చర్చించుకుంటూ, 'జీవితంలోని ఏదో ఒక అంశాన్ని తోసి పుచ్చినవాడి కంటే, అన్ని అంశాలనూ అనుభవంలోకి తెచ్చుకున్నవాడే సుఖ పడుతున్నాడు' అని అనుకున్న మాటల్లో గోపీకృష్ణ భావాలు తొంగిచూస్తు న్నాయి ఈ రకంగా మారుతున్న జీవితపు విలువల్ని సానుభూతితో అర్థం చేసుకునే మనఃస్థితి అతనిలో ఏర్పడిందనటానికి ఇది నిదర్శనం.

ఈ ధైర్యం ఆమెలోని నూతన భావచైతన్యంలో ఒక భాగం. ఆమె తన జీవితాన్ని సమీక్షించుకున్నది. భర్త హృదయాన్ని తన ప్రవర్తనతో గాయపరిచినందుకు క్షమాపణకోరుకోవటం, తన సంతానంపట్ల ప్రేమాను రాగాలను ప్రకటించటం, ఆమెలో పునరుజ్జీవించిన సంస్కారానికి, పశ్చాత్తా పానికి తిరుగులేని సాక్ష్యాలు.

''నడకతప్పి మనం బాధపడుతున్నాంగాని నిజానికి బాధపడవలసిన అవసరం ఈనాడు నాకేమీ కనపడటం లేదు. మనకంటే బీదవాళ్ళూ దుర దృష్టవంతులూ ఎంత మంది లేరు.''

ఈ మాటలు లోచూపుతో కూడినవి. తమ శక్తిసామర్థ్యాలను పూర్తిగా వినియోగంలోకి తీసుకువచ్చి, ఇదివరకటి జీవితం కంటే సుఖప్రదమైన జీవితం గడపటానికి ఆమె ఆలోచనకు పూనుకున్నది.

ఇదివరకు తమకంటే ఆర్థికంగా పై స్థాయిలో ఉన్నవారి జీవితంతో తమ జీవితాన్ని పోల్చుకున్నందువల్లే అసంతృప్తి కలిగిందనే సదవగాహన ఆమెకు కలిగింది. అందుకే ఆమె మనస్సు నిర్మలంగా వుంది. అతడుకూడా ఆ అనుభవాన్ని జీవితంలో భాగంగా అర్థం చేసుకునే స్థితిలో ఉన్నాడు. ''మనం కాస్త పెరిగాం'' అంటూ అతడా మనఃస్థితిని వ్యాఖ్యానించి చెప్పాడు.

గర్భస్రావం జరగటానికిగాను వేడినీళ్ళస్నానం చేయించిన తర్వాత నర్స్ ఈవమ్మ ఇచ్చిన మద్యం సేవించిన మత్తులో తాను 'ఉపచేతన'లో ఇన్నాళ్ళూ దాచుకున్న జ్ఞాపకాలను కోరికలను కూతురిముందు రాజమ్మ వెల్లడి చేస్తుంది. ఇది స్వేచ్ఛాసంసర్గ (Free association)[14] పద్ధతిలో రోగి తాను అంతరంగపు పొరలలో దాచుకున్న భావాలను, అణచుకున్న

కోరికలను వ్యక్తం చేయటం వంటిది. దీన్ని ఆధారంగా చేసుకొని పాత్ర యొక్క మనోవిశ్లేషణ[15] చేయవచ్చు.

"తప్పనేదే లేదే అరుంధతీ! ఇక వుందేమిటి! నీకు నువ్వు, నాకు నేను. అంతే ఉందల్లా సుఖమే. దాని వెంటపడితే ఎవ్వరి బ్రతుకైనా హాయిగా వెళ్ళ మారిపోతుంది." అంటుంది కూతురితో.

తప్పనేదే లేదనుకోవటం, నైతికమైన కట్టుబాట్లను, ముఖ్యంగా వైవాహిక బంధాన్ని అతిక్రమించాలనుకోవటం. అట్లా అతిక్రమిస్తే సుఖం లభిస్తుందనుకోవటం రాజమ్మలో బలంగా కనిపిస్తుంది. ఆమెకోరే సౌఖ్యం లైంగికసౌఖ్యం ఎంత మాత్రం కాదు. నారాయణరావు 'ఓవర్ సెక్స్‌డ్' కావటంవల్ల, ఆమెకు లైంగిక అసంతృప్తి లేదు. అందువల్ల, ఆమె దృష్టి పూర్తిగా డబ్బును ఆశ్రయించి వున్న సౌఖ్యాల మీదా, సాంఘికమైన అంతస్తు మీదా ఉండేది. ఈ కోరిక ఆమెకు తల్లిదండ్రుల నుంచీ, పెళ్లికి ముందటి జీవితంనుంచీ వారసత్వంగా లభించింది. పెళ్లికి ముందటి జీవితం గూర్చే, పెళ్లి తర్వాత కలలు కనవలసి రావటం దారుణమైన వ్యంగ్యం. 'కట్టుబాట్ల'ను అతిక్రమించి వుంటే తాను సుఖపడివుండేదన్న ఊహకు ఆధారం కాలేజీలో తనతో చదువుకున్న విశ్వేశ్వరరావు. ఆమె అతణ్ణి ప్రేమించలేదు. కాని, ఆమె సరేనంటే అతడు పెళ్లి చేసుకునేవాడని రాజమ్మ నమ్మకం. విశ్వేశ్వరరావు నారాయణరావు లాగా గుమాస్తా అయివుంటే ఆమెకీ భావం పెరిగేది కాదు. కాని, విశ్వేశ్వరావు ఇంగ్లండులో పెద్ద ఉద్యోగం చేస్తున్నందు వల్ల అనుభవంలోని జీవితానికీ, భావనాజగత్తులోని జీవితానికీ మధ్యన వైరుధ్యం పెరిగిపోయింది. అందుకే, తన కూతురుతో.

"మీ నాన్న నేను వివాహం చేసుకోవటంలో అర్థం లేదు" అనికూడా అనగలిగింది.

ఇన్ని రోజులుగా ఉపచేతనలో అణచివేయబడ్డ కోరికలు, కోరికలు తీరకపోవటంవల్ల కలిగిన భావాలు ఈ దశలో బయల్వెడలటం రెక్కలు వచ్చిన పక్షులు ఎగిరిపోవటం వంటిది. ఆమెలో వచ్చిన మార్పు కారణంగా వీటికి విలువలేదు. మనసులో స్థానం లేదు. అందుకే అవి ఒక్కొక్కటిగా

నిష్క్రమిస్తున్నాయి. తర్వాత ఆమె మనను పూర్తిగా తేలికపడి కొత్త జీవితానికి స్వాగతం పలుకుతుంది.

ఈ 'మత్తు' సంధి దశగా కల్పించబడింది. గర్భస్రావంతో పిండం పతనమైనట్లుగా, పాత జీవితం నశించి సరికొత్త జీవితం ప్రారంభమవుతుందని సూచించాడు రచయిత.

ఈ విధంగా ఇది ఈ అసంపూర్ణ నవలలో చిట్టచివరి ముఖ్యసన్నివేశం. నర్సింగ్ హోమ్‌లో చేరిన తర్వాత జీవితంపట్ల ఆమెకు అస్పష్టంగా కలిగిన భావం. బలపడి స్పష్టమైన రూపంలో ప్రసన్నం కావటానికి అవకాశమేర్పడింది.

ఆ తర్వాత భార్య రెండు రోజులు ఇంట్లో లేకపోవటంతో గృహజీవితంలో ఏర్పడిన అవ్యవస్థను రచయిత చిత్రించాడు. సంసారజీవితంలో భార్యకున్న ప్రాముఖ్యాన్ని అవగాహన చేసుకోవటానికి, దైనందిన జీవిత సమస్యలకు సన్నిహితం కావటానికి ఈ వాతావరణం తోడ్పడింది.

ఈ నవలలో ఇంతవరకు పరిశీలింపబడిన ప్రధాన ఇతివృత్తంతో పాటుగా ప్రభుత్వ కార్యాలయాల పనితీరును విమర్శిస్తూ ప్రభుత్వోద్యోగుల మనస్తత్వాన్ని కూడా రచయిత చిత్రించాడు, పౌరుని జీవితంపైన అధికారంలో ఉన్న ప్రభుత్వ విధానాల ప్రభావం పరోక్షంగానో, ప్రత్యక్షంగానో ఉంటుంది. ఆ ప్రభుత్వ యంత్రాంగంలో ఒక భాగమైన ప్రభుత్వోద్యోగుల జీవితం మీద కూడా ఆ ప్రభావం తప్పనిసరిగా ఉంటుంది.

కాలేజీ జీవితంలో చైతన్యాన్ని ప్రదర్శించిన నారాయణరావు, ప్రభుత్వోద్యోగంలో చేరిన తర్వాత ఎదుగూబొదుగూలేని జీవితానికి అలవాటు పడటంవల్ల, గిడసబారిపోయాడు. తన పైఅధికారులకు భయపడే తత్వం అలవాటు కావటంతో అతనిలో పిరికితనం ప్రవేశించి, భార్యావిధేయతకు దారితీసింది. కార్యాలయంలో ఒక అధికారి అధికారానికి లోబడి పనిచేసే ఉద్యోగి ఇంట్లో భార్య మీద పిల్లల మీద అధికారం చేయటం ద్వారా ఆ విధేయతాభావాన్ని పరిహారాత్మకంగా భర్తీ చేసుకోవచ్చు. లేదా, విధేయతకు పూర్తిగా అలవాటుపడి, అందులోనే తృప్తిని అనుభవిస్తున్న వ్యక్తి ఇంట్లోనూ

విధేయుడుగానే ఉండిపోవచ్చు. నారాయణరావు రెండో రకానికి చెందినవాడు. తన ఉద్యోగదక్షతవల్ల, నిజాయితీవల్ల పై అధికారుల మెప్పుపొంది పదోన్నతిని పొందాలనే ఆశ నారాయణరావును విధేయతకు అలవాటు చేసింది.

ఈ విధంగా నారాయణరావు వ్యక్తిత్వాన్ని రూపొందించటంలో ఉద్యోగ జీవితానికి ఉన్న ప్రాముఖ్యాన్ని రచయిత స్పష్టం చేశాడు. ప్రభుత్వ యంత్రాంగాన్ని 'పరమపదసోపానం'గా చమత్కరించి, ఉద్యోగి పైకి ఎక్కటం కష్టమని, 'దిగటానికేముంది ? భూమి తగలేవరకూ జర్రున జారటమే' అంటాడు రచయిత.

శారద మేనమామ మురళీమోహన్ ప్రభుత్వోద్యోగం కబంధుని వంటిది అంటూ మొదలుపెట్టి అది ఉద్యోగిని ఎలా వ్యక్తిత్వం లేకుండా చేస్తుందో, ఉద్యోగులు ఎలా తమమీదికి నేరం వాలకుండా ఫైళ్ళను తెలివిగా నిర్వహిస్తూ, ప్రజలకు ముఖ్యంగా అమాయకులకు నష్టం కలిగిస్తుంటారో, 'కాన్ఫిడెన్షియల్ రిపోర్టులు' ఎలాతమ అసలు ప్రయోజనాన్ని కోల్పోయాయో వివరంగా నారాయణరావుతో చర్చించాడు. ఈ చర్చ నవలలో పూర్తిగా అతికినట్లుగా ఉండి, శారద వ్యక్తిత్వాన్ని, ఆమె కాబోయే భర్త మురళీమోహన్ వ్యక్తిత్వాన్ని, వెల్లడించేదిగా వుంది. శారద వంట పూర్తిచేసి వాళ్ళను భోజనాలకు పిలిచేవరకు కొనసాగటంవల్ల కాలం గడవటానికి మురళీమోహన్ తమ అతిథి అయిన నారాయణరావుతో అతనికి తెలిసిన విషయాన్ని చర్చించినట్లు కనిపిస్తుండటంవల్ల కూడా రచయిత చక్కగా ఔచిత్యాన్ని పోషించాడు.

ఉద్యోగుల సాధకబాధకాలను చిత్రించటానికిగాను రచయిత రాష్ట్రంలోనే అతిపెద్ద కార్యాలయం అయిన సెక్రటేరియట్‌ను ఎన్నుకున్నాడు. ప్రభుత్వ యంత్రాంగం మాత్రం నిజంగా ప్రజలకు మేలుచేయటంలేదని గోపీచంద్ చాలా స్పష్టంగా వెల్లడించాడు ప్యూన్‌స్థాయి ఉద్యోగి దగ్గరనుంచి సెక్రెటరీస్థాయి ఉద్యోగివరకు అన్ని అంతస్తులను స్పృశించి, వారిని కేరికేచర్లుగా ప్రదర్శించగలిగాడు. గోపీచంద్ వ్యంగ్యశక్తి పదునుదేరిన ఘట్టాలలో ఇదీ ఒకటి అని చెప్పక తప్పదు.

అయితే, కొన్ని సందర్భాలలో సంక్షిప్తతను పాటించి వుండవలసింది. ఉదాహరణకు—పెద్దయ్యగారి ఫ్యాన్ గూర్చి మూడు పుటలు వర్ణించటం, శ్రీరాములు అనే బతకనేర్చిన గుమాస్తా గూర్చి ఎనిమిది పుటలు రాయటం, అసిస్టెంట్ సెక్రెటరీలు పాతకార్లు కొని అవస్థలు కొనితెచ్చుకునే ప్రహసనాన్ని మూడు పుటలు వర్ణించటం, కాస్త ఎక్కువే అనిపిస్తుంది అలాగే, లక్ష్మణకోటిశాస్త్రి అనే నారాయణరావు మిత్రుడు పనిచేసే 'పౌర సంబంధ ప్రచారకశాఖ'ను 'అనువాదాలను ఉత్పత్తిచేసే ఫ్యాక్టరీ'గా వర్ణించి ఆవృత్తాంతాన్ని రచయిత తొమ్మిది పుటలు వర్ణించాడు (నిజానికి ప్రభుత్వ అనువాద శాఖ ఒకటి వేరే వుంది). గోపీచంద్ పౌరసంబంధాలశాఖలో సంయుక్త నియంత్రణాధికారిగా గడించిన అనుభవంతో పై విషయాలు వర్ణించాడు. అయితే, రచయిత కొంత సంయమనం పాటించివుండివుంటే ఉద్యోగ జీవిత వాతావరణం నవలలో కళాత్మకంగా ఇమిడి వుండేది. అయితే లక్ష్మణకోటి శాస్త్రి డబ్బు ఇవ్వకపోవటంతో నిరాశానిస్పృహలకు లోనైన నారాయణ రావు ఇంటికి తిరిగి వస్తున్నప్పుడు మొక్కజొన్న కండెలను, వాటిని అమ్మే పల్లెటూరి స్త్రీని, ఆ స్త్రీ భర్తను వర్ణించటం ఉచితంగా వుంది. అతనికి డబ్బు లేకుండా ఇంటికి వెళ్ళాలనిపించటం లేదు. అతని ఆలోచనాధోరణి పలాయన తత్వానికి దగ్గరగా ఉండటంతో అతడు వీలైనంత ఆలస్యంగా ఇల్లు చేరటానికిగాను ఈ అంశాన్ని, 'మతిమంతు' అనే పిచ్చివాడి వృత్తాంతాన్ని, చిత్రించటంలో రచయిత నేర్పరితనాన్ని ప్రదర్శించాడు.

అలాగే, నర్సింగ్‌హోమ్ వాతావరణాన్ని చిత్రించటంలో సీమపందుల వర్ణన చక్కగా అమరింది. ఈ వాతావరణంలో నర్సు ఈవమ్మ ప్రతిమాటా, ప్రతి కదలికా ఎంతో సజీవంగా ఉన్నాయి. చిన్నపాత్రే అయినా, కలకాలం గుర్తుండిపోయే పాత్ర ఈవమ్మ.

నర్సింగ్‌హోంలో చేరిన తర్వాత, గర్భస్రావంకోసం రాజమ్మను నర్స్ వేడినీళ్ళతో స్నానం చేయిస్తుంది ఆ మరునాడు ఉదయం ఇంట్లో పిల్లల ఆకలి సమస్యను తీర్చటానికి నారాయణరావు హోటల్‌కు బయలుదేరతాడు.

ఈ దశలో గోపీచంద్ మృతి కారణంగా నవల అసంపూర్తిగా మిగిలి

పోయింది. ఈ నవలను గోపీచంద్ ఏ విధంగా ముగించేవాడన్నది మన ముందున్న ప్రశ్న.

ఈ నవల సుఖాంతమయ్యేదా ? లేక విషాదాంతమయ్యేదా ? అన్నవి పై ప్రశ్నతో సంబంధమున్న ప్రశ్నలు రాజమ్మ భవిష్యత్తును గూర్చి ఊహిస్తే సమస్య కొంత పరిష్కారం కావచ్చు.

నవల చివరి భాగంలో అక్కడక్కడా కనిపించే విషాద భావాల మూలంగా రచయిత నవలను విషాదాంతం చేయాలనుకున్నాడనిపిస్తుంది. అశాస్త్రీయమైన గర్భస్రావ విధానానికి రాజమ్మ బలవుతుందేమోననిపిస్తుంది.

సాధ్యమైనంత మంచి వైద్య సదుపాయం సమకూర్చాలనే ఉద్దేశంతో నారాయణరావు అప్పుకోసం చేసిన ప్రయత్నం విఫలం కావటంతో, అశుభం జరుగుతుందేమోనని అనుమానించటానికి అవకాశం ఏర్పడింది.

గర్భస్రావం చేసే ఊవమ్మ అనే నర్స్, వృత్తికి తగిన మానవత్వపు విలువలు తెలిసిన మనిషి కాకపోవటంవల్ల ఈ అనుమానం బలపడుతుంది.

నర్సింగ్ హోంలో తనను చూడటానికి వచ్చిన భర్తతో ఇన్ని రోజులుగా తాను అతని మనసును కష్టపెట్టినందుకు క్షమాపణ కోరుకుని దుఃఖిస్తుంది, రాజమ్మ. ఇది వీడ్కోలు దృశ్యంలా కనిపించి తిరిగి భార్యాభర్తలు కలుసుకోరేమోననిపిస్తుంది.

తల్లికి సాయంగా ఉండడానికి అరుంధతి వెళ్ళిన తర్వాత నారాయణరావుకు టేబుల్ మీది ఫైళ్లు యమపాశం లాంటి ఎర్రని గుడ్డ పేలికలతో కనిపించాయి. ఆ ఫైళ్ళలో తలదూర్చినప్పుడు, అతనికి కనిపించిన కేసులన్నీ అన్యాయానికి, దౌర్జన్యానికి, హింసకు బలైన అమాయకులవే. ఈ రకంగా రాజమ్మకు జరుగబోయే అన్యాయానికి ముందే, ఇతివృత్త పథకంలో భాగంగా ఈ విషాద వాతావరణాన్ని రచయిత చిత్రించాడేమోననే అనుమానం కూడా కలుగుతుంది

వేడినీళ్ళ స్నానం చేసిన తర్వాత ఊవమ్మ ఇచ్చిన మద్యం సేవించిన మత్తులో, కూతురుతో తాను నారాయణరావును పెళ్ళిచేసుకోకుండా ఉన్న

ట్లయితే రాజభవనం లాంటి మేడలో లక్షలకు అధికారిణిగా ఉండేదాన్నని చెప్పుకొని "యిపుడు చావటానికి సిద్ధంగా కుక్కిమంచం మీద పడి వున్నాను" అంటుంది.

నవల పేరు 'యమపాశం' కావటంవల్ల రాజమ్మను మృత్యువు కబళించటానికి పొంచి ఉన్నదేమోనని లేదా మరేదైనా కారణంవల్ల రాజమ్మను మృత్యువు కబళించటానికి పొంచి ఉన్నదేమోనని కూడా ఊహించటానికి వీలుంది.

అయితే పైన వ్యక్తమైన ఇతివృత్తపరమైన అనుమానాలు సమంజసమైనవిగా కనిపించవు. కారణం, అవి సహేతుకమైనవి కాకపోవటమే అంతే కాదు, నవలలో క్రమంగా బలపడుతూ వచ్చిన భావపరిణామాన్ని ఈ అనుమానాలు తాత్వికంగా ముందుకు తీసుకుపోవటం లేదు.

అందువల్ల, ఈ నవల సుఖాంతమవుతుందని నమ్మటానికే ఆధారాలు ఎక్కువ కనిపిస్తున్నాయి. విషవలయంలో చిక్కుకున్న రాజమ్మ పాత్రను పరిశీలిస్తే ఈ భావం బలపడుతుంది. ఆపరేషన్ అంటేనే భయపడే రాజమ్మ గర్భస్రావం చేయించుకోవటానికి పూనుకోవటం, ఆమెలో కలిగిన ఆత్మవిశ్వాసానికి సూచన. భయం కారణంగా చోటుచేసుకున్న మృత్యుచ్ఛాయలను ఆత్మవిశ్వాసం తుడిచివేస్తుంది.

ఆమె ప్రధాన నిర్ణయం తీసుకున్న తర్వాత అంతకు ముందున్న మాదిరిగా కాక, ప్రశాంతంగా ఆలోచించింది. సంస్కారంతో ప్రవర్తించింది. ఆమెలో హృదయపూర్వకమైన పశ్చాత్తాపం చోటు చేసుకోగలిగింది.

ఆ గండం గడిచిన తర్వాత ఆమె కొత్త దృక్పథంతో, సంతృప్తికరమైన జీవితాన్ని తీర్చిదిద్దుకోవాలని ఊహించింది తన భర్తతో స్పష్టాస్పష్టమైన తన అభిప్రాయాన్ని ప్రస్తావించింది.

కష్టాలు మనిషిలోని సోమరితనాన్ని దూరంచేసి క్రియాశీలిని చేస్తాయి అంతేకాదు, అంతర్ముఖుణ్ణి చేస్తాయి. ఉద్యోగంలో చేరిన తర్వాత ఎప్పుడూ తనపై అధికారులను ఎదిరించని నారాయణరావు అప్పుకోసం తిరిగిన రోజున

అలస్యంగా వచ్చినందుకు సూపరింటెండెంట్ తన అధికారదర్పాన్ని ప్రదర్శించినప్పుడు ఎదురుతిరిగాడు. గిడిసబారినట్లు కవిపించే నారాయణ రావులో, యాంత్రిక జీవితానికి అలవాటుపడిన నారాయణరావులో జీవితంలో ఎదురైన కష్టాల మూలంగా కొంత మార్పు వచ్చిందనటానికి పై అంశం నిదర్శనం.

రాజమ్మ నర్సింగ్‌హోంలో చేరిన తర్వాత, ''మనం కాస్త పెరిగాం'' అంటాడు ఎదుగుదలకు సంబంధించిన అవగాహన జీవిత సమీక్షవల్ల కలి గింది. గతించిన జీవితాన్ని ఇప్పటి జీవితాన్ని తులనాత్మకంగా పరిశీలించటం వల్ల కలిగింది కష్టాలు భార్యాభర్తలను సన్నిహితం చేశాయి. అంటే, వాళ్ళు జీవితానికి కూడా సన్నిహితం అయ్యారన్నమాట. ఇక జీవిత సమస్యల నుంచి నారాయణరావు పారిపోడు. ఇదివరకులాగా ఒక సిద్ధాంతాన్నో, సాంప్ర దాయిక విశ్వాసాన్నో అడ్డుగా పెట్టుకొని, జీవితం చేతిలో కీలుబొమ్మ కాడు.

జీవితంలోని సమస్యలను ఎదుర్కోవటానికి మానసికమైన ధైర్యసాహ సాలు ముఖ్యం తప్ప, డబ్బు ముఖ్యం కాదని చెప్పటానికే నారాయణరావుకు అప్పు దొరకనట్లుగా రచయిత చిత్రించాడు.

రాజమ్మ కోరికలు తీరకపోవటంవల్ల భర్తమీద పెంచుకున్న కసిని ప్రేమగా సంతానం మీద ఏర్పరచుకున్న క్రోధాన్ని వాత్సల్యంగా మార్చుకో గలిగింది. అందువల్ల భవిష్యత్తులో ఆమె తన కోరికలకూ వాస్తవ జీవితానికీ మధ్యన వంతెన నిర్మించుకోగలుగుతుంది. భోగభాగ్యాలతో విలాసవంతంగా జీవించటం ద్వారా పొందదలచుకున్న మానసిక సంతృప్తిని తన అనుభవం లోకి వచ్చిన జీవితం నుంచే పొందగలుగుతుంది.

ఇది నవలలో రచయిత ఉద్దేశించిన పరిణామం. పాత్ర లేక పాత్రలు పరివర్తనకు లోనుకావటం గోపీచంద్ నవలల్లో మనకు కనిపించే ప్రధా నాంశం 'పరివర్తనం', 'మెరుపుల మరకలు', 'గడియపడని తలుపులు', 'గతించనిగతం' వంటి నవలల్లో స్పష్టంగా ఈ లక్షణం కనిపిస్తుంది.

'యమపాశం' అన్న నవల పేరును గూర్చి—

నారాయణరావు దంపతులు అజ్ఞానం కారణంగా తమ జీవితాన్ని ఎలా నరకప్రాయం చేసుకున్నారో ధ్వన్యాత్మకంగా రచయిత సూచించాడు కాని, ప్రమాదం పూర్తిగా ముంచుకు రాకముందే కళ్ళు తెరిచినందువల్ల నష్టం జరుగ లేదు. అయితే, జీవితం 'యమపాశం'గా మారి వారి కంఠాలను సులమటానికి పొంచి వున్న మాట మాత్రం నిజం. రచనలో మూడు వంతులు కష్టాలను అనుభవిస్తున్న ప్రధాన పాత్రల మనస్తత్వాలను రచయిత చిత్రించాడు కనుక, 'యమపాశం' అన్న పేరు ఉచితంగా ఉన్నది. మరో విషయం ఏమి టంటే, 'యమపాశం' అన్న మాటను ప్రభుత్వ వ్యవస్థను విమర్శించిన సంద ర్భంలో రచయిత అప్పుడప్పుడు ప్రస్తావించాడు. అంటే ఈ పేరులో నారా యణరావు దాంపత్య జీవితాన్ని మాత్రమే కాకుండా ప్రభుత్వ యంత్రాంగాన్ని కూడా ధ్వనింపజేశాడన్నమాట.

అయితే, విషాదాంతం చేయటం ద్వారా రచయిత ప్రయోజనాన్ని సాధించలేడా ? అన్నది ప్రశ్న. రాజమ్మ మరణిస్తే నవల విషాదాంతం అవు తుంది. ఏ ప్రయోజనాన్ని ఆశించి ఆమె నర్సింగ్‌హోంలో చేరిందో, ఆ ప్రయోజనం దెబ్బతిన్నా, లేక కష్టాలు పెరిగి, కొత్త సమస్యలు పెరిగినా కూడా నవల విషాదాంతమవుతుంది. నవలను విషాదాంతం చేయటం ద్వారా కూడా రచయిత తాను చెప్పదలుచుకున్నది చెప్పగలడు. ఈ విధంగా చెప్పట మంటే పరోక్షపద్ధతిలో చెప్పటమే। రచయితకు వ్యతిరేకదృష్టి మీద నమ్మకం లేదు. గోపీచంద్‌కు ప్రతినిధి పాత్ర అయిన గోపీకృష్ణ కూడా, 'నిషేధదృష్టితో జీవితాన్ని చూచిన ఏ వ్యక్తీ వికసించడు' అంటాడు.

అందువల్ల, రచయిత నవలను సుఖాంతం చేయటం ద్వారా సూటిగానే తన సందేశాన్ని అందజేయదలచాడని చెప్పవచ్చు అదిగాక, ముఖ్యపాత్రల్లో పరిణామం వచ్చిన దశలో నవలను విషాదాంతం చేయటం అర్థంలేని పనే అవు తుంది. ఆయా పాత్రల వ్యక్తిత్వాల్లో వచ్చిన పరిణామం సజీవంగా ముందుకు సాగటానికి దోహదం చేయాలనుకునే ఏ రచయిత అయినా నవలను సుఖాంతం చేస్తాడు.

గోపీచంద్ నిజంగా ఒక కుటుంబ జీవితాన్ని చిత్రించటానికి ప్రయత్నిం

చింది. 'యమపాశం'లోనే అది అసంపూర్ణనవల కావటం దురదృష్టకరం ఇతర నవలలో తక్కువ అంశాలతోపాటు కుటుంబం కూడా ఒక అంశమే. కాని, యమపాశంలో కుటుంబమే ముఖ్యాంశం. అందులో ఈ నవలలోనిది మధ్యతరగతి జీవితచిత్రణకూడా కావటం వల్ల ఆసక్తిదాయకంగా రూపొందింది.

ప్రపంచంలో కుటుంబంలేని మానవ సమాజమేదీలేదు.16 పెళ్లివల్ల పుట్టే సంతానంవల్ల ఎదురయ్యే అనేకరకాల సమస్యల పరిష్కారాలు ఆ కుటుంబం జీవిస్తున్న వ్యవస్థతో ముడిపడి ఉంటాయి. అయినా వ్యక్తుల తెలివితేటలు, వారు తీసుకునే నిర్ణయాలు కూడా సమస్యల పరిష్కారాల విషయంలో కొంత ప్రభావాన్ని కలిగిఉంటాయి. అయినా, వారి తెలివితేటలు రాణించాలన్నా వారు తీసుకున్న నిర్ణయాలు ఆచరణాత్మక రూపం ధరించాలన్నా వ్యవస్థనుండి కూడా ప్రోత్సాహం అవసరం.

సంఘంలో వరకట్న సమస్య మీసాలు మెలేస్తున్నది. కనుక, పెద్ద బిడ్డ పెళ్లి చేయలేకపోయాడు స్నేహం కంటే డబ్బే విలువైందన్న పరమార్థమే చెలామణిలో ఉన్నది కనుక వంద రూపాయల అప్పు పుట్టించలేకపోయాడు, లైంగికంగా 'ఓవర్ సెక్సెడ్' కనుక ఏడుగురు పిల్లల తండ్రి అయ్యాడు.

రాజకుమారిని నిత్య గర్భిణిగా పోషిస్తూ ఆమెను రాజమ్మగా మార్చి, తాను రాజమ్మ భర్తగా మారిపోయాడు. నారాయణరావు దరిద్రనారాయణుడుగా పరిణామం చెందటంలో అతని తప్పేమీలేదనిపిస్తుంది. ఏడుగురు పిల్లల తండ్రి కావటమొక్కటే అతనికి తృప్తి నిస్తుంది. అందులో రాజమ్మ బాధ్యత కూడా ఉన్నది కనుక అది ఉమ్మడి తప్పు. ఆనాటికి కుటుంబ నియంత్రణ ఈ కాలంలో పొందినంత ప్రాచుర్యాన్ని పొందలేదు. కనుక ఈ తప్పును కూడా సానుభూతిపూర్వకంగానే చూడవలసి ఉన్నది.

మొత్తం మీద ఎనమిదో శిశువు ఈ లోకంలోకి రాకుండా ఉండటానికి భార్యాభర్తలు తీసుకున్న నిర్ణయమే సరైనది. రచయిత దృష్టి ఈ అంశం మీదనే కేంద్రీకృతమైనట్లు కనిపిస్తుంది. కాని ఈ సమస్య చిన్నదే ననిపిస్తుంది.

గర్భస్రావం జరుగుతుందనీ, రాజమ్మ తిరిగి ఇంటికి వచ్చేస్తుందనీ ఆశించ వచ్చు.

వంద రూపాయలతో సమస్య పరిష్కారం కావచ్చు. ఇద్దరిలో ఎవరో ఆపరేషన్ చేయించుకోవటంతో తిరిగి పిల్లలు పుట్టే అవకాశమే ఉండక పోవచ్చు. అయితే ఇంకా మిగిలిన అనేక సమస్యలు నారాయణరావును వేధిస్తూనే ఉండవా ? అన్నది ప్రశ్న. ఇది అసంపూర్ణ నవల కనుక ఈ ప్రశ్న శేషప్రశ్నే. అయినా, ఇకముందు వారు జీవితంపట్ల ఎలాంటి వైఖరి ప్రదర్శిస్తారన్నది కూడా ఈ సమస్యల పరిష్కారమార్గాన్ని ప్రభావితం చేస్తుంది. నారాయణరావుకు జీవితంపట్ల స్వతంత్ర భావాలు లేవు. కనుక రాజమ్మ, అరుంధతీ గోపీకృష్ణుల భావాలను గురించి తెలుసుకోవటం అవసరం.

"ఖర్చుకు సరిపోయే డబ్బు మీరు సంపాదించటం లేకనా ? ఖర్చుకు మితం అనేది ఏముంది ? ఎంతలోనైనా సరిపెట్టుకోవచ్చు. ఎంత వచ్చినా లేమితో కుములుతూనే వుండవచ్చు" అంటుంది, రాజమ్మ భర్తతో.

కుటుంబ సమస్యలకు మూలం డబ్బు కాదనీ లేదా ఆ సమస్యల పరిష్కారానికి డబ్బు ముఖ్యం కాదనీ రాజమ్మ తెలుసుకున్నట్లు అనిపిస్తుంది.

"ఇంకా స్పష్టంగా రూపం అయితే ధరించలేదుకాని నా మనస్సుకి ఒక కొత్త రూపు స్ఫురిస్తూ వుంది." అని మాత్రం చెప్పగలిగింది. తనకే స్పష్టంగా స్ఫురించలేదు కనుక, ఆమె వివరించలేకపోయేది.

ఇక అరుంధతి—

"మనం జీవితగమనంలో కొంచెం వెనుకపడ్డాం నాన్నా, అంటే దాని స్వభావాన్ని తెలుసుకొని మనం నడచుకోవటం లేదు." అంది, తండ్రితో. అంతేకాదు "ఇపుడు మనం కష్టాలు అనుకునేవన్నీ ఈ విషయం జ్ఞాపకం చెయ్యటానికి గాను వచ్చిన మిత్రబృందమే. అంతకంటే ఏమీ లేదు." అంటూ, ఉన్న చోటు నుంచి కదలకపోవటమే తమ సమస్యలకు ప్రధానకారణంగా భావిస్తుంది.

అరుంధతి మాటల ద్వారా అర్థమయ్యేదేమిటంటే—డబ్బు సరిపోవటం, సరిపోకపోవటం, ఎక్కువ మంది పిల్లలు కలగటం వంటివి. నిజమైన కష్టాలు

కావని, పీటి వెనుక అసలు కష్టాలు వేరే ఉన్నాయనీ, ఉన్నచోటునుంచి కదలక పోవటమంటే, జీతం డబ్బులతో జీవితాన్ని కొలుస్తూ బతకటమేననీ ఊహించ వచ్చు. మరి దీనికంటే భిన్నమైందేమిటి? జీవితాన్ని ఆర్థికదృష్టితో చూడక పోవటమే. మరి ఏ దృష్టితో చూడాలి? అన్న ప్రశ్నకు ఇంకా సమాధానాలు చెప్పే దశ రాలేదు.

ఇంకా తల్లిబిడ్డల భావాలు ప్రారంభదశలోనే ఉన్నాయి. మరి గోపీ కృష్ణ భావాలను కూడా తెలుసుకోవటం అవసరం.

జీవితంలో నైతికవిలువలకు చోటు లేదా? అని నారాయణరావు ప్రశ్నించినప్పుడు,

"ఎందుకు లేదు వున్నది....నేటి మన నైతిక విలువలు వంటి నిషేధాజ్ఞలే....నిషేధ దృష్టితో జీవితాన్ని చూచిన ఏ వ్యక్తీ వికసించడు. వికసించని ఏ వ్యక్తికీ ముక్తిలేదు. జీవితాన్ని బహుభంగుల అనుభవించే వ్యక్తే సంపూర్ణతను పొందగలుగుతాడు" అంటాడు గోపీకృష్ణ. గోపీకృష్ణ నీతినియమాలను నిషేధాజ్ఞలుగా నిర్వచించాడు. వాటివల్ల కలుగుతున్న అనర్థాన్ని వివరించాడు ఈ స్థితిలో వ్యక్తి బాధ్యత ఏమిటో కూడా సూత్రీకరించాడు. వ్యక్తికీ సంఘానికీ సంఘర్షణ తరతరాలదే. ఏ వ్యవస్థలో అయినా, నీతినియమాలతో వ్యక్తి పూర్తిగా సంతృప్తి చెందినట్లు లేదు. కొత్త వ్యవస్థ ప్రారంభదశలో పాత వ్యవస్థ నీతినియమాలే చెలామణిలో ఉన్నప్పుడు సంఘర్షణ తప్పదు. అంతేకాదు, సాంఘిక దృష్టికీ, వైయక్తిక దృష్టికీ కూడా సంఘర్షణ తప్పదు. గోపీకృష్ణ వైయక్తిక దృష్టితోనే సాంఘిక నియమాలను ఉల్లంఘించటంలోనే వికాసం ఉన్నదని అంటున్నాడు. నవలలో మరికొంత ముందుకుపోతే, గోపీ కృష్ణకూ అతని భార్యకూ భేదాభిప్రాయాలు వచ్చాయనీ ఆమె అతనితో కాపురం చేయటం మానేసి స్వతంత్రంగా జీవిస్తున్నదనీ తెలుస్తుంది. గోపీకృష్ణలోని మద్యపానాభిలాష, స్త్రీలోలుత్వం ఇందుకు కారణాలు. అంటే, అతడు వైయక్తికదృష్టితో విలువలను ఉల్లంఘించాడు భార్య గోపీకృష్ణను తిరస్కరించి, స్వతంత్ర జీవితాన్ని వరించింది. మొత్తం మీద కుటుంబ జీవితం సంక్షోభానికి గురైంది.

ఇప్పుడు గోపీకృష్ణ 'బహుభంగుల జీవితాన్ని అనుభవించటం' అంటూ సిద్ధాంత స్థాయిలో చేసిన వాదం కొంత తెలుస్తున్నది. ఈ అనుభవించటంలో మద్యపానమూ, లైంగిక స్వేచ్ఛా కూడా ఉన్నాయని అర్థమవుతోంది. ఈ రెండింటివల్ల అతడు పొందే ఆనందస్వరూపం ఎలాంటిదో తెలియదు. కనుక, దాని జోలికి పోనవసరంలేదు. అయితే, మద్యపానం జీవిత లక్ష్యంగా పెట్టుకున్నవాడు తాగుబోతు కాకుండా వికసించే అవకాశం వుండవచ్చు; లైంగిక సౌఖ్యం ఆదర్శంగా పెట్టుకున్నవాడు వ్యభిచారి కాకుండా వికసించే అవకాశం ఉంటే వుండవచ్చు. కాని, ఈ రెండు మార్గాల ద్వారా వికాసాన్ని సాధించటానికి డబ్బు మాత్రం అవసరమే. అందువల్ల, గోపీకృష్ణది విమానాల్లో తిరిగే సుఖవాది దృష్టి. తన సౌఖ్యానికి అడ్డంకుగా ఉండే భార్యతో సహా అతడు దేన్నీ లక్ష్యపెట్టడు. పెట్టుబడిదారీ నాగరికతా, ఉద్యోగావసరాలూ, వ్యాపారంలో లాభాల రూపంలో వస్తున్న డబ్బూ అతని భావాలకు కారణాలు. గోపీకృష్ణ అంగీకరించకపోయినా హోదాకు తగినట్లుగా అతని కోరికలు తీరటానికి డబ్బే పునాది.

తేలిందేమిటంటే, అరుంధతీ రాజమ్మల దృష్టి, గోపీకృష్ణ దృష్టి ఒకటి కాదని. అందువల్ల అరుంధతి రాజమ్మలు జీవితాన్ని భౌతికదృష్టితో కాక ఆధ్యాత్మికదృష్టితో చూడదలచుకున్నారేమోనని ఊహించటానికి అవకాశం వుంది. రాజమ్మలో వచ్చిన ప్రశాంత మానసిక స్థితిని ఆధారంగా చేసుకొని మాత్రమే ఊహించటం సమంజసం కాదు. కనుక, ఇది ఊహ మాత్రమే.

నారాయణరావు వీళ్ళ మార్గంలో నడిచేవాడు మాత్రమే !

ఐదవ ప్రకరణం

## సూచికలు

1. 'చీకటిగదులు' నవల జనవరి 1960 నుంచి సెప్టెంబర్ 1962 వరకు 'యువ' మాసపత్రికలో సీరియల్ నవలగా వెలువడింది.

2. ఈ అంశాన్ని ఆరవ ప్రకరణంలో వివరించటం జరిగింది.

3. 'ఇరుగు పొరుగు' కథా సంపుటి.

4 గోపీచంద్ స్మారక సంచిక, 'ప్రతిభావంతుడు' వ్యాసం, పుట. 62.

5,6 'ఉన్నవ రచనలు కొన్ని', పుటలు 221, 222.

7. త్రిపురనేని సుబ్బారావు గారి 'గోపీచంద్' ఆధారంగా.

8. 'ప్రేమోపహతులు' నవలను గోపీచంద్ 'శాయన్న' అనే కలం పేరుతో రచించాడు. 'యువ' మాసపత్రికలో ఈ నవల మే 1962 నుంచి సెప్టెంబర్ 1962 వరకు సీరియల్‌గా వెలువడింది.

9 Sadism = A type of sexual perversion, characterized by pleasure, or sexual gratification in whipping or otherwise maltreating individuals of the same or opposite sex.

—Dictionary of Psychology, p. 237.

10 Masochism = (1) A sexual perversion characterized by pleasure in being abused esp. by love object (2) Pleasure in being abused or dominated; a taste for suffering.

—Webster's New Collegiate Dictionary.

11. 'పాత పగలు—కొత్త పగలు' కథా సంపుటి.

12. 'ఇది తులసివనం' (నవల), లత.

13. 'యమపాశం' ప్రథమ ముద్రణ రచయిత మరణానంతరం, సెప్టెంబర్ 1963. నవోదయ పబ్లిషర్స్, విజయవాడ-2.

14. 'మనోవిశ్లేషణ' విధానంలో అనుసరించబడ్డ ప్రాథమిక పద్ధతుల్లో స్వేచ్ఛా సంసర్గ పద్ధతి ఒకటి. ఈ పద్ధతిలో వ్యక్తి తన అంతరంగం లోని భావాలను ఎలాంటి అడ్డంకు లేకుండా అప్రయత్నంగా వ్యక్తం చేయటానికి అవకాశం ఉంటుంది.

—Dictionary of Psychology, p 110.

15. సిగ్మండ్ ఫ్రాయిడ్ పరిశోధనా ఫలితమైన సుప్రసిద్ధ సిద్ధాంతం. దమనానికి గురైన అచేతనలోని భావాలే వ్యక్తి ప్రవర్తనకు మూలమని చెప్పి, ఆ భావాలను బహిర్గతం చేయటానికి ఫ్రాయిడ్ విశాలమైన ప్రాతిపదిక మీద మనోవిశ్లేషణ విధానాన్ని రూపొందించాడు. నాడీ రుగ్మతలను వివిధ మనోవ్యాధులను గుర్తించటానికి వాటిని తగిన చికిత్సద్వారా నయం చేయటానికి ఈ విధానాన్ని ఉపయోగిస్తుంటారు.

—Ibid, p. 216.

16. 'The family is an institution found in all human societies.'

—International Encyclopedia of Social Sciences, Vol. 5, p. 313.

రెండవ భాగం

ఆరవ ప్రకరణం

ప్రభావం-పరిణామం

# 1. తండ్రిగారి ప్రభావం

గోపీచంద్ తన తండ్రి, కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారి ప్రభావంతో సాహిత్యరంగంలో ప్రవేశించాడు.

కవిరాజుగారిని మొదట్లో మూఢవిశ్వాసాలు. ఆ తర్వాత కులవ్యవస్థ లోని హెచ్చుతగ్గులు రెచ్చగొట్టాయి. బ్రాహ్మణాధిక్యం వారికి దుస్సహ మయింది.

'శ్రీమదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసువంటి ఉదార భావాలుగల కవి కూడా ఆ రోజులలో "ఏ, బి, సీ, డీలు నేర్చి ఎక్కువ కులమును చులక నగా జూచు శూద్రయోని" అని రాసి హర్షధ్వానులందుకొన్నాడు.1 అంటూ 'ఆ రోజులను' గూర్చి తాపీ ధర్మారావుగారు వివరించారు. తమ కమ్మకులం వారు ఆర్థికంగా అధికులైనా, గ్రామపెద్దలుగా ఉన్నా, వారిని బ్రాహ్మ ణులు నీచంగా సంబోధించటం, అల్పదృష్టితో చూడటం కవిరాజుగారి ఆత్మాభిమానాన్ని దెబ్బతీశాయి. బాల్యంలో అందరిలాగానే కవిరాజుగారూ ఆస్తికులే. అయితే, క్షుద్రశక్తులపట్ల అవిశ్వాసం, మూఢవిశ్వాసాలపట్ల నిరసన భావం వారిలో నాస్తికభావాలకు పునాదివేశాయి. సమాజంలోని హెచ్చుతగ్గు లకు మూలకారణాలేమిటో తెలుసుకోవాలనే జిజ్ఞాస హేతువాద భావప్రపం చానికి దారివేసింది.

వారి మొదటి గ్రంథం 'కారెంపూడి కదనం', చివరి గ్రంథం 'భగవ ద్గీత'. ఈ రెండూ పలనాటివీరచరిత్ర'కు సంబంధించినవే.2 ఈ గ్రంథరచన

కవిరాజుగారి సుస్థిర చారిత్రక దృష్టికి నిదర్శనం. వారు, తమ మొదటి ముద్రిత రూపకమైన 'కురుక్షేత్ర సంగ్రామం' (1910) లో పాండవుల అన్యాయాన్ని ప్రశ్నించి, కౌరవుల వైఖరిని సమర్థించి తిరుగుబాటు దృష్టిని ప్రదర్శించి, సంచలనాన్ని సృష్టించారు.

బారిష్టర్ పట్టాకోసం వారు ఇంగ్లండు వెళ్ళారు. అనేక విదేశాలను సందర్శించారు. ఈ దశ వారిలో నాస్తిక హేతువాద భావాలు బలపడటానికే సహజంగా దోహదం చేసింది. దేశానికి తిరిగి వచ్చిన తర్వాత వారిని జస్టిస్ పార్టీ ఆకర్షించింది. 'సౌత్ ఇండియా లిబరల్ ఫెడరేషన్ (1916) అనేదే జస్టిస్ పార్టీగా ప్రసిద్ధి చెందింది.'3 ఈ ప్రసిద్ధికి ఒక ముఖ్యకారణం, అపార్టీ నిర్వహించిన బ్రాహ్మణేతరోద్యమమే.

చదువు పూర్తి చేసుకొని వచ్చిన తర్వాత కవిరాజుగారు ఆంధ్రప్రాంతంలో బ్రాహ్మణేతరోద్యమాన్ని సృష్టించటానికి కంకణం కట్టుకున్నారు. 1918-20 మధ్య కాలంలో కృష్ణా గుంటూరు గోదావరి జిల్లాలలోని పలు ప్రదేశాలను సుడిగాలిలా చుట్టుముట్టి, తమ ఉపన్యాసాలద్వారా యువకుల్లో వారు కలిగించిన సాంఘిక చైతన్యం అపూర్వమైనది. బ్రాహ్మణులు తమ' స్థానాన్ని వదిలవరచుకోవటానికి పూనుకోవటంవల్ల అనేక వాదోపవాదాలూ దుష్ప్రచారాలూ చెలరేగాయి.4

ఆర్యద్రావిడ విభేదాలను నిరూపించటానికి 1920 లో వారు 'శంబుక వధ' నాటకాన్ని రచించారు. శంబుకుడు సంయమీంద్రుడే. కాని, వశిష్ఠుని దృష్టిలో—

''అనార్యుడు, అనగా ద్విజేతరుడు, అనగా ద్రావిడుడు. అనగా స్మృతులు పేర్కొన్న శూద్రుడు.''5

శూద్రుడు తపోధనుడు కావటం, సర్వసమానత్వాన్ని బోధించటం ఇష్టంలేని పూజారివర్గం వశిష్ఠుని నాయకత్వంలో ఏకమై శ్రీరాముణ్ణి తమ కీలుబొమ్మగా మార్చేస్తారు. పర్యవసానంగా—

'శల్యగతప్రాణుడును, జటావల్కలధారియు, శాంతస్వభావుడునయిన శంబుకర్షి'ని6 రాముడు హత్య చేస్తాడు.

'....పురాణములెంతవఱకు వేదమునకు ననుకూలములో ఎంతవఱకు ప్రతికూలములో, ఎంతవఱకు నీతిబాహ్యములో, యెంతవఱకు బక్షపాత భూయిష్ఠములో మోడ్పుగన్నులతో నున్న విద్వల్లోకమునకు జూపించు తలంపు'7 తో కవిరాజుగారు 1925 ప్రాంతంలో 'సూతపురాణము'ను రచించారు.

వారు, పురాతన సాహిత్యాన్ని నాస్తిక హేతువాద దృష్టితో పరిశీలించారు. కొన్నింటిని పునర్నిర్మించారు. వారి రచనలలో తాత్త్వికోపజ్ఞతోపాటు తార్కికప్రజ్ఞ కూడా చోటుచేసుకున్నది.

కవిరాజుగారి సాంఘికలక్ష్యమేమిటి ? అని ప్రశ్నించినప్పుడు, వెంటనే వచ్చే జవాబు, 'బ్రాహ్మణుల ఆధిక్యాన్ని తగ్గించటం' అని. బ్రాహ్మణేతరుల్లో ఆత్మగౌరవభావాన్ని కలిగించటం, విద్య ఏ ఒక్కరిసొత్తు కాదనే సత్యాన్ని చాటి చెప్పటం, తక్షణ ప్రయోజనాలుగా కవిరాజుగారు భావించారు.

'విప్రుడా ! లోకపరివర్తనము గమనింపుము. ఆత్మరక్షణకయి యెట్టి కట్టుదిట్టములు జరుగుచున్నవో పరికింపు. హిందూ సంఘమునందు నీ వొక్కడవే ప్రాజ్ఞుడవైయుండి యధికారము సాగించుకొనవలయునని యత్నించితివో, గొన్నినాళ్ళకయినను కులక్షయము కాకమానదు.'8 అన్న ఈ హెచ్చరిక, వారి ఇతర రచనలలో కూడా ప్రతిఫలించింది.

మొదట్లో బ్రిటిష్ అనుకూల జమీందార్ల పార్టీ అయిన జస్టిస్ పార్టీ వారి వ్యక్తిత్వాన్ని పరిమితం చేసినట్లు కనిపిస్తున్నది. అందుకే వారు 'జాతీయ బ్రాహ్మణేతరోద్యము' లేవదీశారు.9 ఇది జస్టిస్ పార్టీకి పోటీ. ఉప్పు సత్యాగ్రహ కాలంలో కవిరాజుగారి—

'వీరగంధము తెచ్చినారము

వీరులెవ్వరో తెల్పుడీ' అన్న గేయం మంచి ప్రాచుర్యం పొందింది. అయినా కవిరాజుగారు స్వాతంత్ర్యోద్యమ సానుభూతిపరుడే అయ్యారు తప్ప, క్రియాశీల కార్యకర్త కాలేకపోయారు.

కవిరాజుగారి సందేశం బ్రాహ్మణేతరులకందరికీ అయినప్పటికీ, అట్ట

డుగు వర్గాలకు వినిపించినట్లు లేదు. మధ్య తరగతి, ఉన్నత మధ్య తరగతి వర్గాలు, భూస్వామ్యవర్గం ఈ పిలుపును అందుకోగలిగాయి. బ్రాహ్మణులకు బదులు బ్రాహ్మణేతరులే పౌరోహిత్యం వహించే కొత్త 'వివాహవిధి'ని వారు తెలుగునాట ఆవిష్కరించారు. ఇది వారి సంస్కరణదృష్టికి నిదర్శనం.

తండ్రిగారి ప్రభావం గోపీచంద్ మీద ఏ మేరకు ఉన్నది? అన్న ప్రశ్నకు గోపీచంద్ రచనలే చక్కని జవాబులని చెప్పవచ్చు. గోపీచంద్‌ను సాహిత్యరంగం ఆకర్షించటానికి, తండ్రిగారు రచయిత కావటం, వారి రచనలు ప్రాచుర్యం పొందటం ప్రధాన కారణం. తండ్రి రచనలకు లభిస్తున్న దూషణభూషణలపట్ల గోపీచంద్‌కు ప్రత్యేక ఆసక్తి కలిగింది. తండ్రి రచించిన 'శంబుకవధ' నాటకాన్నే పేరు కూడా మార్చకుండా కథగా రచించాడు. ఇదే గోపీచంద్ మొదటి రచన కావటం యాదృచ్ఛికం కాదు.

పద్దెనిమిదేండ్ల గోపీచంద్‌ను ఆ నాటకంలో ఒక సత్యసంధుడైన అనార్య తాపసికి జరిగిన ఘోరాన్యాయం కదిలించింది. ఆ అన్యాయం చేసిందీ, హత్యకు పాల్పడ్డదీ సాక్షాత్తూ దుష్టశిక్షణకు శిష్టరక్షణకు ప్రసిద్ధి పొందిన శ్రీరామచంద్రుడు కావటం. అతణ్ణి ఆలోచింపజేసింది. శంబుకుడు అపరాధేనని స్వయంగా విశ్వసించిగానీ, ఆవేశానికి లోబడిగానీ కాక, బ్రాహ్మణుల చేతిలో కీలుబొమ్మగా మారి చంపటం గోపీచంద్‌ను ఉద్రేకపరిచింది. ఈ దెబ్బతో, అవతారాలమీదనే కాదు, సంపూర్ణ ఆస్తిక భావాల మీదనే అతనికి నమ్మకం సడలింది.

దేవుని అస్తిత్వానికి సంబంధించిన విచికిత్స విద్యార్థిదశలో అందరికీ సాధారణంగా ఎదురయ్యే సమస్యే. గోపీచంద్‌కు నాస్తిక భావాలే నచ్చటానికి తండ్రిగారి ప్రభావమే కారణం.

తండ్రిగారి నుంచే గోపీచంద్‌కు సంక్రమించిన మరో తత్వం హేతువాదం. హేతువాద సమన్వితమైనప్పుడే నాస్తికత్వం బలమైన విశ్వాసంగా రూపొందుతుంది. ఈ భావాలు అతనిలో బలపడటానికి సూతాశ్రమ వాతావరణం కూడా దోహదం చేసింది.

'మా నాన్న నాస్తికవాది, సత్యాన్వేషి, ఆయన బ్రతికివున్నంత కాలం

మా ఇల్లు ఎప్పుడూ వాదోపవాదాలతో మార్మోగుతూ వుండేది. అటువంటి వాతావరణంలో పుట్టి పెరిగాను'10 అన్నాడు గోపీచంద్.

తండ్రిగారి ప్రోత్సాహంతో చర్చల్లో పాల్గొంటుండేవాడు.

''గోపీ'' అంటూ కొడుకుని పిలిచి, ''వారేదో అంటున్నారుచూడు'' అనేవారు. ఎదుట కూర్చున్న పెద్దమనిషిని చూపించి.11 'దేవుడు వుంటే చూపించు' అని ఆస్తికుణ్ణి పరాస్తం చేయటానికి గోపీచంద్ పూనుకునేవాడు.

బ్రాహ్మణుల ఆధిక్యాన్ని ప్రశ్నించటానికీ, పురాణేతిహాస కావ్యాల లోని అసంబద్ధతను ప్రశ్నించటానికీ కవిరాజుగారు తన రచనల్లో హేతువాదానికి అగ్రపీఠంవేస్తే, గోపీచంద్ ఆధునిక సమాజానికి హేతువాదాన్ని అన్వయించి రచనలు చేశాడు. ఇది, అతని స్వతంత్ర వ్యక్తిత్వానికి నిదర్శనం. అంతేకాదు, తండ్రిగారి గ్రాంథిక భాషను కాకుండా, వ్యావహారిక భాషను స్వీకరించటం. ఆ రోజుల్లో ప్రచారంలో ఉన్న కథానికా ప్రక్రియను స్వీకరించటం అతని ఆధునిక మనస్తత్వానికి సాక్ష్యాలు.

హేతువాద ఆయుధంతో దాడిచేయటానికి గోపీచంద్‌కు వెంటనే దొరికిన లక్ష్యం సమకాలీన భావకవిత్వం.

క్షీణప్రబంధయుగంలోనూ ఆ తర్వాతా, మృతప్రాయమైన తెలుగు కవిత్వానికి భావకవిత్వం కొత్త వూపిరిపోసింది. సుకుమార హృదయానుభూతులను 'రంగూ రుచీ వాసనా' గల కొత్త భాషలో భావకవిత్వం ఆవిష్కరించింది. స్వేచ్ఛాభావాలకూ, ఆత్మాశ్రయరీతికీ, ఖండకావ్య ప్రక్రియకూ ప్రాచుర్యాన్ని సంతరించిపెట్టింది. తెలుగు సాహిత్యంలో చారిత్రక పాత్ర వహించింది. తెలుగు కవిత్వానికి విశాల ప్రాతిపదికను సమకూర్చింది. మానవతావాదాన్ని నవీన హృదయ సంస్కారంలో భాగంగా రూపొందించగలిగింది.

రానురాను భావకవిత్వానికీ వాస్తవ జీవితానికీ అఖాతం పెరగసాగింది. అది పూర్తిగా వ్యక్తినిష్ఠమైపోయి సామాజిక సమస్యలకు దూరం కాసాగింది. క్రమంగా ఆర్థిక రాజకీయ సాంఘిక పరిస్థితులలో కూడా గణనీయమైన మార్పులు వచ్చాయి. అందుకే, భావకవిత్వం మీద తిరుగుబాటు జరిగింది.

'వేటతల జూచిగాని మోమోటపడడు' అన్న కవిరాజు గారి పద్య పాదాలను రచయిత స్మరించాడు. మనిషిలోని స్వార్థప్రవృత్తిని మొదటి పాదంలో, పాశవిక ప్రవృత్తిని రెండో పాదంలో చిత్రించి ఆ రెండూ దేవునిలో ఉన్నాయని కవిరాజు గారు వ్యంగ్యంగా చెప్పారు. మనిషి తన ప్రవృత్తులనే దేవునికి అంటగట్టాలని గోపీచంద్ గుర్తించటానికి కారణం, తండ్రి నుంచి సంక్రమించిన హేతువాద ప్రభావమే.

ఈ కథల సంపుటిలోనే ఉన్న 'మానవ జీవితం' అన్న గల్పికలో "మానవుడు నగం జీవితం నేర్చుకోవటంలోను, మిగిలిన నగం తాను నేర్చుకున్నది తప్పని తెలుసుకోవటంలోను గడుపుతున్నాడు" అని తెలుసుకున్న దేవుడు—

''మంచిది కనక ఇప్పట్లో మనకేమీ ఫరవాలేదన్నమాట! ఇంకా కొన్నాళ్ళ వరకూ మన భుక్తికి లోటు లేదన్నమాట...." అని కులికాడట;

హేతుజ్ఞానం లేకపోవటంవల్లే మానవుడు జీవితాన్ని అర్థం చేసుకోలేక పోతున్నాడనీ, మానవుని అజ్ఞానంమీదే దేవుడు బతుకుతున్నాడనీ హేతువాదిగా గోపీచంద్ విశ్వసిస్తున్నాడు.

1943 నాటి 'పరివర్తనం' నవల భావకవిత్వం పట్ల గోపీచంద్ ప్రతికూల దృష్టికే కాకుండా, హేతువాద దృష్టికి కూడా తిరుగులేని నిదర్శనం.[15]

# 2. మార్క్సిజం ప్రభావం

తండ్రిగారి తర్వాత గోపీచంద్‌ను 'మార్క్సిజం' ప్రభావితం చేసింది.

1925లో భారతదేశంలో కమ్యూనిస్టు పార్టీకి అంకురార్పణ జరిగింది.[16] మొదలు, మార్క్స్ భావవాహినితో భారతీయులకు ప్రత్యక్ష పరిచయం ఏర్పడ సాగింది. అంతకుముందే, మార్క్స్ మహాశయుని తాత్త్విక విశ్వాసాలకు రష్యా విప్లవం (అక్టోబర్, 1317) నిజం చేయటంతో అంతర్జాతీయ రాజకీయాలలో వచ్చిన సంచలనం భారతీయులకు సుపరిచితమే. స్వాతంత్ర్యంకోసం పోరాడు తున్న భారతీయులకు, ముఖ్యంగా. విప్లవ రాజకీయాలతో సంబంధమున్న యువకులకు, బ్రిటిష్ ప్రభుత్వాన్ని కూల్చివేయటానికే కాకుండా, భారత దేశం శక్తిమంతమైన దేశంగా రూపొందటానికి కూడా మార్క్సిజం ఆశా జ్యోతిగా భాసించింది. 1921 నాటికే ఆంధ్రదేశంలో మార్క్స్‌భావాలు అడుగు పెట్టాయి. తన 'మాలపల్లి'లో—'Workers of the World unite' అన్న కార్ల్‌మార్క్స్ పిలుపును మొదటిసారి భారతదేశంలో, ఆంధ్రదేశంలో 'పని వాండ్లందరు ఏకమైతిరా-ప్రపంచమే మీది' అని వినిపించినవాడు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ.[17]

ఆంధ్రలో కమ్యూనిస్టుపార్టీ అధికారి పూర్వకంగా 1934 సెప్టెంబర్‌లో నెలకొల్పబడింది[18] తర్వాత దాన్ని ప్రభుత్వం నిషేధించింది. అంతకు ముందు నుంచే భయంకర ఆర్థిక మాంద్య పరిస్థితులలో భూస్వాములనుంచి, వడ్డీ వ్యాపారులనుంచి సన్నకారు రైతులను, రైతుకూలీలను కాపాడేటందుకు అజ్ఞాత కమ్యూనిస్టులు రక్షక సంఘాలను ఏర్పాటుచేసి గణనీయంగా కృషి చేస్తున్నారు.

1930 ప్రాంతంలో తెలుగుగడ్డపై 'కమ్యూనిస్టు ఉద్యమ సాహిత్యం వేరూనడం ప్రారంభమైంది.'[19] '1934లో కమ్యూనిస్టు మేనిఫెస్టోకు-గద్దె లింగయ్య అనువాదం వెలువడింది. ఆ తర్వాత 'సామ్రాజ్యవాదము' (లెనిన్

వ్యాసానికి తర్జుమా), 'సామ్యవాద సిద్ధాంతాలు', 'అమ్మ' (గోర్కీ నవలకు క్రొవ్విడి లింగరాజు అనువాదం) మొదలైన రచనలు కమ్యూనిస్టు భావాలను తెలుగు ప్రజలకు పరిచయం చేయటంలో ప్రముఖపాత్ర వహించాయి. (1934లో 'కమ్యూనిస్టు మానిఫెస్టో'కు రెండు ముద్రణలు వచ్చినా, లండన్ లైబ్రరీలకు పంపటానికి ఒక్కప్రతి కూడా కృష్ణా గోదావరీ జిల్లాల కలెక్టర్‌లు సంపాదించలేకపోయారు.'20

ప్రారంభదశలోనే కమ్యూనిస్టుపార్టీ ఎంతగా ప్రజాభిమానాన్ని చూరగొన్నదో, ఎంతగా క్రమశిక్షణ గల కార్యకర్తల అండదండలు పొందగలిగిందో తెలుసుకోవటానికి పై అంశం తిరుగులేని నిదర్శనం.

తీవ్ర కమ్యూనిస్టు వ్యతిరేకులైన ఎన్.జి. రంగా వంటివారు కూడా ఆంధ్ర కమ్యూనిస్టుల శక్తిసామర్థ్యాలను, క్రమశిక్షణను అభినందించారు.21

1927—33 మధ్యన గుంటూరు ఏ.సి. కాలేజిలో చదువుకున్నప్పుడు-కొంతకాలం గోపీచంద్ కమ్మ హాస్టల్‌లో ఉన్నాడు.22 ఈ హాస్టల్ విద్యార్థుల్లో గాంధీని అభిమానించే వర్గం ఒకటి, కమ్యూనిస్టుపార్టీ భావాలను అభిమానించే వర్గం ఒకటి ఉండేవి. ఈ విధంగా బి.ఏ. చదువుతున్న రోజుల్లోనే తొలిసారి మార్క్సిజంతో గోపీచంద్‌కు పరిచయం ఏర్పడినట్లు అతని ఆత్మకథాత్మక నవల 'చీకటిగదులు'లో సాక్ష్యాలున్నాయి."23 ఈ నవలలో శివకుమార్ కమ్యూనిస్టు భావాలకు, పరంధామయ్య గాంధీ భావాలకు ప్రతినిధులు. హాస్టల్ కార్యదర్శి పదవికి శివకుమార్ పరంధామయ్యల మధ్య పోటీ జరిగితే తన ఓటు శివకుమార్‌కు వేయటానికే నిశ్చయించుకొని,24 కమ్యూనిస్టు భావాల పట్లనే కథానాయకుడు గోపాలం మొగ్గు చూపించాడు.

కమ్యూనిస్టుల ఉద్యమం అతణ్ణి ఎందుకు ఆకర్షించిందో తెలుసుకోటానికి ముందు అతనికి అదివరకే పరిచయమైన జాతీయోద్యమం గూర్చి తెలుసుకోవటం అవసరం. తండ్రిగారి బ్రాహ్మణేతరోద్యమం నిత్యజీవితానుభవంలోనిదే. జస్టిస్ పార్టీతో ఉన్న సంబంధాలవల్ల మొదట్లో కవిరాజు గారిది ప్రభుత్వానుకూలదృష్టే. మామూలుగా సాంఘిక దురాచారాలతో పోరాడే సంస్కర్తలు, ఇటు అధిక సంఖ్యాక ప్రజలనూ, అటు ప్రభుత్వాన్నీ శత్రువు

లుగా చేసుకోరు. ఇందుకు ఉదాహరణగా వీరేశలింగంపంతులుగారిని పేర్కొనవచ్చు.

గోపీచంద్‌కు కూడా మొదట్లో జాతీయోద్యమంపట్ల ఆసక్తి కలిగినట్లు లేదు. గాంధీగారి మతభావాలపట్ల నాస్తికుడైన గోపీచంద్‌కు నమ్మకం కుదిరి ఉండదు. కాని,

'మహాత్మాగాంధీ నాయకత్వం కింద మానవుడు ఆస్తినీ, ప్రాణాలనూ లెక్కచెయ్యకుండా తన సంకుచిత స్వభావాన్ని రద్దుచేసుకొని దేవతవలె ప్రవర్తించటం'25 మాత్రం అతణ్ణి ఆకర్షించింది.

ఉప్పు సత్యాగ్రహంతో మొదలైన శాసనోల్లంఘనోద్యమం (1930-33)లో గుంటూరుజిల్లాకు చెందిన దేశభక్తులే అధికసంఖ్యలో జైళ్ళకు పోవటం,26 తమ కులంవాళ్ళే అగ్రగాములు27గా ఉండటం గోపీచంద్‌కు తెలియని విషయాలు కావు. గుంటూరుజిల్లా 'కరవది'లో జండాను ఊరేగించి ప్రతిష్ఠించినందుకు అనేకులను ప్రభుత్వం అరెస్ట్ చెయ్యటం,28 సత్యాగ్రహోద్యమాన్ని బలపరుస్తూ తెనాలి న్యాయవాదులు; మునిసిపల్ కౌన్సిలర్లు ప్రకటనలు చేయటం,29 పత్రికలు ఉద్యమానికి సంబంధించిన వార్తలు ప్రకటించకుండా ప్రభుత్వం నిషేధపుటుత్తర్వులు జారీచేసినప్పుడు తెనాలి గోడల మీద పోస్టర్లు ప్రత్యక్షం కావటం30—ఇవన్నీ సాంఘిక రాజకీయ చైతన్యం ఉన్న గోపీచంద్‌కు తెలిసిన విషయాలే.

ఈ సన్నివేశాలు అతణ్ణి ఆకర్షిస్తున్నాయి. జనులు త్రివిక్రములై ప్రదర్శిస్తున్న పౌరుషం అతణ్ణి ఆశ్చర్యపరుస్తున్నది. అయితే, అతని దృష్టి గ్రామీణ ప్రాంతపు రైతు మీద కూడా ప్రసరించింది. ఆర్థికసంక్షోభంలో ఊపిరాడక జీవచ్ఛవమైన రైతును, సన్నకారు రైతును ఆయన మరిచిపోలేదు. రైతురక్షకసంఘాల పేరుతో అనేకులు నిర్వహిస్తున్న సభలు ఆయన దృష్టిని తప్పకుండా ఆకర్షించాయి. తర్వాతికాలంలో గోపీచంద్‌ను సినిమా రంగానికి పరిచయం చేసిన గూడవల్లి రామబ్రహ్మం 1931 వేసవిలో తెనాలిలో నిర్వహించిన బ్రహ్మాండమైన రైతురక్షణమహాసభ31 కృషి

గుంటూరులలో జరుగుతున్న ఇలాంటి అనేక సభలూ గోపీచంద్‌ను విశేషంగా ఆకర్షించి వుంటాయి.

ఆ రోజుల్లోనూ ఆ తర్వాతా అజ్ఞాత కమ్యూనిస్టులు కర్షక కార్మిక సభలను నిర్వహించారు. అనేక ప్రదర్శనలను జరిపారు. ఊరేగింపులకు లెక్కలేదు. వీటి ప్రత్యేకతను గోపీచంద్ గుర్తించాడనటానికి అతని నవలల్లో సాక్ష్యాలున్నాయి.

'పరివర్తనం' (1943) నవలలో నాయకుడు రాజారావు సంఘర్షణకు లోనై ఇల్లునూ తోటనూ వదిలి వీధిలోనికి వచ్చినప్పుడు.

'ఆకలితోటి నకనకలాడే
దరిద్రులంతా లేవండోయ్'32

అంటూ పాడుకుంటూ ముందుకు సాగుతున్న ఊరేగింపును చూస్తాడు. ఈ పాట- కమ్యూనిస్టు పాడుకునే

'ఆకలి మంటకు సలసల మాడే
అనాథులందరు లేవండోయ్'33

అనే అంతార్జాతీయ శ్రామిక గేయానికి అనుకరణే.

మరో ఉదాహరణకోసం 'యమపాశం' (1962) నవలను చూడవచ్చు. నాయకుడు నారాయణరావు తన కూతురు అరుంధతితోపాటు నర్సింగ్ హోంలో ఉన్న భార్యను చూడటానికి వెళ్తున్న సన్నివేశంలో ఊరేగింపును చూస్తాడు.

'అది ఫ్యాక్టరీ కార్మికుల ఊరేగింపు. దానిని కార్మికులు లేవదీశారు. చంకన పిల్లలను వేసుకున్న స్త్రీలు కూడా నడుస్తున్నారు. చిన్నపిల్లలు కూడా నడుస్తున్నారు. చిన్నపిల్లలు కూడా ఉత్సాహం కొద్దీ ఎర్రజెండాలు పట్టుకొని మిగిలిన వాళ్ళతోపాటు నడుస్తున్నారు.'34

ఈ సన్నివేశం నవలా కాలానిదే కావచ్చు. కాని, మనసులోపడ్డ బీజం మాత్రం 1935 ప్రాంతాలదే.

కమ్యూనిస్టుల ఆధ్వర్యంలో జరిగిన కర్షక కార్మిక సభలు, ఊరేగింపులు, ప్రదర్శనలు, తాకట్టులో ఉన్న తమ బతుకుల్ని విడిపించుకోవటానికి, ఇటు నల్లదొరలతో, అటు తెల్లదొరలతో కర్షకకార్మికులు సాగిస్తున్న పోరాటంలోని అపూర్వసన్నివేశాలు. గోపీచంద్‌వంటి హేతువాదికి ఈ పోరాటాల వెనుక ఉన్న ఆర్థిక సాంఘిక రాజకీయ కారణాలపట్ల ఆసక్తి కలగటం సహజమే.

1935 మార్చ్‌లో గుంటూరులో కమ్యూనిస్ట్ పార్టీ శాఖ ప్రారంభమైన తర్వాత, తెనాలిలో కూడా ఒక శాఖ ఏర్పడింది.[35] వెంటనే అందుబాటులోకి వచ్చిన కమ్యూనిస్టు సాహిత్యాన్ని గోపీచంద్ చదివాడు రష్యా విప్లవాన్ని పరిశీలించాడు. విప్లవానికి ముందున్న రాజకీయతత్వాలను అధ్యయనం చేశాడు.[36]

1936 లో అప్పటి ఆంధ్ర విశ్వవిద్యాలయం వైస్-ఛాన్సలర్‌గా ఉన్న కట్టమంచి రామలింగారెడ్డిగారు 'సోషలిజం' పుస్తకాలను తమ విశ్వవిద్యాలయ గ్రంథాలయంలో నిషేధించారు. ఆ తర్వాతి కాలంలో మద్రాసు ప్రధానమంత్రిగా ఉన్న రాజాజీగారు కూడా 1937, 38లలో కొన్ని కమ్యూనిస్టు గ్రంథాలను స్వయంగా నిషేధించారు.[37] కమ్యూనిజాన్ని అణచివేయటానికి బ్రిటిష్‌వాళ్ళతోపాటుగా అధికారంలో ఉన్న భారతీయులుకూడా దమననీతిని ఉపయోగించటం అప్పటి యువతరానికి కోపకారణమైంది. నిషేధాల మూలంగా మార్క్సిజంపట్ల యువకులకు, విద్యార్థులకు ఆసక్తి పెరిగిందే కాని తగ్గలేదు.

రెండవ ప్రపంచయుద్ధ కాలంలో గోపీచంద్ రచించిన 'పిత్రార్జితం'[38] కథను పరిశీలిస్తే, ఆయనకు కమ్యూనిస్టు పార్టీ మీదున్న అభిమానం స్పష్టమౌతుంది.

తండ్రి అభీష్టానికీ, గురుతుల్యుడైన గోపీ ఆకాంక్షకు విరుద్ధంగా తన ఆస్తిని 'పార్టీ'కి ఉడుతాభక్తిగా ఇచ్చేయటానికి నిర్ణయించుకున్న శేషాద్రికథ 'పిత్రార్జితం'. ఊళ్ళోని తనవంటి వాళ్ళను ఒక జట్టుగాచేసి బుర్రకథలవంటి కళారూపాల ద్వారా ఫాసిజానికి వ్యతిరేకంగా పోరాడటానికి పూనుకున్న

వాడు శేషాద్రి. శేషాద్రి సొంత ఆస్తికి వ్యతిరేకి. పొలం ప్రజల్ని 'రియాక్షనరీ'గా తయారు చేస్తున్నదంటాడు.

శేషాద్రి ఆస్తి అమ్మకుండా నచ్చజెప్పటానికి వచ్చిన గోపీ ప్రయత్నం విఫలమౌతుంది.

ఈ కథలో ఎక్కడా 'కమ్యూనిజం' అన్న మాటలేదు. రచయిత 'పార్టీ' అన్న మాటనే ఉపయోగించాడు ఆ పార్టీ మరేదైనా కావచ్చునని ఊహించవచ్చు. నిజానికి ఆ రోజుల్లో కాంగ్రెస్‌పార్టీకి కూడా అనేకులు తమ ఆస్తిపాస్తులను ధారపోశారు. 'రియాక్షనరీ' 'విప్లవసమరం' 'గెరిల్లా' వంటి మాటలు, సొంత ఆస్తికి వ్యతిరేకంగా శేషాద్రి వ్యక్తం చేసిన భావాలు, ఆ పార్టీ కమ్యూనిస్ట్ పార్టీయేనని చెప్పటానికి సాక్ష్యాలు. బుర్రకథలవంటి కళారూపాలను, ప్రజాసమస్యలతో కూడిన సజీవనాటకాలను తమ పార్టీ ప్రచారంకోసం కమ్యూనిస్టులు ఉపయోగించుకున్నట్లుగా39 ఏ పార్టీవాళ్ళూ ఉపయోగించుకోలేదు.

ఈ కథపట్ల గోపీచంద్‌కు ప్రత్యేకాభిమానం ఉన్నట్లున్నది. దాదాపు రెండు దశాబ్దాల తర్వాత 'పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా' నవలలో పేరు కూడా మార్చకుండా ఈ కథను రచయిత ప్రస్తావించాడు. ఆత్మకథాత్మక లక్షణాలున్న ఈ నవలలో రచయిత ప్రతినిధి పాత్ర అయిన కేశవమూర్తిని కమ్యూనిస్టుల మీది సానుభూతితో పూర్వాశ్రమంలో ఈ కథ రాసినందుకు, ఆయన మిత్రుడు శారదవ్రతుడు ఆక్షేపించాడు. ఆ సన్నివేశంలో —

'అవి కమ్యూనిస్టు పార్టీ ముమ్మరంగా ప్రచారం చేస్తున్న రోజులు. యువకులూ, కార్మిక కర్షకులూ దాని అండన జేరుతున్న రోజులు. ఎక్కడ, ఏ సమయంలో మీటింగు పెట్టినా పదివేలమందికి తక్కువ హాజరయ్యేవారు కారు ఆనాటి సభ్యుల ఆవేశం, ఆ పార్టీ అంటే ఇష్టంలేనివారినికూడా కదిపిందని చెప్పటం ఏ మాత్రం అతిశయోక్తి కాదు. తీవ్రంగా విమర్శించే వ్యక్తులు కూడా వారి పట్టుదలకూ, సంఘటనా శక్తికీ, కార్యదక్షతకూ, త్యాగనిరతికి లోలోపల జోహారులర్పిస్తూ ఉండేవారు. 'త్యాగనిరతి అంటే

జ్ఞాపకం వచ్చింది. ఆనాడు ఆ పార్టీ సభ్యులు రేపు ఏమవుతుందనే ఆలోచన లేకుండా ఆస్తులను తెగనమ్మి పార్టీకి ఇచ్చివేశారు. ఆ పార్టీ కంకరరాళ్ళతో అగ్నిజ్వాలలను రేపిన రోజులవి.40 అని వివరించాడు రచయిత

కమ్యూనిస్టుల కార్యదీక్షపట్ల, త్యాగనిరతిపట్ల గోపీచంద్‌కు ఏర్పడ్డ అభిమానం మార్క్సిజంపట్ల గాఢమైన అభిమానాన్ని కలిగించింది అంటే, అతని దృష్టి సిద్ధాంతంవైపే ప్రసరించింది. పార్టీ రాజకీయాలకు మాత్రం దూరంగానే ఉన్నాడు. కారణం తనకు తెలిసిన యువకులైన కమ్యూనిస్టుల మనస్తత్వం గోపీచంద్‌కు నచ్చలేదు. వారి మాటతీరు, ఆవేశం తిరుగుబాటు ధోరణి వంటివి గోపీచంద్‌కు నచ్చలేదు. ఇందుకు సాక్ష్యం "పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా'' లో దొరుకుతుంది. గోపీచంద్ ప్రతినిధిపాత్ర కేశవమూర్తికి యువకుడైన నాసరయ్య అనే కమ్యూనిస్టుతో పరిచయం ఏర్పడింది. నాసరయ్య కమ్యూనిజం గూర్చి బిగ్గరగా మాట్లాడేవాడు. కేశవమూర్తి ఏమైనా ప్రశ్నల నడిగితే జవాబులు చెప్పటానికి బదులు—

''మేము అధికారంలోకి రాగానే మేముచేసే మొట్టమొదటిపని ఏమనుకున్నావు? నీబోటివాళ్ళను ఉరితియ్యటమే41 అనేవాడు. ఈ అహేతుక అమానుష ధోరణి గోపీచంద్‌కు నచ్చలేదు

'నాసరయ్యలాంటి న్యూరోటిక్ కాక, మర్యాదమన్ననలు తెలిసిన ఏ కమ్యూనిస్టు సభ్యుడో తనకు తగిలివుంటే, తన జీవితం వేరే విధంగా నడిచి వుండేది.'42 అనుకుంటాడు కేశవమూర్తి. ఇది గోపీచంద్ అభిప్రాయమే. ఆ పార్టీలో చేరకపోవటానికి, అప్పటికే తానొక 'మేధావి'43నని గోపీచంద్ భావించటం కూడా ఒక కారణమే. ఆ పార్టీలో చేరితే, తనను గౌరవించటానికి బదులు మేధావి వర్గానికి చెందినందుకు ద్వేషిస్తారేమోనని కూడా ఆయన భావించాడు.

ఈ కారణాల దృష్ట్యా, పార్టీ రాజకీయాలకు దూరంగా ఉంటూ, తానే నిజమైన మార్క్సిస్టునని భావిస్తూ వ్యాసాలనూ, కథలనూ రచించాడు. కాని పార్టీ పట్ల ఉన్న అభిప్రాయం, పార్టీ తత్త్వం పట్ల ఆయనకు అర్ధమనస్కతను ఏర్పరిచింది.

1938లో గోపీచంద్ ప్రచురించిన 'పట్టాభిగారి సోషలిజం'లో పట్టాభి గారు చెప్పే కాంగ్రెస్ సోషలిజాన్ని ఖండించి, 'వ్యక్తిని సంఘానికి లోబరచటం, కేపిటలిస్టులను లేకుండా చేయటం, సంఘంలో భూకామందులను లేకుండా చేయడం, సంఘంలో వ్యక్తి లాభపద్ధతి లేకుండా చెయ్యటం'44 వంటి కమ్యూనిస్టు భావాలను ప్రతిపాదించాడు. అయితే, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాన్ని టూకీగా చెప్పటానికి పూనుకొని విప్లవశక్తులను, విప్లవ వ్యతిరేక శక్తులను కలిపివేశాడు. అందుకే 'ఎనార్కిజం'45ను కూడా విప్లవ లక్ష్యసాధనలో ఒక దశగా భావించాడు. 'ఎనార్కిజం'కు నాయనికుగా గోపీచంద్ పేర్కొన్న 'బకూనిన్' మార్క్సుకు వ్యతిరేకంగా స్విట్జర్లాండులో పోటీ ఫెడరేషన్ ఏర్పాటుచేశాడు. 1872లో జరిగిన హేగ్ కాంగ్రెస్‌లో మార్క్సిస్టులకూ బకూనిస్టులకు విభేదాలు తీవ్రతరమైనాయి. అనేక దేశాల్లో తమ మురాలను బలపరచుకోవటం ద్వారా బకూనిన్ అంతర్జాతీయ కార్మికోద్యమాన్ని బలహీనపరచటానికే యత్నించాడు. 'రాజకీయాధికారాన్ని చేపట్టటం కాకుండా, రాజకీయాధికారాన్ని విధ్వంసం చేయాలనేదే'46 బకూనిన్ సిద్ధాంతం. గోపీచంద్ భావించినట్లుగా విధ్వంసకాండ విప్లవ లక్ష్యసాధనలో ఒక దశ కాజాలదు.

'ప్రజాసాహిత్యం'47 అనే శీర్షికతో గోపీచంద్ ప్రకటించిన వ్యాసంలోని అంశాలను కమ్యూనిస్ట్ నాయకుడు మద్దుకూరి చంద్రశేఖరరావు (చంద్రం) గారు ఖండించారు.

తాను, 'మార్క్సిస్ట్ దృక్పథం'లో ఆ వ్యాసాన్ని రచించినట్లుగా గోపీచంద్ వెల్లడిచేసి—

'ఎవరికి వాళ్ళే బ్రతికే పద్ధతికి వ్యతిరేకం జరగడంవల్ల సహకారంతో కూడుకున్న జమీందారి విధానం వచ్చింది,' అని రాశారు. దీన్ని ఖండిస్తూ చంద్రం గారు—

జమీందారీ విధానానికి పూర్వం ఎవరికివాళ్ళే బ్రతికే పద్ధతి లేదనీ, బానిస విధానం వుండేదనీ, ఏ మాత్రం మార్క్సిస్టు జ్ఞానం వున్న వారికైనా ఇది బోధపడుతుందనీ'48 అన్నారు. అదే వ్యాసంలో మరోచోట—

'ప్రిమిటివ్ కమ్యూనిజంలోనుంచి జమీందారీ విధానము వచ్చింద'ని గోపీచంద్ రాశాడు.

'ఆదిమ సమాజంలో నుంచి పశువుల పెంపకం, వ్యవసాయం కొలదిగ వృద్ధి అయిన తరువాత తెగలు తాము జయించిన శత్రువులను బానిసలుగా పనిచేయించుకొనేవారనీ బానిస విధానం అమలులోనికి వచ్చిందినీ సమాజ శాస్త్రం చెబుతూంది'49 అంటూ చంద్రశేఖరరావుగారు గోపీచంద్ చేసిన తప్పును స్పష్టంగా ఖండించారు,

'మార్క్సిస్ట్ దృక్పథంతో' రాస్తున్నానంటూనే గోపీచంద్ ఈ రెండు సందర్భాలలోనూ ఒకే తప్పు చేశాడు.

ఆదిమ కమ్యూనిస్టు విధానానికి భూస్వామ్య విధానానికి మధ్యన బానిస విధానం ఉన్నదని మరిచిపోయాడు.50

పై పరిశీలనను బట్టి తేలిందేమిటంటే. గోపీచంద్‌కు మార్క్సిజంపైన అభిమానమైతే ఉన్నది. కాని, గురి మాత్రం లేదు అని అర్థమన్నప్పటితోనే ఒకవైపు శంకిస్తూనే ఆయన మార్క్సిజాన్ని అధ్యయనం చేశాడు

ఇందుకు కారణం యం.యన్. రాయ్.

# 3. యం.యన్. రాయ్ ప్రభావం

గోపీచంద్ మీద యం.యన్. రాయ్ ప్రభావం గణనీయంగానే వుంది. రాయ్ అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించాడు. రష్యా నాయకులతో ఏర్పడ్డ భేదాభిప్రాయాలకారణంగా రష్యా నుంచి బెర్లిన్ మీదుగా 1930 డిసెంబర్‌లో భారతదేశం చేరుకున్నాడు. అప్పుడు దేశంలో శాసనోల్లంఘనోద్యమం సాగుతున్నది.

భారతదేశ స్వాతంత్ర్యమే రాయ్ జీవిత లక్ష్యం కనుక, విదేశాలలో ఉంటున్నా, ఎప్పటికప్పుడు దేశంలోని రాజకీయ పరిణామాలను గమనించాడు. దేశంలో కమ్యూనిస్టుపార్టీ స్థాపనకు కృషిచేశాడు. కరపత్రాల ద్వారా ఉత్తరాల ద్వారా స్వాతంత్ర్యోద్యమం గూర్చి తన అభిప్రాయాలను మిత్రులకు తెలియజేస్తుండేవాడు.

సహాయ నిరాకరణోద్యమ సందర్భంలో గాంధీగారి పేరు రష్యా నాయకులకు ప్రముఖంగా వినిపించింది. సామ్రాజ్యవాదంతో పోరాడుతున్నందుకు గాంధీగారు కూడా విప్లవ నాయకుడేనని లెనిన్ భావించాడు. కాని, లెనిన్ అభిప్రాయంతో రాయ్ ఏకీభవించలేదు. 'గాంధీ రాజకీయంగా పురోగామే కాని, సాంఘికంగా తిరోగామి'51 అని రాయ్ అభిప్రాయపడ్డాడు. గాంధీగారి మతప్రోక్త భావాలు మధ్యయుగాల మనస్తత్వం ఉన్న భారతీయులను ఆకర్షిస్తున్నాయని రాయ్ భావించాడు. ఆ తర్వాతికాలంలో కూడా రాయ్ అభిప్రాయాలలో పెద్దగా మార్పు రాలేదు.

కమ్యూనిస్టు ఉద్యమ వ్యాప్తికి కృషిచేస్తూ బ్రిటిష్ సామ్రాజ్యాన్ని కూలదోయటానికి కుట్రపన్నాడన్న నేరంకింద చాలాకాలం నుంచే పోలీసులు రాయ్ కోసం వెతుకుతున్నారు. చివరకు 21-7-1931 నాడు బొంబాయిలో రాయ్‌ను పోలీసులు అరెస్టు చేయగలిగారు. కాన్పూర్ కుట్రకేసులో ఆరు

సంవత్సరాలు కఠిన కారాగారావాస శిక్ష అనుభవించి 20-11-1936 నాడు జైలునుంచి విడుదలయ్యాడు.

జైలులో ఉన్న కాలంలో ఆయన అనేక పుస్తకాలు రచించాడు. జైలులో ఉండగానే అచ్చయిన పుస్తకాలు: 'My defence', 'Congress at the cross roads', 'On the Congress Constitution'. జైలు నుంచి బయటకు వచ్చిన తర్వాత అచ్చయిన పుస్తకాలు: "Letters from Jail", 'Letters to the Congress Socialist Party' 'From Savagery to Civilization' 'Science and Superstition', 'Fascism', 'Materialism',[52] మొదలైనవి.

పై పుస్తకాల ద్వారా, 'Independent India' అనే పత్రికద్వారా తన భావాలను రాయ్ ప్రచారం చేశాడు.

రాయ్ భావాలు, మార్క్సిజం మీద ఆధారపడ్డ భావాలే. కాని రష్యాలో స్టాలిన్ అనుసరించిన విధానం 'దారుణ వామపక్ష విధానమ'ని (Ultra-leftist Policy) రాయ్ భావించాడు.

'దారుణ వామపక్ష విధానం ద్వారా ప్రజాస్వామ్య శక్తులతో సహాయ నిరాకరణ జరపటంవల్ల అవి నీరసించి క్రమంగా ఫాసిజం విజృంభించి మానవ స్వేచ్ఛకూ, సంస్కృతికీ ప్రమాదకరంగా పరిణమిస్తుంద'నీ[53] రాయ్ భావించాడు.

ఈ భావం పునాది మీద కొత్త రాజకీయ సిద్ధాంతాన్ని రూపొందించాలనే భావం రాయ్‌కు బహుశా అప్పుడే కలిగి ఉంటుంది.

'ఇండియాలోని వామపక్ష వర్గాలను విప్లవాత్మక పంథాలో నడిపి ప్రజాస్వామ్య విప్లవాన్ని సాధించే కార్యక్రమానికి అవకాశం గలదని'[54] భావించాడు. కాని కాంగ్రెస్‌కు ప్రత్యామ్నాయంగా పార్టీని స్థాపించటంగానీ, గాంధీగారి నాయకత్వాన్ని ఎదురించటంగానీ అసాధ్యమని తెలుసుకున్నాడు. కాంగ్రెస్ పార్టీలోకి ప్రవేశించి, క్రమంగా దాన్ని విప్లవ చైతన్యం గల కర్షక కార్మిక వర్గాల పార్టీగా, రూపొందించవచ్చునని, తద్వారా రాజకీయ స్వాతం

త్ర్యంతోపాటుగా ఆర్థిక సాంఘిక పునర్నిర్మాణాన్ని సాధించవచ్చునని ఆశించాడు.

ఈ ఉద్దేశంతోనే తన సహచర మిత్రులకు 'కాంగ్రెస్‌ను బలపరచండి' ('Rally round the Congress') అనే పిలుపునిచ్చాడు. సహచరులతో పాటు, కాంగ్రెసులో ప్రవేశించాడు. ఫెయిజ్‌పూర్ కాంగ్రెస్ (డిసెంబర్ 1936)లో సభాసదులను విశేషంగా ఆకర్షించాడు.

రాయ్ భావాలూ, మార్గమూ అనుసరించినవారు 'రాడికల్ కాంగ్రెస్ వాదుల బృందము' ('League of Radical Congress men')గా ఏర్పడి 'రాయిస్టులు' ('Rayists') అని వ్యవహరింపబడ్డారు. ఫెయిజ్‌పూర్ కాంగ్రెస్ తర్వాత రాయ్ మహారాష్ట్ర, కర్ణాటక, ఆంధ్ర ప్రాంతాలలో కాంగ్రెస్‌కు ప్రచారం చేశాడు.'[55]

ఈ సందర్భంలోనే గోపీచంద్‌కు 'రాయిజం'తో పరిచయం ఏర్పడింది. కమ్యూనిస్టులపట్ల అసంతృప్తి కలిగినందువల్ల అతడు 'రాయిజం' పట్ల మొగ్గు చూపించాడు. ఇటు రష్యా అనుకూల కమ్యూనిజంతోపాటు గాంధీగారి నాయకత్వంలోని కాంగ్రెస్ కూడా ఆమోదయోగ్యం కాని వామపక్షవాదులకు రాయ్ ఆశాజ్యోతి అయ్యాడు. తాను 'నిజమైన మార్క్సిస్టున'నీ రాయ్ స్పష్టం చేస్తూ వచ్చాడు కనుక. రాయిస్టులంతా తామే నిజమైన మార్క్సిస్టులమని ప్రకటిస్తూ వ్యాసాలను కథలను ఇతర రచనలనూ ప్రచురించారు. గోపీచంద్ కూడా 1938లో 'ప్రజామిత్ర' పత్రికలో 'రాయ్ వ్యాసాలు' అన్న పేరుతో కొన్ని రచనలను ప్రకటించాడు.[56]

రాయ్ ప్రభావంలోనికి వచ్చిన తర్వాత గోపీచంద్ అతని మిత్రులు 'మార్క్సిజానికి కమ్యూనిస్టులు సిచార్థం కల్పించి భ్రష్టుచేస్తున్నారనీ, నిజమైన కమ్యూనిస్టులు తామేనని'[57] విశ్వసించేవారు. ఈ కాలంలోనే గోపీచంద్ రాసిన 'మార్క్సిజం వ్యాసాలు అనేకం 'ప్రజామిత్ర'లో ప్రచురింపబడినవి.'[58]

రెండో ప్రపంచ యుద్ధ కాలంలో తమ ప్రత్యేక వ్యక్తిత్వాన్ని ప్రదర్శించటానికి రాయ్‌కు, రాయిస్టులకు ఒక అవకాశం లభించింది. కాంగ్రెస్

యుద్ధం విషయంలో ప్రభుత్వంతో సహాయనిరాకరణ విధానాన్ని అవలంబిం చింది హిట్లర్ రష్యా మీద దాడిచేయనంతకాలం కమ్యూనిస్టులు దానిని సామ్రాజ్యవాద వ్యతిరేక యుద్ధంగానే భావించారు. ఈ పరిస్థితిలో రాయ్ మాత్రం ఫాసిస్ట్ శక్తులను ఎదిరించటానికి బ్రిటిష్ ప్రభుత్వంతో సహకరించా లని ప్రచారం చేశాడు.59

ఈ ఘట్టంలో రాయ్ భావాలు గోపీచంద్ రచనల్లో స్పష్టంగా ప్రతిబిం బించాయి.

'పీడకల'60 అన్న కథలో 'రాధాకృష్ణమూర్తి' అనే రచయితను గూర్చి ఆలోచిస్తూ కథకుడు నిద్రపోగా, కలలో ఉపన్యాస వేదికమీద ఆ రచయిత కనిపిస్తాడు. తన సుదీర్ఘ ఉపన్యాసంలో—

"కాంగ్రెస్ సంస్థ మిమ్మల్ని ఎప్పుడో విడిచిపెట్టింది" అంటాడు.

యుద్ధానికి ముందే కాంగ్రెస్ తన సహాయ నిరాకరణ వైఖరిని ప్రభుత్వా నికి తెలియజేసింది. ఈ అంశాన్ని దృష్టిలో ఉంచుకొని రాయ్ ప్రభావంతో కాంగ్రెస్ ప్రజలకు దూరమైందని అంటున్నాడు ఉపన్యాసకుడు. కాంగ్రెస్, అధిక సంఖ్యాక ప్రజలైన కర్షక కార్మికుల పార్టీ కాదని మొదటి నుంచీ రాయ్ భావిస్తూ వచ్చాడు.

"సంఘం అభివృద్ధి చెందాలంటే వర్గపోరాటంతో దిగువ వర్గాలు అధి కారం స్వాధీనం చేసుకోవటం కంటే గత్యంతరంలేదు. విప్లవం కంటే శరణ్యం లేదు." అంటాడు ఉపన్యాసకుడు.

ఇది మార్క్సిస్ట్ అవగాహనే. మార్క్స్ మీద పూర్తి విశ్వాసం ఉన్న ప్పటి రాయ్ భావం కూడా ఇదే. కొంతకాలం తర్వాత రాయ్ వర్గాలనే నమ్మ లేదు కనుక, మార్క్సిస్ట్ అవగాహనతో విప్లవాన్ని కూడా నమ్మలేదు. వివిధ భావాలు ఆనాటి యువకునిలో ఎలా చోటుచేసుకున్నాయో చెప్పటానికి కూడా ఈ మాటలు ఉపకరిస్తాయి.

"ఒకదశ వరకూ జాతీయవాదం విప్లవపూరితంగా వుంటుందనే మాట నిజమే....ధర్మ సిద్ధాంతాన్ని ఆధారం చేసుకొని, దేవుని మీద భారంవేసి,

బతుకు వెళ్ళబోసుకునే ప్రజల్లో ఒక లౌకిక ఆదర్శాన్నీ, తీవ్ర వాంఛనీ కలి గించి, వాళ్ల దృష్టిని సంఘం వైపుకి తిప్పుతుంది. కాని లాభం వొచ్చే సమయం వచ్చేటప్పటికి ఉద్యమాన్ని నడిపే నాయకత్వం ఇతర వర్గాలను మోసంచేసో అణగదొక్కో తానే అధికారంలో వుండేటట్లు, తన వర్గానికే లాభాలు వొచ్చే టట్లు చేసుకుంటుంది" అంటూ కొనసాగించాడు ఉపన్యాసకుడు.

"Nationalism is confined to the bourgeois"61 అన్న రాయ్ అభిప్రాయానికి, గాంధీగారివి మతప్రోక్త భావాలు కనుక మధ్యయుగాల మన స్తత్వంగల ప్రజలను ఆకర్షించగలిగాయనే రాయ్ అభిప్రాయానికి పై మాటలు ఒక వివరణ. జాతీయవాదం నుంచి అంతర్జాతీయవాదానికి ప్రజలు ఎదగా లనీ, ప్రజల్లో విప్లవచైతన్యం లేనిపక్షంలో నాయకత్వం వహించిన వర్గమే లాభపడుతుందని రాయ్ విశ్వాసం. కాంగ్రెస్‌ను విప్లవసంస్థగా రూపొందించ టానికే రాయ్ తన అనుచరులతో ఆ పార్టీలో ప్రవేశించాడు.

కల చివరిదశలో

"అవును నేను యింగ్లండుకు సహాయం చెయ్యమనే చెప్పుతున్నాను. యుద్ధానంతరం ఇంగ్లండు మనల్ని దోచుకునే స్థితిలో వుండదు" అన్నాడు.

—ఇది కూడా పూర్తిగా రాయ్ అభిప్రాయమే.62 యుద్ధానంతరం స్వాతంత్ర్యం చారిత్రకంగా అనివార్యమని కూడా రాయ్ ప్రచారం చేశాడు.

కల చివరలో ఒక కుర్రవాడు "అతడు రాయిస్ట్, అతడు రాయిస్ట్" అంటూ కేకలు వేశాడు. జనమంతా ఒక్కసారి నివ్వెరపోయింది. "రాయిస్టా" "ఓరి వీడి...." "వీళ్ళు మనిషూసి మారేడు కాయ చేస్తారురా" "వీళ్ళతో మాట్లాడగూడదురా" అంటూ వెళ్ళిపోతారు.

రాయిస్టుల వాదం న్యాయమైనదేననీ, కమ్యూనిస్టులూ, ఇతర పార్టీల వాళ్లూ ప్రజల్లో తప్పుడు అభిప్రాయాలు కలిగించినందువల్ల విఫలమైందనే సూచనతో కథ ముగిసింది.

'దేశం ఏమయ్యేట్టు ?' అన్న కథలో కూడా రాయిజం ప్రభావం కని పిస్తుంది. ఈ కథ దాదాపుగా ఒక నాటిక లాగా వుంది. ముఖ్యపాత్రధారులు : కాంగ్రెస్ వాది, కమ్యూనిస్ట్, రాయిస్ట్, కాంగ్రెస్ సోషలిస్ట్.

కమ్యూనిస్ట్ దృష్టిలోనూ, రాయిస్ట్ దృష్టిలోనూ కాంగ్రెస్ 'ఫాసిస్ట్ సంస్థ'. కమ్యూనిస్టూ, రాయిస్టూ కలిసి కాంగ్రెస్ సోషలిస్ట్ పార్టీని నిరసిస్తారు.

''మీరు మమ్మల్ని ప్రోత్సాహపరిచి మాతో కలిసి పనిచేసి అప్పుడిలా అంటున్నారా?'' అని కాంగ్రెసు— సోషలిస్ట్ ప్రశ్నిస్తాడు.

కమ్యూనిస్ట్ పార్టీని ప్రభుత్వం నిషేధించగానే అంతా కాంగ్రెస్ సోష లిస్ట్ పార్టీలో చేరి, ఆ పార్టీని నిజమైన మార్క్సిస్ట్ పార్టీగా అభివృద్ధిపరచా లని, 1936లో కాకినాడలో జరిగిన రహస్య సమావేశంలో కమ్యూనిస్టులు నిర్ణయించుకున్నారు.63 ఈ నిర్ణయం మేరకు కమ్యూనిస్టులు కాంగ్రెస్ సోష లిస్ట్ పార్టీలో చేరారు.

....'యం.యన్. రాయ్ గారు కాంగ్రెసు సోషలిస్ట్ పార్టీలో చేరాలని వాదించారు. తీరా 1935లో అదే విధంగా జరగగా, కాంగ్రెసు సోషలిస్ట్ పార్టీ నుండి బయటకు రావాలని వాదించారు'54 అన్న విమర్శకు కూడా రాయ్ గురయ్యారు.

'రాయ్ జైల్లో ఉన్న రోజుల్లోనే కాంగ్రెస్ సోషలిస్ట్ పార్టీ ఏర్పడింది. కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ, ఫార్వర్డ్ బ్లాక్ నిర్మాణానికి రాయ్ పూర్తిగా వ్యతి రేకి. ఇట్టి ముఠాలేర్పడటంవల్ల సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమం దుర్బలం కావడమేగాక, వామపక్షీయ వర్గాలలో అనైక్యత మేర్పడి, కాంగ్రెస్ నాయ కత్వం వహిస్తున్న అభివృద్ధినిరోధక శక్తులకు బలపడే అవకాశాన్నిస్తుంద'ని65 రాయ్ అనుచరుల అభిప్రాయం.

కథలో ''పీళ్ళ నాయకుణ్ణి అంతర్జాతీయ పార్టీ నుండి వెళ్ళగొట్టడం'' అంటాడు కమ్యూనిస్టు.

చైనా సమస్య మీదా, సామ్రాజ్యవాద ఉపసంహరణ సిద్ధాంతం మీదా, దారుణ వామపక్ష విధానం మీదా రాయ్‌కు స్టాలిన్‌తోనూ, ఇతర రష్యా నాయ కులతోనూ విభేదాలు ఏర్పడ్డాయి. పర్యవసానంగా 'కొమింటర్న్' నుంచి 1929 డిసెంబర్‌లో రాయ్‌ను బహిష్కరించారు.66 ఈ అంశాన్నే కమ్యూ నిస్టు పై వాక్యంలో ప్రస్తావించాడు. 'రాయిస్ట్'ను 'రెనెగేడ్' (స్వపక్షానికి

ద్రోహం తలపెట్టేవాడు) అని పిలుస్తాడు. ఈ అభిప్రాయంతో కాంగ్రెస్ సోష లిస్టు ఏకీభవిస్తాడు !

"కాంగ్రెస్‌ను బలపరచమని చెప్పి, తాను మరో పార్టీ పెట్టాడు." అన్నది కూడా కమ్యూనిస్టు చేసిన మరో విమర్శ.

ఇందుకు రాయిస్ట్ ఇచ్చే జవాబు—

"పరిస్థితుల్నిబట్టి పద్ధతులు మార్చుకోవటం మీకు చేతగాదు. ఫాసిజం ఇంపీరియలిజం కంటే ఘోరమైంది."

1936 నుంచే రాయ్, తన అనుచరులతో ప్రత్యేక బృందంగా కాంగ్రెస్ కార్యక్రమాలలో పాల్గొన్న విషయం ఇదివరకే చెప్పటం జరిగింది. రాయ్ 1940లో కాంగ్రెస్ నుంచి విడిపోయి, స్థాపించిన 'రాడికల్ డెమొక్రాటిక్ పార్టీ' ఆశయం ఫాసిజం నుంచి దేశాన్ని రక్షించటమేనని రాయిస్ట్ అభిప్రాయం. తన నాయకుని చర్యను సరైన ఎత్తుగడగా రాయిస్ట్ సమర్థిస్తున్నాడు.

కాంగ్రెస్ పార్టీ యుద్ధంలో బ్రిటిష్ ప్రభుత్వంతో సహకరించటంలేదు కనుక, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ తీవ్రవాదులను మోసంచేస్తున్నది కనుక, కమ్యూనిస్టు పార్టీ ఫాసిజం ప్రమాదాన్ని అప్పటికి గుర్తించక సామ్రాజ్యవాద వ్యతిరేక యుద్ధమని భ్రమపడుతున్నది కనుక రాయిస్ట్ విమర్శలకు గురయ్యాయి,

గోపీచంద్ మొదటి నవల 'పరివర్తనం'పైన రాయ్ ప్రభావం కనిపిస్తుంది. ఈ నవల రచనాకాలం నాటికి గోపీచంద్ రాయ్ అనుచరుడుగా ప్రసిద్ధికెక్కాడు. 'సెక్సు వాంఛ ప్రకృతి ప్రేరణ. దాన్ని మనం తీసివెయ్యలేం. మానవునికి సహజంగా వుండే వాంఛలను తీర్చుకోవలసిందే కాని, అణగదొక్కితే ఎన్ని వెర్రితలలు వేస్తుందో ఎవ్వరు చెప్పగలరు.' అని నవల పీఠికలో గోపీచంద్ చెప్పిన మాటలు, ఎం.ఎన్. రాయ్ బ్రహ్మచర్యాన్ని ఖండిస్తూ చెప్పిన ఈ కింది మాటలను గుర్తు చేస్తాయి.

'బ్రహ్మచర్యం విపరీత పరిస్థితులకు దారితీస్తుంది. ప్రకృతి సహజమైన కార్యాన్ని అరికట్టటం ప్రమాదభరితం. ప్రకృతి పగతీర్చుకొనక మానదు.'67

1945 వరకే గోపీచంద్ మీద రాయ్ ప్రత్యక్ష ప్రభావం కనిపిస్తుంది.

'అసమర్థుని జీవయాత్ర'లోని రామయ్య తాత సీతారామారావుకు బోధించే ప్రధాన తత్వం రాయిజమే. అయితే, సీతారామారావుమీద దాని ప్రభావం మృగ్యం. అందువల్ల తాతకూ, సీతారామారావుకూ మధ్యన కనిపించే ఈ విభేదం, గోపీచంద్‌లో రాజుకుంటున్న అసంతృప్తికి సంకేతం.

రాయ్ భావాలు నవ్యమానతావాదంగా రూపొందిన తర్వాత చాలాకాలం వరకు గోపీచంద్ నవలలు రాయనేలేదు. 1960లో నవలా రచనకు తిరిగి పూనుకున్న నాటికి ఆధ్యాత్మికవాదిగా రూపొందాడు. అయినా, ఆ నవల మీద మానవతావాద ప్రభావం కనిపిస్తుంది. రాయ్ రాజకీయ భావాల ప్రభావం కూడా కనిపిస్తుంది.

1946లో రాయ్ ప్రతిపాదించిన రాడికల్ ప్రజాస్వామ్య సూత్రాలకు గానీ, ఆ తర్వాత ప్రవచించిన నవ్యమానవవాదానికిగానీ మూలం మానవుడు.

'మానవుడే అన్నిటికి ప్రమాణం' (ప్రోటోగోరస్) 'మానవజాతికి మానవుడే మూలం' అనే సూక్తుల68 ప్రేరణతో ప్రపంచాన్ని శ్రేయో రాజ్యంగా, విశ్వభ్రాతృత్వ వ్యవస్థగా పునర్నిర్మించటమే రాయ్ ఆశయం.

అందుకే——

'పార్టీ రాజకీయాలు, పార్టీ ప్రభుత్వాలు యీ రెంటిలోను నాటి ఆదర్శాలకు భిన్నంగా'69 ఆచరణలో వ్యక్తం అవుతున్న ధోరణులను రాయ్ ఖండించాడు.

అంతేకాదు,

'కమ్యూనిజంతో రాజకీయ స్వాతంత్ర్యంలేదు'70 అని కూడా చెప్తూ వచ్చాడు. ఈ మాటను గోపీచంద్ పూర్తిగా విశ్వసించాడు.

'పిల్లతెమ్మెర'లోని శచీంద్రుడు కమ్యూనిస్టు పార్టీకి చెందినవాడే,71 ఆ పార్టీ ప్రచారంకోసం సాంస్కృతిక కార్యక్రమాలు చేపడతాడు. శమంతక మణిని అగ్రశ్రేణితారగా రూపొందించాలనుకుంటాడు. పార్టీ అతణ్ణి బహిష్క

రించినా, అతని స్వభావంలోకాని, విశ్వాసంలోకాని అంతగా మార్పులేదు. చివరికి అతడు శమంతకమణిని హత్య చేస్తాడు. ఈ హత్యకు వైయక్తిక కారణాలతోపాటు అతణ్ణి కొరముట్టుగా మార్చిన పార్టీ తత్వప్రభావం కూడా ఉందని రచయిత సూచించాడు.

శమంతకమణిని సానుభూతితో చూడటంలోనూ, శమంతకమణి కొడుకును పెంచుకోవటంలోనూ డ్యాన్సుమాష్టారు ప్రదర్శించింది మానవత్వమే. డ్యాన్సుమాష్టారు మానవత్వాన్ని ప్రదర్శించటానికి ఒక కారణం, అతడు ఏ పార్టీ తత్వానికి చెందినవాడు కాకపోవటమేనని రచయిత ఉద్దేశం.

ఒకోక్కసారి సాధారణ వివేకం కూడా కోల్పోయిన వ్యక్తులుగా కమ్యూనిస్టులు చిత్రీకరింపబడ్డారు.

'చీకటిగదులు'లో దమయంతి మరణించిందని తెలుసుకొని గోపాలాన్ని పరామర్శించటానికి వచ్చిన శివకుమార్—

"ఈ ప్రపంచం లోపభూయిష్టమైంది కనుక ఇటువంటి కష్టాలు తరుచు వస్తూనేవుంటై....ఇటువంటి కష్టాలులేని సమాజంకోసం ద్విగుణీకృతోత్సాహంతో పాటుపడాలి"72 అంటాడు.

ఇంతకూ, పెంచి పెద్దచేసిన తల్లి చనిపోవటమే గోపాలానికి సంభవించిన కష్టం. ఈ మృత్యువువల్ల వచ్చిన కష్టమూ, ఆర్థిక వ్యత్యాసాలవల్ల వచ్చే కష్టాలూ ఒకటే అయినట్లుగా రచయిత కమ్యూనిస్టు శివకుమార్ చేత మాట్లాడించాడు।

వ్యక్తిగత అనుభవంవల్ల మాత్రమేకాక, రాయ్ ప్రభావంవల్ల కూడా కమ్యూనిస్టులపట్ల గోపీచంద్‌కు ఏర్పడ్డ అవిశ్వాసానికి పై మాటలు నిదర్శనం. తల్లి మరణంతో బాధపడుతున్న స్నేహితుణ్ణి పరామర్శించటానికి రావటంలోనే కమ్యూనిస్టు శివకుమార్ మానవత్వాన్ని ప్రదర్శించాడు !

ఇక, 'పండితపరమేశ్వరశాస్త్రి వీలునామా'లో కమ్యూనిస్టు నాసరయ్య 'న్యూరోటిక్'73 గా చిత్రింపబడ్డాడు.

'ప్రజలకు పార్లమెంటరీ ప్రజాస్వామికంలో యెంత అధికారముందో కమ్యూనిజంలో కూడా అంతే అధికారం వుంది. ప్రజలు పశుప్రాయులుగా చేయబడుతున్నారు. వ్యక్తిత్వానికి ఆస్కారం లేదు. వారు మానసికంగా విజ్ఞానాన్నిపొందే అవకాశం లేదు ప్రభుత్వం చెప్పినట్లు చేయటమే వారి విధిగా తేలింది.'74 అన్న రాయ్ భావాల ఛాయ 'యమపాశం'లో కనిపిస్తుంది.

"ఆలోచిస్తుంటే వొకొక్కొక్కప్పుడు వ్యక్తులు తమ తెలివిని చంపుకుంటున్నందుకు ప్రభుత్వం జీతాలిస్తున్నదా అనిపిస్తూవుంటుంది.'' అని మురళీ మోహన్ అన్నప్పుడు-

''యంత్రంలో ఫిట్ ఇన్ అయినందుకు'' అని నారాయణరావు అంటాడు.

''యంత్రంలో ఫిట్ ఇన్ అవటం అంటే స్వీయప్రతిభను చిదుముకోవటం అన్నమాటే గదా''75 అన్నాడు మురళీమోహన్.

పార్టీ ప్రభుత్వం వ్యక్తిని ఒక కొరముట్టుగా తయారుచేస్తూ, వ్యక్తిత్వాన్ని హరించివేస్తూ ఉంటుందనే రాయ్ విమర్శే పై మాటల్లో వ్యక్తమౌతున్నది. గోపీచంద్ దృష్టిలో ప్రభుత్వయంత్రాంగమే వ్యక్తిని కాటువేయటానికి కాచుకొని ఉన్న విషసర్పాలతో నిండిన పరమపదసోపానం.

'గడియపడని తలుపులు'లో కోటేశ్వరమ్మ డబ్బుకోసం పలుకుబడికోసం ప్రభుత్వ యంత్రాంగంలో స్థానం సంపాదిస్తుంది. కాని, ఆమె అసంతృప్తి పెరుగుతుందే కాని తగ్గదు. అంటే, వ్యక్తి అంతర్గత చైతన్యాన్ని ప్రోత్సహించే స్వభావం పార్టీ ప్రభుత్వానికి ఉండటం అసాధ్యమని రచయిత ఉద్దేశించాడు.

అయితే, గోపీచంద్ ప్రతినిధి పాత్ర కావటంవల్ల కథకుడు ప్రభుత్వోద్యోగే అయినా, శ్రీనివాసరావుపట్లా కోటేశ్వరమ్మపట్లా అపారమయిన సానుభూతిని ప్రదర్శిస్తాడు. వాళ్ళ సమస్యాపరిష్కారానికి విఫలయత్నం చేస్తాడు. చివరిదశలో కోటేశ్వరమ్మకు సన్నిహితం కావటం ద్వారా, ఆమె

ఒంటరితనాన్ని పారదోలటంలోనూ, ఆమె ఆధ్యాత్మికజీవితంతో పాలు పంచుకోవటంలోనూ, ఆమె మరణించిన తర్వాత అంత్యక్రియలు జరపటం లోనూ మైత్రినీ మానవత్వాన్నీ ప్రదర్శిస్తాడు.

ఇది, 'చివరకు మిగిలేది'లో బుచ్చిబాబు చెప్పే - 'మనిషినీ మనిషినీ స్నేహపాశంలో బంధించివేసే మానవత్వం.'

# 4. మనోవిజ్ఞానశాస్త్ర ప్రభావం

గోపీచంద్‌కు మార్క్సిజంపట్ల అసంతృప్తి కలగటానికి కారణం, ఆ సిద్ధాంతంలోని సంపూర్ణ భౌతిక తత్వమే అందుకే, మానవుని వైయక్తిక స్వేచ్ఛను గుర్తించే సిద్ధాంతంకోసం అతడు ఆరాటపడ్డాడు. ఆ వెతుకులాటలో అతనికి లభించిన ఒక మజిలీ ఎం.ఎన్. రాయ్. భావజాలం. రాయిస్టుగా గాని, రాడికల్‌గా గాని గోపీచంద్ సాహిత్య రాజకీయ రంగాలలో కృషి చేసినప్పుడు కమ్యూనిస్టులను వ్యతిరేకించటానికే రాయిజం ఎక్కువగా తోడ్పడిందే తప్ప, అతనిలోని అసంతృప్తిని తొలగించలేకపోయింది.

ఆర్థికశక్తేకాక ఇంకా అనేక శక్తులు మానవ మనస్తత్వాన్ని నిర్ణయిస్తున్నాయని గోపీచంద్ విశ్వసించటంతో,67 ఆయన దృష్టి మనోవిజ్ఞాన శాస్త్రం వైపు మళ్ళిందని చెప్పవచ్చు.

చాలావరకు మానవ మనస్తత్వంపట్ల ఏర్పడే ఆసక్తే, మనోవిజ్ఞాన శాస్త్రంపట్ల ఆసక్తికి కారణమౌతుంది. రచయితకు పాత్రలను సృష్టించే సమయంలో ఎదురయ్యే అనేక ముఖ్యాంశాలలో మనస్తత్వ చిత్రణ కూడా ఒకటి. జీవితాన్ని ప్రతిబింబించే రచయిత, విధిగా మానవ మనస్తత్వాన్ని కూడా ప్రతిబింబిస్తున్నాడు. అయితే, యథార్థ మానవ మనస్తత్వానికి సంబంధించిన మనోవిజ్ఞానశాస్త్రాన్ని సాహిత్యంలోని కాల్పనిక పాత్రలకు వర్తింపజేయటంలో చాలా సమస్యలు ఎదురవుతాయి.

ఉత్తమ రచయిత జీవితాన్ని దృష్టిలో ఉంచుకొనే పాత్రల మనస్తత్వాన్ని సృష్టిస్తాడు తప్ప, మనోవిజ్ఞానశాస్త్రాన్ని దృష్టిలో ఉంచుకొని కాదు. సాధారణంగా, మనోవిజ్ఞానశాస్త్ర సిద్ధాంతాలను, సూత్రాలను సాహిత్య పాత్రలకు, ముఖ్యంగా సాంఘిక నవలల్లోని పాత్రలకు యథాతథంగా వర్తింప జేయటం సాధ్యంకాదు. అందువల్ల చాలా సందర్భాలల్లో ఇవి పాక్షికంగా మాత్రమే వర్తిస్తాయి.

ఒక్కోసారి ఒకే సూత్రానికి, సిద్ధాంతానికి అనేక వివరణలుంటాయి ఒకే అంశంమీద మనోవిజ్ఞాన శాస్త్రజ్ఞులతో భేదాభిప్రాయాలు కూడా ఉంటాయి. చాలావరకు బాల్యంగాని, గత జీవితంగాని, ఇప్పటి ప్రవర్తనకు కారణాలుగా ఫ్రాయిడ్ చెప్తుంటాడు. మరి పాత్ర బాల్యంగాని, గత జీవితం గాని నవలలోలేని పక్షంలో, ఉన్నా మనోవిజ్ఞానశాస్త్రం దృష్ట్యా నిరుపయోగంగా ఉన్న పక్షంలో, ఆ సూత్రాలను సిద్ధాంతాలను పూర్తిగా వర్తింపజేయటం సాధ్యంకాదు. కేవలం రోగులు చెప్పింది విశ్వసించి, రోగుల అనుభవాలనే సూత్రీకరించి, జనులందరికీ వర్తింపజేశాడనీ, సాంఘిక జీవితాన్ని పట్టించుకోలేదనీ'77 ఫ్రాయిడ్ వంటి సాటిలేని మేటి మనోవిజ్ఞాన శాస్త్రవేత్త మీద ఉన్న విమర్శ అందువల్ల మనోవిజ్ఞానశాస్త్ర దృష్టితో సృజనాత్మక సాహిత్యాన్ని పరిశీలించటం కొంతవరకు మాత్రమే సమర్థనీయం. రచయిత మనోవిజ్ఞానశాస్త్రాన్ని దృష్టిలో ఉంచుకొనిగాని, ఆ శాస్త్రంలోని కొన్ని సిద్ధాంతాలకు సృజనాత్మక రూపకల్పన చేయటానికి ప్రయత్నించినప్పుడు గాని ఆరచనల్ని పూర్తిగా మనోవిజ్ఞానశాస్త్ర దృష్టితో పరిశీలించవచ్చు.

తెలుగు సాహిత్యవిమర్శలో కూడా మనోవిజ్ఞానశాస్త్రం చాలాకాలం క్రితమే ప్రవేశించింది.

ఉదాహరణకు 1937 ఫిబ్రవరిలో వెలువడిన 'ప్రతిభ' పత్రికలో నోరి నరసింహశాస్త్రిగారు చలంమీద చేసిన విమర్శను పరిశీలించవచ్చు. '....కాని వారి వ్రాతలలో దేవుడూ పూజా అంటే ఒక obsessionగా తయారవుతున్నదని వారు గమనించినట్లు లేదు ఇది ఎందువల్ల? వారి అంతరంగములో దైవభక్తి ఉపాసనానక్తి అడిగి ఉండి, ఏవో theories వల్ల వాటిని వారు repress చేస్తూ ఉన్నందుచేతనా?'78 అన్న నోరి నరసింహశాస్త్రిగారి ఈ ప్రశ్నార్థక విమర్శను—

'ఫ్రాయిడ్ సాయంతోటి చలం మనస్తత్వాన్ని సరిగానే అంతు చిక్కించుకున్నారు'79 అని కె.వి రమణారెడ్డిగారు సమర్థించారు.

అప్రయత్నంగా, మాటిమాటికీ వ్యక్తిలో తలెత్తే భావమే. ఆలోచనే 'అనియంత్రిత భావం' (Obsession).

ఇది దేవుని ఉనికిని కూడా ప్రశ్నించేదై ఉండవచ్చు 80

చలం మాటిమాటికి దేవుని ఉనికిని సందేహించటం, దైవపూజను ఖండించటం వంటి వాటికి వారిలోని అణచివేతకు గురైన ఆస్తికత్వమే కారణమని నోరి నరసింహశాస్త్రిగారు గుర్తించారు. రచనల సహాయంతో రచయిత తత్వాన్ని వెల్లడించటానికి, వారి మనోవిజ్ఞానశాస్త్ర అవగాహన తోడ్పడిందని చెప్పవచ్చు.

గోపీచంద్‌కు ముందు పూర్తిగా మనోవిజ్ఞానశాస్త్ర దృష్టితో నవలలు రచించిన వారెవరూ లేరు. గోపీచంద్ కూడా 'అసమర్థుని జీవయాత్ర'లో ప్రదర్శించిన, గాఢమైన మనోవిజ్ఞాన శాస్త్రావగాహనను ఇతర నవలల్లో ప్రదర్శించ లేదు. అయినా, కొన్ని నవలల్లో ముఖ్యంగా పాత్రచిత్రణలో కొంత మేరకు మనోవిజ్ఞానశాస్త్ర లక్షణాలను ప్రదర్శించాడు.

గోపీచంద్ నిరూపించిన ప్రధానమైన మనోవిజ్ఞానశాస్త్ర లక్షణాలను పరిశీలించటం అవసరం.

1943 నాటికే గోపీచంద్ మనోవిజ్ఞానశాస్త్రవేత్తల రచనలు అధ్యయనం చేశాడు. 'పరివర్తనం' పీఠికలో.

'భావకవిత్వాన్ని విమర్శించే నవ్యులు మానవునికి సహజంగా ఉండే గుణాల్లో 'సెక్స్' ఒకటని అంగీకరిస్తారు. కాని, యిదే బలవత్తరమైన గుణం అనిగానీ ఇంతకంటే మానవునికి వేరొక గుణం లేదనీగానీ అంగీకరించరు' అన్నాడు.

ఫ్రాయిడ్‌మీద ఉన్న విమర్శల్ని దృష్టిలో ఉంచుకొని గోపీచంద్ ఈ మాటలు అన్నట్లున్నాడు. ముఖ్యంగా ఫ్రాయిడ్ శిష్యుడైన అడ్లర్ ఫ్రాయిడ్ సిద్ధాంతీకరించిన 'శైశవ కాముకత' (Infantile Sexuality)ను పిచ్చుక మీద బ్రహ్మాస్త్రంగా భావించాడు.81 లైంగిక వాంఛను బలవంతంగా అణచుకోవటం నేరమనీ, భార్య మరణిస్తే, రెండో పెళ్లిచేసుకొని జీవితాన్ని ఆనందమయం చేసుకోవటమే యువకుని కర్తవ్యమనీ 'పరివర్తనం'లో గోపీచంద్

చెప్పదలచుకొన్నాడు. అంటే, లైంగికవాంఛను ఒక విశ్శృంఖలమైన శక్తిగా కాక, మానవుని ముఖ్యావసరాలలో ఒకటిగా రచయిత భావించాడు. ప్రధాన పాత్ర రాజారావు రూపకల్పనలోను, పరిణామంలోను ఈ ఉద్దేశాన్ని నెరవేర్చు కోవటానికి మనోవిజ్ఞానశాస్త్రం దృష్ట్యా, రచయిత అనుసరించిన పథకాన్ని పరిశీలించటం అవసరం.

'పరివర్తనం' నవలలోని రాజారావుకు భార్య చనిపోయిందని స్పష్టంగా తెలుసు. జీవించి ఉండగా భార్య ప్రసాదించిన ప్రేమ, లైంగిక సౌఖ్యం యౌవ నంలో ఉన్న తనకు కావాలనీ తెలుసు. మరోస్త్రీని వివాహం చేసుకోవటం మాత్రమే ఈ సమస్యకు పరిష్కారం. కాని అతని కోరికకు, అతని సంస్కా రం అడ్డుతగులుతున్నది. గత స్మృతులతో ఒక భ్రాంతిమయ వాతావరణాన్ని సృష్టించుకొని, విరహంలోనే ఆనందాన్ని పొందుతూ కాలం గడుపుతున్నాడు రాజారావు.

'మూర్తిమత్వంలో ఫ్రాయిడ్ మూడు ముఖ్య వ్యవస్థలను పేర్కొ న్నాడు. అవి-1) అచిత్తు లేదా ఇడ్ (Id), 2) అహము లేదా ఈగో (Ego), 3) అధ్యహము లేదా సూపర్ ఈగో (Super ego)....అచిత్తు మూర్తిమత్వం లోని నిజమైన మానస వాస్తవికత (True Psychic reality). ఎందువల్ల నంటే అది వ్యక్తిగత (Subjective) అంతరానుభూతులకు ప్రాధాన్యం ఇస్తుంది. అచిత్తు ఎటువంటి తన్యతను, సమతౌల్యంలో ఎటువంటి మార్పులను సహించదు. తన్యత ఆనందానికి అవరోధం కలిగిస్తుంది. కనుక వెంటనే తన్య తను తొలగించి మళ్ళీ ఆనందాన్ని సంపాదించడానికి 'అచిత్తు' ఎప్పుడూ ప్రయత్నిస్తూ ఉంటుంది. అచిత్తుకు కావలసిన వస్తువు లభించనప్పుడు అది తన్యతను తొలగించుకొనడానికి ఒక మానసిక ప్రతిమ (Mental image)ను సృష్టించుకొని ఆనందాన్ని పొందవచ్చు.'

'అహము లేదా ego....బయటి ప్రపంచానికి, అచిత్తుకు మధ్య వంతెన వలె ఏర్పడుతుంది.' అచిత్తు ఆనందసూత్రాన్ని బట్టి వర్తిస్తే, 'అహము వాస్త వికతా సూత్రాన్నిబట్టి వర్తిస్తుంది. ఒక్క మాటలో చెప్పవలెనంటే, 'ఈగో' మూర్తిమత్వానికి కార్యనిర్వాహకంగా పనిచేస్తుంది. 'ఇడ్' యొక్క కోరిక

లను, అవసరాలను గమనించి, వాటిని తగిన విధంగా తృప్తిపరచటానికి ప్రయత్నించవలె. వాస్తవికతా సూత్రాన్ని అనుసరించి ఒక సహజాతాన్ని తృప్తిపరచటానికి అవకాశమున్నదా లేదా, ఉంటే ఎప్పుడు ఏ విధంగా తృప్తిపరచడానికి వీలవుతుంది అనే విషయాలను నిర్ణయించవలె. ఇట్లా నిర్వహించడంవల్ల సూపర్ ఈగో కూడా తృప్తిపడేటట్లు చూసుకోవలె'

'అధ్యహము లేదా సూపర్ ఈగో సంఘంలోని సాంప్రదాయికమైన విలువలకు, నియమాలకు, ఆదర్శాలకు ప్రాతినిధ్యం వహిస్తుంది. సూపర్ ఈగో వాస్తవికత కంటే, ఆదర్శానికే ప్రాముఖ్యమిస్తుంది. దానికి ఆనందం కంటే పరిపూర్ణతే ప్రధానమైనది.'82

భార్య మరణంవల్ల రాజారావు అంతరంగంలో వెలితి ఏర్పడింది. తన్యత అసమతౌల్యం ఏర్పడ్డాయి. ఆనందానికి అవరోధం కలగటం సహించలేని 'ఇద్' తన్యతను తొలగించుకోవడానికి, విరహవేదనలో ఆనందాన్ని చవి చూస్తున్నది గంగా స్రవంతి, తోటలోని గులాబి మొక్క విరజాజి వంటివి తన భార్యకు సంబంధించిన స్మృతి ప్రతిమలను (Memory images) గుర్తుకు తెచ్చే సాధనాలు.

అచిత్తు (ఇద్) ఊహాప్రపంచంలో జీవిస్తున్నదని రాజారావులోని ఈగోకు తెలుసు కాని, రాజారావుకు భార్యపట్ల ఉన్న మానసికానుబంధం బలమైనది. మరో స్త్రీని పెళ్ళిచేసుకోవటమంటే, మొదటి భార్యకు అపచారం చేయటమేననీ, అసలు పవిత్ర ప్రేమను కళంకితం చేయటమేననీ అతని ఉద్దేశం. ఇది సూపర్ ఈగో సృష్టించిన బలమైన సంస్కారం. అటు 'ఇద్' ఇటు సూపర్ ఈగో రెండూ బలమైనవే, రాజారావులోని ఈగో బలహీనమైనది. ఫ్రాయిడ్ చెప్పినట్లుగా, బాహిరప్రపంచం, సూపర్ ఈగో, ఇద్ అనే ముగ్గురు యజమానులకు సేవచేయలేక పాపం ఈగో సతమతమయింది.83 ఇక్కడ 'అక్క' బాహిరప్రపంచానికి ప్రతినిధి. తన ఆనంద సూత్రానికి భంగం కలగకూడదని 'ఇద్' రెండోపెళ్లి తన ఆదర్శానికి వ్యతిరేకమని సూపర్ ఈగో జీవించటానికీ, నిజమైన ఆనందం పొందటానికీ రెండోపెళ్లి అత్యవసరమని బాహిరప్రపంచం–పూర్తి వైవిధ్యంతో కూడిన కోరికలను కోరు

తున్నాయి. వీటి మధ్యన సమన్వయాన్ని చేకూర్చటం ఈగోకు తనకు మించిన పనే. కాని, బాహిరప్రపంచపు ప్రతినిధి అయిన అక్క దీక్షతోను, యుక్తి యుక్తంగాను చేసిన కృషి క్రమంగా ఈగోకు బలాన్ని చేకూర్చింది. సూపర్ ఈగో పాత అదర్శాన్ని వదులుకొని కొత్త ఆదర్శాన్ని స్వీకరించగలిగింది.

'అసమర్థుని జీవయాత్ర' మనోవైజ్ఞానిక నవల కనుక, ఆ నవలలోని అనేక మనోవిజ్ఞానశాస్త్ర గతాంశాలను ఇదివరకే పరిశీలించటం జరిగింది 84 ఈ శాస్త్ర సంబంధమైన పరిజ్ఞానం నవలలకు మాత్రమే పరిమితం కాకుండా, కథలకు కూడా పాకింది. దీన్నిబట్టి గోపీచంద్‌కు మనోవిజ్ఞానశాస్త్రంపట్ల ఏర్పడ్డ గాఢాభిమానం స్పష్టమవుతుంది. ఉదాహరణకు 'అసమర్థుని జీవయాత్ర' పూర్తయిన అనతికాలానికే వచ్చిన 'దరిద్రులు'85 అనే కథను పరిశీలించవచ్చు.

'దరిద్రులు' కథలో నెలకు యాభై రూపాయల సంపాదన ఉన్న పేద వాని కుటుంబం, వెయ్యి రూపాయల సంపాదన ఉన్న ఆఫీసరు కుటుంబం ఎదురెదురుగా ఉంటాయి. ప్రతిరోజు బీదవాడు రాత్రి ఇంటికి రాగానే, కూతురు పెళ్ళి చెయ్యమని అడిగేది భార్య. అతడు కర్రతీసుకొని కొట్టేవాడు. ఆమె 'గోలగా' ఏడ్చేది. ఒకరోజు ఎదురింటి ఆఫీసరు గారి భార్యతో, ఆమె కొడుకు తమ కూరచట్టిని పగలగొట్టాడని 'గిల్లికజ్జా' పెట్టుకుంటారు తల్లీబిడ్డలు. కొత్త చట్టికోసం డబ్బిస్తానని ఆఫీసరు భార్య అంటే బీదవాడి భార్య ఒప్పుకోలేదు.

'వాణ్ణి తన్ని మా వాకిట్లోకి రాకుండా చేస్తావా లేదా ?' అంటుంది. రాత్రి భర్త రాగానే బీదవాడి పెళ్ళాం కూతురు పెళ్లిచెయ్యమని అడిగింది. అతడు కర్ర తీసుకొని కొట్టాడు. ఆమె గోలగా ఏడ్చింది.

ఈ కథలో దారిద్ర్యాన్ని, దారిద్ర్యంవల్ల ఏర్పడే మనస్తత్వాన్ని రెండిం టినీ చక్కగా సమన్వయం చేశాడు రచయిత. దారిద్ర్యం మూలంగా తల్లి దండ్రులు తమ పిల్లలకు పీచుమిఠాయే కొనివ్వలేని స్థితిలో ఉన్నప్పుడు, ఆడ పిల్లల పెళ్ళిళ్ల చేయటం ఎంత కష్టమో చెప్పాడు. ఈ అంశంతోపాటు తీరని కోరికల మూలంగా, ఎదుటివాళ్లను అవమానించి సంతోషించే మనస్తత్వం కూడా ఏర్పడుతుందని చెప్పదలచుకున్నాడు. నిజానికి ఆఫీసరుగారి కొడుకు చట్టిని పగలగొట్టనేలేదు. అయినా పగలగొట్టాడనే అబద్ధాన్ని ఆధారంగా

తీసుకొని గిల్లికజ్జా పెట్టుకున్నారు. తల్లీబిడ్డలు ఆఫీసరు భార్యకు ఆర్థిక సమస్య లేమీ లేనందుకు, పెళ్ళీడు పిల్ల లేనందుకు బీదవాడి భార్యకు ద్వేషమైతే, ఒక యువతి పెళ్లికి నోచుకోవటమేకాక, తల్లి కూడా అయినందుకు కూతురుకు ద్వేషం.

ఈ అంశాలతోపాటు మరో ముఖ్యాంశం ఏమిటంటే, బీదవాడి భార్యకు రోజూ రాత్రి భర్త చేతిలో దెబ్బలుతినటం అలవాటుగా మారటం. ఇది క్రమంగా లైంగికానందాన్ని కలిగించే అవకాశం కూడా ఉంది. ఈ అలవాటు ఆమెకు ఆనందాన్ని కలిగిస్తున్నందుకే ప్రతిరోజు భర్తరాగానే, అతడు కొడతాడని తెలిసే కోపం తెప్పించే మాట అంటున్నది. ఆఫీసరు భార్య కొత్త చట్టీకి డబ్బు ఇస్తానంటే రాజీపడకుండా ''వాణ్ణి తన్ని మా వాకిట్లోకి రాకుండా చేస్తావా లేదా ?" అనటం వెనుక ఉన్న కీలకం కూడా ఇదే. దెబ్బలు తిని, లైంగికానందాన్ని పొందటాన్ని ''పరపీడన రతి'' (Masochism)[86] అంటారు.

ఈ కథలో ఆర్థిక సంబంధమైన సమస్యా, మనస్తత్వ సంబంధమైన సమస్యాఉన్నా, మనస్తత్వ సంబంధమైన సమస్యే ముఖ్యమైందనే వైఖరిని రచయిత ప్రదర్శించాడు.

గోపీచంద్‌కు మార్క్సిజంపట్ల అభిమానం సన్నగిల్లి మనోవిజ్ఞానశాస్త్రం పట్ల అభిమానం పెరిగిందనటానికి ఈ కథ ఒక నిదర్శనం. అయితే, ఈ అభిమానం కూడా ఆ తర్వాత కేవలం ఆసక్తిగా మారిపోయింది. పూర్తి మనోవైజ్ఞానిక నవలలు లేవనే చెప్పవచ్చు. 'అసమర్థుని జీవయాత్ర' కలిగించిన మానసిక అసంతృప్తి మూలంగా రచయిత ఆ తర్వాతికాలంలో మనోవైజ్ఞానిక నవలలను వ్రాయటానికి పూనుకొని ఉండకపోవచ్చు. ఆధ్యాత్మికరంగం పట్ల ఆకర్షణ మరోకారణం కావచ్చు. మొత్తంమీద ఇతర నవలల్లో రచయిత మనోవిజ్ఞాన శాస్త్రీయ అంశాలను పాక్షికంగా మాత్రమే ఉపయోగించుకున్నాడు. ఈ అంశాలను పరిశీలించటం అవసరం.

రచయిత 'మెరుపుల మరకలు' నవలలో ఉషారాణి పాత్రను ఆధ్యాత్మిక దృష్టితో తీర్చిదిద్దిన తీరులో మనోవిజ్ఞాన శాస్త్ర గతాంశాలు గోచరిస్తాయి.

ముఖ్యంగా యూంగ్ (Jung) ప్రభావం కనిపిస్తుంది. ఉషారాణితో కమలా కరం ప్రస్తావించిన మనోవిజ్ఞానశాస్త్రజ్ఞులలో యూంగ్[87] కూడా ఉన్నాడు. నిజానికి రచనాకాలం నాటి గోపీచంద్ ప్రవృత్తికి, ఆధ్యాత్మిక విశ్వాసాలకు విలువ ఇచ్చిన యూంగ్ దగ్గరివాడు కూడా.

యూంగ్ ఉద్దేశంలో వ్యక్తి మూర్తిమత్వంలో వ్యక్తి అచేతనం కన్నా సమష్టి అచేతనం[88] (Collective unconscious) చాలా ముఖ్యమైనది. వ్యక్తిపర అచేతనం కంటే గంభీరమైనది సమష్టి అచేతనం. దీనిలో తరతరాలుగా మానవజాతి శ్రమించి సాధించిన వివేకం కూడా ఉంటుంది.

సమష్టి అచేతనలో మనకు తెలియకుండా ఉండే 'ఆర్కిటైపులు' (మూల రూపాలు, archetypes) మానవ అంతరంగానికి శక్తిని ప్రసాదిస్తాయి. ఇవి సహజాతాల వంటివే. కాని, పూర్తిగా వ్యక్తి అంతరంగ ప్రవర్తనకు సంబంధించినవి.[89]

కొన్ని ప్రదేశాలపట్ల, వస్తువులపట్ల పవిత్రభావం కలగటానికి కూడా ఈ ఆర్కిటైపులే కారణం.[90] ఉషారాణికి హిమాలయాలను చూడాలనే కోరిక కలగటానికీ, హిమాలయాలపట్ల పవిత్రభావం కలగటానికీ కారణం, ఈ ఆర్కిటైపులే.

ఆధ్యాత్మిక లక్ష్యసాధనకోసం కృషిచేసే వాళ్ళు ఒక దశలో తమకు దేవుడు కనిపించాడని, దివ్యతేజస్సు కనిపించిందని చెప్తుంటారు. యూంగ్ ఉద్దేశంలో అది ఆర్కిటైప్ విన్యాసమే. 'దీనిని నమ్మటం నమ్మకపోవటమనేది ఆ ఆర్కిటైప్‌తో సంఘర్షించిన వ్యక్తి విశ్వాసాలమీద ఆధారపడి ఉంటుంది. మతవిశ్వాసాలుగల వ్యక్తి దైవాన్నో దైవాంశనో దర్శించినట్లు భావించవచ్చు. హేతువాది ఆ కొత్త అనుభవంతో ఉక్కిరిబిక్కిరైనా కావచ్చు, లేదా ఏదో అనారోగ్యంవల్ల ఆ అనుభవం కలిగిందనైనా చెప్పవచ్చు. ఆధ్యాత్మికవాదులు సృష్టిని నడిపే చైతన్యశక్తిగా భావించవచ్చు. నిజానికి ఇలాంటి అనుభవాలు మన అవగాహనకు అతీతమైనవి. అవి జరుగుతుంటాయి. వాటిని నమ్మేవాళ్ళ జీవితాలను గాఢంగా ప్రభావితం చేస్తుంటాయి.'[91]

పై వివరణ దృష్ట్యా ఉషారాణికి చక్రవర్తి సాన్నిధ్యంలో మొదటి సారి అనుభవంలోకి వచ్చిన 'హృదయాంతర్గతమైన ఏ పొరక్రిందో అనిర్వచనీయ ఆనందానికి' యూంగ్ చెప్పే ఆర్కిటైపే కారణం. ఆ తర్వాత ఆమెకు అప్పుడప్పుడు అలాంటి అనుభవాలు కలిగాయి. కరుణానందస్వాములవారి మార్గదర్శకత్వంలో ఆమె అంతర్ముఖత్వం పొందిన తర్వాత 'మనోవీథిలో విహరించి, 'సాలెగూడు'ను ఛేదించుకొని, సోపానాలను అధిరోహిస్తూ' సాగించిన ప్రయాణంలో కనిపించే ఆధ్యాత్మిక భావాలకు ఆర్కిటైపులే మూలమని చెప్పవచ్చు. ఈ ప్రయాణం'లోనే ఉషారాణికి.

'జీవితంలో తునకలు తునకలుగా అనుభవించిన భయం ఒకచోట కేంద్రీకృతమై ఆమె మనస్సును క్షోభపెట్టింది.'

ఇది యూంగ్ చెప్పే సమష్టి అచేతనంలోని అజ్ఞాత ఆదిమ భయమే.92 ఆ భయాన్ని జయించి శిఖరాగ్రం మీదికి చేరుకున్నానని అనుకోవటం, శరీరం అమృతం పూసినట్లున్నదనుకోవటం, ఆర్కిటైపును ముఖాముఖి మూర్కొని పొందిన అపూర్వానుభవం కారణంగానే.

నిషిద్ధదృశ్యాలను, నగ్నశరీరాలను చూడటంద్వారా వ్యక్తులుపొందే లైంగికానందాన్ని 'Voyeurism'93 అంటారు. 'మెరుపుల మరకలు' నవలలోని చంద్రవదనులు అనే కవి ఉషారాణిలో తన కూతురును చూసుకోవాలనే కోరికతో తెచ్చానని ఒక చీరను బహూకరిస్తాడు. దాన్ని ఆమె కట్టుకుంటే చూడాలని వుందంటాడు. ఉషారాణి గదిలోకి వెళ్లి పాతచీరను విడిచి, కొత్త చీరను ధరిస్తుంటే, తలుపు సందుల్లో నుంచి చూసి చంద్రవదనుడు లైంగికానందాన్ని పొందుతాడు.

'ప్రేమోపహతులు' అన్న అసంపూర్ణనవలలో రచయిత సుందరీ జయరామారావుల మనస్తత్వంలో 'పరపీడనరతి' (Sadism), 'స్వపీడనరతి' (masochism) అన్న లక్షణాలను ఏవిధంగా సమన్వయపరిచాడో ఇదివరకే వివరించటం జరిగింది.

అభ్యంతరకరమైన లైంగిక భావాలను సాంఘికంగా ఆమోదయోగ్య

మైన లైంగిక కామ భావనకు చోటులేని పవిత్రమైన లక్ష్యంవైపు అచేత నంగా మళ్ళించటాన్ని 'ఉదాత్తీకరణం'94 (Sublimation) అంటారు.

'గడియపడని తలుపులు' నవలలోని శ్రీనివాసరావులో ఈ ఉదాత్తీ కరణ లక్షణాలు పాక్షికంగా కనిపిస్తాయి.

సాంఘిక నీతిపట్ల గౌరవమూ, కోటేశ్వరమ్మపట్ల ఆరాధనా భావమూ ఉన్న శ్రీనివాసరావు కోటేశ్వరమ్మ చొరవ కారణంగా ఆమెతో లైంగిక సంపర్కాన్ని నెరపుతాడు. ఆ క్షణంనుంచి అతనిలో కోటేశ్వరమ్మపట్ల ప్రేమభావం కూడా కలుగుతుంది. కాని, అదివరకే వివాహితుడైన శ్రీనివాస రావు ఒక పరస్త్రీతో పెట్టుకున్న లైంగిక సంబంధాన్ని సంఘం అంగీకరిం చదు. ఈ దశలో అతడు బ్రహ్మానందస్వామి భక్తుడౌతాడు. కోటేశ్వరమ్మ మూలంగా అక్కడి నుంచి నిష్క్రమించి, రామేశ్వరం వెళ్ళి, భక్తిమార్గంలో శేషజీవితం గడుపుతుంటాడు. ఈ ప్రయత్నం సఫలమైనా కాకపోయినా అతని ఉదాత్త ఆశయం మాత్రం మారే అవకాశం లేదు.

అభ్యంతరకరమైన లైంగిక కామవాంఛను పవిత్రమైన లక్ష్యంవైపు మళ్ళించే యత్నం చేశాడు కనుక, శ్రీనివాసరావులో వచ్చిన పరిణామానికి 'ఉదాత్తీకరణ భావం' గానీ 'ఉదాత్తీకరణయత్నం' గానీ కారణంగా చెప్పు కోవచ్చు.

'మెరుపుల మరకలు'లో ఉషారాణి, తన అభ్యంతరకరమైన అక్రమ లైంగిక భావాలను ఉదాత్తాశయంవైపు మళ్ళించగలిగినందువల్లనే యోగినిగా రూపొందగలిగింది. ఈ పరిణామాన్ని విశాలమైన ప్రాతిపదికమీద 'ఉదాత్తీ కరణం'గానే భావించవచ్చు.

దమనానికి గురైన భావాలను ఊహలను ఇతరులలో దర్శించటాన్ని ప్రక్షేపణం (Projection) అంటారు. ఇదొక మానసిక తంత్రం (Menta mechanism) 1

'పిల్లతెమ్మెర' నవలికలోని శమంతకమణి పాత్రలో మనకు పై లక్షణం కనిపిస్తుంది.

తనకు ఇష్టమైన పురుషులను ఆకర్షించే తత్వంగల శమంతకమణి డ్యాన్సుమాష్టారును కూడా ఆకర్షించటానికి ప్రయత్నిస్తుంది. కాని, అతడు ఆమె స్త్రీత్వాకర్షణకు లొంగడు. అతనిలోని ఈ ప్రత్యేకత ఆమెలో అతనిపట్ల గౌరవాన్ని కలగజేస్తుంది. ఫలితంగా అతనిపట్ల ఆమెకున్న లైంగికవాంఛ దమనానికి గురవుతుంది. తర్వాత తనకు పుట్టిన కొడుకులో డ్యాన్సుమాష్టారు పోలికలను చూసుకుంటుంది.

నిజానికి పదిరోజులు చిన్నారి శిశువులో పోలికలను గుర్తించటం కష్టం. శమంతకమణికి తన శిశువులో కనిపించిన పోలికలు, తాను చూడాలనుకున్న పోలికలే తప్ప, ఉన్న పోలికలు కావు. డ్యాన్సుమాష్టారితో లైంగిక సంపర్కం ఏర్పడాలనీ, ఫలితంగా అతనిలాంటి కొడుకు కలగాలనీ ఆమె ఒకప్పుడు వ్యక్తావ్యక్తంగా కోరుకున్న కోరికలు. అవి దమితమై ఈ రూపంలో బహిర్గతమయ్యాయి.

ఇది ప్రక్షేపణ తంత్రం.

'అసమర్థుని జీవయాత్ర'లో సీతారామారావు తన లక్షణాలనే తన మిత్రులలో చూస్తాడు.95 ఇది 'ప్రక్షేపణ'కు మరో ఉదాహరణ.

ప్రతిఫలాపేక్ష లేకుండా గాని, కొద్దిపాటి ప్రతిఫలాన్ని అపేక్షించి గాని, సహకారభావంతో త్యాగబుద్ధితో చేతనైన సహాయం చేయటమే 'పరహితత్వం' (Altruism).96

ఈ లక్షణం పండితపరమేశ్వరశాస్త్రి వీలునామాలోని కేశవమూర్తిలో కనిపిస్తుంది.

సీమంతాన్ని భార్య ఇంట్లో నుంచి వెళ్ళగొడితే కేశవమూర్తే వాళ్లిద్దరికీ రాజీచేసి కాపురం నిలబెడతాడు. రాధారమణకు జైలుశిక్ష పడకుండా తప్పిస్తాడు. పురూరవుడు ఒక నీతిబాహ్యమైన పత్రికను నడుపుతూ బతుకుతుంటే మంచిదారి చూపిస్తాడు. కృష్ణమూర్తి చెడ్డవాడని తెలిసినా కేశవమూర్తి చేరదీస్తాడు. అతడు డబ్బు అడిగితే ఇస్తాడు. తన పలుకుబడిలో మద్రాసులో ఉద్యోగం ఇప్పిస్తాడు. అయినా కృష్ణమూర్తి కృతజ్ఞత చూపడు, పైగా అభూత

కల్పనలతో కేశవమూర్తి మీదనే కథ రాసి పత్రికలో ప్రచురిస్తాడు. అయినా, మళ్ళీ ధనసహాయం చేస్తాడు. కృష్ణమూర్తి మళ్ళీ ద్రోహం చేస్తాడు ఇంతచేసినా కృష్ణమూర్తిని సంస్కరించాలని కేశవమూర్తి ప్రయత్నిస్తూనే ఉంటాడు.

కన్యకామణికి సినిమాలలో నటించే అవకాశం కలుగజేయటానికి కూడా ఈ లక్షణమే కారణం. కేశవమూర్తి సహకార భావంతో, త్యాగబుద్ధితో ఈ సహాయాలు చేశాడని చెప్పవచ్చు. అయినా, పరోక్షంగా వాళ్ల నుంచి కృతజ్ఞతా భావాన్ని గాని, సానుభూతిని గాని అపేక్షించి ఉండవచ్చు.

'దమితభావాలమీద ఆధారపడ్డ అసత్యాలను, వికారాలను తప్పు దాచేస్తుంది'97 అని చెప్తూ ఫ్రాయిడ్, 'మాట్లాడటంలోను, రాయటంలోను మనంచేసే పొరపాటు, మన ఉద్దేశాలకు అతీతంగా ఉండే మానసికమైన కలవరమే కారణము'98ని అంటాడు.

ఈ రకమైనా 'Lapse in speaking and writing' 'మెరుపుల మరకలు'లో కనిపిస్తుంది.

తిరుపతినుంచి తిరిగిరాగానే ఉషారాణి ఇంటికి వెళ్ళిన చక్రవర్తికి, ఉషారాణితోపాటు శ్రీకాంత్ కనిపించేసరికి 'ఆశాభంగం' కలుగుతుంది. వాళ్ళ మధ్యన కూడా లైంగిక సంబంధం ఏర్పడిందేమోనని అనుమానిస్తాడు. ఆ తర్వాత ధ్రువపరుచుకుంటాడు.

అందమైన ఉషారాణిని, తెలివైన ఉషారాణిని, తనకంటే పై అంతస్తుకు చెందిన ఉషారాణిని, తనకంటే తక్కువవాడైన శ్రీకాంత్ స్వాధీనపరుచుకున్నందుకు అవ్యక్తంగా చక్రవర్తికి ద్వేషం కూడా కలిగింది.

ఆఫీసుకు వెళ్ళగానే తోటి సబ్-ఎడిటర్ రంగస్వామి "కాటర్‌పిల్లర్ అంటే ఏమిటోయి చక్రవర్తీ" అని అడిగాడు. ''ద్వేషభూయిష్టుడు" అన్నాడు చక్రవర్తి. ''కాంటాంకరస్ కాదోయ్ కాటర్ పిల్లర్'' అన్నాడు. రంగస్వామి అంతా గొల్లున నవ్వారు.

కాటర్‌పిల్లర్—అంటే ఒక 'పురుగు విశేషం' కాంటాకరస్ (Contankerous) అంటే ద్వేషభూయిష్ఠుడు లేదా వక్రబుద్ధిగలవాడు. డొక్కశుద్ధి

గలవాడే అయినా, చక్రవర్తి పొరపాటుగా ద్వేషభూయిష్ఠుడనే తప్పు అర్థాన్ని చెప్పాడు. ఇందుకు కారణం, అతనికి శ్రీకాంత్‌పట్ల కలిగిన ద్వేషభావమే. ఈ భావాన్ని దమించటానికి అవ్యక్తంగా ప్రయత్నించినా 'మాట' రూపంలో బహిర్గతమైంది.

క్రిమివిశేషమనే అర్థం ముందు స్ఫురించి, ఒక స్త్రీకోసం వ్యక్తిత్వం కోల్పోయిన తానూ క్రిమివంటి వాణ్ణననే భావం మెరుపులాగా అవ్యక్తంగా కలిగి ఉంటుంది. అందువల్ల 'క్రిమి విశేషం', 'ద్వేషభూయిష్ఠుడు' అతని విషయంలో సమానార్థకాలే!

ఆ వెంటనే చక్రవర్తి రాత రూపంలో చేసిన పొరపాటును ఎడిటర్ ఎత్తిచూపాడు.

'ట్వంటియత్ సెంచరీ ఫాక్సు పిక్చర్' అన్న దాంట్లోని 'ఫాక్సు పిక్చర్'ను 'నక్క చిత్రం' అని చక్రవర్తి తెనిగించాడు.

సంస్థ పేరులో భాగమైన ఫాక్సు అనువాదానికి లొంగనిమాటే అని తెలిసినవాడైనా ఈ పొరపాటు చేశాడు. అంటే, అతడు నక్కనుగూర్చి, నక్కలాంటి వ్యక్తిని గూర్చి ఆలోచించి ఉంటాడు. లేదా ఒక వ్యక్తిని నక్కగా నిర్ధారణ చేసుకొని ఆ భావాన్ని దమించటానికి ప్రయత్నించైనా ఉంటాడు.

అతని ఉద్దేశంలో ఉషారాణే నక్క. ఆమె నెరజాణ అని, అతనికి తెలిసిపోయింది. తనతో సంబంధాన్ని కొనసాగించటానికి భర్తను ఎట్లా మోసగించిందో, శ్రీకాంత్‌తో సంబంధాన్ని కొనసాగించటానికి తననూ అట్లాగే మోసపుచ్చిందని అతడు నిర్ధారణ చేసుకున్నాడు. అందువల్ల ఉషారాణి నక్కగా, ఆమె పనులు నక్కజిత్తులుగా తోచసాగాయి. మరి ఈ భావాన్ని దమితం చేసుకోవటమెందుకంటే, ఆమె మీద అతనికేమీ హక్కులేదు కనుక, అతడూ ఆమె లాగే తప్పు చేస్తున్నాడు కనుక.

పై రెండు సందర్భాలలోనూ చక్రవర్తిలోని మానసికమైన కలవరం లేదా సంక్షోభం వ్యక్తమయింది.

శమంతకమణి ఉషారాణి కోటేశ్వరమ్మలలో ఒక సమాన లక్షణం కనిపిస్తుంది. అది స్వేచ్ఛాప్రవృత్తి. ఈ స్వేచ్ఛాప్రవృత్తి తోపాటుగా ఈ ముగ్గురిలోనూ 'Impulsive nature' అన్న లక్షణంకూడా తరతమ భేదాలతో పెనవేసుకున్నది.

ఒక చర్యకు పూనుకునే 'అకస్మిక ఉత్సాహం' (drive) ఈ లక్షణంలో ముఖ్యాంశం. చాలావరకు ఈ ఉత్సాహం సరళమైనదేకాక, తాత్కాలికమైనది కూడా.99 ఈ లక్షణం ఉన్నవాళ్ళలో భవిష్యత్తును గూర్చిన ఆలోచన తక్కువ.

శమంతకమణిలో ఈ లక్షణం ఎక్కువగా కనిపిస్తుంది.

పోలీసు సబిన్స్పెక్టరు దగ్గర పెరుగుతున్న కాలంలో ఒక కుర్రవాడితో లేచిపోవటంలోనూ తిరిగి ఇంటికి రావటంలోనూ, రామనాథాన్ని వివాహమాడటంలోనూ, అతనికోరిక మేరకు ఆధ్యాత్మిక సాధన చేయటంలోనూ, శచీంద్రుని నాటకాలలో నటించటంలోనూ, అతనితో మద్రాసుకు వచ్చివేయటంలోనూ, రామనాథంతోనూ, శచీంద్రునితోనూ లైంగిక సంబంధాన్ని కొనసాగించటంలోనూ; డ్యాన్సు నేర్చుకోవటంలోనూ, డ్యాన్సుమాష్టారును ఆకర్షించటానికి ప్రయత్నించటంలోనూ, ఈ లక్షణం కొంత పాత్ర వహించింది. చివరిసారి శచీంద్రుణి కవ్వించి, ఆకర్షించటానికి చేసిన యత్నంలో కూడా ఈ లక్షణం కనిపిస్తుంది.

ఉషారాణి తన వ్యవహారాలు భర్తకు తెలియకూడదని జాగ్రత్తపడుతుంది. సంఘానికి ఒకవైపు భయపడుతూనే, చక్రవర్తితోనూ, శ్రీకాంత్ తోనూ లైంగిక సంబంధాలు పెట్టుకోకుండా ఉండలేకపోతుంది. కొత్త పెళ్లికూతురైన పద్మపట్ల సంపూర్ణ సానుభూతిని కలిగి ఉంటూనే, ఆమె భర్త కమలాకరంతో లైంగిక సంపర్కం పెట్టుకుంటుంది.

అప్పటికప్పుడే హిమాలయాలను చూడటానికి నిశ్చయించుకుంటుంది ఈ చర్యల వెనుక ఈ లక్షణం ఉన్నది. కాని, శమంతకమణిలో ఉన్నంత గాఢంగా లేదు.

కోటేశ్వరమ్మ భర్తను వదిలివచ్చేస్తుంది. డబ్బునూ పలుకుబడినీ సంపాదిస్తుంది. ఒకరాత్రి శ్రీనివాసరావు పక్కలో పడుకొని లైంగిక సంపర్కం అనివార్యమయ్యేటట్లు ప్రవర్తిస్తుంది. ఈ చర్యలు అతిసహజమైనవిగానే అనిపిస్తాయి. అయితే, బ్రహ్మానందస్వామి ఆశ్రమంలో మంచినీళ్లు త్రాగటానికి వెళ్లిన సన్నివేశంలో శ్రీనివాసరావు ఢీకొనటం, లైంగిక సంపర్కానికి దారి తీయటంతో ఆమెలోని ఈ లక్షణం స్పష్టంగా బహిర్గతమైంది.

ఆశ్రమం నుంచి బహిష్కృతురాలైన తర్వాత ఒక గమ్యమంటూ లేకుండా తీర్థయాత్రలను చేయటంలో కూడా ఈ లక్షణం కనిపిస్తుంది.

# 5. సంధిదశ

1943-1946 మధ్య కాలంలో గోపీచంద్‌కు మనోవిజ్ఞానశాస్త్రంపట్ల గాఢమైన అభిమానం కనిపిస్తుంది. ఆ తర్వాత ఆయన మానవ మనస్తత్వం మీదినుంచి 'జీవితం' వైపు తన దృష్టిని మళ్లించాడు. జిజ్ఞాసువుగా, వివేచనాత్మకంగా పరిశీలించటం ప్రారంభించాడు.

భౌతికవాద సిద్ధాంతాలను జీవితానికి అన్వయించి అసంతృప్తి చెందిన గోపీచంద్ క్రమంగా కొత్త భావాలకు విలువ ఇవ్వటం ప్రారంభించాడు.

'అసమర్థుని జీవయాత్ర' తర్వాత సుమారు సంవత్సరానికి గోపీచంద్, 'ఆదర్శజీవులు'100 అన్న గొలుసుకట్టు నవలలో నాలుగో భాగాన్ని రచించాడు. ఈ నవలలో ఆరు భాగాలున్నాయి. ఈ భాగాలను వరసగా కొడవటిగంటి కుటుంబరావు పాలగుమ్మి పద్మరాజు, మునిమాణిక్యం నరసింహారావు, గోపీచంద్, శ్రీశ్రీ, చింతా దీక్షితులు రచించారు.

ఇలాంటి నవలల్లో మారే రచయితలు, మారనిపాత్రలకు తమతమ భావాలను అంటగట్టటం అతిసహజం. ఇందులో గోపీచంద్ రచించిన భాగం పేరు 'శకుంతల-లోకం'. ఈ రచన 'అసమర్థుని జీవయాత్ర' తర్వాత ఆయన భావాలకు అద్దం పట్టేదిగా ఉంది.

ప్రముఖ సాంఘిక శాస్త్రవేత్త కార్ల్ మాన్‌హీమ్101 ప్రభావాన్ని సూచించే అంశాలు కూడా ఈ భాగంలో ఉండటం విశేషం.

'ఆర్థికస్థితి వొక్కటే సంస్కారం తేలేదు'. అన్న వాక్యంతోపాటు–

'ఇద్దరు వ్యక్తులు ఏకాభిప్రాయంతో వుండటం, ఒకరి లోపాలను ఒకరు ప్రేమించుకోవటం జరగని పని. వారికి తల్లిదండ్రుల నుంచి వొచ్చిన లక్షణాలు, వారు పెరిగిన వాతావరణం, వారు చదివిన చదువులు, వారు చేసిన స్నేహాలు, వారు తిరిగిన ప్రదేశాలు – అటువంటి అనుభవాలు అనేకం

కలిసిగదా మానవుని దృష్టి ఏర్పడేది.' అన్న వాక్యాలు గోపీచంద్ మీద కార్ మాన్‌హమ్ ప్రభావాన్ని సూచిస్తున్నాయి.

తర్వాతి కాలంలో ఆయన రచించిన 'పోస్టు చెయ్యని ఉత్తరాలు'లో

'... కారల్ మాన్‌హీమ్ కూర్చిన 'సోషాలజీ' నా చేతుల్లోకి వొచ్చింది. అది చదివాను. నాకు నిజంగా ఆరోజు అమితానందం కలిగింది. అతడు మానవుని మనస్తత్వాన్ని నిర్ణయించేది ఒక ఆర్థికశక్తేకాదనీ మరికొన్ని శక్తులు కూడా ఉన్నాయనీ చెప్పాడు. హెరిడిటీ, సమిష్టి జీవితం, సంస్కారం—వంటి పరస్పర సంఘర్షణవల్ల మానవ సంస్కారం ఏర్పడుతుందని చెప్పాడు. అన్నిటికంటే సంస్కారానికి ఎక్కువశక్తి ఉన్నట్టు చెప్పాడు.'102

మాన్‌హమ్ చెప్పిన మానవ సంస్కారమే, నవలా భాగంలో 'మానవ దృష్టి'గా రూపొందింది. దీన్నిబట్టి మార్క్సిజం ప్రభావం నుంచి బయటపడ టానికి కారల్ మాన్‌హీమ్ భావాలు కూడా గోపీచంద్‌కు తోడ్పడ్డాయని తెలు స్తున్నది. హేతువాదిగానూ, రాయిస్టుగానూ ఉన్నప్పుడు, ఆర్థికశక్తే ముఖ్య మని నమ్మిన గోపీచంద్, ఇప్పుడు హెరిడిటీ, సమష్టి జీవితం, సంస్కారం వంటిదే ఆర్థికశక్తి అని భావిస్తున్నాడు. మనస్తత్వ నిర్మాణంలో హెరిడిటీ, సమష్టి జీవితం, సంస్కారం ఎప్పుడైతే ముఖ్యపాత్ర వహిస్తున్నాయో. మానవ జీవితంలో కూడా ముఖ్యపాత్ర వహిస్తున్నాయని రచయిత ఉద్దేశం.

స్త్రీ పురుష సంబంధాలపట్ల, ముఖ్యంగా దాంపత్య జీవితంపట్ల 'అసమ ర్థుని జీవయాత్ర'లో ప్రారంభమైన ఆలోచనకు 'ఆదర్శజీవులు'లో ఒక స్పష్టమైన ఆకృతి కనిపిస్తుంది. 'అసమర్థుని జీవయాత్ర'లో తండ్రి రమ్మన్నా భర్తను వదిలి వెళ్ళటానికి ఇందిర ఒప్పుకోదు. రంపపు కోతను అనుభవించ టానికే సిద్ధపడుతుంది అందుకే, సీతారామారావు మేనమామ—

'నీలాంటి వాళ్ళ భార్యలు లేచిపోరు. నీలాంటి భర్తలు భార్యలను నీచంగా చూస్తారు, అందువల్ల వాళ్ళకు ఆత్మవిశ్వాసం చస్తుంది. భర్తలను సుఖపెట్టటానికి ప్రయత్నించటమే వాళ్ళకు జీవితపరమావధి అవుతుంది.' అంటూ, భార్యలోని ఆత్మవిశ్వాసాన్ని చంపుతున్నందుకు భర్తను, భర్తమీద తిరుగుబాటు చేయనందుకు భార్యను ఇద్దరినీ అసహ్యించుకున్నాడు.

మార్పు రావలసింది ఇద్దరిలో అయినా. కొన్ని హక్కులు, కీలకమైన స్థానం కోల్పోవలసివస్తుంది కనుక పురుషుడు హృదయపూర్వకంగా మార్పును అంగీకరించడు అందుకే మార్పుకోసం ప్రయత్నించవలసింది స్త్రీయే.

సీతారామారావు మేనమామ కోపంతో అనుకున్నట్లు 'లేచిపోవటమే' సమస్యకు పరిష్కారం కాదు.

''ఒకరితో ఒకరు కాపురం చెయ్యలేనపుడు విడిపోయే అవకాశం కలిగించండి'' అంటాడు, 'ఆదర్శజీవులు'లో సభకు అధ్యక్షతవహించే పాత్ర. ఈ పాత్రను గోపీచంద్ తన భాగంలో కొత్తగా సృష్టించాడు. భార్యాభర్తలు విడిపోవటం కూడా సమస్యకు పరిష్కారం కాదు. కాని, తాత్కాలిక విముక్తికోసం, న్యాయవ్యవస్థలో మార్పును కోరుతూ మానవతా దృష్టితో అన్నమాట ఇది.

ఈ సమస్యకు పరిష్కారాన్ని గోపీచంద్ ఈ విధంగా చర్చించి, సూచిస్తున్నాడు.

'దాంపత్యానికి స్త్రీ పురుష వాంఛ చాలు అనుకోవటం ఎంత తప్పో, ఇక సంస్కారానికి చెంది ఒకరినొకరు సానుభూతితో అర్థం చేసుకుంటే చాలు అనుకోవటం అంతే తప్పు. ఒకరు శారీరక వాంఛలకు బానిస, ఒకరు భావానికి బానిస.'103

స్త్రీపురుష వాంఛే ముఖ్యమైందనే ఫ్రాయిడ్ దృష్టి గోపీచంద్‌కు ఏనాడూ లేదు. 'పరివర్తనం' పీఠికలో ఈ విషయం స్పష్టం చేశాడు. అందువల్ల దాంపత్యానికి స్త్రీపురుషవాంఛ మాత్రమే ముఖ్యం కాదు. ఇకపోతే ఒకే సంస్కారం ఉన్నవాళ్ళు అంటే, జీవితంపట్ల ఒకే రకపు దృక్పథం ఉన్న వాళ్ళు పెళ్ళి చేసుకుంటే దాంపత్యం సమస్యలు లేకుండా ముందుకు సాగుతుందనే అభిప్రాయంతో కూడా గోపీచంద్ ఏకీభవించలేదు. కారణమేమిటంటే –

''ఇద్దరు వ్యక్తులు ఏకాభిప్రాయంతో వుంటం'' జరగని పని.

అందువల్ల అటు స్త్రీపురుష వాంఛను, ఇటు తమ తమ సంస్కారాలను

సమన్వయపరచుకోవటం వల్లనే నిజమైన మానసిక స్వేచ్ఛను సాధించటం భార్యాభర్తలకు సాధ్యమౌతుందని గోపీచంద్ సూచిస్తున్నాడు.

ఈ సమన్వయంలో ఆర్థికదృష్టికి ప్రాముఖ్యం లేదు, కనుక, ఇది చాలావరకు మానసికమైందనే విషయాన్ని గుర్తించవలసి ఉన్నది. అందు వల్ల శకుంతల లోకం మానసిక ప్రపంచమే అయింది

ఈ 'సమన్వయం' శకుంతల సాధించవలసిన ఆదర్శమే తప్ప సాధించిన ఆదర్శం కాదు. మాతృత్వం ద్వారా ఏ స్త్రీ అయినా సాధించేది కొంత పరిపక్వతనే కాని, పరిపూర్ణత్వం కాదు.

ఆ తర్వాతి రచనల్లో గోపీచంద్ స్త్రీ పాత్రలను సృష్టించేటప్పుడు కొంతవరకు ఈ ప్రమాణాన్ని దృష్టిలో ఉంచుకున్నా, ఆచరణాత్మక సమన్వయానికే ప్రాముఖ్యమిచ్చాడు. జీవితంలోని వైవిధ్యందృష్ట్యా ఇది అవసరం కూడా.

ఉదాహరణకు పసిపిల్లల్ని పెంచి పెద్ద చేయవలసిన బాధ్యతలున్న భర్తను కోల్పోయిన యువతి సాధించవలసిన సమన్వయం ఏమిటన్న ప్రశ్నకు సమాధానం కోసం 1949 లో గోపీచంద్ రాసిన కథ 'ఆశా జ్యోతి'104ని పరిశీలించవచ్చు.

పిల్లవాడు కడుపునపడటం, భర్త మరణించటం ఒకేసారి జరిగినై. ఆమె ఆత్మహత్య చేసుకుందామనుకొంది కాని, కడుపులో కదిలే శిశువుకోసం బ్రతికింది. పుట్టిన కొడుక్కి గుండె జబ్బు. ఈ కష్టాలను తాను జయించ గలదా ? తన సంతానాన్ని కాపాడుకుంటూ తాను జీవించగలదా ? అన్నవి ఆ యువతికి ఎదురైన ప్రశ్నలు. దీపానికి కొడిగట్టింది. వెలుతురు మందగించింది. దీపం కొడికి బలైతే, చీకటి కొడిని రాల్చుకుంటే వెలుగు. వ్యక్తి నిరాశకు బలైతే మరణం. నిరాశను జయిస్తేనే జీవితం.

''ఈ ప్రపంచంలో ఒక మనిషి కష్టపడటం, సుఖపడటం, పుట్టటం, చావటం యివేవీ చెప్పుకోదగ్గ విషయాలు కావు అంటీ అంటకుండా బ్రతకటమే జీవితాన్ని జయించటం'' అని భర్త అనేవాడు. ఆశనూ నిరాశనూ

రెంటినీ సమదృష్టితో చూస్తూ ద్వంద్వాతీతంగా బతకాలని కోరాడన్న మాట. కాని, ఆమె అనుభవం ద్వారా తెలుసుకున్న విలువ భర్త ప్రబోధం కంటే భిన్నమైంది. ఆమె ఆశనూ, నిరాశనూ సమదృష్టితో చూడలేదు. 'జీవితానికి పునాదే ఆశ.' అని తెలుసుకోగలిగింది. అర్థంలేని ప్రశ్నల్ని పక్కకునెట్టి ''బతకటమే ఆనందం'' అనుకున్నది.

'కొడిరాలింది. దీపం మెరిసింది. మెరవటంలో కొలనులోని కలువ పువ్వులా మెరిసింది.' అంటూ ఆమె జీవితంలో నవోదయాన్ని సూచించాడు రచయిత. శక్తిమంతమైన కవితాత్మక ప్రతీకలతో గోపీచంద్ రచించిన అరుదైన కథ 'ఆశాజ్యోతి'.

ఈ కథలో ఆ యువతి ఆర్థికస్థితి ఎలాంటిది ? అన్న ప్రశ్న తలెత్తదు. రచయిత దృష్టిలో ఆర్థిక స్థితికి ప్రాముఖ్యం క్షీణించింది కనుక ఆ ప్రశ్న తలెత్తలేదు. జీవించటం ఎలా ? జీవించటం ఎందుకు ? అన్న ప్రశ్నలు కూడా ముఖ్యం కాదు. దైనందిన జీవితంలో పాల్గొనటం ద్వారా కొత్త విలువలను సంతరించుకోవటమే ముఖ్యం. ఇది ఆ యువతి తనకూ బతుక్కూ మధ్యనే కాదు, మృత్యువుకూ జీవితానికీ మధ్యన కూడా సాధించిన సమన్వయం.

'ఇది, 'ఎందుకు' అన్న ప్రశ్నకు గోపీచంద్ 1949 నాటికి సాధించిన సమాధానం.

మొత్తం మీద గోపీచంద్ జీవితంపట్ల జిజ్ఞాస, వివాహ వ్యవస్థపట్ల వివేచన పెరిగాయనటానికి పై రెండు రచనలు సాక్ష్యాలు.

# 6. ఆధ్యాత్మికవాద ప్రభావం

1946లో భౌతికవాద సమగ్రతను శంకించిన గోపీచంద్, 1947 నుంచి 1949 వరకు జీవన తత్త్వాన్వేషకునిగా భౌతికవాద గ్రంథాలనే కాకుండా, తద్వ్యతిరేక భావవాద105 గ్రంథాలనూ, సమన్వయాన్ని ప్రతిపాదించే గ్రంథాలనూ అధ్యయనం చేశాడు. బహుశా, ఇదివరకు అధ్యయనం చేసిన గ్రంథాలనే, మళ్ళీ పరిశీలించి ఉండవచ్చు.

కవిరాజుగారి సూతాశ్రమం ఆస్తికులకూ నాస్తికులకూ మధ్యన ప్రతిరోజూ వాదోపవాదాలతో 'ఘూర్ణిల్లుతూ, ఉండేదని, తండ్రిగారి ప్రోత్సాహంతో నాస్తికదృష్టితో తాను వాదించే వాణ్ణని గోపీచంద్ చెప్పుకున్నాడు.106 1928లో గోపీచంద్ మొదటి రచన చేశాడు కనుక, ఒక వ్యక్తిత్వం వచ్చిన సంవత్సరంగా దాన్ని మనం గుర్తిస్తే, కవిరాజుగారు చనిపోయేవరకు అంటే, 1943 వరకు దాదాపు 15 సంవత్సరాలపాటు ఆయన మీద ఈ వాతావరణ ప్రభావం ఉందని చెప్పవచ్చు. కాలేజీ చదువుకోసం గుంటూరు వెళ్ళినా, అప్పటి సాంఘిక రాజకీయ పరిస్థితులు యువకులలోని నాస్తిక హేతువాద భావాలను ప్రోత్సహించేవిగానే ఉన్నాయి.

వాదోపవాదాలు చాలావరకు పాల్గొనే వ్యక్తుల తెలివితేటల మీద, వాదనాపటిమ మీద ఆధారపడి ఉంటాయి. ప్రతిరోజూ జరిగే వాదోపవాదాలలో ఎప్పుడూ ఒక పక్షం గెలవదు. గెలిచినప్పుడు ఆనందించటం ఎంత సహజమో ఓడినప్పుడు విచారించటం, ఓటమికి కారణాలను అన్వేషించటం అంతే సహజం.

ఈ కారణాలను అన్వేషించటంలోనే ఎదుటి పక్షంపట్ల జిజ్ఞాస అభివృద్ధి చెందుతుంది. 1932 ప్రాంతంలోనే గోపీచంద్‌కు ఇలాంటి జిజ్ఞాస కలిగిందనటానికి సాక్ష్యాలున్నాయి.

ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారి 'శారదా నికేతనం'లో ఎనిమి

దేళ్ళ శిక్షణ పొందిన గోపీచంద్ భార్య దైవభక్తితో ప్రార్థన చేసుకుంటుంటే గోపీచంద్ కూడా ఆమె సరసన కూర్చొని ప్రార్థన చేసేవాడు.107 వారి పెళ్లి 1932లో జరిగింది. కనుక, ఆ తర్వాతి కాలంలోనే ఇది జరిగింది. ఇంచుమించుగా ఈ దశలోనే ఉన్నవ వారి దగ్గర ప్రార్థన మంత్రోపదేశాన్ని కూడా ఆయన పొందాడు.

అయితే, ఈ ప్రార్థన మూలంగా గోపీచంద్‌లో ఆస్తిక భావాలు కలిగినట్లులేదు. ఆస్తికుణ్ణి వాదనలో ఓడించటానికి ఆస్తిక గ్రంథాలు చదివినట్లుగానే మొదట్లో ఈ ప్రార్థన కార్యక్రమంలో గోపీచంద్ పాల్గొన్నాడు. కాని, రానురాను–స్వాతంత్ర్య సమర–సంఘ సంస్కరణ సాహిత్య రంగాలలో విజయాలు సాధించి, విశిష్ట వ్యక్తిత్వాన్ని సంతరించుకున్న ఉన్నవవారిపట్ల ఉన్న గౌరవం, వారి ఆస్తిక భావాలపట, ఆధ్యాత్మిక విశ్వాసాలపట్ల కూడా కలిగింది.

'నేను పెరిగివస్తున్నకొద్దీ శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారిపట నా దృష్టి మారుతూ వచ్చింది...."ఇంతమంచివాడే, ఇంత చదువుకున్నవాడే ఈయనకు ఆధ్యాత్మికవాదం మీద గురేమిటి ?" అనిపించేది. లోతుకు దిగి తెలుసుకోవాలనే కుతూహలం కలిగేది.'108

ఈ దశలో గోపీచంద్‌కు ఆస్తిక భావాలపట్ల గౌరవం ఏర్పడింది, 'వారూ భౌతికవాదుల్లాంటి సత్యాన్వేషకులే' అన్న దృష్టి మాత్రం ఏర్పడింది. ఇప్పటికీ ఆయన మీద తండ్రిగారి పట్టు కొంత సడలింది. అంతేగాని, ఆధ్యాత్మిక రంగంపట్ల గురి కుదరలేదు తన నాస్తిక హేతువాద భావాలే సరి అయినవనే విశ్వాసం బలంగానే ఉన్నది. భావకవిత్వాన్నీ, సాంఘిక అన్యాయాన్నీ ఉద్రేకంతో ఖండిస్తూ రచనలు చేస్తున్న గోపీచంద్, అటు అహింసాయుత రాజకీయాలూ, ఇటు ఉగ్రవాద రాజకీయాలే కాకుండా కొత్తగా ప్రవేశించిన కమ్యూనిస్టుపార్టీ రాజకీయాలూ, ఎం.ఎన్. రాయ్ భావాలూ, రాజకీయ రంగంలో సంఘర్షిస్తున్న అపూర్వ సన్నివేశాన్ని అర్థమైనంతమేర సహజ ఆవేశపూరిత శైలితో కథలనూ, వ్యాసాలనూ, నాటికలనూ రచించటంలోనూ గడుపుతున్న గోపీచంద్; రాయిజాన్ని ప్రచారంచేస్తూ రాజకీయాల్లో తిరుగుతున్న గోపీచంద్ తనలో కలిగిన ఆ సడలింపును అంతగా గుర్తించలేదు.

గుర్తించినా దానికి పెద్దగా విలువ ఇవ్వలేదు. ఆ తర్వాత ఆయన కొంతకాలం మనోవిజ్ఞాన శాస్త్రంపట్ల కూడా గాఢమైన ఆసక్తిని ప్రదర్శించాడు. ఈ ఆసక్తి కూడా తనలోని ఈ సడలింపును గుర్తించటానికి కొంత అవరోధంగానే పరిణమించింది.

సాధారణంగా, ఆధునిక యువకునిది సంక్లిష్ట మనస్తత్వం జీవితాన్ని ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ ప్రభావితం చేస్తున్న ఆర్థిక రాజకీయ పరిస్థితులు, అందుబాటులోకి వస్తున్న విజ్ఞానశాస్త్రం, రోజురోజుకు సన్నిహితమవుతున్న ప్రపంచం ఇరవయ్యో శతాబ్దపు యువకుని మనస్తత్వాన్ని సంక్లిష్టం చేస్తాయి. గోపీచంద్ మనస్తత్వం సంక్లిష్టం కావటానికి మరో అంశం కూడా తోడ్పడింది, అది— పెట్టుబడిదారీ వ్యవస్థకు సంబంధించిన కుహనా సంస్కృతిని ప్రతిబింబించే సినిమా రంగం.109

1939-1949 మధ్యకాలంలో గోపీచంద్ జీవితంలో చెప్పుకోదగ్గ సంఘటనలు అనేకం జరిగాయి. ముఖ్యమైనవి మూడు : 1) తండ్రి కవిరాజు గారు 1943లో మరణించారు. 2) విశ్వసించి ప్రచారం చేసిన రాడికల్ డెమొక్రాటిక్ పార్టీ ఇటు కాంగ్రెస్‌పార్టీనీ అటు కమ్యూనిస్టుపార్టీని ఎదుర్కొ లేకపోయింది. ఫలితంగా రాయ్ 1946 నాటికే రాజకీయాల నుంచి నిష్క్ర మించే స్థితిలో ఉన్నాడు. 3) సినిమారంగంలో అతనికి నిరాశా నిస్పృహలు ఎదురయ్యాయి.110

'1940-50 మధ్యలోని దశాబ్దం గోపీచంద్ జీవితంలో కష్టాలకాలం— ప్రధానంగా ఆర్థికంగా'111 అని సంజీవదేవ్‌గారు భావిస్తున్నారు.

నాస్తిక హేతువాదాలు, మార్క్సిజం, రాయిజం, చలనచిత్ర రంగం పొరల కింద ఇంతకాలం అణగిమణిగి ఉన్న ఆధ్యాత్మిక బీజం ఆయన జీవితంలో నెలకొని ఉన్న నిరాశాజనక పరిస్థితులసారాన్ని గ్రహించి క్రమ క్రమంగా మొలకెత్త సాగింది. ఈ దశలో మనోవిజ్ఞాన శాస్త్రంపట్ల కూడా గోపీచంద్‌కు అభిమానం తగ్గింది.

'వైయక్తిక చేతన ఉపచేతనలు 'అచేతన' అనే మహాసముద్రంలో తేలేవి మాత్రమే. ఆధ్యాత్మిక రంగంలో కృషిచేయదలచుకున్న భారతీయుడు ఈ

రెండింటి ద్వారా అచేతనలోని అనంత చైతన్యంతో తాదాత్మ్యం చెందవలసి ఉన్నది.'112

మరి, మనోవిజ్ఞానశాస్త్రం అచేతనను కొంత వివరించగలిగినా, ఆధ్యాత్మికానంత చైతన్యాన్ని విశ్వసించదు.113 అందువల్ల, ఆధ్యాత్మిక విశ్వాసాల దృష్ట్యా, మనోవిజ్ఞానశాస్త్రం పరిధి చిన్నదే. ఈ కారణంవల్ల కూడా గోపీచంద్‌కు ఈ శాస్త్రంపట్ల అభిమానం తగ్గిపోయింది.

ఈ మార్పు ఆయనలో కలవరాన్ని సృష్టించింది. పాత విశ్వాసాల పునాది కదలటం మొదలుకావటంతో గోపీచంద్ సంఘర్షణకు గురయ్యాడు.

కార్ల్‌మాన్‌హీమ్,114 ఉన్నవ లక్ష్మీనారాయణ మొదలైన వారి సహాయంతో తన కలవరాన్ని తగ్గించుకున్నాడు. అరవిందుని రచనలు ఆయనకు కొత్త గమ్యాన్ని చూపించాయి.

'పోస్టు చెయ్యని ఉత్తరాలు'115 (ఆధ్యాత్మికవాద, భౌతికవాద సమన్వయము) గోపీచంద్ అరవిందుని భావాలచేత ప్రభావితుడయ్యాడని ప్రపంచానికి వెల్లడిచేశాయి.

అరవిందుని భావాలతో 1944116 నాటికే గోపీచంద్‌కు కొంత పరిచయం ఉంది. తన అభిమాన నాయకుడు ఎం.ఎన్. రాయ్ లాగే వంగీయుడు కావటంవల్లా, రాయ్ లాగే మొదటి దశలో బ్రిటిష్ ప్రభుత్వాన్ని కూలదోయటానికి విప్లవాత్మక రాజకీయాల్లో పాల్గొన్నవాడు కావటంవల్లా గోపీచంద్‌కు అరవిందుని భావాలతో పరిచయం ఏర్పడి ఉండవచ్చు.

అరవిందుడు ప్రవచించిన ఏవే భావాలు తనకు నచ్చాయో 'పోస్టు చెయ్యని ఉత్తరాలు'లో రాశాడు.

తనకు అరవిందుడు ఏ దశలో బలంగా ఆకర్షించాడో గోపీచంద్ చెప్పుకున్నాడు. జీవితంలో అన్న అర్ధసత్యాలుగానే తనకు కనిపిస్తున్నప్పుడు, జీవితం మీదనే విరక్తి కలుగుతున్నప్పుడు, అసలు 'మనస్సు'కు ఉన్న పరిమితశక్తే ద్వంద్వాలకు అర్ధసత్యాలకు మూలమని అరవిందుడు చెప్పిన మాటలు గోపీచంద్‌ను ఆకర్షించాయి.117

గోపీచంద్ దృష్టిలో అర్ధసత్యాలంటే ఏవో ఊహించవచ్చు. గోపీచంద్ ఇంతవరకూ నాస్తిక హేతువాదాలనూ, మార్క్సిజాన్నీ, ఎం.ఎన్. రాయ్ వాదాన్నీ విశ్వసించాడు. నాస్తిక హేతువాదాలూ మార్క్సువాద రాయ్ వాదాలూ పూర్తిగా భౌతిక ప్రపంచానికి సంబంధించినవే కనుక అవి ఆధ్యాత్మిక భావాలను అంగీకరించక ఆయన దృష్టిలో అర్ధ సత్యాలయ్యాయి. మానవులను ధనిక బీద వర్గాలుగా విభజించటంవల్ల మార్క్సిజం ఆయన దృష్టిలో అర్ధార సత్యమే అయింది. మనిషి అర్ధసత్యాలతో విసిగిపోవటానికి మనస్సుకున్న పరిమితశక్తే కారణమని తెలుసుకోవటంతో అతీత మానసిక శక్తిపట్ల విశ్వాసం కలిగింది.

మరి హిందూ ఆధ్యాత్మిక వాదంపట్ల గోపీచంద్‌కు పూర్తి నమ్మకం కలగక పోవటానికి ప్రధానకారణం అది భౌతికవాదాన్ని నిరాకరించటమే. భౌతికవాదాన్ని పరిత్యజించి హిందూ ఆధ్యాత్మికవాదాన్ని స్వీకరించటమంటే, గోపీచంద్ దృష్టిలో కేవలం మరో అర్ధసత్యాన్ని స్వీకరించటమే. అందుకే భౌతికవాదాన్ని ఆధ్యాత్మికవాదంతో సమన్వయపరిచే అరవిందుని నవీన వాదం గోపీచంద్‌ను ఆకర్షించింది.

సంక్షిప్తంగా అరవిందుని వాదం ఇది ;

చైతన్యావిర్భావం గూర్చి అటు భౌతికవాదం గానీ, ఇటు ఆధ్యాత్మిక వాదంగానీ సంతృప్తికరంగా వివరించలేదని అరవిందుని ఉద్దేశం. అరవిందుడు హిందూమత విశ్వాసాన్ని అంతర్బుద్ధిని ఆధారంగా చేసుకొని, దివ్యశక్తిని విశ్వసించాడు. పరిణామక్రమంలో ఆవిర్భవించకముందే ఏదో విధంగా పదార్థంలో చైతన్యం నిగూఢంగా చోటుచేసుకున్నదనీ, పరిణామంలో దివ్య చైతన్యావిష్కారం తప్పనిసరిగా సంభవిస్తుందనీ ఆయన నిర్ధారణకు వచ్చాడు. అందువల్ల, సర్వాంతర్యామియైన శక్తి రూపాంతరమే పదార్థమనీ, పరిణామ క్రమంలో తన శక్తులను అది బహిర్గతం చేస్తుందనీ అరవిందుడు వాదించాడు.

పరిణామ సిద్ధాంతం పందొమ్మిదవ శతాబ్దపు అతికీలకమైన ఆలోచనా

శక్తి. ఆ శతాబ్దపు విజ్ఞానాన్ని ఆలోచనా విధానాన్ని మాత్రమే కాక రాజకీయాలనూ సమాజాన్ని కూడా ప్రభావితం చేసింది.

తరతరాల పరిణామం ఫలితంగా —

మొట్టమొదట మాంసకృత్తుల అణువుల నుంచి ఏకకణ జీవులు, వాటి నుంచి బహుకణ జీవులు ఉద్భవించాయని, భూగ్రహానికి సంబంధించినంత వరకు, మానవజాతే ఈ జీవ పరిణామానికి అత్యున్నత రూపమనీ అరవిందుడు విశ్వసిస్తాడు. అభివృద్ధి క్రమంలో మనిషికి మానసిక చైతన్యంకూడా లభ్యమైంది. ఈ పరిణామం మనిషితోనూ, మనసుతోనూ ఆగిపోదు. అతీత మనస్సు, అతీత మానవుడు అవతరించటం తప్పనిసరి.

అతీతమనస్సు, సాధారణ మనస్సు కంటే అనంత చైతన్యాన్ని కలిగినట్టిది. సచ్చిదానంద సంధాయకమైనట్టిది. అతీత మానవుని అవతరణకు సంబంధించిన పరిణామం జరుగుతూనే ఉన్నది. అయినా, అత్యున్నత దివ్య శక్తులను చేరుకోవటానికే కాక, భూమి మీదికి తీసుకురావటానికి కూడా మానవుడు ఆ పరిణామాన్ని త్వరితం చేయవలసి ఉన్నది.

తన తత్వానికి ఆచరణాత్మక రూపం ఇవ్వటానికి అరవిందుడు ఒక యోగమార్గాన్ని కూడా బోధించాడు. జ్ఞాన కర్మ భక్తి యోగాల సమన్వయ రూపం కావటంవల్లా, భారతీయ యోగులు అవలంబించిన మార్గాలను అరవిందుడు స్వానుభవంతో సమన్వయపరచటంవల్లా ఈ యోగాన్ని పూర్ణయోగమని పిలుస్తారు.118

అరవిందుని తత్త్వం సంపూర్ణ సత్యాన్ని ప్రతిపాదిస్తున్నదని విశ్వసించాడు. కనుక గోపీచంద్ అరవిందుని భక్తుడయ్యాడు. అప్పుడప్పుడు పాండిచ్చేరి వెళ్లి అరవిందుని దర్శనం కూడా చేసుకున్నాడు.119 తన 'పోస్టు చెయ్యని ఉత్తరాలు'లో అరవిందుని తత్త్వాన్ని వివరించాడు.

అయితే, గోపీచంద్ నవలల్లో అరవిందుని తత్త్వం ప్రతిబింబించిందా? అనేదే ముఖ్యమైన ప్రశ్న. సమాధానంకోసం 'అసమర్థుని జీవయాత్ర' తర్వాత గోపీచంద్ రచించిన నవలల్లోని తత్త్వాన్ని ఒక్కసారి సమీక్షించుకుంటే సమంజసంగా ఉంటుంది.

'పిల్లతెమ్మెర' నవలికలోని నాయకుడు డ్యాన్సుమాష్టారు సినిమాల్లో శాస్త్రీయ నృత్యాలను కూర్చినందువల్ల ప్రేక్షకుల ఆదరణ పొందలేక పోయాడు. అతనికి భరతనాట్యమన్నా, 'కథాకళి' అన్నా మిక్కిలి అభిమానం. కాని, 'మణిపురి' నాట్యంపై పాశ్చాత్య ప్రభావం ఉన్నందువల్ల, భరతనాట్యం మీదా కథాకళి మీదా ఉన్న గౌరవం లేదు.

నవల చివరి భాగంలో హైదరాబాదులోని నృత్య కళాశాలలో తాను అదివరకు గౌరవించిన నాట్యాలనే కాక అనేక ఇతర నాట్యాలను కూడా నేర్పుతుండటం చూసిన తర్వాత, పైకి భేదాలు కనిపించినా వాటి వెనక ఉన్న ఆత్మ ఒకటేనని గ్రహించాడు. అంతేకాదు, వివిధ నాట్యరీతుల సమ్యక్ సమ్మేళనంలో మృణాళిని ఇచ్చిన ప్రదర్శన అతని భావాన్ని బలపరిచింది.

ఈ విధంగా డ్యాన్సుమాష్టారు వివిధ ప్రాంతాలకూ, దేశాలకూ చెందిన నాట్యశైలుల మధ్యన సమన్వయం సాధించాడు.

'మెరుపుల మరకలు'లోని ఉషారాణి భౌతిక జీవితాన్ని పరిత్యజించి ఆధ్యాత్మిక ప్రపంచంలోనికి అడుగుపెట్టి యోగినిగా పరిణామం చెందింది. ఈ పరిణామం గూర్చి ఇదివరకే చర్చించటం జరిగింది.120

ఉషారాణి సాధించిన తాత్త్విక పరిణామానికి బీజం 'పిల్లతెమ్మెర'లో కనిపిస్తుంది. శమంతకమణిని వివాహం చేసుకున్న తర్వాత, రామనాథం ఆమె మనస్సును 'భగవంతుని పరం' చేయటానికి యత్నించాడు.

"క్రమక్రమేణా ఆమెలో పరివర్తనం కనబడుతూ వచ్చింది. బుద్ధి సిలకడ అబ్బుతూనే వుందని నేను అనుకున్నాను ఉన్నట్లు ఉండి ధ్యాననిమగ్నురాలయ్యేది" అంటూ, శచీంద్రుని మూలంగా ఆమె తిరిగి పూర్వపుమనిషి అయిందని రామనాథం చెప్పాడు. 'పిల్లతెమ్మెర'లో శమంతకమణి పాత్ర ద్వారా సాధించని ప్రయోజనాన్ని 'ఉషారాణి' ద్వారా సాధించాలని రచయిత భావించినట్లున్నది.

అయితే, ఉషారాణిలో వచ్చిన తాత్త్విక పరిణామం అరవిందుని తత్త్వానికి అనుగుణంగా ఉన్నదా? లేదా? అన్నదే ప్రశ్న. కాని, ఈ వివ

రాలను పరిశీలించటానికి నవలలో ఉన్న చిత్రణ అతిస్వల్పం. ఆమె సాధన దశను రచయిత వివరంగా చిత్రించనే లేదు. హిమాలయాలలోకి వెళ్లి పోయిన పదేళ్ళకు ఆమె మహాయోగినిగా మారింది.

'ఆమె అత్యున్నత స్థాయిని పొందిన యోగిని. ఎప్పుడూ సమాధ్యవస్థ లోనే వుంటారు. వారు అనాది నుంచీ ఆ మహారణ్యంలోనే తపస్సు చేస్తు న్నారు రాత్రీపగలనక అక్కడే వుండేవారు. ఇటీవలే భక్తులు కొందరు సమాధ్యవస్థలో వున్నవారిని అలాగే వుంచి చుట్టూ ఒక దాబా కట్టించారు. కాని మామూలు మనుష్యులకు అక్కడకు వెళ్ళడం కొంచెం కష్టం' అని మఠాధిపతులు చక్రవర్తిలో అన్నారు.

అరవిందుని తాత్త్వికదృష్టితో చూస్తే తపస్సాధనకోసం మానవ సమా జానికి దూరంగా అడవులలోకి వెళ్లిపోవటం అంత అవసరం కాదు.121 పాండిచ్చేరిలో ప్రజల మధ్యన ఉన్న అరవిందుల ఆశ్రమమే ఇందుకు నిద ర్శనం. వైయక్తిక మోక్షం అరవిందునికి అంతగా అంగీకారయోగ్యం కాదు. సమస్త మానవజాతినే కాదు, భౌతిక ప్రపంచాన్ని కూడా దివ్యచైతన్య విల సితం చేయటమే అరవిందుని ఉద్దేశం.122

అయితే, సాంప్రదాయిక హిందూతత్వం కంటే,

'God leads man, while man is misleading himself'123 అని చెప్పే అరవిందతత్త్వం ఉషారాణి వంటి వ్యభిచారిణిని సానుభూతితో చూస్తుందని చెప్పవచ్చు.

పది పదకొండేండ్ల సాధనలో ఉషారాణి యోగినిగానే కాదు 'మహా యోగిని'గా రూపొందిందని రచయిత విశ్వసిస్తున్నాడు. యోగిగా రూపొంద టానికి జీవితకాలమే చాలదంటారు. 1893 లో స్పష్టమైన మొదటి ఆధ్యాత్మి కానుభవం పొందిన అరవిందుడు, 24-11-1926 నాడు అంటే, సుమారు 33 సంవత్సరాలకుగాని సిద్ధిని పొందలేకపోయాడు 124

ఆధ్యాత్మిక రంగంలో పదేళ్ళు అత్యల్ప కాలమే. అందులో మొదటి నుంచీ ఆధ్యాత్మిరంగంతో సంబంధంకూడా లేని ఉషారాణి అల్పవ్యవధిలో 'మహయోగిని'గా రూపొందటం అసాధారణం.

అందువల్ల, సమన్వయానికి కూడా అవకాశం లేదు.

పూర్వజన్మ సుకృతంవల్లనో, అతీతశక్తి హఠాత్ ప్రేరణవల్లనో ఉషారాణి మహాయోగినిగా రూపొందిందని రచయిత విశ్వసించి వుంటాడు.

'గడియపడని తలుపులు' నవలికలో కోటేశ్వరమ్మ మానసిక ఏకాంతంలో అన్వేషణ అవ్యక్తంగా ఉంది. భర్తను వదిలిరావటంలోను, తిరిగి భర్త దగ్గరకు వెళ్ళలేకపోవటంలోను అన్వేషణ తత్వాన్ని, ఆత్మాభిమానాన్ని ప్రదర్శిస్తుంది. కాని దుర్భర ఏకాంతం అనుభవించవలసి వస్తుంది భర్త లక్షణాలున్న శ్రీనివాసరావును ప్రేమించటంలో తానొక గమ్యం చేరుకున్నానని ఆమె భావించింది. కాని, పరాజయమే ఎదురైంది. కొత్త లక్ష్యాన్ని అన్వేషించటానికి, ఒంటరితనాన్ని జయించటానికి తీర్థయాత్రలకు బయలు దేరింది.

తీర్థయాత్రల నుంచి తిరిగివచ్చిన తర్వాత ఆమెలో మార్పువచ్చింది. ఏకాంత ప్రియత్వం అలవడింది: భాగవతం చదవటం ప్రారంభించింది.125

'ఏకాంత ప్రియత్వం జ్ఞానంవైపు పయనించటానికి గుర్తు. గుంపు నడుమా, యుద్ధరంగంలో, వ్యాపార కేంద్రంలో సుస్థిర ఏకాంత దృష్టి ఉన్నట్లయితేనే జ్ఞానసాధన సాధ్యమౌతుంది.126 అన్న అరవిందుని మాటలు కోటేశ్వరమ్మకు వర్తిస్తాయి.

నిజమైన జ్ఞానంకోసం 'భాగవతం' చదవటం ప్రారంభించింది. 'ఎంతటి మహత్తర విషయాన్నైనా ఇట్టే అర్థం చేసుకునే' స్థితినీ, 'ఎంతటి ఉన్నతస్థాయినైనా ఇట్టే చేరుకునే' స్థితినీ ఆమె సాధించింది.

'పండితపరమేశ్వరశాస్త్రి వీలునామా'లోని తత్త్వాన్ని గూర్చి ఇదివరకే చర్చించటం జరిగింది.127

'శిథిలాలయం' నవలికలో నిర్మలాదేవి, తాను అనాథగా ఉన్నప్పుడు పీతాంబరరావు ఆశ్రయించింది. పెళ్లైన తర్వాత భర్తను వదిలి నారాయణను ఆశ్రయించింది. నారాయణను వదిలిన తర్వాత అనాథ శరణాలయాన్ని ఆశ్ర

యించింది. అక్కడ ఆమె జీవిత లక్ష్యాన్ని సాధించింది. తానే స్వయంగా సేవాసదనం స్థాపించి, పూజా, సేవా చేసి, పార్లమెంటు సభ్యురాలిగా కూడా ఎన్నికైంది.

ఈ ప్రగతి వెనుక, పరిణామం వెనుక ఉన్న సూత్రం అడ్డంకుగా ఉన్న పరిస్థితులను జయించటం, పాతను వదులుతూ, కొత్తను కలుపుకుంటూ వెనుకకు చూడకుండా ముందుకు సాగటం, వ్యక్తిత్వాన్ని సంతరించుకోవటం వల్లనే జీవితానికి విలువ లభిస్తుంది. ఈ విలువల నుంచే కొత్త సాంఘిక నియమాలు పుట్టవలసి ఉన్నది. ఇది నిర్మలాదేవి పాత్ర ద్వారా రచయిత చెప్ప దలచుకున్న సత్యం. సాంఘిక నియమాలను ఉల్లంఘించిన నిర్మలాదేవి సంఘానికే సేవచేయటానికి పూనుకోవటం గమనార్హం.

మరోపాత్ర సీనా, నీతి బాహ్యమైన వేశ్యావృత్తిని వదిలి సాంసారిక జీవితాన్ని స్వీకరించటం ద్వారా, కొత్త విలువను సంతరించుకొంటుంది. స్వేచ్ఛకోసం నిర్మలాదేవి వివాహ వ్యవస్థలోని నీతి నియమాలను ఉల్లంఘించింది. స్వేచ్ఛను వదులుకొని సీనా వివాహవ్యవస్థను స్వీకరించింది. తిరుగుబాటు తత్త్వాన్నీ సంఘసంస్కరణ వాదాన్నీ సమన్వయిపరిస్తేనే వివాహ వ్యవస్థ కొత్త విలువలను సంతరించుకొంటుందని గోపీచంద్ ప్రతిపాదిస్తున్నాడు. 'గతించని గతం' నవలికలో హుస్సేన్‌ఖాన్ రజాకార్‌గా హిందువులను హింసించి, హిందూ యువతిని మానభంగం చేశాడు. అతడు పాకిస్తాన్ వెళ్ళిన తర్వాత సాటి ముస్లిమే తన తల్లికి అన్యాయం చేశాడనీ, తనవల్ల నష్టపోయిన హిందువే తన తల్లిని ఆదుకున్నాడనీ హుస్సేన్‌ఖాన్ తెలుసుకున్నాడు.

తనలోని పరమత ద్వేషంవల్ల హిందువులకు నష్టం కలుగుతుందనేది హుస్సేన్‌ఖాన్‌కు తెలిసిన సత్యమే నష్టం కలిగించటమే అప్పట్లో అతని ధ్యేయం. కాని, స్వమత దురభిమానమే తనకు కీడు కలిగించిందనీ, తన తల్లిని బలిగొన్నదనీ అతడు ఆలస్యంగా తెలుసుకున్న సత్యం. ఫలితంగా హుస్సేన్‌ఖాన్ స్వమతానికీ పరమతానికీ మధ్యన సమన్వయాన్ని సాధించి మానవతా దృష్టిని అలవరచుకున్నాడు.

'చీకటి గదులు,, 'ప్రేమోపహతులు' 'యమపాశం' ఈ మూడూ అసంపూర్ణ రచనలు కావటంవల్ల ప్రధాన తత్త్వాన్ని నిర్ధారణ చేయటం సమంజసం కాదు. వాటి ముగింపులను ఊహించిన ఘట్టాలలో తత్త్వప్రతిపాదన ప్రయత్నం జరిగింది.

ఇదివరకు చేసిన పరిశీలనవల్ల 'పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా' నవలలో అరవిందుని తత్త్వాన్ని ప్రతిబింబించటానికి రచయిత ప్రయత్నించాడని తెలపటం జరిగింది. పై సమీక్షవల్ల గోపీచంద్ 'మెరువుల మరకలు' నవలలో హిందూ ఆధ్యాత్మిక భావాలను ప్రతిబింబించటానికే ప్రయత్నించాడనీ, 'గడియపడని తలుపులు' నవలలో అరవిందుని భావాన్ని ప్రతిపాదించటానికి కొద్దిగా ప్రయత్నించాడనీ తేలింది. అంటే కేవలం మూడు నవలల్లోనే, అదీ పాక్షికంగా మాత్రమే ఆధ్యాత్మిక భావాల ప్రభావం కనిపిస్తుది.

'పిల్లతెమ్మెర' 'శిథిలాలయం' 'గతించనిగతం' నవలల్లో గోపీచంద్ సమన్వయభావాన్ని ప్రతిపాదించాడు అరవిందుని తత్వం కూడా ఆధ్యాత్మిక భౌతికవాదాల మధ్యన సమన్వయమే కనుక గోపీచంద్‌లో సమన్వయదృష్టే జీవలక్షణంగా కనిపిస్తున్నదని చెప్పవచ్చు.

'ఏదో ఒక సిద్ధాంతంతో తృప్తిపడే రోజులుగా కనపడటం లేదు ఈ రోజులు. అన్ని సిద్ధాంతాల్లోని మంచిని ఏరుకొని, పోగుచేసుకొని ప్రయాణం చెయ్యవలసిన రోజులుగా కనబడుతున్నాయి ఇవి.'[128] అన్న వాక్యాలు గోపీచంద్ తత్త్వాన్ని వ్యాఖ్యానిస్తున్నాయి.

మానవ జీవితం వైవిధ్యంతో కూడింది. అందుకే జీవితం ప్రతిపాదించే తత్త్వం కూడా వైవిధ్యంతో కూడి ఉండటంలో ఆశ్చర్యం లేదు.

తూర్పు-పడమర, యుద్ధం-శాంతి, ప్రాంతం-జాతి, కలిమి-లేమి' మతం-విజ్ఞానం, గతం-వర్తమానం-ఇలాంటి ఎన్నో వైరుధ్యాలు మనిషికీ మనిషికీ మధ్యన అగాధాలను త్రవ్వాయి. మనిషి గుండెలో అగ్నిపర్వతాలను ప్రేల్చాయి. పచ్చని బతుకు పొలంలో చీడను సృష్టించాయి, మనిషి దారిలో కత్తులను పరిచాయి.

ఫలితంగా మనిషి తీవ్రమైన సంఘర్షణకు లోనయ్యాడు. అతని ముందు అన్నీ ద్వంద్వాలు, అన్నీ అర్ధసత్యాలు ప్రశ్నార్థకాలై నిలుచున్నాయి. ఏ ఒక్కదానితో సమాధానపడిపోయినా, రెండోది దూరమైపోతుంది.

అందుకే, రెండింటి స్వరూప స్వభావాల్లో ఉండే తీవ్ర విరుద్ధాంశాలను దూరంగా ఉంచి, వ్యక్తికీ సంఘానికీ ప్రయోజనదాయకమయ్యేటట్లుగా వాటిని సమన్వయపరచవలసిన ఆవసరముందని గోపీచంద్ విశ్వసించాడు. ఈ సమన్వయం, భౌతికవాదంలో పాతకూ, కొత్తకూ మధ్యన కావచ్చు; ఆధ్యాత్మిక వాదంలో పాతకూ కొత్తకూ మధ్యన కావచ్చు; భౌతిక ఆధ్యాత్మికవాదాల మధ్యనా కావచ్చు.

ఇది గోపీచంద్ హృదయం.

"ఇప్పుడు ఇక్కడిదాకా వచ్చారు. ఇక ముందు మాత్రం ఇక్కడే నిలబడతారని నమ్మకం ఏముంది ? అని అడుగుతారు, అడగవచ్చు. ఈ విషయం గాంధీ గారు బాగా చెప్పారు. "నీకు కావలసింది సత్యమా ? లేక వైరుధ్యం లేకపోవటమా ? అని నన్నెవరైనా అడిగితే నేను సత్యాన్ని కోరుకుంటాను." అన్నారు 129 అంటూ సమన్వయం నుంచి కొత్త సత్యం పుడుతుందంటున్నాడు.

ఇది గోపీచంద్ విశ్వాసం. మార్పుకు లోనయ్యే అవకాశంలేని విశ్వాసం భవిషత్తులో ఆయన తిరిగి భౌతికవాది అయినా, సమర్థించుకోవటానికి అవకాశం ఉన్న విశ్వాసం.

"ఎటువంటి మానవ సంబంధాన్నయినా, పెట్టుకున్న దగ్గరి నుంచీ అధిగమించ బుద్ధవుతుంది నాకు "130 అన్న నిర్మలాదేవి మాటకు గోపీచంద్‌కు తాత్త్వికంగా వర్తిస్తుంది. ఒక తత్త్వంతో సంబంధం పెట్టుకున్న దగ్గరి నుంచీ, దాన్ని అతిక్రమించాలనే స్వభావం గోపీచంద్‌ది. అందువల్ల అరవిందుల తత్వంతో ఆగిపోయేవాడు కాదేమోననిపిస్తుంది. 'మెరుపుల మరకలు' నవలలోని ఉషారాణి పాత్రచిత్రణలో, అరవిందుని తత్వంలోని మంచిని తన దృష్టితో వివేచించి, దాన్ని మాత్రమే స్వీకరించి, సాంప్రదాయిక హిందూ ఆధ్యాత్మిక రంగంలోకి ప్రయాణం చేసే వైఖరికి సూచనలు కనిపిస్తున్నాయి.

ఆరవ ప్రకరణం

## సూచికలు

1. 'కవిరాజా జీవితం సాహిత్యం', 'అభినందన', పుట 1.
2. 'మూంచాల', భరతవాక్యం, పుట 188, గోపీచంద్.

   'కారెంపూడి కదనం' నాటకాన్నే త్రిపురనేని సుబ్బారావుగారు 'పల నాటి పౌరుషం'గా పేర్కొన్నారు. చూ. 'కవిరాజు జీవితం— సాహిత్యం' పుట 61.
3. ఉన్నవ రచనలు కొన్ని, పుట 117, 'కవిరాజు అస్తమయం' మూడో సూచిక.
4. 'Fight for freedom', Pages 28 to 30, N.G. Ranga
5. 'శంబుక వధ', ద్వితీయాంకము పుట 72, కవిరాజు.
6. Ibid. ప్రథమాంకము, పుట 47.
7. 'సూతపురాణము', 'సూతపురాణ రచనావశ్యకత యేమి'. (తొలిపలుకులు) కవిరాజు.
9. 'ఉన్నవ రచనలు కొన్ని', పుటలు 117, మూడో సూచిక.
10. 'పోస్టు చెయ్యని ఉత్తరాలు', 'చిత్తజల్లు' (పీఠిక), గోపీచంద్.
11. 'గోపీచంద్ స్మారక సంచిక', పుట 11, 'జీవితచరిత్ర', త్రి. సుబ్బారావు.
12. 'సాహిత్య ప్రయోజనం,' పుటలు 71, కొడవటిగంటి కుటుంబరావు.
13. 'ప్రజామిత్ర' 21—6-'36 (ఆదివారం)
14. 'భార్యల్లోనే ఉంది', (కథా సంపుటి), పుట 89.

15. చూ. ఈ సిద్ధాంత వ్యాసం మూడవ ప్రకరణం.

16. 'యం.యన్ రాయ్ : జీవితం—సిద్ధాంతం, పుట 236, కోగంటి రాధా కృష్ణమూర్తి.

17. 'మాలపల్లి నవలపై ప్రభుత్వ నిషేధాలు, పీఠిక పుట xvviii, 'నగ్న ముని.'

18 'తెలంగాణా విప్లవపోరాటం'—గుణపాఠాలు', పుట 169, పుచ్చలపల్లి సుందరయ్య.

19. 'మాలపల్లి నవలపై ప్రభుత్వ నిషేధాలు', 'ముందు మాటలు', బంగోరె.

20. Ibid. పుట xLiii.

21. 'Fight for freedom', p. 2?1, N.G, Ranga.

22 'గోపీచంద్'. పుట 8, తి. సుబ్బారావు.

23 'చీకటిగదులు' పుటలు 129 నుంచి 134 వరకు. సిద్ధాంత వ్యాసకర్తకు 12 ఫిబ్రవరి, 1984నాడు ఇచ్చిన ఇంటర్వ్యూలో ఆవుల సాంబశివరావు గారు కూడా ఇదే అభిప్రాయం వ్యక్తం చేశారు.

24 Ibid పుట 182.

25. Ibid పుట 66.

26,27. 'ఆంధ్రలో స్వాతంత్ర్య సమరము' పుటలు 120, 121.

28. Ibid పుట 99.

29 Ibid పుట 101.

30 Ibid పుట 112.

31. Fight for freedom, p 1?5.

32. 'పరివర్తనం', పుట 82.

33. ఫ్రెంచి మూలం; యూజన్ పాటియల్, అను : బాలాంత్రపు నళినీ కాంతరావు (1935) గద్దె లింగయ్యగారి సంపాదకత్వంలో వెలువడిన 'ప్రభ' పత్రికలో ఈ అనువాదం ప్రచురితం.

34. 'యమపాశం', పుట 194.

35 'ఆంధ్రలో స్వాతంత్ర్య సమరము', పుట 124.

36. 'పట్టాభిగారి సోషలిజం' పుటలు 14 నుంచి 16 వరకు.

37. 'మాలపల్లిపై ప్రభుత్వ నిషేధాలు', పుట 78.

38. 'గీతాపారాయణం' కథల సంపుటి.

39. ఆ రోజుల్లో సాంస్కృతిక కార్యక్రమాలు ఆంధ్ర ప్రాంతంలో జరుగుతుండేవి ముఖ్యంగా, కృష్ణాజిల్లా 'ప్రజానాట్య మండలి' 'రాష్ట్ర ప్రజానాట్య మండలి దళం' పేర్కొనదగినవి.

—వీరతెలంగాణా : నా అనుభవాలు—జ్ఞాపకాలు, పుట 59, రావి—నారాయణరెడ్డి.

40. 'పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా', పుట 66

41. Ibid పుట 94.

42. Ibid పుట 97.

43. Ibid పుట 95.

44. 'పట్టాభిగారి సోషలిజం' పుట 7.

45. Ibid పుట 14.

46. 'ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం—దాని పరిణామం, పుట 100, చంద్ర పుల్లారెడ్డి, మానికొండ సుబ్బారావు.

47. 'విహారి' 1943 డిసెంబర్, 1944 జనవరి, ఫిబ్రవరి సంచికలు.

48,49. 'చంద్రం వ్యాసావళి', పుటలు 90, 91.

50. (a) చరిత్రలో ఐదు ముఖ్య విధానాలు కనిపిస్తాయి. ఆదిమ కమ్యూనిస్టు విధానం, బానిస విధానం, భూస్వామ్య విధానం, పెట్టుబడిదారీ విధానం, సోషలిస్టు విధానం. ఆదిమ కమ్యూనిస్టు విధానంలో ఉత్పత్తి సాధనాలు సామాజిక యాజమాన్యం కింద ఉండటమే ఉత్పత్తి సంబంధాలకు ప్రాతిపదిక....బానిస విధానం కింద బానిస యజమాని చేతిలో ఉత్పత్తి సాధనాలుంటాయి. ఉత్పత్తిచేసే పనివానికి, అంటే బానిసకు కూడా అతడే యజమాని....భూస్వామ్య విధానంలో భూస్వామ్య ప్రభువు ఉత్పత్తి సాధనాలకు యజమానియేకాని, ఉత్పత్తిచేసే కార్మికుని (అర్ధ బానిస) పై పూర్తి యాజమాన్యం అతనికి లేదు. చేతిపనివానికి తన ఉత్పత్తి పరికరాలపైన యాజమాన్యం వుంటుంది.'

—గతితార్కిక చారిత్రక భౌతికవాదం, పుటలు 28, 29, 30 'స్టాలిన్'.

(b) భారతదేశంలోని బానిసలను గూర్చిన వివరాలు చరిత్ర గ్రంథాల్లో కూడా కనిపిస్తాయి. ఉదా: 'ఆర్యుల రాకకు పూర్వం భారతదేశంలో నివసించిన ప్రజల్ని ఋగ్వేదం 'దాసులు' లేదా 'దస్యులు' అని వర్ణించింది. ఆర్యులు వీరిని ఓడించి దాసదాసీలుగా మార్చివేశారు.

—తరతరాల భారత చరిత్ర, పుట 26, రొమిల్లా థాపర్.

(c) బుద్ధుని కాలాన్ని భారతదేశం బానిస విధానం నుంచి అర్ధ బానిస విధానంలోకి మారే సంధికాలంగా ఏటుకూరి బలరామమూర్తిగారు పేర్కొన్నారు.

—'భారతీయ తత్త్వశాస్త్రము', పుట 436.

51. యమ్. యన్. రాయ్ స్వీయ గాథలు', పుట 426.

52. 'ఎం. ఎన్. రాయ్: భారత కమ్యూనిజం', పుట 542 (సూచిక), రావిపూడి వెంకటాద్రి

53 'యమ్. యన్. రాయ్ స్వీయగాధలు', పుట 482, బి.యస్.ఎల్. హనుమంతరావు.

54. Ibid పుట 485.

55. 'యమ్.యన్. రాయ్ స్వీయ గాధలు', పుట 496.

56. 'గోపీచంద్ స్మారక సంచిక', నేను-మా గోపీచంద్.

57. 'ఏం ఏ. వీలునామా'లో గోపీచంద్ ప్రతినిధి పాత్ర కేశవమూర్తి అభిప్రాయం, పుట 6౮

58. 'ఆంధ్రలో స్వాతంత్ర్యసమరము', పుట 140.

59. 'యమ్.యన్. రాయ్ స్వీయగాధలు', పుట 497.

60. 'ధర్మ అనుపత్రి', కథల సంపుటి.

61. ఎం.ఎన్. రాయ్ భారత కమ్యూనిజం, ఉపోద్ఘాతం.

62. 'Fight for freedom', p. 327, N.G. Ranga.

63,64. 'ఆంధ్రప్రదేశ్ దర్శిని', పుట 585.

65. 'యమ్.యన్. రాయ్ స్వీయ గాధలు', పుట 495.

66. Ibid పుటలు 462, 463.

67. యం.యన్. రాయ్ వ్యాసాలు, పుట 42, అను. కె రాదాకృష్ణమూర్తి.

68. యమ్ యన్. రాయ్ స్వీయ గాధలు', 516.

69. 'యం.యన్. రాయ్ జీవితం—సిద్ధాంతం', పుట 408.

70. 'యమ్.యన్. రాయ్ వ్యాసాలు', పుట 286.

71. చూ. 'పిల్లతెమ్మెర' పుటలు 13, 19, 68.

72. 'చీకటిగదులు', పుట 496.

73. 'ఏం.ఏ. వీలునామా', పుట 97.

74. 'యం.యన్. రాయ్ వ్యాసాలు', పుట 286.

75. 'యమపాశం' పుట 33.

76. 'పోస్టు చెయ్యని ఉత్తరాలు', పుట iii.

77. 'అపసామాన్య మనోవిజ్ఞానము', పుట 77.

78.79 'సంవేదన' (త్రైమాసిక), జనవరి 1969, పుటలు 58, 59.

80. 'Abnormal Psychology, p. 133. J.D. Page.

81. 'Contemporary Schools of Psychology', p. 194, Robert S. Woodworth.

82. 'అపసామాన్య మనోవిజ్ఞానము', పుటలు 67 నుంచి 70.

83. 'The Proverb tells us that One cannot serve Lwo masters. The poor 'ego' has a still harder time of it, it has to serve three harsh masters. The three tyrants are the external world, the Super ego and the id.'

—New Introductory Lectures on Psycho analysis. p. 103, S. Frued.

84. చూ. ఈ సిద్ధాంత వ్యాసం, రెండవ ప్రకరణం.

85. 'నవోదయ', వారపత్రిక 3-11-1946.

86. చూ. ఈ సిద్ధాంత వ్యాసం, ఐదవ ప్రకరణం, సూచికలు 9, 10.

87. 'మెరుపుల మరకలు', పుట 167.

88,89. Contemporary Schools of Psychology, p. 201.

90. 'Projection of archetypes also gives rise to the sense of holiness attaching to places and things, and by

Projecting the deepest archetypes in this way human beings stand, apart from them and relate to them.'

—'Modern Psychology' (The teachings of C.G. Jung), p. 140, David Cox.

91. Ibid pages 141, 142.

92. అపసామాన్య మనోవిజ్ఞానము పుట 100.

93. Voyeurism : Voyeur=One, obtaining sexual gratification from seeing sex organs and sexual acts; broadly : One who habitually seeks sexual stimulation by visual means.

—Webster's New Collegiate Dictionary,

94. 'ఉదాత్తీకరణం' గూర్చి రచయిత 'అసమర్థుని జీవయాత్ర'లో పేర్కొన్నారు. చూ. రామయ్య తాత హితబోధ, పుట 188.

95. 'అసమర్థుని జీవయాత్ర'. పుటలు 130 నుంచి 140.

96. International Encyclopedia of Psychiatry, Psychology, Psychoan alysis, Vol. 8.

97. The basic Writings of Sigmund Frued, Psycho pathology of everyday life, p. 142.

98. Ibid p. 144.

99. Impulse=A sudden drive to action, Particularly a relatively simple drive of short duration.
—The New dictionary of Psychology, p. 176.

100. 'నవోదయ' వారపత్రిక, 18-5-1947.

101. కార్ల్ మాన్‌హీమ్ (Karl Mannheim) బహుముఖ ప్రజ్ఞాశాలిగా పేరు

పొందిన సాంఘిక శాస్త్రవేత్త. 'Sociology of Knowledge', 'Man and Society' మొ॥ గ్రంథాల రచయిత

102. 'పోస్టు చెయ్యని ఉత్తరాలు', పుట 111.

103 'ఆదర్శ జీవులు', 'శకుంతల—లోకం'.

104. 'భారతి' మాసపత్రిక, జూన్ 1949.

105. ప్రకృతిలో కూడిన భౌతిక ప్రపంచం చైతన్యం నుంచీ, ఆత్మ నుంచి ఉద్భవించిందని విశ్వసించేది భావవాదం. తద్వ్యతిరేకమైంది భౌతిక వాదం.

—గతి తార్కిక భౌతికవాదం, పుట 16.

106. చూ. ఇదే ప్రకరణం 'తండ్రిగారి ప్రభావం'.

107. గోపీచంద్ స్మారక సంచిక, 'మా జీవ యాత్ర', శ్రీమతి శకుంతలా గోపీచంద్, పుట 22.

108. 'పోస్టు చెయ్యని ఉత్తరాలు', పుట vi.

109. గూడవల్లి రామబ్రహ్మంగారి 'రైతుబిడ్డ' చిత్రానికి సహాయ దర్శకత్వం వహించటానికి 1939లో గోపీచంద్ మద్రాసు వెళ్ళాడు.
—గోపీచంద్ స్మారక సంచిక, పుట 22.

110. చూ. ఈ సిద్ధాంత వ్యాసం, ఏడవ ప్రకరణం, 'ఆత్మ—కథాత్మక లక్షణాలు.'

111. ఈ వ్యాసకర్తకు రాసిన లేఖ, తేది : 9-7-1980.

112. 'Mahayogi Sri Aurobindo', p. 120, R.R. Diwakar.

113. ఆధ్యాత్మిక విశ్వాసాలకు విలువ ఇచ్చే యూంగ్, సమాధ్యవస్థను ఖండించినందుకు గోపీచంద్ నిరసన తెలిపాడు.
—చూ. పోస్టు చెయ్యని ఉత్తరాలు, పుటలు 101, 102.

114. కార్ల్ మాన్‌హీమ్ గోపీచంద్‌ను ఆకర్షించటానికి మరో కారణం, Sociology of knowledge లో ఆయన వ్యక్తం చేసిన భావాలే. మాన్‌హీమ్ మీద ఉన్న ఈ కింది విమర్శ గమనార్హం. 'These were other reasons why Mannheim's 'Sociology of knowledge' failed. What he meant by knowledge was largely normative and metaphysical beliefs, ideas about the nature and right organization of Society and interpretations of history.'

—'International Encyclopedia of the Social Sciences', Vol. 9, p. 559.

115. 'ఆంధ్రపత్రిక' (దిన)లో 1949 నుంచే 'పోస్టు చెయ్యని ఉత్తరాలు' వెలువడుతూ వచ్చాయి. ఈ లేఖలు 1955లో పుస్తకరూపంలో వచ్చాయి.

116. 'శాస్త్ర దాస్యం', కొప్పరపు సుబ్బారావు పుస్తకానికి 'ముందు మాట' గోపీచంద్ (1944).

117. పో.చె. ఉ. పుట v.

మనస్సుకు సంబంధించిన అరవిందుని ఈ అభిప్రాయం గమనార్హం: 'We mean by mind imprisoned in a living body. But mind is not the highest possible power of consciousness, for mind is not in possession of truth, but only its ignorant speaker.

—'The hour of God and other writings', p, 7. Sri Aurobindo.

118. ఆధార గ్రంథాలు: 1) The Encyclopedia of Philosophy I; 2) Super mental manifestations, p. 225, Sri Aurobindo; 3) Mahayogi Sri Aurobindo' Chapter XII.

119. 'గోపీచంద్ స్మారక సంచిక', పుట 22.

120. చూ. ఈ సిద్ధాంత వ్యాసం పుటలు 106 నుంచి 113.

121. 'Mahayogi Sri Aurobindo', p. 158.

122. Ibid p. 250.

123. The hour of God and other Writings, (Vol. 17) p. 105 Sri Aurobindo.

124. 'Mahayogi Sri Aurobindo', p. 221.

125. 'గడియపడని తలుపులు', పుట 106.

126. 'The hour of God and other Writings', p. 92.

127. చూ. ఈ సిద్ధాంత వ్యాసంలోని మూడవ ప్రకరణం, 'పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా'

128. పో.చె.ఉ. 'చిత్తజల్లు'

129. Ibid (రెం.ము.) పుట 12.

130. 'శిథిలాలయం' పుట 122.

ఏడవ ప్రకరణం

## ఆత్మకథాత్మక లక్షణాలు

ఒక దేశంలో నివసించే కోట్లాది ప్రజల జీవితాల్లో, ఒక ప్రాంతంలో నివసించే లక్షలాది ప్రజల జీవితాల్లో ఒకేరకపు సన్నివేశాలు, సంఘటనలు, అనుభవాలు చోటుచేసుకుంటాయి. వాళ్ళ జీవితాలను శాసించే సమకాలీన ఆర్థిక సాంఘిక రాజకీయ శక్తులు ఒకటే కావటంవల్ల, ఈ సారూప్యత సిద్ధిస్తున్నది. సాంఘిక నవలా రచయిత అతిసహజంగా తన నవలలో వీటిని తన జీవితంతో కలిపి ప్రదర్శిస్తాడు. అంతమాత్రాన అది ఆత్మకథాత్మక నవల కాజాలదు. రచయిత నవలలో ప్రదర్శించే జీవితంలో బలమైన ఆత్మీయతాముద్ర ఉన్నప్పుడే అది ఆత్మకథాత్మక నవల అవుతుంది.

మనిషికి తనను గూర్చి తెలిసినంతగా ఇతరుల గూర్చి తెలియదు. పరిశీలనాశక్తి ఉన్న రచయితకు కూడా తన ప్రవర్తనా, ఆ ప్రవర్తనకు మూలకారణాలూ విదితమైనంతగా చుట్టూ ఉన్న వ్యక్తుల ప్రవర్తనా, ఆ ప్రవర్తనను శాసించే మూలకారణాలూ విదితం కాకపోవచ్చు. తేలిందేమిటంటే, రచయితకు తన జీవితం అందుబాటులో ఉన్నంతగా ఇతరుల జీవితం ఉండదని.

సాంఘిక నవల జీవితమంతది కాకపోయినా, చాలావరకు విస్తారమైనదే. సృజనాత్మక శక్తి తగ్గినా, తన జీవితం గూర్చి ప్రకటించుకోవాలని రచయిత భావించినా, నవలలో స్వీయజీవితం చోటుచేసుకోవచ్చు. ఈ చోటు చేసుకోవటమనేది ఎన్ని రకాలుగానైనా జరగవచ్చు. రచయిత తన జీవితాన్నే కల్పనలతో జోడించి రాయవచ్చు. తన జీవితంలోని సన్నివేశాలను, సంఘటనలను కొద్ది మార్పులతో ప్రవేశపెట్టవచ్చు. కాని, ప్రధాన పాత్రగా రచయిత రూపాంతరం చెందటమే చాలావరకు కనిపిస్తుంది.

రచయిత వైయక్తిక అనుభూతులు, అనుభవాలు, ఆలోచనలు, స్వభావం, జ్ఞానం, కుటుంబ జీవితం, సాంఘిక జీవితం మొదలైన అంశాలన్నీ గాని, కొన్నిగాని అవసరమైనంత మేర కాల్పనిక రూపం ధరించి పాత్రలో భాసిస్తాయి.

విమర్శకుడు ఒక నవలను ఆత్మకథాత్మక నవలగా గుర్తించటమెట్లా? అన్నది ముఖ్యమైన ప్రశ్నే. రచయిత జీవితం ప్రత్యక్షంగాగానీ, పరోక్షంగా గానీ తెలిసి ఉంటే ఈ చిక్కు కొంతవరకు విడిపోతుంది. కాని, సమకాలీన రచయితల విషయంలో మాత్రమే, అదీ పాక్షికంగానే ఈ సమాధానం వర్తిస్తుంది. రచయిత తనకు ప్రత్యక్షంగా తెలిసినపుడు, విమర్శకుడు తన అభిమాన దురభిమానాల రంగుటద్దాలలో నుంచి ఆ రచయితను పరిశీలిస్తే అసత్యాలు చోటు చేసుకునే అవకాశం లేకపోలేదు, విమర్శకుడు ఎంత నిజాయితీగా రచయితను పరిశీలించినా తన పరిమితుల కారణంగానో అజాగ్రత్త కారణంగానో పొరపాట్లు చోటు చేసుకోవచ్చు. కుటుంబ సభ్యులద్వారా, స్నేహితుల ద్వారా, సన్నిహితుల ద్వారా విమర్శకుడు రచయితను గూర్చి తెలుసుకోవచ్చు. వారు రచయితకు అభిమానులైతే అతిశయోక్తులు చెప్ప వచ్చు. వ్యతిరేకులైతే విద్వేషాన్ని కక్కవచ్చు. ఈ రెండూ విమర్శకునికి ఆ నవలను పరామర్శించటానికి ఉపకరించవు. రచయిత నలుగురిలోకి రాని వాడైతే ఈ లక్షణాలను నిరూపించటం మరీ కష్టం. జనబాహుళ్యంతో సంబంధం ఉన్న రంగాలలో కృషి చేసిన రచయిత జీవితం, సాహిత్య రంగంలో గణనీయమైన విజయాలను సాధించిన రచయిత జీవితం విమర్శ కునికి కొంతవరకు అందుబాటులో ఉంటుంది.

అయినా, రచయిత స్వయంగాగాని, స్వీయచరిత్రద్వారా గాని వెల్లడి చేసే జీవితం విమర్శకునికి ప్రామాణికమైనదని చెప్పవచ్చు. స్వీయచరిత్ర లేనప్పుడు జీవిత చరిత్ర గ్రంథమే విమర్శకునికి ఆధారమౌతుంది. ఈ జీవిత చరిత్రలు ఒకటికి రెండున్నప్పుడు విమర్శకునికి సత్యాసత్యాల నిర్ధా రణ సులభమౌతుంది.

సన్మాన సంచికలు, స్మారక సంచికలు, తోటి రచయితల రచనలోని

ప్రస్తావనలు, జీవిత రేఖలను వివరించే వ్యాసాలు—ఇవన్నీ పరిమితంగా విమర్శకునికి ఉపకరిస్తాయి.

ఒక సన్నివేశంగానీ, ఒక మనస్తత్వంగానీ, మరే అంశంగానీ ఆ రచయిత రచించిన అనేక నవలల్లో పునరావృతమైనప్పుడు కూడా ఆత్మీయ స్పర్శ ఉన్నదని గుర్తించవచ్చు. ఏది ఏమైనా, ఆత్మకథాత్మక లక్షణాన్ని గుర్తించటంలోనూ, నిరూపించటంలోనూ విమర్శకుడు రాగద్వేషాతీతంగా ఉన్నప్పుడే సాహిత్య ప్రయోజనం సిద్ధిస్తుంది.

త్రిపురనేని సుబ్బారావుగారు 'చీకటిగదులు' నవలను గోపీచంద్ ఆత్మకథాత్మక నవలగా పేర్కొన్నారు.

'ఇందులోని పాత్రలు—గోపాలం, గోపీచంద్‌గానూ కృష్ణస్వామి, రామస్వామిగారుగానూ, శివకామయ్య, ఉన్నవ లక్ష్మీనారాయణపంతులుగారు గానూ, దుర్గ, శకుంతలాదేవిగారుగానూ కన్పిస్తారు.'1 అన్నారు,

అలాగే శ్రీ ఆర్. ఎస్. సుదర్శనంగారు కూడా ఈ అంశాన్ని పేర్కొన్నారు.

'గోపీచంద్ జీవిత చరిత్రా, అది స్పృశించినంతమేర ఆంధ్రదేశ రాజకీయ చరిత్రా ఒక పెద్ద నవలలో సమన్వయ దృక్పథం నుంచి వ్రాయటానికి పూనుకున్నాడు. అదే 'చీకటిగదులు' అనే అసంపూర్ణ రచన'2 అన్నారు.

గోపీచంద్ 1962లో మరణించారు. వారి సతీమణికూడా అతర్వాత మరణించారు. అందువల్ల త్రిపురనేని సుబ్బారావుగారు రచించిన జీవిత చరిత్రా, గోపీచంద్ స్మారక సంచికా 'చీకటిగదులు'లోని ముఖ్యాంశాలను నిరూపించే ప్రధాన ఆధారాలు.

కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారి జీవితం ప్రధానంగా ఉద్యమ స్వభావం కలిగినట్టిది. గోపీచంద్ జీవితం నిరంతరపరిణామశీలమైనట్టిది. సమకాలీన సాంఘిక నేపథ్యంలో ఈ ఇద్దరి జీవితాల చిత్రణా ప్రయోజనకారి అనటంలో సందేహం లేదు.

త్రిపురనేని సుబ్బారావుగారి 'గోపీనంద్' అన్న పుస్తకంవల్ల వెల్లడైన గోపీచంద్ జీవితానికి సంబంధించిన కొన్ని అంశాలు, సుబ్బారావుగారే రచించిన 'కవిరాజు జీవితం—సాహిత్యం' అన్న పుస్తకంలో పేర్కొనబడిన కవిరాజుగారి జీవితానికి సంబంధించిన అంశాలు 'చీకటిగదులు' నవలలో స్పష్టంగా కనిపిస్తున్నాయి.

'అదొక పల్లెటూరు, దాని పేరు రామాపురం' అంటూ 'చీకటిగదులు నవల ప్రారంభమౌతుంది. ఈ రామాపురంలోనే అమ్మమ్మ పోషణలో గోపాలం తన బాల్యాన్ని గడిపాడు.

గోపీచంద్ బాల్యం కూడా కొంతవరకు కృష్ణాజిల్లా రామాపురంలో గడిచింది.[3]

'చీకటిగదులు' ప్రారంభంలోనే గోపాలం అమ్మమ్మ తన కూతురును జ్ఞాపకం చేసుకుంటుంది ఆమె తన కూతురును విద్యాధికుడైన కృష్ణస్వామికి ఇచ్చి పెళ్లి చేసింది. ఆమె కూడా వాళ్ళతోపాటే ఉండేది. గోపాలాన్ని, కమలను కన్న తర్వాత ఆమె కూతురు చనిపోతుంది. ఆ తల్లిలేని పిల్లలను పోషించుకుంటూ ఆమె అల్లుని దగ్గరే ఉండిపోవాలని ఆశించింది. కాని, అల్లుడు రెండో పెళ్లి చేసుకుంటాడని తెలిసిన తర్వాత అక్కడ ఉండలేకపోయింది. అంతేకాక, కృష్ణస్వామి చదువుకోసం చేసిన అప్పును తీర్చటానికి అతని అన్న రత్నమ్మను డబ్బు అడిగేసరికి, ఆ ఇంట్లో ఉండటం తన కూతురు పిల్లల భవిష్యత్తుకు ఎంత మాత్రం మంచిదికాదని నిర్ణయించుకొని రామయ్య సహాయంతో అల్లునికి చెప్పకుండా రామాపురం వచ్చేస్తుంది.

ఇదే వృత్తాంతాన్ని ఇతివృత్తంగా తీసుకొని 'జీవనది'[4] అన్న కథను కూడా రచించాడు గోపీచంద్. 'చీకటిగదులు'లోని గోపాలం ఈ కథలో కాశీపతిగా కనిపిస్తాడు. వయస్సు ఎనిమిదేళ్ళు, అతని చెల్లెలి వయస్సు నాలుగేళ్ళు. అతని అమ్మమ్మకు ఇంకెవరూ లేకపోవటంవల్లా అమ్మమ్మ తన కూతురుతోపాటు అల్లుని దగ్గరే వుండేది. కూతురు చనిపోయింది. రామయ్య సలహా మీద పిల్లల్ని పోషించుకుంటూ అల్లుని దగ్గరే ఉన్నది. కాని, అల్లుడు రెండో పెళ్లి చేసుకుంటాడనితెలిసి పిల్లల క్షేమాన్నికోరి ఎవ్వరికి చెప్పకుండా

తన వూరికి వచ్చేస్తుంది. ఈ కథలో కాశీపతి తల్లి పేరు పున్నమ్మ. ఇది గోపీచంద్ తల్లి పేరే.

'చీకటిగదులు'లోని వృత్తాంతానికి, 'జీవనది'లోని ఇతివృత్తానికి ఏమీ తేడా లేదు. ఈ అమ్మమ్మ పాత్ర లక్షణాలే కొన్ని 'పరివర్తనం'లోని 'అమ్మమ్మ'లో కనిపిస్తున్నాయి. ఇందులో కూడా జీజీ అమ్మమ్మకు ఏకైక కుమార్తె. అమ్మమ్మ అల్లుని ఇంట్లోనే వుంది. కూతురునూ, కొడుకునూ అమ్మమ్మకు వదిలేసి జీజీ కన్నుమూసింది. అల్లుడు రెండో పెళ్లి చేసుకుంటా డేమోనని అమ్మమ్మ మొదట్లో భయపడ్డది కూడా

''చిన్నప్పుడే తల్లిదండ్రులు పోయారు.''

''జాలితలచి ఎవ్వరో పెంచుకున్నారు.''

''పెళ్లి అయింది ''

''లేక లేక ఒక్క కూతురు కలిగింది.''

''ఆ కూతురు కూడా రెండు కాయల్ని భూమిమీద వేసి రాలిపోయింది.''5

అంటూ, అమ్మమ్మ శాంతతో తన కష్టసుఖాలను చెప్పుకునేది.

చాలావరకు ఈ వృత్తాంతం గోపీచంద్ జీవితానికి సంబంధించిందే గోపీచంద్ పదోఏట తల్లి పున్నమాంబగారు చనిపోయారు. అదే సంవత్సరం కవిరాజుగారు రెండో పెళ్లి చేసుకున్నారు. ఈ మధ్య కాలంలో గోపీచంద్ తన చెల్లెలు సరోజినితోపాటు అమ్మమ్మతో రామాపురంలో ఉన్నాడు. రచనల్లో అమ్మమ్మకు ఎదురైన సమస్యను నిరూపించటానికి గోపీచంద్ జీవిత చరిత్రలో ఆధారాలు లేవు. అయినా ఒకటికి రెండుసార్లు వివరంగా చిత్రింపబడ్డ వృత్తాంతం రచయితకు ఆత్మీయమైందేనని చెప్పవచ్చు.

గోపీచంద్ ప్రత్యేకతలలో ఒకటైన గ్రామీణ జీవన చిత్రణకు పునాది బాల్యజీవితమే. తెనాలిలో స్థిరపడ్డ తర్వాత కూడా రైతుల సమస్యల మీదా, గ్రామీణ జీవిత విధానం మీదా తన దృష్టిని కేంద్రీకరించాడు. ఇందుకు 'చీకటిగదులు' నవల ప్రారంభంలోని రామాపురం గ్రామ వర్ణన

మంచి ఉదాహరణ. చితికిపోయిన రైతులను, వలసవెళ్లే రైతులను రచయిత ప్రస్తావించాడు. కూలిపోయే ఇండ్లు, జీవనాధారాలైన చెరువులు, పంట కాల్వలు, పొలాలు, దేవాలయాలు,—వీటి చట్రంలో గ్రామీణుల కష్టసుఖాల చిత్రణ కనిపిస్తుంది.

'రక్తపుమరకలు'6 'సరే కానివ్వండి'7, 'మమకారం'8 వంటి కథల్లోని గ్రామీణ పాత్రలు సజీవమైనవి. గోపీచంద్ నవలల్లోని కథాస్థలం చాలావరకు పట్టణ ప్రాంతమే. అయినా, పాత్రలు మాత్రం గ్రామీణప్రాంతం నుంచి వచ్చినవే. కారణం, గోపీచంద్‌కు గ్రామీణ జీవితం ఆత్మీయమైంది కావటమే.

నవలకూ, జీవితానికీ తాదాత్మ్యం ఉన్న మరికొన్ని అంశాలు: నవలలో గోపాలాన్ని సవతితల్లి దమయంతి ప్రేమాభిమానాలతో పెంచి పెద్ద చేస్తుంది నిజజీవితంలో కూడా గోపీచంద్‌ను సవతితల్లి చంద్రావతి పెంచి పెద్ద చేసింది 9

నవలలో గోపాలం కాలేజి చదవు నిమిత్తం మధురాపురి వెళ్లినప్పుడు అద్దె ఇల్లు దొరకలేదు. అందువల్ల తన కులం వాళ్ళ హాస్టల్‌లో చేరాడు. ఆ హాస్టల్ కార్యదర్శిగా కూడా ఎన్నికయ్యాడు. పరంధామయ్య గాంధీ ఆదర్శాలకు, శివకుమార్ కమ్యూనిస్టు భావాలకు ప్రతినిధులుగా చిత్రితమయ్యారు.

నిజజీవితంలో హైస్కూల్ చదువు ముగిసిన తర్వాత గోపీచంద్ గుంటూరు ఆంధ్రా క్రిష్టియన్ కాలేజీలో చేరాడు. బ్రాహ్మణేతరుడైన కారణంగా అద్దె ఇల్లు దొరకనందుకు కమ్మహాస్టల్‌లో చేరాడు. ఆ హాస్టల్ కార్యదర్శిగా కూడా కొంతకాలం పనిచేశాడు.

ఆ హాస్టల్‌లో కొంత మందికి కమ్యూనిజంపైనా, మరికొంత మందికి గాంధీ సిద్ధాంతాలపట్ల అభిమానం ఉండేది.10

ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారూ, రామస్వామి చౌదరి గారూ ప్రాణ స్నేహితులు విశ్వాసాలలో వీరిద్దరికీ ఉన్న వైరుధ్యం మరి ఏ ఇద్దరికీ లేదు. ఒకరు ఆస్తికులు, మరొకరు నాస్తికులు; ఒకరు వచన రచయితలు,

మరొకరు కవులు; ఒకరు కాంగ్రెస్, మరొకరు జస్టిస్ పార్టీ. కాని, వీరి స్నేహం అతి గాఢమైంది.[11]

నవలలో శివకామయ్య కృష్ణస్వాముల వ్యక్తిత్వ అనుబంధాలు కూడా అటువంటివే.

నవలలో శివకామయ్య దంపతులు గురుకులాన్ని నిర్వహించేవారు ఉన్నవ దంపతులు కూడా 'శారదా నికేతన్'[12] అనే గురుకులాన్ని నిర్వహిస్తారు.

నవలలో గోపాలం వివాహం చేసుకోబోయే దుర్గ, శివకామయ్య గురుకులంలోని విద్యార్థినే. నిజజీవితంలో కూడా గోపీచంద్ భార్య శకుంతలాదేవి గారు ఉన్నవ దంపతుల శారదా నికేతన్‌లో 1928 నుంచి 1937 వరకు చదువుకున్నారు.

తాము ఉన్నవ దంపతుల వద్ద ఎనిమిది సంవత్సరములు శిక్షణ పొందినట్లుగా[13] వారు పై అంశాన్ని ధ్రువీకరించారు.

నవలలో గోపాలాన్ని పెంచిన దమయంతి ఆస్తిక భావాలు గల స్త్రీ[14] గోపీచంద్‌ను పెంచిన తల్లి చంద్రావతీదేవి గారు కూడా దైవభక్తి పరాయణురాలు.[15]

రామస్వామి గారు బ్రాహ్మణేతరోద్యమానికి అంకితమైన హేతువాది. నవలలో కృష్ణస్వామి అడుగడుగునా బ్రాహ్మణేతరోద్యమానికి నాయకునిగా హేతువాదిగా కనిపిస్తాడు.

రామస్వామి గారు సుప్రసిద్ధ కవులు. నాటకకర్తలు, కృష్ణస్వామి కూడా కవే. 'చీకటిగదులు'లో ప్రస్తావనకు వచ్చిన రచనలు,[16] కవిరాజు గారు రచించిన 'కురుక్షేత్ర సంగ్రామము' (1910) 'శంబుకవధ' (1920) నాటకాలే.

నవలలో గోపాలం రచయిత. కళ్యాణకింకిణి సాహిత్య వ్యాసంగాన్ని అతడు ప్రోత్సహిస్తాడు గోపీచంద్ 1928లో మొదటి కథ[18] రాసి, క్రమంగా సాహిత్య రంగంలోకి ప్రవేశించాడు.

దమయంతి మరణం తర్వాత నవల అసంపూర్తిగా మిగిలిపోయింది.

తులనాత్మక పరిశీలన ద్వారా వెల్లడయిన పై అంశాల మూలంగా 'చీకటిగదులు' ఆత్మకథాత్మక నవల అని స్థూలంగా నిర్ధారణ చేయవచ్చు. జీవితంలోని కొన్ని అంశాలనుగాని, జీవితాన్నిగాని ఆధారం చేసుకొని కాల్ప నిక రచనకు పూనుకున్న రచయిత మార్పులు చేర్పులు చేయవలసి ఉంటుంది. మార్పుచేర్పులు లేని పక్షంలో జీవిత చరిత్ర అవుతుందే తప్ప నవల కాజాలదు.

అందుకే కృష్ణస్వామి పాత్ర చిత్రణలోనూ, గోపాలం పాత్ర చిత్రణ లోనూ రచయిత మార్పులు చేసినట్లు కనిపిస్తున్నది.

దమయంతి మరణశయ్య మీద ఉన్నప్పుడు, కృష్ణస్వామి ఒక బైరాగి ఇచ్చిన తాయెత్తును కట్టుకొమ్మని ఆమెకు ఇస్తాడు.19 మరి హేతువాది, నాస్తి కుడూ అయిన కృష్ణస్వామి తత్త్వానికి ఈ చర్య చుక్కెదురు. ప్రేమాస్పదు రాలైన భార్యను ఏదో విధంగా కాపాడుకోవాలనే ఆరాటంతో ఈ పని చేశా డని కృష్ణస్వామి చర్యను సమర్థించవచ్చు.

కాని,

'మనస్సు విశాలపడటానికి యిది పునాదేమో అని.'

'ఈ దృష్టి నిర్గుణ స్వభావానికి, తద్వారా భగవద్దర్శనానికి దోహద మిస్తుందేమోనని కథానాయకుడు గోపాలం భావిస్తాడు. శివకామయ్య వ్యక్తిత్వ వైశిష్ట్యం పెరగటానికి, కృష్ణస్వామిలో ఇలాంటి మార్పును రచయిత ఉద్దే శించినట్లున్నాడు. మొత్తం మీద గోపీచంద్ కృష్ణస్వామిని కవిరాజు గారికి భిన్నంగా, ఆధ్యాత్మిక విశ్వాసాల వైపు మొగ్గు చూపుతున్న వ్యక్తిగా చిత్రించ దలచుకున్నాడని స్పష్టమౌతున్నది.

కవిరాజుగారిలో ఇలాంటి మార్పు వచ్చిన సూచనలు లేవు. మరణించే నాటికి కూడా కవిరాజుగారు నాస్తికుడే, హేతువాదే.21

గోపాలం మొదటి నుంచీ తండ్రికి మానసికంగా కొంత దూరంగా ఉన్నట్లుగా చిత్రితమయ్యాడు. ఇందుకు పై మాటలే నిదర్శనం.

విద్యార్థి దశలో గోపాలాన్ని ఆకర్షించిన రచయితల్లో కాళిదాసు, రవీంద్రుడూ ఉన్నారు. కళ్యాణకింకిణి సాహిత్య కృషిని ప్రోత్సహించటానికి రవీంద్రుని పుస్తకాలను కూడా ఆమెకు పంపిస్తాడు.[22]

కాని, గోపీచంద్‌కు, మాత్రం విద్యార్థి దశలో ఈ రచయితలు నచ్చ లేదు.

'ఆ రోజుల్లో మాకు వ్యాస వాల్మీకి కాళిదాసాదుల వంటి సంస్కృత కవులుగానీ, రవీంద్రుని వంటి ఆధునికులుగానీ ఏ మాత్రం నచ్చేవారు కాదు. ఎవ్వరైనా షేక్స్‌పియర్‌తోపాటు కాళిదాసుని చేర్చినా, బెర్నార్డ్‌షాతోపాటు రవీంద్రుని కలిపినా మాకు హాస్యాస్పదంగా వుండేది.' అని 'తత్వమసి' పరిచ యంలో రచయిత గోపీచంద్ రాసుకున్నాడు.

1945 వరకు కూడా గోపీచంద్ హేతువాదిగా కన్పిస్తాడు కాని, గోపాలం మాత్రం 1932 నాటికే అధ్యాత్మిక విశ్వాసాలు గల యువకునిగా కనిపిస్తున్నాడు. ఇది చిన్న మార్పు కాదు. గోపీచంద్ దాదాపు తన జీవిత చరిత్రనే తిరిగి రాసుకునే ప్రయత్నం చేశాడని చెప్పవచ్చు. అతడు, ఆధ్యా త్మికవాదిగా మారిన తర్వాత రాయటం ప్రారంభించిన నవల కావటంవల్ల రచనా కాలంనాటి భావాలను రచయిత అతిక్రమించలేకపోయాడు.

మొత్తం మీద ఈ మార్పు రచయిత వ్యక్తిత్వాన్ని ప్రతిబింబిస్తూ కొంత కాల్పనికతను కూడా సాధించింది.

ఇక ఇతర నవలల్లో కనిపించే ఆత్మకథాత్మక లక్షణాలను పరిశీలించ టం అవసరం.

'పరివర్తనం' నవలను 'తెలుగుదేశంలో హేతువాదాన్ని ప్రచారంలోకి తెచ్చిన తండ్రి రామస్వామి చౌదరిగారు మరణించిన తర్వాత గోపీచంద్ అనుభవించిన మనోవైకల్యానికి' ప్రతిబింబంగా భావిస్తున్నారు, ఆర్.ఎస్. సుదర్శనం గారు.[23]

రామస్వామి చౌదరిగారు 1943 జనవరి 16 తేదీనాడు మరణించారు.[24] 'పరివర్తనం' జూన్ (1943)లో అచ్చయింది. అంటే, గోపీచంద్ పితృ

వియోగ దుఃఖాన్ని, భార్యా వియోగ దుఃఖంగా రూపకల్పన చేశాడన్నమాట. తండ్రికీ తనకూ ఉన్న లంకె కేవలం తండ్రీకొడుకుల అనుబంధమే కాదు, హేతువాద తాత్త్వికానుబంధం కూడా. అలాగే జీజీకి రాజారావుకూ మధ్యన ఉన్నది. కేవలం భార్యాభర్తల అనుబంధం మాత్రమే కాదు ప్రణయానుబంధం కూడా. హేతువాదానుబంధాన్ని అతిక్రమించి కొత్త తత్వాన్ని అన్వేషించటం ద్వారా పితృవియోగ దుఃఖాన్ని జయించటానికి పూనుకున్నాడు గోపీచంద్. ప్రణయానుబంధాన్ని అతిక్రమించి కొత్త స్త్రీతో అనుబంధాన్ని పెంపొందించుకోవటం ద్వారా నూతన జీవితాన్ని పొందగలిగాడు. రాజారావు

'అసమర్థుని జీవయాత్ర'లోని సీతారామారావు కూడా గోపీచంద్‌లోని ఒక భాగమే నంటున్నారు ఆర్. ఎస్. సుదర్శనంగారు. తండ్రి మరణంవల్ల గోపీచంద్ అనుభవించిన....'మనోవైకల్యము సామాన్యమైనది కాదు. మృత్యువుతో హుటాహుటి పోరాటము. నవలలో నాయకుడైన సీతారామారావు మృత్యువు చేతిలో ఓడిపోయాడు. కాని, నవల వ్రాయటం ద్వారా, తనలోని సీతారామారావు మృతి చెందటం ద్వారా, గోపీచంద్ వ్యక్తిగతంగా పునర్జన్మ వంటి అనుభూతి, పొంది క్రొత్త దృక్పథంతో క్రొత్తజీవితాన్ని ప్రారంభించా డని వారు భావించా25రు.

సుమారు రెండేండ్ల తర్వాత కూడా పితృవియోగ దుఃఖాన్ని గోపీచంద్ అతిక్రమించలేకపోయాడంటే ఆ అనుబంధం ఎంత శక్తిమంతమైనదో స్పష్టమౌతున్నది. తన జీవితాన్ని పణంగా పెట్టి హేతువాదానుబంధంతో చేసిన సాహసాత్మక సంఘర్షణలో గోపీచంద్ మిగిలాడని సుదర్శనంగారి అభిప్రాయం.

గోపీచంద్ రచించిన కొన్ని కథల్లో కనిపించే గోపీ పాత్రలో కొంత వరకు ఆత్మకథాత్మక లక్షణం కనిపిస్తున్నది. ఉదాహరణకు 'సిగ్గు26 కథలో గోపీచంద్ స్వయంగా ఎరిగిన సినిమా వాతావరణం చిత్రితమైంది.

1939 నుంచి 1952 వరకు గోపీచంద్ సినిమారంగంలో కృషి చేశాడు. ఈ అనుభవాలు 'పిల్లతెమ్మెర' నవలికలో, 'పండితపరమేశ్వరశాస్త్రి వీలునామా' నవలలో ప్రతిబింబించాయి.

'పిల్లతెమ్మెర' నవలికలో కథానాయకుడు చలనచిత్ర రంగంలో కృషి చేసినవాడే

"నేను అప్పుడు సినిమాల్లో పనిచేస్తూ వుండేవాణ్ణి. అప్పటికి రెండు మూడు పిక్చర్సుకి డ్యాన్సు డైరెక్టరుగా పనిచేశాను. కాని నా డ్యాన్సెస్ ఏవీ రాణ కెక్కలేదు ప్రేక్షకులకు నచ్చలేదు." అంటాడు డ్యాన్సు మాష్టారు. ఇవి, నవలలోని ప్రారంభ వాక్యాలు.

గోపీచంద్ సినిమా రంగంలో సహాయ దర్శకునిగా, దర్శకునిగా, రచయితగా కృషిచేశాడు. గూడవల్లి రామబ్రహ్మంగారి ఆహ్వానం మేరకు 1939లో మద్రాసు వెళ్లి 'రైతుబిడ్డ' చిత్రానికి సహాయ దర్శకుడుగా పని చేశాడు. కాని, స్వేచ్ఛాజీవి కావటంతో రామబ్రహ్మంగారి 'క్యాంపు'లో ఎక్కువ రోజులు ఇమడలేకపోయాడు కొందరి మిత్రులతో ఒక సంస్థను ప్రారంభించి 'పెంకిపిల్ల' చిత్రాన్ని తీయాలనుకున్నాడు. కాని, ఆదిలోనే హంసపాదైంది. 'ప్రగతి' పిక్చర్సు పతాకం క్రింద 'లక్ష్మమ్మ కథ' చిత్రాన్ని తీయాలని మరికొంత మంది మిత్రులతో మరో కంపెనీని స్థాపించాడు. కాని, పెట్టుబడి పెడతానన్నవారు ఏనాటికి తగిన మొత్తం తీసుకురాలేకపోయారు. అందువల్ల కంపెనీ కూడా మూలబడింది. అంతేకాక, వారి దర్శకత్వంతో వచ్చిన 'పేరంటాలు', 'ప్రియురాలు' చిత్రాలు విజయవంతం కాకపోవటంతో చలనచిత్ర రంగం వారికి దినదిన గండమైంది.27

ఫలితంగా గోపీచంద్ దర్శకత్వ శాఖ నుంచి నిష్క్రమించవలసి వచ్చింది. దర్శకత్వమే, 'పిల్లతెమ్మెర'లో నృత్య దర్శకత్వంగా రూపొందింది

'పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా'లో నాయకుడు కేశవమూర్తి కూడా సినిమా రంగంలో కృషి చేసినవాడే.

'కేశవమూర్తికి స్క్రిప్టు రాసే ఆఫర్ వొకటి వస్తే దానిని పురస్కరించుకొని మద్రాసు వెళ్లవలసి వచ్చింది.'28

సినిమా రంగంలో ప్రవేశించినప్పటినుంచీ బాగానే ఉందనీ, డబ్బుకి ఇబ్బంది లేకుండా గడిచిపోవటమేకాక, కొత్త కొత్త మనుష్యులతో పరిచయ

మయిందనీ చెప్పటం జరిగింది 29 అతని సహాయం పొందిన కృష్ణమూర్తి కేశవమూర్తికీ కన్యకామణికీ అక్రమ సంబంధం ఉన్నదంటూ ఒక వ్యాసాన్ని ప్రచురించి మనశ్శాంతిని లేకుండా చేస్తాడు.

కేశవమూర్తి రాసిన సినిమా కథల్లో ఐడియాస్ అన్నీ తనవేనని సీమంతం దుష్ప్రచారం చేశాడు. అంతేకాదు, కన్యకామణి వృత్తాంతానికి రంగులు పూసి అతని భార్య సుజాతతో చెప్పాడు.30 సీమంతం రాసిన ఆకాశ రామన్న ఉత్తరాలవల్ల కేశవమూర్తి కుటుంబ జీవితంలో ఏర్పడిన సంక్షోభం31 కారణంగా అదివరకే, కొంత ఆధ్యాత్మిక రంగం పట్ల అవ్యక్తాకర్షణ ఏర్పడిన కారణంగా, సినిమా రంగంపట్ల అతనికి అదివరకున్న దృష్టి మారింది.

'చిన్నప్పుడు కోతి కొమ్మచ్చి వంటి ఆటలు ఆడుతున్న రోజులు జ్ఞాపకం వచ్చినై అప్పటికి ఈ ఆటలే పరమసత్యాలుగా కనిపించేవి. వాటి ల్లోని జయాపజయాల కంటే వేరు సత్యాలు కనిపించేవి కావు. చిత్ర నిర్మాణం కూడా అదే విధంగా కనపడజొచ్చింది 32 ఫలితంగా సినిమాలకు రాయటం మానుకున్నాడు.33

నిజ జీవితంలో సహాయ దర్శకుడిగా, రచయితగా, దర్శకుడిగా సినిమా రంగంలో కృషి చేసిన గోపీచంద్, నవలలో కేవలం రచయితగా కనిపిస్తాడు నిజజీవితంలో గోపీచంద్ సినిమా రంగానికి దూరంకావటానికి ఆయన దర్శకత్వం వహించిన చిత్రాలు ప్రజాదరణ పొందకపోవటం కారణం కాగా, నవలలో వైయక్తిక జీవితంలో ఏర్పడిన సంక్షోభం కారణంగా చిత్రిత మైంది.

'సినిమాలో ఇమడలేదు కొన్నాళ్ళు కాసటబీసటగా వుంది '34 అని ఆవుల గోపాలకృష్ణమూర్తిగారు, 'ఆ రంగంలోనే 1952 ఆ పవిత్ర మూర్తి తామరాకు మీద నీటి బిందువు లాగు నిలిచి పనిచేశారు. ఎన్ని గాలి దుమారా లకూ చలించలేదు'35 అని శ్రీమతి శకుంతలా గోపీచంద్ గారు తెలియ జేస్తున్నారు

నిజజీవితంలో కూడా గోపీచంద్ సినిమారంగంలో ఉన్నప్పుడే అరవిందుల తత్వంపట్ల ఆకృష్టుడై, ఆ తత్వాన్ని వ్యాసాలుగా రాసి 1949 నుంచి ప్రచురిస్తూ వచ్చారు. ఈ వ్యాసాలే ఆ తర్వాత 'పోస్టు చెయ్యని ఉత్తరాలు' అన్న పుస్తకరూపం ధరించాయి.

కేశవమూర్తి గోపీచందేననటానికి తిరుగులేని సాక్ష్యం మరొకటుంది. కేశవమూర్తి తాను 'మార్క్సిస్టు'గా ఉన్నప్పుడు రచించినట్లుగా తెలిపే 'పిత్రార్జితం'36 కథ గోపీచంద్ రచించిందే. కథ పేరులో గాని, ఇతివృత్తంలో గాని ఏమీ మార్పులేదు.

కేశవమూర్తి కూడా గోపీచంద్ లాగే కథలూ, నవలలూ రాసినవాడు. కేశవమూర్తి తాను ప్రచురించిన పుస్తకాన్ని మిత్రుడు సీమంతం ద్వేషబుద్ధితో ఓర్వలేనితనంతో విమర్శించాడని భార్య ద్వారా తెలుసుకుంటాడు 37

ఈ పుస్తకం గోపీచంద్ రచించిన 'మెరుపుల మరకలు' నవలేనని ఆర్.ఎస్. సుదర్శనంగారు భావించారు.38

గోపీచంద్ తన స్నేహితుల 'కృపణత్వాన్నీ, విమర్శలనూ,' క్షమించలేకపోయాడనీ, తన కోపతాపాలను 'పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా'లో 'క్రుమ్మరించాడ'నీ సుదర్శనంగారు భావిస్తున్నారు.39

సీమంతం మొదలైనవారు గోపీచంద్ మిత్రులేననీ, ఫలానా మిత్రుడు ఫలానా పాత్రగా రూపొందాడనీ నిరూపించటం ద్వారా ఆత్మకథాత్మక లక్షణాలను బహిర్గతం చేయటం అంతకష్టమేమీ కాదు. కాని, వివాదాస్పదమైన ఈ నిరూపణవల్ల సాహిత్య విమర్శకు చేకూరే ప్రయోజనమేమీ లేదు.

'ఆత్మకథాత్మక నవలలో రచయిత జీవితం, కల్పన ఏయే పాళ్ళలో చోటుచేసుకున్నాయో నిరూపించటం ఒక సమస్య'40 అని విమర్శకులు భావించారు. అందుకే పూర్తిగా వైయక్తిక అంశాలను, స్త్రీ పాత్రలకు సంబంధించిన ఆత్మకథాత్మక లక్షణాలను వివరించటంవల్ల ప్రయోజనమేమీలేదని భావించటం జరిగింది.

మొత్తంమీద 'చీకటిగదులు' నవలతోపాటు ఇప్పుడు పరిశీలించబడ్డ అంశాలు ఒక ముఖ్యమైన విషయాన్ని నిరూపిస్తున్నాయి. గోపీచంద్ తన సాహిత్యంలో ఒక పాత్ర. అతని జీవితానుభవం ప్రత్యక్షంగా పరోక్షంగా నవలల్లో ప్రతిఫలించింది. ఇందుకు ఏ రచయితకైనా తానూ, తన జీవితం అతిసులభంగా అందుబాటులో ఉండటం ఒక కారణం. తనను గూర్చి పది మందికీ చెప్పుకోవాలన్న ఆసక్తి మరో కారణం.

గోపీచంద్‌కు ఈ నవలల్లోని ముఖ్యపాత్రలకు మధ్యన పలుచని పొర మాత్రమే కనిపిస్తున్నది. కొన్ని నవలల్లో ప్రతినిధి పాత్ర రూపంలో రచయిత కనిపిస్తాడు.

గోపీచంద్ ఒక పుస్తకాన్ని వ్రాసి అచ్చువేయగానే, ఆ పుస్తకంలోని పాత్రల 'ఒరిజినల్స్'కోసం విమర్శకులు గాలించేవారట.41

ఈ విషయాన్ని 'తాను సృష్టించిన పాత్రల ఒరిజినల్స్‌కోసం విజ్ఞులం, విమర్శకులం అనుకునే వారు తనకు పరిచయస్థుల్లో' వెతికేవారని కేశవమూర్తి కూడా ప్రస్తావించాడు.42

రచయిత ఉత్తమపురుషలో కథాకథనానికి పూనుకున్నప్పుడు ఆ పాత్రను 'Persona' అంటారు.43 రచయితకు, రచనలోని కథకునికి ఏమీ సంబంధం ఉండవలసిన అవసరం లేదు.44 కాని, డ్యాన్సున్నమాష్టారు, 'గడియపడని తలుపులు'లోని కథకుడు45 కొన్ని సందర్భాలలో 'Persona' లక్షణాలను అతిక్రమించారు

'తనను గూర్చి తాను రాసుకోవటం ఆనందదాయకమైంది' అదే సమయంలో కష్టతరమైంది కూడా. తనను హీనపరిచే సత్యాన్ని చెప్పటానికిగానీ, తనను గూర్చిన ప్రశంసను పాఠకులకు వెల్లడిచేయటానికిగానీ అతని హృదయమే అడ్డు తగులుతుంది '46 అని కౌలే భావించాడు కాని అనేక సందర్భాలలో తనను గూర్చిన ప్రశంసలను పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా' నవలలోని సుజాతా కన్యకామణీ— సుభాషిణి పాత్రల ద్వారా వెల్లడిచేయటానికి గోపీచంద్ వెనుకాడలేదు 47

ఏడవ ప్రకరణం

సూచికలు

1. 'గోపీచంద్', పుట 69, త్రి సుబ్బారావు
2. 'సాహిత్యంలో దృక్పథాలు', పుటలు 141, 142.
ఈ విషయంలో ఇంకో ఆధారం 'గోపీచంద్ స్మారక సంచిక'లో కని పిస్తుంది. 'మీరు మళ్ళీ కథలు, నవలలు ఎందుకు రాయకూడదు?'' అని చలసాని ప్రసాద్ గారు అన్నప్పుడు, ''ఎవరి కథో ఎందుకు ? మన కథ మనమే రాసుకుందాం.'' అంటూ 'చీకటిగదులు' నవలను అప్పటికప్పుడె మొదలుపెట్టి ఒక్కరోజులోనే 50 పేజీలు రాసేశారట (పుట 211).
3. 'ఉభయ కుశలోపరి', పుట 5, గోపీచంద్.
4. 'ఇరుగుపొరుగు', కథల సంపుటి
5. 'పరివర్తనం', పుట 40.
6. 'దేవుని జీవితం', కథల సంపుటి.
7. 'సరే కానివ్వండి', కథల సంపుటి.
8. 'తండ్రులు కొడుకులు', కథల సంపుటి
9. 'గోపీచంద్ స్మారక సంచిక', పుట. 17 (ఫోటో)
10. 'గోపీచంద్', త్రిపురనేని సుబ్బారావు
11. Ibid పుట. 13.
12. 'మాలపల్లి నవలపై ప్రభుత్వ నిషేధాలు', పుట 10, పాదసూచిక 11లో 'శారదా నికేతన్' స్థాపనకై ప్రేరణ వివరాలు:
'ఉన్నవ రచనలు కొన్ని' అనుబంధం-4, శారదానికేతన్ అనుబంధం-5 స్వాతంత్ర్యోద్యమంలో శారదానికేతనం పాత్ర.

13. గోపీచంద్ స్మారక సంచిక, పుట. 22.
14. చీకటిగదులు, పుట. 106.
15. వేటపాలెంలో కవిరాజుగారి బంధువొకరు తెలిపిన సమాచారం.
16. 'చీకటిగదులు' పుటలు 27, 28
17. Ibid, పుట. 242.
18. 'గోపీచంద్' పుటలు 10, 11.
19. చీ.గ. పుట. 403
20. Ibid, పుట. 419.
21. త్రిపురనేని మధుసూదనరావుగారు సిద్ధాంత వ్యాసకర్తకు 14-12-83 నాడు రాసిన లేఖలో ఈ అభిప్రాయాన్ని బలపరిచారు.
22. చీ,గ. పుట. 278.
23. 'సాహిత్యంలో దృక్పథాలు', పుట. 103
24. 'కవిరాజు జీవితం-సాహిత్యం' పుట. 14.
25. 'సాహిత్యంలో దృక్పథాలు', పుట, 103.
26. 'భార్యల్లోనే వుంది,' కథా సంకలనం.
27. 'గోపీచంద్ స్మారక సంచిక,' పుటలు 84 నుంచి 86 'మద్రాసులో' మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి.
28. 'పం.ప. వీలునామా', పుట. 56.
29 Ibid, పుట. 142.
30 Ibid, పుట. 171.
31. Ibid, పుట. 105.
32. Ibid, పుట. 236.
33. Ibid, పుట. 273.
34. 'గోపీచంద్ స్మారక సంచిక' పుట. 35

35 Ibid, పుట 22.

36. 'పం ప. వీలునామా', పుట. 66, 'గీతాపారాయణం', పుట. 30.

37. పం.వ. వీ. పుటలు 26, 27.

38. 'సాహిత్యంలో దృక్పథాలు', పుటలు 135, 136.

39 Ibid, పుట. 141.

40. 'Plain man and the novel' : 'The autobiographica novel', Roger Dataller.

41. 'గోపీచంద్' పుట. 23.

42. పం.వ, వీ. పుట. 36.

43. 'Persona is often applied to the first person narrator, the 'I' of a narrative Poem or novel.'

—A glossary of literary terms, p. 124, M.H. Abr. ns.

44. Persona is not to be confused with the poet's private personality.

—A reader's guide to literary terms, Kasl Bickson and Arthur Gany.

45. 'హేతవాద బుద్ధి', (పుట. 72) పూర్వాశ్రమంలో గోపీచంద్ లక్షణమే అలాగే ప్రభుత్వోద్యోగం కూడా.

46. 'Plain man and the novel', The autobiographical novel.

47. చూ. ఈ సిద్ధాంత వ్యాసం, 'మూడవ ప్రకరణం', సూచిక 33.

ఎనిమిదవ ప్రకరణం

# శిల్పం

ఆధునిక తెలుగు సాహిత్యంలో 'Technique' అన్న ఆంగ్ల పదానికి సమానార్థకంగా 'శిల్పం'[1] అన్నమాట వాడుకలో ఉంది. ఆధునిక రచయితలు, విమర్శకులు 'శిల్పం' అన్న మాటను ఒక నిర్దిష్టమైన అర్థంలోకాక, స్వేచ్ఛగా ఉపయోగిస్తుంటారు

'ఏ పనిలోనైనా కళానైపుణ్యం చూపే పద్ధతిని శిల్పమనవచ్చు'నని చెప్తూ, సాహిత్య ప్రక్రియలోని వస్తువు పాత్ర, సంవాదం, సంఘటన, సంఘర్షణ, సన్నివేశం, కథాకథనం, శీర్షిక మొదలైన అంశాల కల్పనలోనూ చిత్రణలోనూ రచయిత ప్రదర్శించే కళానైపుణ్యమే ఆయా అంశాల శిల్పంగా (వస్తు విన్యాస శిల్పం', 'పాత్ర చిత్రణ శిల్పం' మొదలైనవి) రూపొందుతుందని పోరంకి దక్షిణామూర్తి భావించారు.[2] ఆయా అంశాల మధ్యన సమతుల్యతనూ, ఏకసూత్రతనూ సాధించటం ద్వారా ఉత్తమ రచయిత తన రచనలో సమగ్ర శిల్పాన్ని ఆవిష్కరిస్తాడు

'శిల్ప ప్రాముఖ్యం' అన్న వ్యాసంలో రాచమల్లు రామచంద్రారెడ్డి గారు 'సాహిత్యం....అనుభూతులను కలిగించి, తద్వారా మన సంస్కారంలో మార్పు తెస్తుంది. ఆ మార్పు అభ్యుదయకరమైనదైతే, ఆ సాహిత్యం అభ్యుదయ సాహిత్యమౌతుంది. స్థూలంగా యిలా అనుభూతులను కలిగించే రచనా విధానాన్నే శిల్పమంటాం'[3] అంటూ వస్తువు అభ్యుదయకరమై వుండాలని చెప్తూ, 'శిల్పం' అనేది రచనా విధానంలోని ఒక కీలకమైన అంశమనీ, ఈ విధానం పాఠకుడిలో అనుభూతులను కలిగించేదిగా ఉండవలసిందేననీ భావిస్తున్నారు.

'సాహిత్యంలో ఏది ప్రధానం రూపమా? వస్తువా? అని ప్రశ్నించు

కున్నప్పుడు వస్తువు ప్రధానం అని జవాబు చెప్పుకున్నట్లే, సుందరత, వాస్తవికత, తాత్వికత ఈ మూడింట్లో ఏది ప్రధానం అన్నప్పుడు సుందరత అని జవాబిచ్చితీరాలి. సాహిత్యం పాఠకుల మనసుల్లోకి బాణంగా దూసుకుపోవాలంటే సౌందర్యం అన్నిటికన్నా ముందుండాలి అందుకని ములికి ఎంత వాడిగా సూదిగా ఉండాలో సాహిత్యంతో సౌందర్యాంశ అంత వాడిగానూ పదునుగానూ ఉండాలి ఈ సౌందర్యాంశని శిల్పమని పిలిచినా, అలంకారమని పిలిచినా అభ్యంతరంలేదు....'[4] అంటున్నారు, రాంభట్ల కృష్ణమూర్తి గారు.

రూపం (Form) కంటే, వస్తువు (Content) ముఖ్యమని చెప్తూ రూపం ఆకర్షణీయంగా ఉన్నప్పుడే శిల్పం సిద్ధిస్తుందనీ, ఈ శిల్పం మూలంగానే రచనలోని వాస్తవికతకు, తాత్వికతకు మొత్తం వస్తువుకు అదనపు విలువ చేకూరుతుందని కృష్ణమూర్తి గారు భావిస్తున్నారు.

రామచంద్రా రెడ్డి గారు 'అనుభూతులను కలిగించే' అంశంగా కృష్ణమూర్తి గారు 'సౌందర్యాంశ'గా శిల్పాన్ని నిర్వచించారు సౌందర్యం ద్వారా పాఠకుడు పొందగలిగేది అనుభూతే కనుక ఇద్దరి లక్ష్యమూ ఒకటేనని చెప్పవచ్చు. ఇద్దరూ రూపం కంటే వస్తువు ముఖ్యమైన అంశంగా భావించినా, శిల్పాన్ని తక్కువ చేయలేదు.

'శిల్పం యొక్క ఆశయం విముఖుల్ని కూడా విషయోన్ముఖులను చెయ్యటం'[5] అన్న కుటుంబరావు మాట అనుభవపూర్వకంగా చెప్పినట్టిదిగా తోస్తుంది. ఒక వర్గం పాఠకులను దృష్టిలో పెట్టుకొని రచనలు చేసిన కుటుంబరావు తన వస్తువులకు రూపం ఇవ్వటంలో చాలా జాగ్రత్త వహించాడు.

'రచనా సామగ్రికి (లేదా అనుభవానికి), సాధించిన కళాకృతికి మధ్యన ఉండే అంతరమే శిల్పం'[6] అని మార్క్ శోరర్ భావించాడు. నవలా రచయిత కథా వస్తువును సమకూర్చుకోవటం దగ్గరి నుంచి, తన ఉద్దేశాన్ని సాధించే వరకు, ఎన్నుకునే పాత్రలు, సన్నివేశాలు, సంఘటనలు, భాష మొదలైన

అంశాలన్నీ అతని ఊహాలోకంలో ఉన్నంతవరకు లేదా సమగ్ర రచనాకృతి పొందనంతవరకు మొదటి భాగమనీ, అవన్నీ రచనలోని అంగాలుగా ప్రాణం పోసుకొని సమగ్రరూపం పొందటం రెండవ భాగమనీ చెప్పవచ్చు.

'శిల్పం గూర్చి మాట్లాడటమంటే దాదాపు అన్ని అంశాలను గూర్చి మాట్లాడటమే'7 అని కూడా మార్క్‌షోరర్ భావించాడు. 'అన్ని అంశాలు' అంటే 'పాత్ర చిత్రణ', సన్నివేశకల్పన' మొదలైనవన్నమాట.

నవలా రచయిత తన నవలలోని అంశాలను కల్పించటంలోను, చిత్రించటంలోను, కళా నైపుణ్యాన్ని ప్రదర్శిస్తాడు. ఈ నైపుణ్యం మూలంగానే రచన సర్వాంగసుందరంగా రూపొందుతుంది. ఈ సౌందర్యమే అనుభూతి కలిగిస్తుంది. ఈ విధంగా రచయిత ఉద్దిష్ట ప్రయోజనాన్ని సాధించగలుగుతుంది.

రచయిత తాత్త్విక దృక్పథం కూడా శిల్పాన్ని మలచటంలో గణనీయమైన ప్రాతవహిస్తుంది. 'పాత్ర చిత్రణ' విషయంలో రచయితలు ఎక్కువ మెలకువగా వుంటారు. పాత్రల పరిణామం శిల్పంలో ఒక భాగం అని గుర్తించిన రచయిత తన రచనలో పరిపక్వతను ప్రదర్శిస్తాడు.

ఇక్కడే ఇంకో అంశాన్ని కూడా స్పృశించటం అవసరం రెండు భావాలకు మధ్యన సంఘర్షణ వున్నప్పుడు (ఉదా. సంప్రదాయం X అభ్యుదయం) రచనలో వస్తువు ప్రధాన చర్చనీయాంశంగా వుంటుంది. భావం విషయంలో పేచీలేని దశలో, అంటే ఏ భావం గూర్చి రాయాలో స్పష్టంగా తేలిపోయినప్పుడు రూపం చర్చనీయాంశంగా వుంటుంది,

'శిల్పం' అంటే, నిర్మాణ నైపుణ్యం కొరవడిన సందర్భాలలో కొంత మేరకైనా రచన దెబ్బతింటుంది.

గోపీచంద్ తన నవలల్లో ముఖ్యంగా ప్రదర్శించిన శిల్పాన్ని గూర్చి చెప్పటం జరుగుతుంది. రచనలో నిర్మాణ నైపుణ్యం దెబ్బతిన్న అంశాలను గూర్చి కూడా చెప్పటం జరుగుతుంది.

నవలా సాహిత్య ప్రపంచంలోకి అడుగుపెట్టకముందే, గోపీచంద్ కథా

రచనలో సిద్ధహస్తుడని పేరు తెచ్చుకున్నాడు. ఈ కీర్తికి ఇతర కారణాలతో పాటుగా శిల్పం కూడా ఒక కారణమే. 'పీడకల' కథలో నాయకుడు ఉపన్యాసం ద్వారా వెల్లడిచేసే భావాలే కథావస్తువు. కాని, రచయిత ఒక కలను కల్పించి, ఆ కలలో ఉపన్యాస సన్నివేశాన్ని చిత్రీకరించటంతో పాఠకుణ్ణి, కలవంటి ఒక భ్రాంతిమయ వాతావరణంలోకి తీసుకుపోగలిగాడు. ఆ కథలో స్వప్న సన్నివేశకల్పన ద్వారా రచయిత శిల్పాన్ని ప్రదర్శించాడు. ఈ పద్ధతి వల్లనే ఉపన్యాసం కథగా రూపొందగలిగింది

అలాగే 'దేశం ఏమయ్యేట్టు' అన్న కథలో పాత్రల విభిన్న రాజకీయ విశ్వాసాలే కథావస్తువు. ఆయా పాత్రల మధ్య సాగిన సంభాషణలే కథ నిండా ఉన్నాయి. అయినా, ఆ కథ 'నాటిక' అనిపించదు. పార్టీల మధ్యన ఉన్న సంఘర్షణను వ్యక్తుల మధ్య సంఘర్షణగా రచయిత రూపొందించాడు. సమకాలీన రాజకీయ నాటకాన్ని కళ్లకు కట్టినట్లు ప్రదర్శించటానికి కథలో రచయిత ప్రదర్శించిన నాటకీయ శిల్పమిది.

'పరివర్తనం' నవల ఇతివృత్తాన్ని పరిశీలిస్తే—రాజారావుకు జీజీతో ఉన్న మానసికానుబంధం వియోగదుఃఖంగా, వియోగదుఃఖం వేదనా ప్రియత్వంగా మారటం; అక్క రాజారావుకు నూతన జీవితాన్ని ప్రసాదించటానికి సంకల్పించుకోవటం; శాంత రాజారావు జీవితంలో చోటును ఆశించటం, రాజారావు సంఘర్షణకు గురై విశాల ప్రపంచంలోకి అడుగుపెట్టటం అన్న అంశాలను కాలక్రమంలో మలచటమూ, కథా నాయకుని సంక్లిష్ట మనస్తత్వాన్ని సరళ కథాకథనం ద్వారా ప్రకటించటమూ రచయిత ప్రదర్శించిన శిల్పంగా కనిపిస్తున్నాయి. రచయిత హేతువాద భావాల మూలంగా ఈ శిల్పానికి గాంభీర్యం సిద్ధించింది. ఈ విధంగా, సమకాలీన భావకవుల విరహ సంస్కారాన్ని ఖండించే అభ్యుదయకరమైన వస్తువుకు రచయిత ఆకర్షణీయమైన రూపాన్ని ఇవ్వగలిగాడు.

కాలం చెల్లిన ఆదర్శాన్ని సాధించటానికి పూనుకున్న యువకుడు అసమర్థుడైనప్పుడు, మానసిక దౌర్బల్యపీడితుడైనప్పుడు ఎలాంటి విషమ ఫలి

తాలను ఎదుర్కోవలసివస్తుందో 'అసమర్థుని జీవయాత్ర'లో రచయిత చెప్ప దలచుకున్నాడు. ఇది స్థూలంగా వస్తువు.

ఈ నవలను రచయిత ఆరు ప్రకరణాలుగా విభజించాడు.

i) **అసమర్థుడు :** ఆదర్శలోకపు స్వప్నాల్లో తేలియాడే సీతారామా రావు ఉదారవాదనీతిలో దాతృత్వాన్ని ప్రదర్శించి, ఆచరణలో వైఫల్యాన్ని పొందాడు. ఫలితంగా సాంఘిక జీవితంలో పరాజితుడయ్యాడు. ఈ విధంగా అతడు మొదటి ప్రకరణంలోనే 'అసమర్థు'డయ్యాడు.

ii) **అసమర్థుని భార్య :** ఇక, సీతారామారావుకు మిగిలిన వాస్తవిక జీవితం సాంసారిక జీవితమే. ఒకవైపు కాడి మెడ మీద వేసుకొని భార్యతో పాటు సంసారపు బండి లాగవలసిన సీతారామారావు మొత్తం బరువునూ భార్య మీదికే నెట్టేసి తానూ బండెక్కిపడుకున్నాడు—జీవచ్ఛవమై క్షణక్షణం బరు వెక్కుతూ, ఇది వైయక్తిక జీవితంలో సీతారామారావు వైఫల్యాన్ని సూచిస్తున్నది.

iii) **అసమర్థుని ఆదర్శం :** సాంఘిక ఆదర్శాలు. దాంపత్య ఆద ర్శాలు దెబ్బతినటంతో, నిష్క్రియావాదాన్ని తిరుగులేని ఆదర్శంగా నమ్మటం అనివార్యమైపోవటంతో మృత్యువు సీతారామారావు లక్ష్యంగా మారింది.

iv) **అసమర్థుని మేనమామ :** మేనమామ తన తాతముత్తాతలనూ మొత్తం వంశాన్ని నిర్దాక్షిణ్యంగా విమర్శించటంతో, సీతారామారావు పునాది కదిలింది. హృదయం అగ్నిగుండంగా మారటంలో అహంకారం ప్రకోపిం చింది.

v) **అసమర్థుని ప్రతాపం :** సీతారామారావు కూతురినేకాదు. భార్యను కూడా కొట్టగలగటంతో అహంకారపూరిత- నిస్సహాయక్రోధం అతని సాంసా రిక జీవితాన్ని దగ్ధపటలం చేసింది.

vi) **అసమర్థుని అంతం :** సంఘం మీద సీతారామారావు చేసిన దాడికి అతడే ప్రతిక్రియ అనుభవించవలసివచ్చింది. అతడు ఏకాకి అయ్యాడు. విషపూరితమైన మానసిక జీవితం సీతారామారావును బలి తీసుకున్నది.

రచయిత ఒక్కొక్క ప్రకరణాన్ని పరాకాష్ఠకు తీసుకుపోయే సోపానంగా రూపొందించాడు. ఇది స్థూలంగా నవలా ఇతివృత్త నిర్వహణలో రచయిత ప్రదర్శించిన శిల్పం. సురమౌళిగారు భావించినట్లుగా ఈ ప్రకరణాలు-'దేనికది సమగ్రంగా ఉన్నట్టుగానే ఉండి నవలకు ఉపాంగాలుగా కూడా ఉన్నాయి.'[8]

ఈ పద్ధతి ద్వారా రచనకు సమగ్ర రూపం సిద్ధించింది.

ఈ ఆరు ప్రకరణలూ సీతారామారావు మానసిక జీవిత నాటకంలోని అంకాలు. ఇంకా సరిగ్గా చెప్పాలంటే, నవలలో సీతారామారావు జీవితమే చివరి అంకంలో ప్రారంభమైంది. అందువల్ల, అతని ద్వంద్వ ప్రవృత్తిద్వారా ఆలోచనల ద్వారా, 'అంతర సంభాషణ'ను సృష్టించి రచయిత నాటకీయ శిల్పాన్ని కూడా ప్రదర్శించాడు. చాలావరకు కాలక్రమంలో సాగిన కథాకథనం సంక్లిష్ట మానసిక ప్రవృత్తిని అర్థంచేసుకోవటానికి తోడ్పడింది.

నవలలోని అతి ప్రధానమైన చివరి ఘట్టంలో సీతారామారావు శ్మశానంలో అసాధారణమైనరీతిలో ఆత్మహత్య చేసుకున్న సన్నివేశం బీభత్సరస ప్రధానమైనది. అతడు ఉన్మాది కావటం, అతని జీవితం విషాదాంతం కావటం కరుణరసప్రధానమైన అంశాలు. వీటి మూలంగా నవల అనుభూతి సంపన్నంగా రూపొందింది.

'పిల్లతెమ్మెర' నవలికలో ఒక అమాయకురాలి నిష్కపట లైంగిక స్వేచ్ఛాప్రవృత్తి విషాదాంతం కావటం ప్రధాన కథావస్తువు. ఆమె స్వేచ్ఛాప్రవృత్తిని అదుపు చేయాలనుకునే వ్యక్తుల సంకల్పం మూలంగా ఆయా పాత్రలలో సంఘర్షణ చోటుచేసుకున్నది. భర్త రామనాథం ఆమె శ్రేయోభిలాషిగా సంఘర్షణకు గురిఅవుతాడు. డ్యాన్సుమాష్టారు ఒక సహృదయుడుగా సంఘర్షణకు గురిఅవుతాడు. మృణాళిని సాటిస్త్రీగా సంఘర్షణకు గురిఅవుతుంది. శచీంద్రుడు శ్రేయోభిలాషిగా, సహృదయుడుగా, సాటికళాకారుడిగా పైకి కనిపిస్తూనే, శమంతకమణి పూర్తిగా తనది కాలేదనీ, తన మార్గాన నడవలేదనీ సంఘర్షణకు గురిఅవుతాడు. అతడీ సంఘర్షణ నుంచి విముక్తి

పొందే ప్రయత్నంలో శమంతకమణిని హత్య చేస్తాడు. ఈ నవలికలో రచయిత సంఘర్షణోత్పాదన శిల్పాన్ని ప్రదర్శించాడు.

శమంతకమణి కథను ఒరుసుకొని నడిచిన మృణాళినీ డాన్సుమాష్టారుల ఉపకథ ప్రతిపాదించే సాంప్రదాయికమైన విలువ, శమంతకమణి మరణంవల్ల ఉత్పన్నమయ్యే ప్రశ్నకు సమాధానం కావటంలో నవలారూపానికి సమగ్రత చేకూరింది.

శమంతకమణి ముగ్ధత్వ చిత్రణ అనుభూతి సంపన్నంగా ఉండటంవల్ల ఆమె చుట్టూ తిరిగే పాత్రలు కూడా సజీవంగా కనిపిస్తాయి.

ఈ నవలికలో కథాకథనం (దృక్కోణం) ఆత్మాశ్రయపద్ధతిని ఆశ్రయించింది.

'పిల్లతెమ్మెర'లో ప్రధాన కథతోపాటు మృణాళినీ డ్యాన్సుమాష్టారుల ఉపకథను కూడా కల్పించిన రచయిత, 'మెరుపుల మరకలు' నవలలో ఉషారాణికే రెండు కథలను సృష్టించాడు. మొదటి కథలో ఉషారాణి లైంగిక కామదాహంతో పరితపిస్తే, రెండవ కథలో ఆధ్యాత్మిక గంగాస్రవంతిలో మునకలిడుతుంది. సహజంగా, మొదటి ఉషారాణే సజీవమూర్తి.

ఈ నవలలో, ఆయా పాత్రలు జీవితానుభవం నుంచి, మానసికానుభూతి నుంచి అవగాహననూ, జ్ఞానాన్నీ సాధిస్తాయి. అందువల్ల, సన్నివేశ చిత్రణలో, సంఘటన ఘటనలో రచయిత శిల్పాన్ని ప్రదర్శించాడు.

ఉషారాణి శ్రీకాంత్‌తో కూడా సంబంధం పెట్టుకున్నదని తెలుసుకున్న తర్వాత, చక్రవర్తి ఆమెను దూషించిన సన్నివేశం, ఆ తర్వాత అతనిలో పశ్చాత్తాపాన్ని కలిగిస్తుంది. తన హద్దులు తెలుసుకోవటంతో అతనికి కొంత అవగాహన కలుగుతుంది. ఈ అవగాహనకు సమగ్రరూపం ఇవ్వటానికి 'కారు ప్రమాదం' సంఘటన దోహదం చేస్తుంది.

మార్పు వచ్చిన తర్వాత చక్రవర్తి సౌహార్దాన్ని ప్రదర్శించిన సన్నివేశం ఉషారాణిలో ఆలోచనలను రేకెత్తిస్తుంది.

కమలాకరంతో ఆమె చర్చించిన సన్నివేశాలు జ్ఞానదాయకంగా ఉన్నట్లే, ఆమె అతనితో లైంగికసంపర్కం నెరపిన సన్నివేశం అనుభూతి సంపన్నంగా ఉన్నది. శ్రీకాంత్ ఆమె మీద చేయి చేసుకున్న సంఘటన లైంగిక ప్రవృత్తిపట్ల పునరాలోచనకు దారివేసేదిగా ఉన్నది.

ఉషారాణి హిమాలయాలను సందర్శించిన సన్నివేశం, ప్రకృతి ద్వారా సంఘాన్ని అర్థం చేసుకోవటానికి, అలౌకిక లక్ష్యంవైపు పయనించటానికి దోహదం చేసింది. ఉషారాణి ఆధ్యాత్మికమైన 'మైమరపు'ను పొందిన సన్ని వేశం ఆమె జ్ఞానాతీతస్థితిని అందుకొని ఆధ్యాత్మిక మార్గంలో మునుముందుకు సాగగలదని నిరూపించింది.

ఉషారాణి రామానుజంతో తాను పరపురుషులతో పెట్టుకున్న సంబం ధాలను వివరించిన సన్నివేశం రామానుజం దృష్ట్యా ముఖ్యమైంది. అతడు ఆ తర్వాత రెండో పెళ్లి చేసుకొని భార్యను నిర్లక్ష్యం చేయకుండా జీవితం గడపటానికి దోహదం చేసింది.

ఈ విధంగా సన్నివేశాల ద్వారా, సంఘటనల ద్వారా పాత్రలో మానసికమైన ఎదుగుదలను సాధించటం ఈ నవలలో రచయిత ప్రదర్శిం చిన శిల్పం.

మొదటి దశలో ఉషారాణి జీవిత చిత్రణ, ఆమె ప్రవృత్తికి తగిన విధంగా సాగటంతో అనుభూతిదాయకంగా ఉన్నది.

ఈ నవలలో కథాకథనం (దృక్కోణం) పరాశ్రయపద్ధతిని అనుస రించింది

'గడియపడని తలుపులు' నవలికలో భిన్నమన స్తత్వాలుగల కోటేశ్వ రమ్మా శ్రీనివాసరావుల కలయిక అనుకోని పరిణామాలకు దారితీస్తుంది. కథనం 'కథకుని' పరంగా నడిచింది. ఈ పద్ధతిని అవలంబించినప్పుడు ఏ సంఘటన జరిగినా, కథకునికి తెలిసినప్పుడే పాఠకునికి తెలుస్తుంది. కనుక కథన శిల్పంలో దాగుడుమూతలు చోటుచేసుకున్నాయి. ఇందువల్ల నవలిక ఉత్కంఠాపూర్వకంగా నడిచింది.

కోటేశ్వరమ్మతో మొదటి లైంగిక సంపర్కం శ్రీనివాసరావులో పలాయనవాద తత్త్వాన్ని, రెండవ సంపర్కం ఉన్మాదాన్ని కలిగించాయి. ఇలాంటి చిన్న నవలలోని పాత్రలు సహజత్వాన్ని కోల్పోకుండానే వేగంగా మార్పును సాధించవలసి ఉంటుంది.

'అల్లుకుపోయే స్వభావం' అన్న పునాదిమీద శ్రీనివాసరావు పాత్ర చిత్రణను నిర్వహించటంలో రచయిత మంచి నేర్పును ప్రదర్శించాడు. ఇందువల్ల ఆ పాత్రలో వేగంగా మార్పును సాధించటం సాధ్యమైంది.

కోటేశ్వరమ్మలోని ముఖ్యలక్షణం అన్వేషణాశీలం డబ్బూ, పలుకుబడీ, శ్రీనివాసరావు, బ్రహ్మానందస్వామీ తీర్థయాత్రలూ ఆమెకు తన అన్వేషణలో తాత్కాలికంగా కనిపించిన మజిలీలు. చివరికి మృత్యువు కూడా ఆమె అన్వేషణలో చివరి మజిలీగా రూపొందటంతో అన్వేషణాశీలం ఆ పాత్రలోని జీవలక్షణంగా భాషించింది. ఈ విధంగా కోటేశ్వరమ్మలో అన్వేషణాశీలాన్ని జీవలక్షణంగా చిత్రించటం ద్వారా రచయిత పాత్రచిత్రణలో శిల్పాన్ని ప్రదర్శించాడు.

శ్రీనివాసరావులోనూ, కోటేశ్వరమ్మలోనూ వచ్చిన పరిణామం కరుణాజనకంగా ఉండటంతో పాఠకుడు ఆ పాత్రలతో తాదాత్మ్యం చెందగలడు. కోటేశ్వరమ్మకూ, కథకుడికీ మధ్యన ఏర్పడిన స్నేహానుబంధం నవలా రూపానికి అదనపు సౌందర్యాన్ని చేకూర్చింది.

ఈ నవలికలో కథనం ఆత్మాశ్రయ పద్ధతిలో సాగింది.

దాంపత్య జీవితాన్ని, భార్యనూ నిర్లక్ష్యం చేసిన వ్యక్తి. ఆమె తనను వదిలి వెళ్లిన తర్వాత, తిరిగి దాంపత్య జీవితంకోసం, భార్యకోసం ఆరాటపడి ఒక వ్యభిచారిణిని భార్యగా స్వీకరించటం 'శిథిలాలయం'లోని కథావస్తువు నాయకుడైన పీతాంబరరావు జీవలక్షణం అతని హృదయదౌర్బల్యం. భార్యను నిర్లక్ష్యం చేయటంలోనూ, ఆమెను కోల్పోవటంలోనూ, తిరిగి ఆశించటంలోనూ, నీనాను స్వీకరించటంలోనూ, పీతాంబరరావు హృదయదౌర్బల్యమే మొదటి నుంచీ చివరివరకు ముఖ్యమైన పాత్ర వహించింది.

ఈ విధంగా హృదయ దౌర్బల్యాన్ని పీతాంబరరావు పాత్ర చిత్రణలో రచయిత ఎంతో నైపుణ్యంతో ప్రదర్శించాడు.

వ్యవస్థను అతిక్రమించి ఉన్నతస్థాయికి ఎదిగిన నిర్మలాదేవి పాత్ర చిత్రణా, వ్యభిచార జీవితం నుంచి దాంపత్య జీవితంలోకి ఎదిగిన సీనా పాత్ర చిత్రణా రెండు భిన్నకోణాల నుంచి వివాహవ్యవస్థకు అర్థం చేసుకోవటానికి దోహదం చేసే విధంగా జరగటంవల్ల నవలకు సౌందర్యమూ, గాంభీర్యమూ చేకూరినాయి.

ఈ నవలలో కథనం పరాశ్రయ పద్ధతిలో సాగింది.

ఒక సహృదయుడు మతోన్మాదిగా మారటం, ఆ తర్వాత మతాతీత దృష్టితో మానవతావాదంవైపు మొగ్గు చూపటం 'గతించనిగతం'లోని కథావస్తువు.

హుస్సేన్‌ఖాన్ హిందూ యువతిని చెరిచాడు. ఆ యువతిని ఒక ముస్లిం దాదా ఆదుకున్నాడు. దానయ్య తన ఆస్తిని కోల్పోవటానికి హుస్సేన్‌ఖాన్ కారకుడయ్యాడు. కాని ఆ దానయ్యే హుస్సేన్‌ఖాన్ తల్లిని ఆదుకున్నాడు. ఈ నాలుగు అంశాల మధ్యన సమతౌల్యాన్ని సాధించటంలో రచయిత కళానైపుణ్యాన్ని ప్రదర్శించాడు.

హుస్సేన్‌ఖాన్ తల్లి సందేశాన్ని అర్థంచేసుకుని విలపించిన సన్నివేశం మానవత్వపు విలువలను మానవానుభూతుల 'పరిభాష'లోకి అనువదించి చెప్పేదిగా ఉన్నది.

ఈ నవలికలో కథనం పరాశ్రయపద్ధతిలో సాగింది.

గోపీచంద్ నవలల్లో నైపుణ్యం కొరవడిన అంశాలు, ముఖ్యంగా వైవిధ్యం కొరవడిన శాఖలాలు కూడా కనిపిస్తాయి,

గోపీచంద్ రచించిన చాలా నవలలు వర్తమానంలోనే ప్రారంభమౌతాయి. కాని, వెంటనే లేదా స్వల్ప వ్యవధి తర్వాత పాఠకుణ్ణి గతంలోకి తీసుకువెళ్తాయి. ఒక్కొక్కసారి ఈ గతం కేవలం ఒక ప్రస్తావనగా కూడా కనిపించవచ్చు.

'సీతారామారావు జీవితం విచిత్రమైంది'....అంటూ కథానాయకుని వర్తమాన జీవితాన్ని వ్యాఖ్యానిస్తూ రచయిత 'అసమర్థుని జీవయాత్ర'ను ప్రారంభిస్తాడు. ఆ తర్వాత తండ్రి మరణాన్ని, తండ్రి సీతారామారావు చెప్పిన చివరి మాటను, ప్రజల ప్రశంసను, సీతారామారావు బాల్యం నుంచీ విశ్వసిస్తూ వచ్చిన విలువలను రచయిత ప్రస్తావిస్తాడు.

'మెరుపుల మరకలు' నవల "రేపు నేను తిరుపతి వెళ్తున్నాను" అని చక్రవర్తి ఉషారాణికి చెప్పటంతో వర్తమానంతో మొదలౌతుంది. చక్రవర్తి నిష్క్రమించిన తర్వాత రచయిత ఆమెకు అతనితో ఏ విధంగా పరిచయం కలిగిందో చెప్పి, ఆ పరిచయాలు ఎట్లా అభివృద్ధి చెందాయో కూడా చెప్పాడు.

'గడియపడని తలుపులు' నవలిక, శ్రీనివాసరావు కధకుని తలుపుతట్టటంతో వర్తమానంతో మొదలౌతుంది. ఆ వెనువెంటనే కధకుడు శ్రీనివాసరావు గతాన్ని గుర్తుచేసుకుంటారు.

'పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా' కేశవమూర్తి రచించే నవలను రాసిపెట్టటానికి సుజాత అతని దగ్గరకు రావటంతో మొదలౌతుంది పరమేశ్వరశాస్త్రి ఆరోగ్యం బాగాలేదని టెలిగ్రాం రావటంతో సుజాత ఊరికి వెళ్ళిపోతుంది. అ తర్వాత కేశవమూర్తి తన మిత్రులను జ్ఞాపకం చేసుకోవటం వల్లా, సుజాత రైల్లో తన బాల్యం మొదలు అప్పటివరకు గడిచిన జీవితంలోని ముఖ్యమైన విషయాలను గుర్తుచేసుకోవటం వల్లా నవల గతంలోకి వెళ్తుంది

హుస్సేన్‌ఖాన్ పాకిస్తాన్ నుంచి హైదరాబాద్ రావటంతో 'గతించని గతం' నవలిక వర్తమానంలోనే ప్రారంభమౌతుంది. వెంటనే రచయిత అతనికి పాకిస్తాన్‌లో ఎదురైన నిరాశను గూర్చి చెప్తాడు. ఆ తర్వాత వర్తమానంలోకి వచ్చినా, రజాకార్ రోజులలో పార్వతిని తాను మానభంగం చేసిన వృత్తాంతాన్ని హుస్సేన్‌ఖాన్ గుర్తుచేసుకోవటంతో కధ గతంలోకి వెళ్తుంది.

'చీకటిగదులు' నవల 'అదొక పల్లెటూరు, దాని పేరు రామాపురం అయిదారువందల గడప వుంటుంది.' అంటూ వర్తమానంలోనే ప్రారంభమౌతుంది. వెంటనే——

'ఒకప్పుడు వెయ్యి గడపతో కళకళలాడుతూ వుండేద'ని చెప్తూ పాత కుణ్ణి గతంలోకి తీసుకుపోతాడు, రచయిత. ముఖ్యపాత్రలైన రత్నమ్మా, గోపాలం, కమలలు కూడా వర్తమానంలోనే పాఠకునికి కనిపిస్తారు. కాని వెంటనే రత్నమ్మకు 'ఒక్కసారి తన జీవితమంతా' జ్ఞాపకం రావటంతో కథ గతంలోకి పరుగెడుతుంది

'ఆనాడు నారాయణరావు ఇంటికి వచ్చేటప్పటికి రాత్రి ఏడు గంట లయింది.' అంటూ 'యమపాశం' ప్రారంభమౌతుంది. భార్యతో కొంత మాట్లాడిన తర్వాత అతడు గతంలోకి నిష్క్రమించి, తన పెళ్ళిని గుర్తుచేసు కుంటాడు మధ్యమధ్యన కొన్ని నిమిషాలపాటు వర్తమానంలోకి వస్తూ రెండు సంవత్సరాల క్రితం తన ఆఫీసులో పనిచేసిన శారద వృత్తాంతాన్ని గుర్తుచేసు కుంటాడు. ఆ తర్వాత తన బావమరిది గోపీకృష్ణనూ, అతడు హైదరాబాదుకు వచ్చినప్పటి వృత్తాంతాన్ని గుర్తుచేసుకోవటంతో కథ గతంలోకి వెళ్తుంది.

గోపీచంద్ నవలలు పాత్ర ప్రధానమైనవి. రాజారావు, సీతారామారావు శమంతకమణి, ఉషారాణి, కోటేశ్వరమ్మ, పీతాంబరరావు, కేశవమూర్తి, హుస్సేన్‌ఖాన్, గోపాలం, నారాయణరావు, కళ్యాణి— ఆయా నవలల్లో, నవలి కల్లో ప్రధాన పాత్రలు. ఆయా నవలల్ని పరిశీలించటమంటే, కొంతవరకు ఆయా పాత్రల్ని పరిశీలించటమే. ఈ పాత్రలను గూర్చి ఇదివరకే చాలా వరకు చెప్పటం జరిగింది పాత్రల కల్పనలోనూ, చిత్రణలోనూ వైవిధ్యం కొరవడిన అంశాలను ఇక్కడ ప్రస్తావించటం జరుగుతుంది.

గోపీచంద్ నవలల్లోని పురుష పాత్రల్లో హృదయ దౌర్బల్యం, పరాధీన ప్రవృత్తి ఎక్కువ స్త్రీ పాత్రల్లో సామర్థ్యం, ఆచరణాత్మక దృక్పథం ఎక్కువ.

'పరివర్తనం'లో, రాజారావు- అక్క, 'అసమర్థుని జీవయాత్ర'లో సీతా రామారావు—ఇందిర; 'పిల్లతెమ్మెర'లో డ్యాన్సుమాష్టారు- మృణాళిని, 'మెరు పుల మరకలు'లో రామానుజం- ఉషారాణి; 'శిథిలాలయం'లో పీతాంబరరావు- నిర్మలాదేవి; 'పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా'లో కేశవమూర్తి—

సుజాత; 'యమపాశం'లో నారాయణరావు- రాజమ్మ పాత్రలు ఇందుకు నిదర్శనం.

తరతమ భేదాలతో సీతారామారావు రాజారావు, పీతాంబరావు— ఈ ముగ్గురూ హృదయదౌర్బల్యం విషయంలో అన్నదమ్ములనిపిస్తారు. ఉషారాణి శమంతకమణి కోటేశ్వరమ్మ— ఈ ముగ్గురూ స్వేచ్ఛా ప్రవృత్తి విషయంలో అక్కాచెల్లెళ్ళనిపిస్తారు. కేశవమూర్తి డ్యాన్సుమాష్టారులలో అమాయకత్వం సమానలక్షణంగా కనిపిస్తుంది. అక్కలోనూ, మృణాళినీ సుశీలల్లోనూ ఆత్మీయులకు మార్గదర్శకత్వం వహించే గుణం సమానలక్షణం రామానుజం నారాయణరావులు వారివారి వృత్తులల్లో సమర్థులు.

ఇందిర రాజమ్మ హుస్సేన్‌ఖాన్‌లు మాత్రం కొంతవరకు ప్రత్యేక వ్యక్తులుగా కనిపిస్తారు.

చాలా నవలల్లో 'రచయిత ప్రతినిధి' పాత్రలు కనిపిస్తాయి. 'పరివర్తనం'లో కిష్టుడు, 'అసమర్థుని జీవయాత్ర'లో రామయ్య తాత, 'మెరుపుల మరకలు'లో కమలాకరం; 'శిథిలాలయం'లో పీతాంబరరావు తండ్రి: 'యమపాశం'లో గోపీకృష్ణ అలాంటి పాత్రలు. 'చీకటిగదులు'లో గోపాలాన్ని ఈ పాత్రల పరిణతరూపంగా తీర్చిదిద్దాలని రచయిత ఆశించాడు

నవలల్లోని ప్రధాన స్త్రీ పాత్రల్లో సామర్థ్యం, ఆచరణాత్మక వైఖరి, ధైర్యసాహసాలు పురుష పాత్రల కంటే ఎక్కువేనని పరిశీలనలో వెల్లడైన అంశమే. అయితే, ఈ లక్షణాలు ఆయా రచనల్లో రెండు మూడుసార్లు మాత్రమే కనిపించే అప్రధాన స్త్రీ పాత్రల్లో కూడా కనిపిస్తాయి

'పిల్లతెమ్మెర' నవలికలో శచీంద్రుడు జైలుపాలైన తర్వాత అతని భార్య—

"మూడు నాలుగు సంవత్సరాలు కళ్లు మూసుకుంటే వీడు అక్కరకు వొస్తాడు. ఎవ్వరినైనా రెండు ఎకరాలు కవులుకు తీసుకుంటే జరిగిపోతుంది" అంటూ ఎంతో గుండె నిబ్బరాన్ని ప్రదర్శిస్తుంది.

'మెరుపుల మరకలు' నవలలో భర్తకూ ఉషారాణికీ ఉన్న అక్రమ సంబంధం చక్రవర్తి భార్యకు 'తెలుసు'. అయినా, భర్త ఎన్నటికైనా తన వాడవుతాడనే ఆత్మవిశ్వాసంతో ప్రవర్తిస్తుంది.

'గడియపడని తలుపులు' నవలికలో భర్త ఉన్మాది అయ్యాడని తెలిసిన తర్వాత కూడా, శ్రీనివాసరావు భార్య— "వారు తప్పకుండా తిరిగివస్తారు, అందులో నాకేమాత్రం సందేహంలేదు." అంటూ ఆశావాద దృక్పథాన్ని ప్రదర్శిస్తుంది.

ఇదే నవలలో—

కథకుడు శ్రీనివాసరావు వ్యవహారాన్ని తన భార్యకు వివరించి, తాను కూడా శ్రీనివాసరావు లాగే సంసారబంధాన్ని తెంచుకొని స్వాములవారి ఆశ్రమంలో చేరిపోతే భార్యకు ఎంతో కష్టంగా ఉంటుందన్న భావాన్ని వ్యక్తం చేసినప్పుడు- "కష్టంగానే ఉంటుంది. కాని, తీరా చేరిన తర్వాత చేసేది ఏమున్నది ?" అని అంటుంది.

ఈ మాటల్లో కొంత వేదాంతి ధోరణి తొంగిచూసినా జీవితంలో ఏ పరిణామానికైనా సిద్ధంగా ఉండాలన్న ధైర్యం కూడా కనిపిస్తుంది.

'పరివర్తనం'లోని అమ్మమ్మ తన అల్లుని సమస్యను ఎదుర్కోవటం లోను, 'పండిత పరమేశ్వర శాస్త్రి వీలునామా'లోని వెంకాయమ్మ సుజాతను కాపాడటంలోనూ ధైర్యాన్నీ, సమయస్ఫూర్తినీ ప్రదర్శించారు.

ఆత్మాశ్రయ కథాకథన పద్ధతిని ఆశ్రయించిన నవలికలలో ముఖ్యమైన సంఘటనలు లేక పరిణామాలు సంభవించినప్పుడు 'కథకుడు' లేకుండా పోవటం కనిపిస్తుంది

'పిల్లతెమ్మెర' నవలలో కథకుడు శమంతకమణిని కలుసుకొని హైద్రాబాదు వెళ్ళిపోయిన రాత్రే శచీంద్రడామెను హత్యచేస్తాడు ?

'గడియపడని తలుపులు'లో కోటీశ్వరమ్మ బారి నుంచి తనను కాపాడటానికి ఆశ్రమానికి రమ్మని శ్రీనివాసరావు కోరతాడు కాని, తన బదిలీ వ్యవ

హారం అడ్డురావటంతో వెళ్లలేకపోతాడు. ఫలితంగా కోటేశ్వరమ్మ శ్రీనివాస రావుల మధ్య లైంగిక సంపర్కం జరగటం, వారిని ఆశ్రమాధిపతులు బహిష్కరించటం, ఇద్దరూ చెరోవైపు వెళ్ళిపోవటం జరుగుతుంది.

'శ్రీనివాసరావు కోరినట్లు అతడు వెళ్లిన మరునాడే నేను యాదగిరి గుట్ట వెళ్లివుంటే ఈ ప్రమాదం జరిగి వుండకపోను' అని అనుకుంటాడు, కథకుడు.

ఈ రెండు సందర్భాలలో కూడా కథకుడు కథలో ప్రత్యక్షంగా పాల్గొనకపోవటంవల్ల, ఆ తర్వాతనే పరిణామాలను గూర్చి తెలుస్తుంది ఇందుకు ఆత్మాశ్రయ కథన విధానం కొంతకారణమైతే ఆ పరిణామాలకు కథకుడు అవరోధంగా ఉండకూడదనుకోవటం మరొక కారణం,

ఈ ధోరణి కొద్దిపాటి తేడాలతో ఇతర నవలల్లో కనిపిస్తుంది. 'మెరుపుల మరకలు' నవలలో అనుకున్న ప్రకారం ఉషారాణి కమలాకరంలతో పాటు పద్మ కూడా ఆగ్రా వెళ్ళవలసింది కాని. అనుకోకుండా ఆమెకు కొంచెం జ్వరం, తలనొప్పి రావటంతో ఉషారాణి కమలాకరంలు మాత్రమే వెళ్తారు. ఇందువల్ల వాళ్ళ లైంగిక సంపర్కానికి అడ్డు తొలగిపోతుంది.

'పండిత పరమేశ్వర శాస్త్రి వీలునామా'లో సుజాత సుభాషిణి కేశవమూర్తులతో కలిసి సినిమా షూటింగ్ చూడటానికి వెళ్లాలనే నిర్ణయించుకున్నది. కాని, సమయానికి కొడుకు పరమేశ్వర్‌కు 'కడుపులో నొప్పో ఏమో విడవకుండా మారాంచేసి నిద్రపోయాడు' మేల్కొలపటం ఇష్టంలేక సుజాత ఉండిపోయింది. ఇందువల్ల సుభాషిణి కేశవమూర్తులు షూటింగ్ చూడటానికి పోలేదనీ, జీజీతోనూ, ఆ తర్వాత హోటల్‌లోనూ శృంగార కార్యకలాపాలు జరిపి వచ్చాడని సీమంతం సుజాతకు ఆకాశరామన్న ఉత్తరం రాయటానికి అవకాశం దొరికింది.

కొన్ని సందర్భాలలో రచనలోని భ్రాంతిమయ వాతావరణాన్ని చెదరగొట్టే బలహీనత రచయితలో కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది 'పిల్లతెమ్మెర'లో– "శచీంద్రుడు శమంతకమణిని హత్య చేశాడా? ఈ మాట ఎవరైనా నమ్మ

గలరా ? మీరు నమ్మగలుగుతున్నారా ?" అంటాడు డ్యాన్సు మాష్టారు.

ఈ 'మీరు' పాఠకులే.

'పండిత పరమేశ్వర శాస్త్రి వీలునామా' నవలలో శారద్వతుడు కేశవ మూర్తితో మాట్లాడిన సందర్భంలో, చాలాసార్లు కుండలీకరణాల్లో రచయిత వ్యాఖ్యానించాడు

'"అడుగు, నాకు తెలిసినంతవరకు చెప్పటానికి నేను సర్వధా సిద్ధమే" (ఇక్కడ సర్వధా అన్నప్పుడు ధాకి వత్తువుంది. ఆ విషయం ఎవ్వరూ మరచి పోరాదు.')

'"మేం మేధావులం" అని ప్రారంభించాడు శారద్వతుడు. (ఇక్కడ— 'మేం' అన్నాడు 'మనం' అనలేదు. శారద్వతుడు ప్రతిమాటా ఆచితూచి వాడతాడనే విషయం ఎవ్వరూ మరచిపోగూడదు') "మేధావులు మాటిమాటికీ పుట్టే అట్టివారుకారు. అరుదుగా పుడుతుంటారు. అందుకని ఎంత ఆలస్యంగా మరణిస్తే, సంఘానికి (సంఘానికి అనే మాట మనస్సులో నోట్ చేసుకోవల సిన అమూల్యమైన విషయం) అంత మంచిది."

"మాకు ('మాకు' అన్నాడు. మనకు అనలేదు. విజ్ఞులు యీ విషయం గమనించాలి.) ఏ విషయంలోనూ కమ్యూనిస్టులతో పొత్తు కుదరదు."

పై నాలుగు సందర్భాలలోనూ కుండలీకరణాల్లో రచయిత జోక్యం చేసుకొని, శారద్వతుణ్ణి అవహేళన చెయ్యాలనే దృష్టితో వ్యాఖ్యానించాడు. చివరి రెండు సందర్భాల్లో శారద్వతుడు వాక్యం పూర్తిచేయకముందే ఆ రచ యిత కుండలీకరణాల్లో వ్యాఖ్యానించటం గమనార్హం. ఈ విధానంవల్ల శారద్వతుణ్ణి ఉద్దేశపూర్వకంగా అల్పుడిగా చిత్రీకరిస్తున్నాడనే భావం కలుగు తుంది. అంతేకాక, ఇన్నిసార్లూ రచయిత విజ్ఞప్తి చేసింది నేరుగా పాఠకుడికే కావటంవల్ల పాఠకుని ఏకాగ్రత దెబ్బతిని, నవలలోని భ్రాంతిమయ వాతా వరణం భగ్నమవుతుంది.

ఈ విధంగా గోపీచంద్ చివరి రోజుల్లో రాసిన నవలల్లో కొంత కళా

నైపుణ్యం కొరవడిందని చెప్పవచ్చు. రచనకూ రచనకూ మధ్యన ఎక్కువ ఎడం ఉంటే పాఠకులు రచయితను మరచిపోతారనే అభిప్రాయం కూడా గోపీచంద్‌కు ఉండేది.[9]

చివరిరోజుల్లో గోపీచంద్ పుంఖానుపుంఖంగా రాయటానికి పూనుకున్నాడు. మూడు నవలలు అసంపూర్ణంగా మిగిలిపోవటం, ఆయన ఏక కాలంలో అనేక రచనలు చేయటానికి పూనుకున్నాడన్న సత్యాన్ని చాటిచెప్తున్నాయి. అందువల్ల నవలా రచనపట్ల చివరి రోజుల్లో గోపీచంద్‌కు ఏకాగ్రత తగ్గిందని చెప్పవచ్చు.

ఎనిమిదవ ప్రకరణం

## సూచికలు

1. తెలుగు సాహిత్యంలో శిల్ప పదాన్ని చాలా మంది కవులు భిన్నార్థాలలో ఉపయోగించారు. 'కొనిరమ్మ సిద్దైన శిల్పకళా కుశలత్వ మేర్పడన్' (భార సభా.) అంటూ తీసుకురావటంలో ఉన్న నేర్పును నన్నయ శిల్పంగా భావించాడు '....నేనుభయకావ్య ప్రౌఢి బాటించు శిల్పమునన్ బారగుడన్ గళావిదుడ' (నిర్వ. అవతారిక) అని తిక్కన చెప్పుకున్నాడు.
2. 'కథానిక : స్వరూప స్వభావాలు, అధ్యాయం 4, పోరంకి దక్షిణామూర్తి.
3. 'పీఠిక', ఫిబ్రవరి 1976.
4. Ibid, జనవరి 1977. 'శిల్పం అంటే ఏమిటి ?'
5. 'సాహిత్య ప్రయోజనం,' పుట. 45.
6. —Forms of modern fiction : Technique as discovery, Mark Schoier.
7. Ibid.
8. 'గోపీచంద్ స్మారక సంచిక', పుట. 221.
9. Ibid, కుందుర్తి వ్యాసం.

తొమ్మిదవ ప్రకరణం

# వ్యక్తిత్వం

పరిణామక్రమంలో రచయిత ఒక వ్యక్తిత్వాన్ని సాధిస్తాడు. ఆ వ్యక్తిత్వమే రచయితకు సాహిత్యంలో ఒక స్థానాన్ని సంపాదించి పెడుతుంది.

గోపీచంద్ వ్యక్తిత్వం మీద బాల్యం గాఢమైన ముద్రవేసినట్లు కనిపిస్తుంది. పదేళ్ళ పసి వయసులోనే గోపీచంద్ తల్లిని పోగొట్టుకున్నాడు. ఇది తల్లిలేని లోటును అర్థంచేసుకునే వయసు. తల్లి వియోగాన్ని అనుభవించే వయసు. బ్రాహ్మణేతరోద్యమంలో ఉక్కిరిబిక్కిరయ్యే కవిరాజుగారు తీర్చగలిగిన లోటు కాదది.

తాను అనాథుణ్ణనే భావం, తనకెవరూ లేరనే భావం గోపీచంద్‌లో చోటు చేసుకున్నది. చంద్రావతి గారు ప్రేమాభిమానాలతో పెంచగలిగారు, అయినా అతనిలో అనాథుణ్ణనే భావం మాత్రం అచేతనలో గూడుకట్టుకున్నది.

దీని ఫలితమే వ్యక్తావ్యక్త న్యూనతా భావం.

ఈ న్యూనతను జయించటానికే సూతాశ్రమంలోని చర్చల్లో ఆస్తికులను ఖండించటానికి నాస్తిక హేతువాద భావాలు కొంతవరకు పనికి వచ్చినై. భావకవిత్వం మీద దాడిచేయటంలో కనిపించే ఆధిక్య ప్రదర్శనకు ఈ న్యూన్యతాభావం కూడా కొంతవరకు కారణంగా కనిపిస్తున్నది1.

ఆయన నవలల నిండా 'కోల్పోయినవాళ్లు' 'పోగొట్టుకున్నవాళ్ళు' కనిపిస్తారు. 'పరివర్తనం'లో రాజారావు భార్యను కోల్పోయాడు. 'అసమర్థుని జీవయాత్ర'లో సీతారామారావు తండ్రిని కోల్పోవటంతో అతని పతనం ప్రారంభమైంది. 'పిల్లతెమ్మెర'లో డ్యాన్సుమాష్టారు తల్లిదండ్రులు కనిపించరు. అతని వ్యవహారాలు పినతండ్రే చూస్తుంటాడు శమంతకమణి అనాథ.

'శిథిలాలయం'లో పీతాంబరరావూ, నిర్మలాదేవీ- ఇద్దరూ తల్లి దండ్రులు లేనివాళ్లే 'నీనా'కు ఎవరూ లేకపోవటంవల్లే వేశ్యగా మారవలసి వచ్చింది 'పండిత పరమేశ్వర శాస్త్రి వీలునామా'లో సుజాత అనాథగానే పెరిగి పెద్దదైంది. నవల చివర, అదీ పరమేశ్వర శాస్త్రి చనిపోయిన తర్వాతనే తల్లిదండ్రు లెవరో ఆమెకు తెలుస్తుంది.

'గతించని గతం'లో హుస్సేన్‌ఖాన్‌కు తండ్రి లేడు. ఆ తర్వాత తల్లిని కోల్పోతాడు.

కథా నాయకులలో చాలావరకు భద్రతారాహిత్యం, న్యూనతాభావం, పరాధీన ప్రవృత్తి, ఇతరుల సానుభూతిని అపేక్షించటం-మొదలైన అధీర నాయకుని లక్షణాలు కనిపిస్తాయి.

ఈ లక్షణాలకు కొంతవరకు గోపీచంద్ లక్షణాలు కారణమైతే, మరి కొంతవరకు సమకాలీన పరిస్థితుల ప్రాబల్యం కారణం.

నవలా రచనకు పూనుకున్నవాటికి గోపీచంద్‌కున్న ముఖ్యమైన భావాలను, చివరి దశలో కనిపించే భావాలతో తులనాత్మకంగా పరిశీలిస్తే ఆయన వ్యక్తిత్వం మరికొంత వెల్లడవుతుంది,

1943లో—

ప్రపంచ పరిణామంలో సెక్సు సంబంధం లేకుండా సెక్సు విభజన వల్ల ఉత్పత్తి జరిగిన రోజులు కూడా ఉన్నాయని శాస్త్రజ్ఞులు చెపుతున్నారు [2] అన్నాడు గోపీచంద్.

నిజమే. కొన్ని మొక్కలలోనూ, కొన్ని కీటకాలలోనూ ఒకే బీజకణం నుంచి ఫలదీకరణం జరగకుండానే జీవి అభివృద్ధి చెందుతుంది.

దీన్నే 'Parthenogenesis'[3] అంటారని జంతుశాస్త్రం చెప్తున్నది.

కాని, దీన్ని ఆధారం చేసుకొని—

'మన పూర్వ వాఙ్మయంలో కనిపించే కుండల్లో పుట్టినవాళ్లూ, చెవుల్లో నుంచి వొచ్చినవాళ్ళూ, స్వేద బిందువులవల్ల కలిగినవాళ్ళూ'[4] పై వివరణ

క్రిందికి వస్తారని ధ్రువీకరించటానికి ఆధారాలు లేవు. మహిమవల్ల ఈ సృష్టి జరిగిందని కూడా అప్పటి గోపీచంద్ భావించటంలేదు. అందువల్ల ఇప్పుడు 'టెస్ట్‌ట్యూబ్ బేబీలను' ఉత్పత్తి చేసినట్లుగా, ఆ రోజుల్లో భారతీయ విజ్ఞాన శాస్త్రవేత్తలు జీవిని సృష్టించి ఉంటారని అనుకోవట మొక్కటే మార్గం, ఇది శాస్త్రీయ ఊహాగానమే.

1961లో—

'మన మహర్షులు అనుష్ఠించిన పరిశోధనా విధానం సైన్సు కంటే విశిష్టమైనదని అనిపిస్తున్నది. సైంటిస్టులు పదార్థం మీద పరిశోధనలు జరిపితే వీరు తమమీదే పరిశోధనలు జరుపు కున్నారు.'[5] అంటున్నాడు.

ఈ మాటల్లో స్పష్టంగా ఆధ్యాత్మికవాద ప్రభావం కనిపిస్తున్నది. 1943లో కనిపించే శాస్త్రీయ ఊహాగానమూ, 1961 నాటి ఆధ్యాత్మిక ధోరణీ రెండూ ఇంచుమించుగా ఒకేలాగున్నట్లు కనిపించినా, అప్పట్లో విజ్ఞాన శాస్త్రం వైపు మొగ్గు చూపిన గోపీచంద్, తర్వాతికాలంలో ఆధ్యాత్మికవాదంవైపు ఆకర్షితుడు కావటం స్పష్టంగా కనిపిస్తుంది.

1943లోనూ, అంతకుముందూ భావకవిత్వం మీద ఉన్న అభిప్రాయాలే గోపీచంద్ రాతల్లో 1961లో కూడా కనిపిస్తాయి.

'భావకవిత్వంలోని మెత్తదనంతో మొగము మొత్తిన, భావకవిత్వంలో ప్రాధాన్యం వహించిన విప్రలంభ శృంగారంతో నైరాశ్యానికి లోనైన ప్రజలకు, దాశరథిగారు మేరుగంభీరులై నిలబడి తమ 'రుద్రవీణ'ను వినిపించారు.'[6]

ప్రజలను కవిత్వం నిరాశకు లోనుచేయరాదనే గోపీచంద్ పాత అభిప్రాయంలో మార్పులేదు.

1943లో—

వేదాంతం విరహం– '....ఈ రెండూ మానవుణ్ణి ప్రపంచంలో నుంచి

కష్టాలను ఎదుర్కొనివ్వకా, సుఖాలను అనుభవించ నివ్వకాబయటకు తరిమేవే. బాహ్య ప్రపంచాన్నికాం, లోపలకు చూచుకోమని ప్రేరేపించేవే.'7 అన్నాడు

1961లో—

'వీరందరూ భగవంతుని దర్శనంకోసం మోక్షంకోసం ప్రేరేపించబడిన వారేనా? కొంతమంది జీవితంలో వేగలేక శాంతికోరి వచ్చినవారు కూడా వుండవచ్చు. ఇటువంటి వారిని జీవితపలాయనులు అని యువకులు కొందరు ఈసడించటం తాను ఎరుగును. జీవితం రేపే కల్లోలాలను, తుఫానులను తట్టుకోలేక ఎక్కువ మంది వేదాంతోన్ముఖులవుతారు. జీవితమే భగవంతుని అంకంలోకి తరుముతున్నదన్నమాట.'8 అని అంటున్నారు.

వేదాంతోన్ముఖత్వానికి ప్రపంచంలో, జీవితంలో, వేగలేకపోవటమే కారణమని 1943లో భావించినట్లుగానే 1961లో కూడా గోపీచంద్ భావిస్తున్నాడు కాని, మనిషిని జీవితమే భగవంతుని అంకంలోకి తరుముతున్నదని ఆధ్యాత్మిక విశ్వాసాన్ని వ్యక్తం చేస్తున్నాడు.

అప్పుడూ ఇప్పుడూ కూడా ''మతం', 'భగవంతుడు' అనే భావాలు సామాన్య ప్రజలను దోచుకోటానికి మాత్రమే వినియోగింపబడే భయంకర స్థితికి వొచ్చివున్నాయ'నే9 గోపీచంద్ విశ్వసిస్తున్నాడు. ఆచరణలో ఆస్తిక విశ్వాసాలు ధనికవర్గ ప్రయోజనాలను రక్షిస్తున్నాయనే అవగాహనను వ్యక్తం చేస్తున్నాడు.

1936 ప్రాంతంలో గోపీచంద్ కమ్యూనిస్టుపార్టీ అభిమాని. మార్క్సిజం ఆరాధకుడు.

'బీదవాళ్ళ శ్రమను దోచుకున్న ధనవంతులు, ఇవ్వవలసిన కూలీనే దానమో ధర్మమో చేస్తున్నట్లు నటిస్తారని 'పీడిత హృదయం'10 కథలో చెప్పాడు

1955లో, అరవిందుని భావాలచేత ఆకృష్టుడైన తర్వాత కూడా గోపీచంద్‌కు– 'ఆర్థిక పరిస్థితి'నీ 'వర్గ కలహాన్నీ'11 వదిలిపెట్ట బుద్ధికాలేదు.

1961లో కూడా

"కమ్యూనిస్టు పద్ధతి నాకు హితవు కాకపోయినా నేను అర్థంచేసుకో గలను. శ్రామికులను ధనవంతులు దోచుకుంటున్నారని వారి నమ్మకం. పైకి ఎన్ని వెధవ కబుర్లు చెప్పినా అందులో కొంత సత్యం లేకపోలేదు."12 అనే భావాన్ని వ్యక్తం చేశాడు.

వెనకటి 'పూర్తి సత్యం', ఇప్పుడు 'కొంత సత్యం'గా మారినా కమ్యూనిజంపట్ల గోపీచంద్‌కు ఒక మూల చిన్న సానుభూతి మిగిలే ఉంది.13

అయితే,

'భౌతిక పరిస్థితులే లెక్కలోకి తీసుకోవటం, మనస్సు యొక్క శక్తిని కించపరచటమే'14 అన్న అభిప్రాయం మాత్రం క్రమంగా ఆయనలో బలపడుతూ వచ్చింది.

పై అంశాలను బట్టి, హేతువాదిగా నవలా సాహిత్యరంగంలో అడుగు పెట్టిన గోపీచంద్ ఆధ్యాత్మికవాదిగా రూపొందాడని గుర్తిస్తూనే, అతని అభిప్రాయాల్లో కొన్ని కొంతవరకు మారాయని, కొన్ని మారలేదనీ చెప్పుకోవలసి ఉంటుంది.

యాభై రెండేళ్ళ జీవితంలో కొత్త విశ్వాసాలు కలగటం అతిసహజం కొత్త విశ్వాసాలు కలిగినంత సులభంగా పాత విశ్వాసాలు తొలగిపోవు. అందువల్ల చారిత్రక సంధి దశలో నవలా రచనకు పూనుకున్న గోపీచంద్‌లో పాత భావాలు, కొత్త భావాలు రెండూ చోటుచేసుకున్నాయి.

సమన్వయం గోపీచంద్ జీవలక్షణం కావటం ఇందుకు ముఖ్యకారణం

గోపీచంద్‌ది బహుముఖ వ్యక్తిత్వం.

మార్క్సిజాన్ని అభిమానించిన రోజుల్లోనూ, రాయిజాన్ని ప్రచారం చేసిన రోజుల్లోనూ, ఆయన రచించిన కథలవల్ల తెలుగు కథ రాజకీయ స్వభావం బలపడింది.

కథా రచయితగా, వ్యాసకర్తగా పొందిన గుర్తింపుతో సినిమారంగం

లోకి ప్రవేశించగలిగాడు. జనరంజకమైన సంభాషణలు వ్రాయటంలో అందె వేసిన చేయి అనిపించుకున్నాడు. నవలల్లో పాత్రలకు ఆయన సమకూర్చిన సంభాషణలు సహజంగా ఆయా మనస్తత్వాలకు తగినట్లుగా ఉండటానికి సినిమా అనుభవం కూడా తోడ్పడింది.

గోపీచంద్ దర్శకత్వ శాఖలో జయాపజయాలను చవిచూసినా, వ్యాపార దృష్టితోకాక, చలనచిత్ర రంగంపై తన అభ్యుదయ వ్యక్తిత్వ ముద్రను వేయటానికి కృషిచేసిన వ్యక్తిగా చిరస్మరణీయుడు.

1953లో ఆంధ్ర రాష్ట్రం అవతరించగానే, సమాచార శాఖ డైరెక్టరుగాను, 1956లో ఆంధ్రప్రదేశ్ అవతరించిన తర్వాత సమాచార సంబంధ శాఖలో సంయుక్త నియంత్రణాధికారిగను గోపీచంద్ పనిచేశాడు. ఆయన ఈ పదవుల్లో ఉన్నప్పుడు మారదృష్టితో కొన్ని సంస్కరణలను ప్రవేశపెట్టి ఒక వ్యక్తిత్వం ఉన్న అధికారిగా పేరు తెచ్చుకున్నాడు. తన పదవీకాలాన్ని పొడిగించుకోవటానికి రాజకీయ నాయకులను ఆశ్రయించలేకపోయాడు. ఇది కూడా గోపీచంద్ వ్యక్తిత్వ వైశిష్ట్యాన్ని వెల్లడిచేసే అంశమే

గోపీచంద్‌కు వాదోపవాదాల్లో పాల్గొనటం వెన్నతోపెట్టిన విద్య. ఆయన మంచి మాటకారి, వక్త కూడా. రాడికల్ డెమొక్రటిక్ పార్టీ కార్యదర్శిగా పనిచేసినప్పుడు బహిరంగ సభల్లో రాజకీయోపన్యాసాలు చేసేవాడు. హైదరాబాదులో స్థిరపడ్డ తర్వాత అనేక సభల్లో జనరంజకమైన ఉపన్యాసాలు చేశాడు.

గోపీచంద్ అనేక రేడియో నాటికలను, నాటకాలను రచించాడు. ఈ నాటకాలను రచించె విషయంలో మొదటి దశలోనూ, చివరిదశలోనూ బుచ్చిబాబుగారి స్నేహపూర్వక ప్రోత్సాహం గోపీచంద్‌కు లభించటం ఒక విశేషం. గోపీచంద్ చలనచిత్ర రచనానుభవం ఈ నాటకాలను రచించటానికి ఉపకరించింది.

గోపీచంద్ నాటకాలలో నటించిన సందర్భాలు కూడా ఉన్నాయి. 'రచ్చబండ'15 నాటికలో తాను బ్రహ్మయ్య పాత్రను ధరించినట్లు రాసుకున్నాడు.

'ఆకాశవాణి'లో గ్రామస్థుల కార్యక్రమాల ప్రయోక్తగా కూడా పని చేశాడు. గ్రామీణ జీవితానుభవం ఆధారంగా, గ్రామీణులకు, ముఖ్యంగా రైతులకు విజ్ఞానదాయకంగా ఉండే కార్యక్రమాలను రూపొందించాడు, గోపీచంద్. ఈ కార్యక్రమాల ద్వారా గోపీచంద్ సాధించిన సత్ఫలితాలను స్టేషన్ డైరెక్టర్లంతా గుర్తించారు.

గోపీచంద్ జీవితపు చరమాంకంలో 'ఆకాశవాణి' ఉద్యోగం కొంత ప్రశాంతతను, మరికొంత సంతృప్తిని కలిగించటంవల్ల ఆధ్యాత్మిక చింతనకూ, పుంఖానుపుంఖంగా రచనలు చేయటానికీ అవకాశం ఏర్పడింది. పద్నాలుగేళ్ల తర్వాత 1960లో తిరిగి గోపీచంద్ నవలా రచనకు పూనుకోవటమే ఈ విషయాన్ని వెల్లడిచేస్తున్నది.

గోపీచంద్ నిజాయితీపరుడు, తనలోని మార్పును దాచుకోవటానికి ఎప్పుడూ ప్రయత్నించలేదు. జంకుకొంకులు లేకుండా తన భావాలను వ్యక్తం చేశాడు.

జీవితంలో ఎదురైన కష్టాలే తనను ఆధ్యాత్మికవాదంవైపు మళ్ళించాయని చెప్పటానికి ఆయన వెనకాడలేదు.

'ఈ మధ్య మీకు కష్టాలు ఎక్కువైనాయి. అందుకని మీ దృష్టి ఆధ్యాత్మికవాదం మీదకు పోతూవుంది. అని వ్రాశావు. ఇదీ నిజమేనని నేను ఒప్పుకుంటాను.'16 అన్నాడు గోపీచంద్.

'జనానా' కథలో కథకుడు.

'నాకప్పుడు సర్వీస్‌లో రావలసిన ప్రమోషన్ రాక కాస్త వేదాంత దృష్టి అలవడింది' అంటాడు.

జస్టిస్ పార్టీ నిర్వహించిన బ్రాహ్మణేతరోద్యమం గూర్చి- 'జస్టిస్ పార్టీ చేసిన ముఖ్యమైన పొరపాటులలో యిదొకటి. జన్మను సాకుగా తీసుకొని బ్రాహ్మణులు సంఘంలో ప్రత్యేక హక్కులను అనుభవిస్తున్నారనీ, మిగిలిన కులాలను దాస్యంలో అట్టిపెడుతున్నారనీ, కాబట్టి ఆ హక్కులను గుంజు

కోవాలనీ భావించింది. బాగానే ఉంది. కాని, ఆ పార్టీ బ్రాహ్మణేతరులలోని అగ్రకులాలకు మాత్రమే ప్రాతినిధ్యం వహించటంవల్ల ఆ హక్కులను తమ అనుభవంలోకి తెచ్చుకొని అంతటితో వూరుకుంది. మరి గర్భదారిద్ర్యంలో ఘోర దాస్యంలో తరతరాల నుంచీ క్రుళ్లి క్రుశించిపోతున్న దిగువజాతుల మాటేమిటి ?'17

ఈ విమర్శ పరోక్షంగా తన తండ్రిగారికి కూడా వర్తిస్తుంది ఆంధ్రలో తన తండ్రి గారు నిర్వహించిన ఉద్యమం లక్ష్యాన్ని చేరలేక పోయిందని అరమరికలు లేకుండా గోపీచంద్ చెప్పగలిగాడు.

సాహిత్య భాషకు సంబంధించిన అవగాహన గోపీచంద్ వ్యక్తిత్వంలో ఒక భాగమే గోపీచంద్ కలం పట్టిన నాటికి (1928) 'మాలపల్లి' నవల వెలువడి ఆరు సంవత్సరాలే అయింది. వ్యావహారిక భాషలో వెలువడుతున్న కథలు, నవలలు జనాదరణ పొందుతున్నాయి. అయినా, అనేకులు గ్రాంధికం లోనే వ్రాస్తున్నారు. కవిరాజు గారు సాంఘికంగా మార్పును కోరేవారే అయినా గ్రాంథిక భాషలోనే వ్రాస్తున్నారు. గోపీచంద్ మాత్రం భాష విషయంలో తండ్రి ప్రభావానికి లోనుకాలేదు.

యుద్ధ కాలంలో వ్రాసిన 'పీడకల' కథలో భాషను గూర్చి గోపీచంద్ తన అభిప్రాయాన్ని స్పష్టం చేశాడు.

'సాధారణంగా మన రచయితలు చెప్పవలసింది లేకపోవటం వల్లో తాము చెప్పదలచింది లోకులకు తెలపకుండా ఉండటం మంచిదనో మొత్తానికి ఏ కారణం వల్లయితేనేం తమ బండారం బయలపడకుండా చేసుకోవటానిగ్గాను పులుముడూ లోముడుతో పుస్తకాలు నింపుతున్నారు భావదారిద్ర్యంతోపాటు భాషా స్వరూపం కూడా తెలియని వాళ్లు ఎక్కువ అవటంవల్ల పెద్దపెద్ద సమాసాలూ, పెద్దపెద్ద మాటలూ గుప్పి పుస్తకాలను గజిబిజి చేస్తున్నారు.' అంటాడు కథలోని రచయిత.

తన సమకాలీన రచయితల మీద చేసిన ఈ విమర్శలో గోపీచంద్ 1. భావ దారిద్ర్యాన్ని 2. పెద పెద సమాసాలు. పెద్ద పెద్ద మాటలు గుప్పించి

టాన్ని ప్రస్తావించాడు. 'భావదారిద్ర్యం' అంటే సమకాలీన సాంఘిక అవగాహన లేకపోవటంగా గోపీచంద్ భావించాడు. భావదారిద్ర్యం ఉన్నప్పుడు సహజ శైలికి అవకాశం లేదు. రెండోది భాషకు సంబంధించింది. భావదారిద్ర్యాన్ని దాచుకోవటానికి పెద్దపెద్ద మాటలు, సమాసాలు ఒక ముసుగుగా తయారవుతాయి. వచనం కవిత్వం కంటే భిన్నమైందీ, కవిత్వం కంటే ప్రజలకు దగ్గరిదీ అన్న అవగాహనలేని వాళ్లు భావకవిత్వంలోని మాటలను, సమాసాలను హద్దుమీరి ఉపయోగించడాన్ని గోపీచంద్ ఖండించాడు. ఆయన విశ్వాసం ఆయన రచనల్లో ప్రతిబింబించింది.

కృష్ణా గుంటూరు జిల్లాల మధ్యతరగతి ప్రజల భాషలో గోపీచంద్ అసంఖ్యాకమైన రచనలు చేశాడు. ఇతర రచయితలతోపాటు, వ్యావహారిక భాషను శక్తిమంతమైన సాధనంగా రూపొందించటంలో గోపీచంద్ గణనీయమైన సేవచేశాడు

'స్త్రీ'పట్ల గోపీచంద్ భావాలను తెలుసుకోవటం అవసరం.

ఏ ఆధునిక రచయిత వ్యక్తిత్వాన్నైనా పరిశీలించే సమయంలో స్త్రీ పట్ల ఆ రచయిత భావాలను విధిగా పరిగణనలోనికి తీసుకోవలసి ఉంటుంది. మారుతున్న స్త్రీ జాతీయ పునరుజ్జీవనంలో ఒక ముఖ్యపాత్ర వహిస్తున్నది. స్త్రీకి శతాబ్దాల దాస్యం నుంచి, పారతంత్ర్యం నుంచి విముక్తి లభించాలనీ, కుటుంబంలోనూ సంఘంలోనూ గౌరవప్రదమైన స్థానం లభించాలనీ, క్రమక్రమంగా అన్ని రంగాలలో పురుషునితోపాటుగా సమాన స్థానాన్ని పొందాలనీ హృదయపూర్వకంగా కోరేవాడే ఆధునిక రచయిత

శతాబ్దం క్రితమే వీరేశలింగంపంతులుగారు స్త్రీ విద్యా వ్యాప్తికోసం వితంతు పునర్వివాహాలకోసం, పతితయువతీ రక్షణకోసం దీక్షతో, త్యాగనిరతితో, ధైర్యసాహసాలతో సాగించిన ఉద్యమం మన చరిత్రలో ఒక భాగమైంది. వారు ముందుచూపుతో రచించిన గ్రంథాలు నిర్వహించిన పత్రికలు18 స్త్రీలలో జాగృతినీ, యువకుల్లో ఆలోచననూ, రచయితల్లో కొత్త దృష్టినీ సృష్టించాయి.

చలం అగ్నిపర్వతం మించెత్తిన లావా మగవాడి ద్వంద్వప్రమాణా లను చుట్టుముట్టింది. ఉద్రేకపూరితమైన అతని భావాలు తరతరాల పురుషా హంకారాన్ని ప్రశ్నించాయి అతని ఆర్ద్ర విశాలహృదయం స్త్రీ మనసులోని గాయాలను స్పృశించింది. స్త్రీకి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించింది. స్త్రీకోసం అతడు నీతి అవినీతులతో సంబంధం లేని, విశృంఖల స్వేచ్ఛతో విరాజిల్లే ఒక వినూత్న సమాజాన్ని సృష్టించి ఇచ్చాడు

భావకవులు కూడా స్త్రీని చరణదాసి స్థానం నుంచి తప్పించి హృదయ సామ్రాజ్య పట్టమహిషిగా సంభావించారు.

గోపీచంద్ మీద చలం ప్రభావం లేదనే చెప్పవచ్చు. కాని, ఆ రోజుల్లో ఏ రచయిత దృష్టైనా, స్త్రీ సమస్యల మీదికి మళ్ళటానికి చలమే ప్రేరణను కలిగించాడు.

గోపీచంద్ కూడా చలం సాహిత్యాన్ని చదివి తన ప్రతిక్రియను 'వెంకటచలం పాత్ర'19 అన్న కథలో స్పష్టం చేశాడు. విశృంఖలస్వేచ్ఛ నిజమైన స్వేచ్ఛ కాదని, అది ఒక విధంగా సంఘానికి దూరంగా పోవటమే నని భావించాడు. చలం సమాజంలో 'పచ్చి మంచినీళ్ళు కూడ పుట్టవు' అని ఆ కథ ద్వారా తీవ్రస్థాయిలో తన నిరసనను ప్రకటించాడు.

దీన్నిబట్టి గోపీచంద్ వివాహ వ్యవస్థలో విప్లవాత్మకమైన మార్పులు కోరలేదని, కుటుంబ జీవితం సంక్షోభానికి గురికావటాన్ని ఇష్టపడలేదని తెలుస్తున్నది.

'సంపెంగపువ్వు'20 కథలో 'వచ్చే సంఘంలోని' స్త్రీని ఊహించాడు. తాను స్త్రీననే భావాన్ని 'ఆమె' జయించింది. 'ఆమె' స్త్రీ పురుష సమా నత్వాన్ని సంస్కారంగా రూపొందించుకోగలిగింది. నిజమైన ప్రేమ, అర మరికలులేని స్నేహభావం అన్న లక్షణాలు ఆధునిక దృక్పథంతో సమ్మి శ్రితమైనప్పుడు కొత్త స్త్రీ అవతరిస్తుందని ఈ అరుదైన పాత్ర ద్వారా గోపీచంద్ ఊహించినట్లు కనిపిస్తున్నది.

గోపీచంద్ నవలల్లోని స్త్రీ పాత్రల్లో ముందుగా గుర్తుకు వచ్చేది శమంతకమణీ 'ఉషారాణీ' కోటేశ్వరమ్మలు.

ప్రేమనూ స్వేచ్ఛా ప్రవృత్తినీ సమపాళ్ళలో కలిగిన స్త్రీ ఎదుర్కొనే సమస్యలకు 'పిల్లతెమ్మెర'లో కళాత్మక రూపమిచ్చాడు గోపీచంద్. ఆ స్త్రీ అమాయిక అయినప్పుడు, ముందుచూపు లేనిదైనప్పుడు పర్యవసానం విషాదాంతమే.

శమంతకమణికి పెళ్ళి ఒక సమస్య కాలేదు ఆమెకు ఆర్థిక సమస్యా ఎదురుకాలేదు. ప్రత్యక్షంగా సంఘం నుంచి కూడా ఎలాంటి సమస్యా ఎదురు కాలేదు. కాని, వ్యక్తి నుంచి తాను ప్రేమించిన వ్యక్తి నుంచి సమస్య ఎదురైంది.

ఉషారాణి తెలివైన స్త్రీ. అక్రమ లైంగిక సౌఖ్యం ఆమెకు మానసికావసరమే. స్వేచ్ఛాప్రవృత్తి ఆమెలోని ఆధ్యాత్మిక తృష్ణ యొక్క విన్యాసంగా రచయిత చిత్రించాడు. ఆమెకు చక్రవర్తివల్ల ఎదురైన సమస్య చిన్నదేం కాదు. చివరకు శ్రీకాంత్‌వల్ల కూడా ఆమె సంఘర్షణకు లోనైంది. అయినా, ఈ సమస్యలను తన వ్యక్తిత్వంలో ఇముడ్చుకొని ముందుకు సాగగలిగింది. ఒక వ్యభిచారిణిని మహాయోగినిగా రూపొందించటం సాంఘిక నీతి దృష్ట్యా, సాంప్రదాయిక మత విశ్వాసాల దృష్ట్యా తిరుగుబాటే స్త్రీ వ్యక్తిత్వంపట్ల ఉన్న అచంచల విశ్వాసమే గోపీచంద్ కల్పనకు ఆధారం.

అన్వేషణాశాలిని కోటేశ్వరమ్మ ఎదుర్కొన్న సమస్యలు ఒంటరితనం, ప్రేమరాహిత్యం, డబ్బు పలుకుబడీ జీవితంలో ఆమెకొక స్థానాన్ని ఇవ్వలేక పోవటంతో కొత్త లక్ష్యంకోసం ఆరాటపడింది. అన్వేషించింది. ఆ ప్రయత్నంలో శ్రీనివాసరావు బలికాక తప్పలేదు. స్నేహబంధంలో ఒంటరితనాన్ని ప్రేమ రాహిత్యాన్ని కొంత జయించగలిగినా మృత్యు వాంఛను మాత్రం జయించలేకపోయింది.

స్వాతంత్ర్యానంతరం సంఘంలో వస్తున్న మార్పులు స్త్రీ విద్య కొద్దిగా పెరగటం, నాలుగు గోడల మధ్యన ఉన్న స్త్రీ నలుగురిలోకి రాగలగటం,

పురుషునితో సమానంగా కాకపోయినా, తన స్థాయిలో సాంఘిక వ్యవస్థలోని రంగాలలో కృషి చేయటానికి పూనుకోవటం వంటివి పరోక్షంగా పై పాత్రలను ప్రభావితం చేశాయి.

ఈ పాత్రల మీద గోపీచంద్‌కు పూర్తి సానుభూతి ఉంది గోపీచంద్ వాళ్ళ పక్షమే వహించాడు. ఈ విషయంలో అనుమానం లేదు. కాని, భౌతిక పరిస్థితులపట్ల ఆయనకు అవిశ్వాసం ఏర్పడటంవల్ల తన పాత్రలను ఆ పరిధి నుంచి తప్పించటానికి వ్యక్తివాద వైఖరితో ఆయా పాత్రల సమస్యలను పరిష్కరించాడు.

ఈ దృష్టిని తప్పించుకున్న పాత్ర నిర్మలాదేవి నిర్మలాదేవి కాంక్షించిన స్వేచ్ఛ పై పాత్రల స్వేచ్ఛకంటే భిన్నమైంది. సాంఘిక వ్యక్తిత్వాన్ని సంతరించుకోవటానికే ఆమె వ్యవస్థలోని కట్టుబాట్లను అతిక్రమించింది.

గోపీచంద్ నవలల్లోని స్త్రీ పాత్రలలో ముఖ్యంగా—భార్యల పాత్రలు ఎంతో ఆత్మవిశ్వాసంతో ప్రవర్తిస్తాయి. వైవిధ్యం తగ్గటం శిల్పరీత్యా లోపమే. కాని, ఈ విశ్వాసం గోపీచంద్‌కు స్త్రీపట్ల ఉన్న విశ్వాసం కావటంవల్ల ఆయా పాత్రల చిత్రణ ఆ విధంగా సాగింది.

అనేక సందర్భాలలో గోపీచంద్ వివాహవ్యవస్థపట్ల అసహనాన్ని వ్యక్తం చేశాడు. స్త్రీకి అన్యాయం జరుగుతున్నదనే భావమే ఇందుకు ప్రధాన కారణం. వివాహ వ్యవస్థను గూర్చి చర్చించిన సందర్భాలలో గోపీచంద్ విదేశీయ సమాజాలను దృష్టిలో పెట్టుకున్నట్లున్నాడు. 'మెరుపుల మరకలు'లో కమలాకరం చేసిన చర్చ అంతర్జాతీయ స్థాయిలో ఉన్నట్లనిపిస్తుంది.21

'ఒక స్త్రీ ఇంట్లో నుంచి బయటకు అడుగుపెట్టి దానివల్ల వచ్చే కష్టాలను ఎదుర్కొని సాంఘిక జీవితంలో ప్రవేశించాలనుకోవటం ఉన్నతభావం. అటువంటి స్త్రీకి ఆసరాగా నిలవాలనుకోవటం అంతకన్నా ఉన్నత భావం.'22

'స్త్రీ పురుషులిద్దరికీ స్వాతంత్ర్యం వుండేటట్లు వివాహ వ్యవస్థను సరిదిద్దాలి. శృంగార విషయాలలో కూడా స్త్రీ ముందంజ వేసినా తప్పు అనుకో

కూడదు. ఆమె ఎప్పుడయినా కాలుజారినా పురుషునికి అమితమైన సానుభూతి వుండాలి.'23

ఇవి గోపీచంద్ అభిప్రాయాలు.

స్త్రీ సాంఘిక జీవితంలో భాగం కావాలని కోరటంలోనూ, పురుషునితో సమాన స్థాయిని పొందాలని ఆకాంక్షించటంలోనూ, ద్వంద్వ ప్రమాణాలతో కూడిన నీతి సూత్రాలలో ఆచరణాత్మకమైన మార్పు రావాలని ఆశించటం లోనూ గోపీచంద్ వ్యక్తిత్వంలోని అభ్యుదయ దృష్టి, ఆధునిక సంస్కారమూ వెల్లడవుతున్నాయి.

గోపీచంద్ తన నవలల్లో ప్రతిపాదించిన జీవిత దృక్పథం ఆయన వ్యక్తిత్వంలో ఒక భాగం.

గోపీచంద్ జీవిత దృక్పథమేమిటి ? అన్న ప్రశ్నకు సమాధానంకోసం వెతకటానికి పూనుకోగానే ఎదురయ్యే మరో ప్రశ్న జీవితమంటే ఏమిటి ? అన్నది. ఈ ప్రశ్న చిన్నదేం కాదు. జీవితమంత విశాలమైంది ఒక్క నిర్వచనంగానీ, ఒక్క సమాధానంగానీ ఉండటానికి వీలులేనిది కావటంవల్ల నిరంతరం వివాదాస్పదమైంది.

జీవితాన్ని వివేచించే దృక్పథాలు అనేకం, అనంతం. ఆధ్యాత్మిక విశ్వాసాలతో ముడిపెట్టి ఆలోచిస్తూ వచ్చిన తాత్త్వికులు జీవితమొక మానవా తీత శక్తి ప్రభావంవల్ల మానవానుభవంలోకి వస్తున్న విషయమని భావించారు. అందువల్ల "జీవితం" వ్యక్తావ్యక్త లక్షణాన్నీ మార్మికస్వభావాన్నీ సంతరించుకున్నది. జననమరణాలు ఆశ్చర్యార్థక ప్రశ్నలై జీవిత నిర్వచనంలో ప్రధాన పాత్రను వహిస్తూ వచ్చాయి ఆశానిరాశలు, సుఖదుఃఖాలు, జయాపజయాలు మొదలైనవి జీవిత విశ్లేషణలో ముఖ్యపాత్ర వహించినప్పుడు పరస్పర విరుద్ధాభిప్రాయాలుగానీ, వాటి సమన్వయంగానీ చోటుచేసుకోవటం కూడా సహజమే.

జగత్తు మిథ్య అన్నప్పుడు, జీవితం కూడా మిథ్యకాక తప్పదు.

"Stop and consider life is but a day"24 అన్నప్పుడు జీవితం క్షణభంగురమనే నిస్పృహ కలుగుతుంది. 'చివరకు మిగిలేది' నవల చివర దయానిధి ఒక ఖాళీ కవరును అందుకుంటాడు 25 జీవితం శూన్యమని వైకుంఠం అనే పాత్ర ఆ రూపంలో చేసిన వ్యాఖ్యానమది.

ఇవీ, ఇలాంటివీ మతభావాల ప్రేరణతోనో, వైయక్తిక అనుభవాల కారణంగానో పుట్టిన నిర్వచనాలు.

పందొమ్మిదవ శతాబ్దంలో వచ్చిన విప్లవాత్మకమైన మార్పుల మూలంగా భౌతికవాదం క్రమంగా అన్ని రంగాల్లోకి ప్రవేశించి బలమైన స్థానాన్ని ఆక్రమించటంతో, పాత విశ్వాసాలూ నిర్వచనాలూ, సిద్ధాంతాలూ, సూత్రాలూ సందేహాస్పదమయ్యాయి. పునరాలోచన ప్రారంభమైంది. ఈ పునరాలోచన ఫలితంగా కొత్త విశ్వాసాలూ, నిర్వచనాలూ, సిద్ధాంతాలూ, సూత్రాలూ ఆవిష్కృతమయ్యాయి. ఈ భౌతిక దృష్టికి సమష్టి ఆధారం. అందువల్ల జీవితమంటే, సంఘంలో అందరితోపాటు జీవించే వ్యక్తి జీవితమేననే అవగాహన ఊపిరిపోసుకున్నది. సామాజిక జీవితంలో వ్యక్తి జీవితం ఒక అంతర్భాగమనే విశ్వాసం రూపుదిద్దుకున్నది. రాజకీయార్థిక సాంఘికాది శక్తుల ప్రభావానికి లోనౌతూ తాను మారుతూ, సమాజాన్నీ వ్యక్తులనూ మారుస్తూ నిరంతర పరిణామశీలంతో ముందుకు సాగేదే జీవితమనే జీవన సూత్రం బలపడింది.

పాత వ్యవస్థలోని నియమాలు కొత్త వ్యవస్థలో రాజ్యమేలుతున్నప్పుడూ లేదా ఉన్న నియమాలు పాక్షికంగా ఉన్నప్పుడూ తిరుగుబాటు వైఖరీ, సంస్కరణవాద దృక్పథమూ సాంఘిక జీవితంలో సంఘర్షణను సృష్టిస్తాయి. ఈ సంఘర్షణ నుంచి కొత్త విలువలు పుట్టుకొస్తాయి

సాంఘిక జీవితం దృష్ట్యా అస్తిత్వంలోనికి వచ్చే నియమ నిబంధనలు, వ్యక్తి స్వేచ్ఛకు ఆటంకంగా పరిణమిస్తుంటాయి కనుక, కొందరు వ్యక్తులు తమ కనుకూలమైన విలువలను ప్రచారం చేస్తుంటారు.

జీవితమూ సాహిత్యమూ అవినాభావ సంబంధం కలవే అయినా, సాహిత్యంలోని జీవితం కల్పిత ప్రపంచానికి చెందింది కనుక, పై స్థాయిలో

ఉండాలనే ఉద్దేశం రచయితలకు ఉంటుంది. కాని, రానురాను వాస్తవికవాదం బలపడటంతో సాహిత్యం, ముఖ్యంగా వచన సాహిత్యం జీవితానికి సన్నిహితంగా రూపొందింది.

నిరాశకు నిస్పృహకు జీవితంలో చోటులేదని, ఎంతటి గంభీరమైన సమస్యనైనా పరిష్కరించుకొని క్రొత్త జీవితాన్ని ఆవిష్కరించుకోవాలని 'పరివర్తనం'లో గోపీచంద్ వ్యక్తంచేసిన దృక్పథం. వ్యక్తి జీవితం, సాంఘిక జీవితంలో ఒక భాగమనే విశ్వాసాన్ని ఈ నవల ద్వారా గోపీచంద్ ప్రకటించాడు.

సాంఘిక వ్యవస్థలో వచ్చే మార్పులు, వంశాధిక్యభావానికీ, ఆధునిక సంస్కారానికీ మధ్యన సంఘర్షణ కలిగినప్పుడు ఒక యువకుని జీవితం ఎలాంటి పరిణామం పొందగలదో 'అసమర్థుని జీవయాత్ర'లో చిత్రిస్తూ, వాస్తవ జీవితాచరణకు విరుద్ధమైన మానసిక జీవితం విషాదాంతం కాకతప్పదనే దృక్పథాన్ని గోపీచంద్ వ్యక్తంచేశాడు.

'శకుంతల లోకం' (ఆదర్శజీవులు)లో 'ఆర్థిక పరిస్థితి'కి కాక, మానవ సంస్కారానికి జీవితంలో బలమైన స్థానమున్నదని గోపీచంద్ ప్రతిపాదించాడు.

తర్వాతి నవలల్లో, వివాహ వ్యవస్థను ఉల్లంఘించిన స్త్రీ పాత్రలను సమర్థిస్తూ, వాళ్ళ స్వేచ్ఛాప్రవృత్తిని జీవితంలో వ్యక్తిత్వాన్ని సంతరించి పెట్టే జీవలక్షణంగా గోపీచంద్ గుర్తించాడు.

మతం వ్యక్తికి మాత్రమే పరిమితమైందనీ, మతాభిమానం దురభిమానంగా ప్రకోపిస్తే విషాదకర పరిణామాలు జీవితంలో చోటుచేసుకుంటాయని చెప్తూ, 'గతించనిగతం'లో మానవతా దృక్పథాన్ని వ్యక్తీకరిస్తాడు.

గోపీచంద్ వివిధ రచనల్లో చేసిన ముఖ్యమైన వ్యాఖ్యానాలు :

1. ''జీవితానికి పునాదే ఆశ జీవించటం అంటేనే ఆశపడటం.''26

2. "దేనికోసం బ్రతకటం అనే ప్రశ్న అర్థంలేని ప్రశ్న బ్రతకటమే ఆనందం."27

3. "జీవితంలో అన్ని అంశాలు ముఖ్యమైనవేననీ, బహుముఖాల జీవితానుభవాన్ని పొందిన మానవుడే సక్రమంగా అభివృద్ధి చెందుతాడనీ తెలుసుకోలేకపోయాను."28

4. "ఆలోచనాపరులు జీవితాన్ని తమ వైపుకి మలుపుకోవాలని చూస్తారు. కాని జీవితం అనేది అలా మలుపుకోటానికి వీలైందికాదు. ఈ సంగతి అనుభవం మీద మాత్రమే మానవుడు తెలుసుకోగలుగుతాడు. మొదట్లో జీవిత ప్రవాహంలోని ఏ బిందువునో చెదరగొట్టి, ఏ అలనో విరగగొట్టి జీవితాన్ని మనవైపు తిప్పుకుంటున్నాం అనుకుంటాం. కాని అది వొట్టి భ్రమ."29

5. 'సిద్ధాంత నిర్వచన, పార్టీ నిర్మాణం అనే గట్లను దాటి జీవితం ప్రవహిస్తూ వుంది.'30

6. "ఇప్పుడు మనం అనుకుంటున్నవి నైతిక విలువలు కావు. నిషేధ సూత్రాలు. నిషేధ బుద్ధితో జీవితాన్ని చూచిన ఏ వ్యక్తీ వికసించదు. జీవితాన్ని బహుభంగుల అనుభవించే వ్యక్తే సంపూర్ణతను పొందగలుగుతాడు."31

7. 'ఏదో ఒక నెపంతో జీవితం అందించే అందాలను ఆనందాలను ఒదులుకోవటం.... వెర్రి.'32

ఈ వ్యాఖ్యానాలన్నీ ఆయా పాత్రల ద్వారా గోపీచంద్ చేసినవే. వీటిలో మూడు అంశాలు కనిపిస్తున్నాయి.

i) జీవితాన్ని సిద్ధాంతాలతో కొలవటానికి యత్నించటం వల్ల వ్యక్తి పరిధి సంకుచితమౌతుంది.

ii) జీవితం నిర్వచనాతీతమైంది.

III) జీవితంలోని ఏ అంశాన్నీ తృణీకరించకుండా అనుభవించాలి.

గోపీచంద్ జీవితం ఎందుకు? అని ప్రశ్నించటం తప్పు అనే నిర్ధారణకు వచ్చాడు. ఇందుకు ముఖ్యమైన కారణం, హేతువాదంపట్ల అతనికి కలిగిన అవిశ్వాసమే. సిద్ధాంతాలతో జీవితాన్ని అర్థం చేసుకొని, ముందుకు సాగే సంకల్పాన్నీ, యత్నాన్నీ అతడు నిరసించాడు. కేశవమూర్తి ద్వారా చెప్పించిన మాటల్నిబట్టి చూస్తే, అతనికి మార్క్సిజం మీద కలిగిన అవిశ్వాసమే ఇందుకు కారణమనిపిస్తున్నది.

ఈ కారణాలవల్ల 'ఆశాజ్యోతి'లోని భర్త అభిప్రాయమే కొన్ని మార్పులతో బలపడుతూ వచ్చింది. నిర్లిప్త స్వభావం నుంచి పుట్టిన సుఖదుఃఖాతీత దృష్టిని ఆధ్యాత్మిక దృష్టితో కలిపి, జీవితం మానవాతీతమైందనే నిర్ధారణకు వచ్చాడు అంటే, మానవానుభవంలోకి వచ్చే జీవితమంతా **'అతీతశక్తి'** ప్రసాదమేనని గాఢంగా నమ్మాడు.

అందువల్ల ఏ అనుభవాన్నీ తృణీకరించకూడదనే అభిప్రాయాన్ని కూడా వ్యక్తంచేశాడు. ఈ వివేచనలో ద్వంద్వాల మధ్యన సమన్వయం సాధించినప్పుడే సమగ్రత సాధ్యమని చెప్పే అరవిందుని ప్రభావం కొంత కనిపిస్తుంది.

అయితే, గోపీకృష్ణ మాటలు అధ్యాత్మిక దృష్టితో కూడినవి కావు. 'బహుభంగుల అనుభవించటం' అన్నది సుఖవాది33 నినాదమే. స్వేచ్ఛకోసమో, వ్యక్తిత్వాన్ని సంతరించుకోవటానికోకాక, సౌఖ్యాలను అనుభవించటానికే నీతినియమాలను ఉల్లంఘించాలనే ధోరణినే గోపీకృష్ణ ప్రదర్శించాడు. నీతినియమాలను ఉల్లంఘించటంవల్లనే వ్యక్తిత్వమూ విలువలూ చేకూరుతాయనటం వివాదాస్పద ప్రతిపాదనే. గోపీకృష్ణ ముదిరితే జయరామారావు అయ్యే అవకాశం లేకపోలేదు. గోపీచంద్ వ్యక్తీకరించిన ఈ భావానికి కొంతవరకు చలనచిత్ర రంగం కారణమనిపిస్తున్నది.

మొత్తం మీద, 'జీవితాల పునాదే ఆశ' అన్న అభిప్రాయంలో నడ

లింపు వచ్చినా, జీవితం వ్యర్థమైందనే భావాన్ని గోపీచంద్ వ్యక్తంచేయ లేదు.

అందుకే___

'షోపనార్‌కి నిరాశా తత్వం, సత్యం దుష్టమైనదని భావించటంవల్ల వచ్చినట్లు కనిపిస్తుంది. సత్యం దుష్టమైనదనుకోవటం అర్థంలేని పని'34 అంటూ నిరాశావాదాన్ని ఖండించగలిగాడు.

'నాకు జీవితం మీద ఆశైతే వుంది గాని, తెలివిగా బ్రతకటం చేత కాదు.'35 అని ఆధ్యాత్మికవాదిగా మారిన తర్వాత కూడా చెప్పగలిగాడు.

గోపీచంద్‌లో వచ్చిన పరిణామం అతని జీవిత దృక్పథంలో కూడా ప్రతిబింబించిందని ఈ పరిశీలన వల్ల స్పష్టమౌతున్నది.

నిరాశావాది కాడు కనుకనే గోపీచంద్ మానవతావాది కాగలిగాడు. భౌతికవాదం నుంచి, ఆధ్యాత్మికవాదంవైపు, ఆర్థిక దృక్పథం నుంచి మానవ సంస్కారంవైపు, సాంఘిక జీవితం నుంచి మానవ జీవితం వైపు పయనిం చినా, మజిలీ నుంచి మజిలీకి మకాం మార్చినా మరచిపోకుండా గోపీచంద్ తన హృదయంలో పదిలంగా దాచుకున్న విలువ మానవత్వం.

గోపీచంద్ నమ్మిన ప్రతి ఆదర్శంలోనూ మానవత్వం అంతస్సూత్రంగా ఉంటూనే ఉన్నది. అందుకే, గోపీచంద్ వేసిన ప్రతి అడుగు మానవత్వపు పూదోటవైపే పడింది తప్ప నిరాశావాదపు మరుభూమివైపు కాదు.

అతడు కొన్ని వాదాలను నిరాకరించాడు. కాని మనిషిని నిరాకరించ లేదు. కొన్ని తత్త్వాలను సందేహించాడు. కాని మానవత్వాన్ని సందేహించ లేదు.

అందుకే, తప్పులు చేసిన పాత్రలపట్ల అపారమైన సానుభూతిని కన బరిచాడు. బాధలకు, కష్టాలకు గురైన పాత్రల దుఃఖంలో పాలుపంచు కున్నాడు.

నవల ప్రారంభంలోనే గోపీచంద్ సీతారామారావు 'పతనానికి జాలి' పడ్డాడు. అతడు ఒక్కొక్క అడుగూ మృత్యుముఖంవైపు వేస్తుంటే రామయ్య తాత ద్వారా కాపాడుకోవాలని చివరి నిమిషం వరకు ప్రయత్నించాడు. సీతారామారావు హృదయం 'అగ్నిగుండం'గా మారినా, అతని మనసులో 'తేళ్ళూ జెర్రులూ' చోటుచేసుకున్నా, అతనిలోని మానవత్వానికి మాత్రం మబ్బుపట్టలేదు.

ఉన్మాదావస్థలోనే—

''నలుగురం కూడబలుక్కొని'' బ్రతుకుదామనీ, ''కలహాలూ రక్తపాతాలూ వద్దనీ'' ప్రాధేయపడతాడు. భోగంవాళ్ళ పేటకు వెళ్ళి వేశ్య అందరిలాంటి స్త్రీయేనని గుర్తిస్తాడు. 'గొర్రెలాంటి' ప్రజల పక్షం వహించి మోసం చేస్తున్న నాయకులను దూషిస్తాడు.

సీతారామారావును కాలం కాటేసింది. కష్టాల కత్తులు తూట్లుపొడిచాయి అతని మనస్తత్వమే ఉరితాడై ఊపిరి తీసింది. ఒక నిస్సహాయుణ్ణి, ఒక అమాయకుణ్ణి, ఒక ఒంటరివాణ్ణి ఇన్ని శక్తులు ఒక్కసారి చుట్టుముట్టి బలి తీసుకున్నట్లు చిత్రీకరించటం ద్వారా గోపీచంద్ 'అసమర్థుని జీవయాత్ర'ను మానవత్వపు వచన కావ్యంగా తీర్చిదిద్దాడు.

సీతారామారావు నవలలో చచ్చిపోయినా పాఠకులలోని మానవత్వాన్ని నిద్రలేపి, వాళ్ళ కన్నీళ్ళల్లో తిరిగి ప్రాణం పోసుకొని ఆధునిక తెలుగు నవలా సాహిత్యంలో చిరంజీవిగా రూపొందాడు.

ఆప్యాయతనూ, ఆత్మీయతనూ, మూటకట్టుకున్న మాటలలో, ప్రేమానురాగాలను ప్రకటించే చేష్టలలో, హృదయానుభూతులకు స్పందించి మైమరచిపోయే ఉద్రేకంతో శమంతకమణి అణువణువునా హృదయం ఉన్న పాత్రగా రూపొందింది. అందుకే, రామనాథమూ, మృణాళినీ, డ్యాన్సుమాష్టారూ, చివరకు కారు డ్రైవరూ శమంతకమణి పట్ల సానుభూతిని ప్రదర్శిస్తారు.

ఒక మానవతావాది మాత్రమే సృష్టించగల పాత్ర శమంతకమణి.

శచీంద్రుడు చేసిన ఆక్రందన, ప్రకటించిన పశ్చాత్తాపం ఆ హంతకునిపట్ల కూడా పాఠకులకు సానుభూతిని కలిగిస్తాయి.

ఒకవైపు ఆధ్యాత్మిక సముద్రంలో తేలిపోతూ కూడా గోపీచంద్ మధ్య తరగతి మనిషిని మరచిపోలేదు. జీవితపు పరమపదసోపానపటంలో దిక్కు తోచకుండా ఉన్న, ప్రభుత్వ యంత్రాంగపు కబంధ హస్తాలలో చిక్కుకొని విలవిలలాడుతున్న ఎన్జీవో నారాయణరావు జీవితాన్ని చిత్రించటానికి పూనుకున్నాడు. అతని కష్టసుఖాల్లో గోపీచంద్ తాదాత్మ్యం చెందుతాడు, అష్టను గర్భం రూపంలో వచ్చిపడ్డ జీవన్మరణ సమస్యను పరిష్కరించుకోవటానికి నారాయణరావు దంపతులు పడ్డ ఆరాటాన్ని, చేసిన పోరాటాన్ని గోపీచంద్ మానవతాదృష్టితో ఆవిష్కరించాడు

తెలుగు వచన సాహిత్యంలో గోపీచంద్ చరిత్రాత్మకమైన పాత్రను నిర్వహించాడు అసలాయన సాహిత్య రంగంలోనికి ప్రవేశించింది ఒక ప్రచారకుడుగా. మొదట్లో ఆయన ప్రచారం చేయదలచుకున్నవి తండ్రిగారి భావాలే కావచ్చు, కాని. తండ్రిగారి పద్ధతిలో కాదు. వ్యావహారిక భాషను తన వాహికగా ఎన్నుకోవటంలోనేమి, ఆ రోజుల్లో ప్రచారంలో ఉన్న 'కథానిక'ను స్వీకరించటంలోనేమి, భావకవిత్వం మీదా, అహేతుక భావజాలం మీదా భౌతికదృష్టితో దాడిచేయటంలోనేమి గోపీచంద్ ఆధునిక దృష్టిని ప్రదర్శించాడు. ఈ ఆధునిక దృష్టి మార్క్సిజంచేత ప్రభావితమైనందువల్ల, సమాజాన్ని విశ్లేషించి అర్థంచేసుకోవటానికి తోడ్పడింది. ఆయన ఆవేశ పూరిత రచనలు చేయటానికి ఈ దృష్టే అవసరమైన చైతన్యాన్ని అందించింది.

మొట్టమొదట ఆయన కథా రచయితగా స్థానం సంపాదించాడు. కొడవటిగంటి కుటుంబరావు కథల్లో జీవిత విశ్లేషణ ఎక్కువ, ఆవేశం తక్కువ. గోపీచంద్ కథల్లో ఈ రెండూ సమపాళ్ళలో చోటుచేసుకున్నాయి. ఒక్కోసారి ఉద్రేకంపాలే ఎక్కువగా కనిపిస్తుంది. ఈ ఉద్రేకం పాలుకు కారణం ఆయన కథల్లో కనిపించే వామపక్ష రాజకీయ భావాలే. ప్రయోగశీలత్వం అన్నది గోపీచంద్ కథల్లో కనిపించే రెండో అంశం కథానికా రంగంలో

ఆయన స్థానాన్ని పదికాలాలపాటు సుస్థిరపరచిన మూడో అంశం తాత్త్విక దృష్టి. ఈ దృష్టిని అతి చిన్న అంశం మీద కేంద్రీకరించినట్లుగానే, గంభీర సమస్య మీదా కేంద్రీకరించగలిగాడు. ఈ లక్షణం ఆయన కథల్లో నిగ్రహాన్ని సాధించటానికి తోడ్పడింది.

దాదాపుగా, రాజకీయావేశం తగ్గు ముఖం పట్టిన దశలోనే గోపీచంద్ నవలా ప్రపంచంలో అడుగుపెట్టాడు పదిహేనేళ్ళపాటు కథలు రాసిన అనుభవంతో నవలా సాహిత్యంలో స్థానం సంపాదించటానికి గోపీచంద్ పూనుకున్నాడు. నవలా రచయిత మెరుపులాగా మెరిసి వెళ్ళిపోయే పాత్రలనుకాక, నిలకడగా నిలిచిపోయే పాత్రలను సృష్టించవలసి వుంటుంది. సంభాషణలతోనే కాకుండా, సన్నివేశాలలోనూ, వ్యక్తిత్వాలలోనూ సంఘర్షణను సాధించవలసి ఉంటుంది. జీవితంలోని చిన్న భాగాన్ని కాక, పెద్ద భాగాన్ని చిత్రీకరించవలసి ఉంటుంది. జీవిత సమస్యలను సజీవంగా చర్చించవలసి ఉంటుంది· తాత్త్విక పరిష్కారాలను ప్రతిపాదించవలసి ఉంటుంది. గోపీచంద్ తన పరిధిలో ఈ బాధ్యతలను నిర్వహించాడు.

మొదటి నవల 'పరివర్తనం'తోనే గోపీచంద్‌కు నవలా ప్రపంచంలో స్థానం లభించింది. ఒక విరహవేదనాజీవి అంతరంగ జీవితానికీ అతడు వాస్తవంగా జీవించవలసి ఉన్న జీవితానికి మధ్యన చాలా విచిత్రమైన సమతౌల్యాన్ని సాధించటం ద్వారా ఈ స్థానాన్ని సాధించాడు. తనకు నచ్చని తత్త్వాన్ని ఓడించి, తన విశ్వాసాన్నే పాత్రలో 'పరివర్తన'గా రూపొందించటం ద్వారా సాధించాడు. ఇతివృత్త నిర్వహణలో శస్త్ర చికిత్సకుడు తీసుకునే జాగ్రత్తలను తీసుకోవటం ద్వారా, పర్వతారోహకుడు చూపించే పట్టుదలను ప్రదర్శించటం ద్వారా సాధించాడు. ఇంకా చెప్పాలంటే, సమకాలీన సాంఘిక మూల్యాలను ప్రచార ధోరణిలోకాక అనుభూతి సంపన్నమైన శిల్పంలో ప్రతిపాదించటం ద్వారా నవలా సాహిత్యంలో ఒక స్థానాన్ని సాధించాడు.

రెండో నవల 'అసమర్థుని జీవయాత్ర' తెలుగు సాహిత్యంలోనే ఒక గొప్ప సంఘటన. ఒక అరుదైన సన్నివేశం. ఆ నవల చదవటం ఒక అపూర్వానుభవం. వ్యక్తికీ అంతరంగానికీ, వ్యక్తికీ సమాజానికీ జరిగిన సంఘర్ష

ణను ఈ నవలలో అపూర్వమైన రీతిలో ప్రదర్శించిన గోపీచంద్ తన ముప్పై ఆరో ఏట నవలా సాహిత్యంలో సమున్నతమైన స్థానాన్ని సంపాదించాడు. గోపీచంద్‌కు ముందు రచయితలు తమ పాత్రలకు బాహిర జీవితమే ప్రధానంగా చిత్రించారు. కొన్ని సందర్భాలలో అంతరంగికంగ జీవితాన్ని కూడా సృష్టించారు. కాని, అంతరంగిక జీవితం కేవలం ఉపరితలంలో మాత్రమే చిత్రితమైంది. గోపీచంద్ నవలా సాహిత్యంలో ఉన్నత స్థానం సాధించటానికి ఒక కారణం ఏమిటంటే, మొదటిసారి ఒక పాత్రకు 'ఉపచేతన'తోపాటుగా 'అచేతన'ను కూడా సృష్టించగలగటం. అంతేకాదు అచేతనే ఆ నవలలో ప్రధాన భూమిక వహించగలగటంవల్ల కూడా తెలుగు నవల ఒక కొత్త కోణాన్ని సంతరించుకున్నది.

సీతారామారావు 1946 కు ముందు తెలుగు సృజనాత్మక సాహిత్యంలో లేడు ఆ తర్వాత, పరిస్థితులలో మార్పుల దృష్ట్యా ఉండటానికి వీలు లేదు. సమర్థుణ్ణి సృష్టించటం సులభం. అసమర్థుణ్ణి సృష్టించటం కష్టం. అసమర్థుణ్ణి సృష్టించే రచయిత సమర్థుడైతే తప్ప ఆ పాత్రకు అస్తిత్వం ఉండదు. ముప్పై ఎనిమిదేళ్ళ తర్వాత కూడా సీతారామారావును ఎవరూ మరచిపోలేదు. అతడు చచ్చి సాధించిపెట్టింది, గోపీచంద్‌కు సుస్థిరమైన స్థానమే.

'అసమర్థుని జీవయాత్ర' తర్వాత అంత గొప్ప నవలను గోపీచంద్ వ్రాయలేదన్నది నిర్వివాదమైన విషయం. తర్వాతి నవలలన్నీ గోపీచంద్ సంపాదించిన స్థానాన్ని నిలబెట్టటానికి ఉపకరించాయి గోపీచంద్ తనలో వచ్చిన పరిణామాన్ని అక్షరబద్ధం చేయటానికి ఆ నవలలను ఉపయోగించుకున్నాడు 'తాత్త్విక నవల' అన్నదేదీ ఆయన రాయకపోయినా, తాను నమ్మిన తత్త్వాన్ని చెప్పటానికి మాత్రం ఆయా పాత్రలను, పాత్రల సంభాషణలను కల్పించాడు ఆ పాత్రల చాటు నుంచి తానే తొంగిచూశాడు. తన స్వగతాలనే పాత్రల సంభాషణలుగా రూపొందించాడు. ఈ విధంగా తెలుగు నవలకు కొంత తాత్త్విక స్వభావం అబ్బింది.

ఈ ప్రయత్నం ద్వారా గోపీచంద్ మానవునిగా, జిజ్ఞాసువుగా, ఆలోచనాశీలిగా తన నవలల్లో బహుముఖ వ్యక్తిత్వాన్ని ప్రదర్శించగలిగాడు.

మానవునిగా పాఠకులతో తాదాత్మ్యం చెందాడు. తద్వారా ఆ నవలల లోని 'సాహిత్యగుణం' బలపడింది జిజ్ఞాసువుగా పాఠకులలో ఆలోచనలను రేకెత్తించాడు. ఆ విధంగా వారి వ్యక్తిత్వ వికాసానికి తోడ్పడ్డాడు. ఆలోచనా శీలిగా తాత్త్విక స్థాయిలో ఆలోచించి నిత్యనూతన తత్త్వాలను ప్రతిపాదిం చాడు. ఇందువల్ల ఒకస్థాయి ఉన్న రచయితగా తన స్థానాన్ని పదిలపరచు కున్నాడు.

ఒక చారిత్రక సంధిదశలో భావకవిత్వాన్ని నిరసించి అభ్యుదయ చైతన్య దీపం ఆరిపోకుండా నిర్నిద్ర చైతన్యంతో కృషి చేసిన వచన రచ యిత గోపీచంద్.

చలం బలపరచిన వాస్తవికతను, కొడవటిగంటి కుటుంబరావుగారితో పాటు ముందుకు తీసుకపోయినవాడు గోపీచంద్.

తెలుగు నవలా సాహిత్యకేదారంలోకి మనోవిజ్ఞాన శాస్త్రపు జీవనదిని మళ్లించి క్రొత్త పంట పండించినవాడు గోపీచంద్.

పాత్రల ద్వంద్వప్రవృత్తిని ఆవిష్కరించటంలో, చురుకైన సంభా షణలను నడపటంలో సాటిలేని మేటి రచయిత గోపీచంద్.

అనేక రంగాలలో కృషిచేసి, వైవిధ్యంతో కూడిన అనుభవాన్ని సంపాదించి, ఆ అనుభవాలకు అక్షరరూపం ఇవ్వటానికి ఆరాటపడ్డ 'వేదనా జీవి' గోపీచంద్.

అందుకే—

'నేను ముఖ్యంగా రచయితను. రాజకీయాల్లో రచయితగానే చేరాను. సినిమాల్లో రచయితగానే చేరాను. ప్రభుత్వోద్యోగంలో రచయితగా చేరాను. దీన్నిబట్టి చూస్తే నాకు జరిగిన మార్పులన్నీ 'రచయిత' అనే ఆధారంమీదే జరిగినట్లు స్పష్టంగా కనిపిస్తుంది'.36 అని చెప్పుకున్నాడు.

అతని అంతరంగంలోని రచయితను ఏ రంగమూ కబళించలేక

పోయింది. ఏ ప్రలోభమూ మోసపుచ్చలేకపోయింది. ఏ వాదమూ జయించలేకపోయింది.

వీటన్నింటికీ గోపీచంద్‌ను అతీతంగా ఉంచుతూ వచ్చిన శక్తి, నిరంతర పరిణామానికి అతణ్ణి గురిచేసిన శక్తి, అతనిలోని అరుదైన, అపురూపమైన, నిత్యనూతనమైన అన్వేషణాశీలం.

ఈ అన్వేషణాశీలమే గోపీచంద్‌లో జ్ఞానతృష్ణను పెంచింది. వాదోపవాదాల్లో సృజనాత్మక సాహిత్య దృష్టిలో, జీవితానుభవాల వివేచనలో, తాత్త్విక గ్రంథాల అధ్యయనంలో గోపీచంద్‌ను నడిపించిన శక్తి. అతనిలోని అన్వేషణాశీలమే.

గోపీచంద్ వివరించినట్లుగా—

'ఈ అన్వేషణ ఎందుకు? అనే ప్రశ్న ఉదయించటం స్వాభావికమే! ఆలోచించిచూస్తే ఈ అన్వేషణలో ఏదో ఆనందం వున్నట్లు గోచరిస్తుంది పైగా పూర్తిగా ఎప్పుడూ తెలియకపోయినా, ఎప్పటికప్పుడు కొంత తెలుస్తూనే వుంది. మనం అనుసరించే మార్గంలోనే గమ్యస్థానం మిళితమైవున్నట్టు కనిపిస్తూంది. అందుకనే ఈ అన్వేషణ ముగియబోనిదేగాక, వేసటే లేనిది'37

ఎప్పటికప్పుడు తాను నమ్మిందే సత్యమని, తాను చేరిందే గమ్యమని విశ్వసిస్తూ సాగించిన అన్వేషణ గోపీచంద్‌ది. నమ్మినంతసేపూ సంతృప్తి, నమ్మకం సడలటం ప్రారంభం కాగానే అసంతృప్తి. కొత్త భావంకోసం. సరికొత్త వాదంకోసం అన్వేషణ.

ఈ విధంగా వాదాలతో వివాదపడుతూ, తత్త్వాలతో దాగుడుమూతలాడుతూ, సంతృప్తిలోనూ అసంతృప్తిలోనూ ఆనందాన్నే అనుభవిస్తూ గోపీచంద్ జీవయాత్ర సాగించాడు.

ఆర్. ఎస్. సుదర్శనంగారన్నట్లు—

'సాహిత్య వ్యవసాయమూ, సత్యాన్వేషణమూ జీవితంలో ఒకటైన రచయిత గోపీచంద్' 38

తన సాహిత్యంలో గోపీచంద్ ఒక అనంత యాత్రికుడు. అతడు ఒంటరి యాత్రికుడు కాదు. పాఠకులను తన వెంట తీసుకువెళ్ళే యాత్రికుడు ''ఎందుక''ని ప్రశ్నిస్తూ, ప్రశ్నించుకుంటూ, పరుగులాంటి నడకతో 'యాత్ర'ను ప్రారంభిస్తాడు. గోపీచంద్ చూపు బాటమీదా ఆ బాటలో 'మిళితమైవున్న' గమ్యం మీదా ఉంటుంది. కాని, గమ్యమే సర్వస్వమైనట్లు కనిపించడు. అతనికి ఆకలిదప్పులున్నాయి. పిల్లగాలులు వీస్తే సేదదీర్చుకోవాలని ఉంటుంది. మంచి ప్రకృతి దృశ్యం కనిపిస్తే మైమరచిపోతాడు. ఎర్రజెండాల ఊరేగింపు ఎదురైతే ఊపిరి బిగబట్టి చూస్తాడు. తోవలో అనాథో, ముసలమ్మో కనిపిస్తే, వాళ్ళ పాత గాథల్ని తవ్వి కంటతడి పెడతాడు. పల్లెటూరు తగిలిందా పసివాడై పోతాడు. గుడుల ఆశ్రమాల ఆచూకీ తెలిస్తే చాలు తోవ చుట్టయినా, ఎన్ని అడ్డంకులు ఎదురైనా వెళ్తాడు. కొంత కాలం అదే గమ్యమనుకుంటాడు. కాని, అక్కడే ఆగిపోడు. మళ్ళీ యాత్రను కొనసాగిస్తాడు, వెనకా ముందూ చూసుకుంటూ.

కొత్తకూ పాతకూ మధ్యన, విచికిత్సకూ విశ్వాసానికీ మధ్యన, జీవితానికీ సాహిత్యానికీ మధ్యన ఆధునిక సంస్కార బలంతో, నిత్యనూతన అన్వేషణాశీలంతో సృజనాత్మక సమన్వయాన్ని సాధించిన నవలా రచయిత గోపీచంద్.

## సూచికలు

### తొమ్మిదవ ప్రకరణం
### వ్యక్తిత్వం

1. గోపీచంద్ కటువుగా మాట్లాడేవాడనీ, ఎదుటివారిని వ్యంగ్యబాణాలతో ఎత్తిపొడిచేవాడని ఆయన మిత్రులు కొందరు చెప్పారు.
2 'పరివర్తనం' పీఠిక
3 'Parthenogenesis is the development of the female cell (egg) without the act of fertilization by the male cell (Sperm)'

—'Zoology' Vol. III. P. 53, Prof. Narasimha Rao and T.V. Sivasastry.

4. పరివర్తనం' పీఠిక.
5. 'పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా', పుట 129.
6. దాశరథి గారి 'నవమి'కి గోపీచంద్ వ్రాసిన 'పరిచయం'లో
7. 'పరివర్తనం' పీఠిక.
8. 'మెరుపుల మరకలు' పుట 205.
9 'నవమి'కి రాసిన 'పరిచయం'లో
10. 'భార్యల్లోనే వుంది కథల సంపుటి.
11. పో చె ఉ. పుట. 111
12. పం. ప. వీ పుటలు 149, 150 (కేశవమూర్తి సినిమామిత్రుని మాటలు)
13 'కమ్యూనిజం' పట్ల మిగిలి ఉన్న సద్భావం గోపీచంద్‌కు కమ్యూనిస్టుల మీద లేదు.
14 పో.చె.ఉ. పుటలు 20, 21
15 'తత్వమసి' నాటికల సంపుటి
16. పో.చె.ఉ. 'అతికిన ఉత్తరం'.

17. 'చీకటిగదులు' పుట. 108.
18. వీరేశలింగం పంతులుగారు స్త్రీలకోసం ప్రత్యేకంగా 'సతిహిత బోధిని' అన్న పత్రికను 1883లో ప్రారంభించాడు.
—'వీరేశలింగం పంతులు' సమగ్ర పరిశీలన పుట. 405, డా॥ అక్కిరాజు రమాపతిరావు.
19, 20. 'గీతాపారాయణం' కథల సంపుటి.
21. చూ. ఈ సిద్ధాంత వ్యాసం పుట. 105.
22. 'పిల్లతెమ్మెర' పుట 21
23 'మెరుపుల మరకలు' పుట. 184
24. 'Sleep and Poetry', Keats
25. 'చివరకు మిగిలేది', రెండవ భాగం, పుట. 210
26. 'ఆశాజ్యోతి' కథలో భార్య మాటలు
27. Ibid, భర్త మాటలు
28. 'చీకటిగదులు' పుట 383 కృష్ణస్వామి మాటలు
29. Ibid, పుట. 421, దమయంతి మాటలు
30. పం. ప పి. పుట, 97 కేశవమూర్తి మాటలు
31 'యమపాశం', పుటలు 64, 65 గోపీకృష్ణ మాటలు
32. 'ప్రేమోపహాతులు' పుట. 125 జయరామారావు మాటలు
33 Hedonist Hedonism the ethical theory which based on the assumption that personal pleasure in the standard for human behaviour and conduct.
—Dictionary of Psycholegy, p. 122.
34. 'గోపీచంద్ వ్యాసాలు' మొ భా పుట 332
35. 'పో.చె ఉ' 'చిత్రజల్లు'.
36. 'పో.చె.ఉ 'చిత్రజల్లు'.
37. 'గోపీచంద్ వ్యాసాలు', మొ.భా. పీఠిక
38. 'సాహిత్యంలో దృక్పథాలు', పుట. 144

# ఉపయుక్త గ్రంథసూచి

తెలుగు


1 "అమీనా" చలం, యం. శేషాచలం అండ్ కం.,
సికింద్రాబాద్ (1969)

2. 'అరుణ'. చలం, యం. శేషాచలం అండ్ కం., సికింద్రాబాద్ (1971)

3. అపసామాన్య మనోవిజ్ఞానము'. శ్రీమతి జి భారతి, కుమారి శైలజ,
తెలుగు అకాడమి, హైదరాబాద్, (1973).

4. 'అల్పజీవి', రాచకొండ విశ్వనాథశాస్త్రి, విజయా బుక్స్,
విజయవాడ, (1981).

5. 'అసమర్థుని జీవయాత్ర', గోపీచంద్, డీలక్స్ పబ్లికేషన్స్,
విజయవాడ, (1981).

6. 'ఆంధ్ర కవితా సమీక్ష', కాకర్ల వేంకటరామనరసింహం.
గంగాధర పబ్లికేషన్స్, విజయవాడ, (1984).

7. ఆంధ్రప్రదేశ్ దర్శిని', ఏటుకూరి బలరామమూర్తి,
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌజ్, విజయవాడ, (1976).

8. 'ఆంధ్రలో స్వాతంత్ర్య సమరము', ఆచార్య మామిడిపూడి వెంకట
రంగయ్య, యన్. ఇన్నయ్య, సాంస్కృతిక వ్యవహారాలశాఖ,
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం (1972).

9 'ఆంధ్ర నవలా పరిణామము'. డా. బి వి. కుటుంబరావు,
గాయత్రీ ప్రచురణ, హైదరాబాదు-44, (1971).

10. 'ఆధునికాంధ్ర కవిత్వము. డా. సి నారాయణరెడ్డి, ఆంధ్రప్రదేశ్
సంప్రదాయములు, ప్రయోగములు : బుక్ డిస్ట్రిబ్యూటర్స్,
సికింద్రాబాద్, (1967).

11 'ఇది తులసి వనం', లత, శ్రీ దుర్గా బుక్ సెంటర్, విజయవాడ, (1976).

12 'ఉన్నవవచనలు కొన్ని', సంకలనం : కె. వి. రమణారెడ్డి, సొసయిటీ ఫర్ సోషల్ చేంజ్, కావలి, (1979).

13. 'ఉభయకుశలోపరి', గోపీచంద్, దేశి కవితా మండలి, విజయవాడ, (1956).

14. 'ఎం. ఎన్. రాయ్ : భారత కమ్యూనిజం', రావిపూడి వెంకటాద్రి ప్రజాస్వామ్య ప్రచురణలు, తెనాలి, (1983).

15. 'కవిరాజు జీవితం-సాహిత్యం', త్రిపురనేని సుబ్బారావు, కవిరాజ సాహితీ సదనం, హైదరాబాద్-24, (1964).

16. 'కావ్యజగత్తు', జి. వి. కృష్ణారావు, సూతాశ్రమ గ్రంథమాల, తెనాలి, (1944).

17. 'కుటుంబరావు సాహిత్యం', మొదటి సంపుటం (1982), మూడవ సంపుటం (1982), ఐదవ సంపుటం (1983), విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌజ్, విజయవాడ

18. 'కూపస్థ మండూక్యం', గోపీచంద్, నవజ్యోతి పబ్లికేషన్స్. విజయవాడ, (1971).

19. 'క్రొత్త నిబంధన కీర్తనలు', బైబిలు సొసైటీ ఆఫ్ ఇండియా, బెంగుళూరు, (1980)

20 'గడియపడని తలుపులు', గోపీచంద్, యం. శేషాచలం అండ్ కం సికింద్రాబాదు, (1971).

21. 'గణపతి', చిలకమర్తి

22. 'గతించనిగతం', గోపీచంద్, యం. శేషాచలం అండ్ కం. సికింద్రాబాదు, (1971).

23. 'గతితార్కిక భౌతికవాదం, చారిత్రక భౌతికవాదం', మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతం, ప్రగతి ప్రచురణాలయం, మాస్కో, (1980)

24. 'గతితార్కిక చారిత్రిక భౌతికవాదం', 'స్టాలిన్',
క్రాంతి ప్రచురణలు, సికింద్రాబాదు, (1981).

25. 'గీతాపారాయణం', గోపీచంద్' నవజ్యోతి, పబ్లికేషన్స్,
విజయవాడ, (1971).

26. 'గోపీచంద్', త్రిపురనేని సుబ్బారావు

27. 'గోపీచంద్ వ్యాసాలు-I', దేశి కవితా మండలి, విజయవాడ, (1959).

28. 'గోపీచంద్ వ్యాసాలు-II' విజయవాడ, (1960)

29. 'గోపీచంద్ స్మారక సంచిక , గోపీచంద్ సంస్మరణ కార్యక్రమ
సంఘం, (1963).

30. 'ఖూనీ', కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి,
సరళా పబ్లికేషన్స్, తెనాలి.

31. 'చదువు', కొడవటిగంటి కుటుంబరావు,
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌజ్, విజయవాడ, (1982).

32. 'చివరకు మిగిలేది', బుచ్చిబాబు, మొదటి భాగం, రెండవ భాగం,
యం. శేషాచలం అండ్ కం., సికింద్రాబాదు, (1970).

33. 'చీకటిగదులు', గోపీచంద్, నవోదయ పబ్లిషర్స్, విజయవాడ.

34. 'చీకటినీడలు', బైరాగి, ఎ. బి. సి. ప్రచురణలు,
హైదరాబాదు, (1978)

35. 'జనానా', గోపీచంద్, నవజ్యోతి పబ్లికేషన్స్,
విజయవాడ, (1971)

36. 'జీవితాదర్శం', చలం, ఎం శేషాచలం అండ్ కం.,
సికింద్రాబాదు, (1968).

37. 'జులై 30', (రావిశాస్త్రిగారికి పుట్టినరోజు కానుక), (1982).

38. 'తండ్రులు, కొడుకులు', గోపీచంద్, నవజ్యోతి పబ్లికేషన్స్, విజయవాడ, (1971).

39. 'తత్వమసి', గోపీచంద్ దేశీ ప్రచురణ.

40. 'తత్త్వశాస్త్రము-సామాన్య వివేచనము', డా. వి. నారాయణకరణ్ రెడ్డి ఎన్. ఇన్నయ్య, తెలుగు అకాడమి, హైదరాబాదు, (1971).

41. 'తరతరాల భారత చరిత్ర', రొమిల్లా థాపర్, అనువాదం: 'సహవాసి' హైదరాబాదు బుక్ట్రస్ట్, హైదరాబాదు–29, (1971).

42. 'తాకట్టులో భారతదేశం', తరిమెల నాగిరెడ్డి, 'తరిమెల నాగిరెడ్డి మెమోరియల్ ట్రస్టు' అనంతపురం, (1980).

43. 'తెలుగు కథానిక : స్వరూప స్వభావాలు' డా. పోరంకి దక్షిణామూర్తి, (1988)

44 'తెలుగు నవల-నూరు సంవత్సరాలు', ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, (1973).

45. 'తెలుగు నవలా వికాసము', మొదలి నాగభూషణశర్మ (1971).

46 'తెలుగు నవలా సాహిత్యంలో మనోవిశ్లేషణ', కోడూరి శ్రీరామమూర్తి కిరణ్ కిశోర్ పబ్లికేషన్స్, బొబ్బిలి, (1979).

47. 'తెలుగుసాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము' డా. కొత్తపల్లి వీరభద్రరావు.

48. 'దేవుని జీవితం', గోపీచంద్, నవజ్యోతి పబ్లికెషన్స్, విజయవాడ, (1971).

49. 'దేశం ఏమయ్యేట్టు', ,, ,,

50. 'ధర్మ అనుపత్రి' ,, ,,

51. 'నవమి', దాశరథి, దాచేపల్లి కిష్టయ్య అండ్ సన్స్, సికింద్రాబాదు, (1961).

52. నారాయణరావు', అడవి బాపిరాజు.

53. 'నూతిలో గొంతుకలు', బైరాగి, ఎ. బి సి. ప్రచురణలు, హైదరాబాదు (1978).

54. 'పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా', గోపీచంద్, నవోదయ పబ్లిషర్స్, విజయవాడ, (1971).

55. 'పట్టాభిగారి సోషలిజం', గోపీచంద్, రాడికల్ పబ్లికేషన్స్, బెజవాడ, (1938).

56 'పరివర్తనం' గోపీచంద్, గోపీచంద్ పబ్లికేషన్స్, హైదరాబాదు, (1966).

57. 'పాతపగలు-కొత్తవగలు'; గోపీచంద్, నవజ్యోతి పబ్లికేషన్స్, విజయవాడ, (1971).

58. 'పిల్లతెమ్మెర', నవలిక గోపీచంద్, నవోదయ పబ్లిషర్స్, విజయవాడ (1961).

59. 'పోస్టు చెయ్యని ఉత్తరాలు', గోపీచంద్, దేశికవితామండలి, విజయవాడ (1955).

60 ప్రజల మనిషి—ఒక పరిచయము', వరవరరావు, యుగ ప్రచురణలు హైదరాబాదు.

61. 'ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం-దాని పరిణామం', చంద్ర పుల్లారెడ్డి, మానికొండ సుబ్బారావు, విమోచన ప్రచురణలు, హైదరాబాదు(1979).

62. 'ప్రేమోపహతులు', గోపీచంద్, యం. శేషాచలం అండ్ కం. సికింద్రాబాదు, (1971).

63. 'భగవద్గీత', కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి, సరళా పబ్లికేషన్స్, తెనాలి.

64. భయస్థుడు, మాక్సింగోర్కీ, అనువాదం. రెంటాల గోపాలకృష్ణ.

65. 'భారత కార్మికోద్యమ చరిత్ర', సుకుమల్ సేన్, అనువాదం : హనుమంతరావు, ధనంజయరావు, ప్రజాశక్తి బుక్ హౌజ్, విజయవాడ, (1982).

66 'భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర'-III, ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య, (1977).

67. 'భారతీయ తత్త్వశాస్త్రము', ఏటుకూరి బలరామమూర్తి విశాలాంధ్ర పబ్లికేషన్స్, విజయవాడ (1971).

68. 'భారతీయ దర్శనము'. ఎమ్. రాజగోపాలరావు, డా॥ పి.సి. సుబ్బమ్మ, తెలుగు అకాడమి, హైదరాబాదు, (1977).

69. 'భార్యల్లోనే వుంది', గోపీచంద్, నవజ్యోతి పబ్లికేషన్స్, విజయవాడ, (1971).

70. 'మహాలి', 'యువభారతి', సికింద్రాబాదు (1972).

71. 'మంచాల', గోపీచంద్, దేశికవితామండలి, విజయవాడ (1960).

72. 'మాకూ వున్నాయి స్వగతాలు', గోపీచంద్, నవజ్యోతి పబ్లికేషన్స్, విజయవాడ, (1971).

73. 'మాలపల్లి', ఉన్నవ లక్ష్మీనారాయణ.

74. 'మాలపల్లి నవలపై ప్రభుత్వ నిషేధాలు', బంగోరె, (1979).

75. 'మెరుపుల మరకలు', గోపీచంద్, దీప్తి కన్సరన్స్, వరంగల్, (1961).

76. 'మైదానం', చలం

77. 'యం యన్. రాయ్ వ్యాసాలు', అను. కె. రాధాకృష్ణమూర్తి ప్రజా సాహిత్య పరిషత్తు, తెనాలి (1962).

78. 'యం యన్. రాయ్ స్వీయ గాథలు, బి.యస్.యల్. హనుమంతరావు, ప్రజాసాహిత్య పరిషత్తు, తెనాలి, (1965).

79. 'యమపాశం', గోపీచంద్, నవోదయ పబ్లిషర్స్, విజయవాడ,(1966).

80 'యోగసూత్ర సిద్ధాంతము', టంగుటూరి ప్రకాశం, 'శిల్పి', మదరాసు, (1948).

81. 'రచయితగా గోపీచంద్', గోనేపూడి రాజారావు.

82. 'రష్యాలో విప్లవ దినాలు', అల్బర్ట్ రీస్ విలియమ్స్, ప్రగతి ప్రచురణాలయం, (మాస్కో).

83. 'లోవెలుగులు', గోపీచంద్, దేశికవితా మండలి విజయవాడ, (1958).

84. 'వీరతెలంగాణా నా అనుభవాలు—జ్ఞాపకాలు', రావి నారాయణరెడ్డి కమ్యూనిస్టు పార్టీ ప్రచురణ (1976).

85. వీరతెలంగాణా విప్లవ పోరాటం-గుణపాఠాలు, సుందరయ్య, (1973).

86. 'వీరేశలింగం పంతులు : సమగ్ర పరిశీలన, డా. అక్కిరాజు రమాపతిరావు, విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ, (1972).

87. 'వేయిపడగలు', విశ్వనాథ సత్యనారాయణ.

88. 'శంబుకవధ', కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి, సరళా పబ్లికేషన్స్.

89. 'శిథిలాలయం', గోపీచంద్, దేశీబుక్ డిస్ట్రిబ్యూటర్స్, విజయవాడ (1979).

90. 'శ్రీ అరవిందులు', నవజాత, అను. డా. జె. మంగమ్మ, నేషనల్ బుక్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా, (1972).

91. 'సమాజము-సాహిత్యము', ఆర్.ఎస్. సుదర్శనం, చిత్తూరు జిల్లా రచయితల సహకార ప్రచురణ సంఘం, చిత్తూరు, (1972).

92. 'సరే కానివ్వండి', గోపీచంద్, నవజ్యోతి పబ్లికేషన్స్, విజయవాడ, ఫిబ్రవరి, (1971).

93. 'సాంఘిక మనోవిజ్ఞాన శాస్త్రము', డా. ఎన్. యాదగిరి రెడ్డి, డా. ఎస్. చంద్రశేఖర శర్మ, తెలుగు అకాడమి, హైదరాబాద్, (1971).

94. 'సారస్వత వివేచన', రాచమల్లు రామచంద్రా రెడ్డి, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌజ్, విజయవాడ, (1976)

95. 'సాహిత్యంలో దృక్పథాలు', ఆర్ ఎస్. సుదర్శనం, నవోదయ పబ్లిషర్స్, విజయవాడ, 1968).

96. 'సాహిత్య ప్రయోజనం', కొడవగంటి కుటుంబరావు విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌజ్, (1980).

97. 'సాహిత్య నేపథ్యం', ఆర్.ఎస్. సుదర్శనం, (జనవరి, 1983).

98. 'సూతపురాణం', కవిరాజు రామస్వామి చౌదరి, సరళా పబ్లికేషన్స్, తెనాలి, (1971).

99. 'హిమబిందు', అడవి బాపిరాజు.

ఆంగ్లం .

1. 'Abnormal Psychology', James D. Page, Mcgraw-Hill Book Co, INC; Kogakusha Co. Ltd. Tokyo, (1947).
2. A Glossary of Literary terms, M. H. Abrams, The Macmillan Co. of India Ltd. Delhi, (1978).
3. 'An Introduction to the English novel'.
—Arnold kettle (1951).

4. 'An Introduction to the Study of Literature', William Henry Hudson, Kalyani Publishers, Ludhiana, (1973).
5 'A Reader's guide to literary terms' Karl Beckson, Arthur Ganz Thames and Hudson, London, (1961).
6. A short history of the English novel, Diana Neill, Collier Books, New york, (1964).
7 'A short history of the Indian National Congress,' M V. Ramana Rao, S. Chand and Co. Delhi, (1959).
8 'Aspects of the novel', E M. Forster, Oliver Stally Brass, Penguin Books, (1977).
9. 'Chamber's Twentieth Century Dictionary' Edited by A.M. Macdonald. OBE, B.A. (Oxon), Allied Pushihers, Private Limited, Bombay, (1978).
10. 'Colliers, Encyclopedia', Vol. 13, Macmillan Educational Corporation New York, (1979).
11. 'Contemporary Schools of Psychology', Robert S. Woodwarth, Methnen & Co. Ltd , 31, Essex street, London, W.C.Z., (1931).
12. 'Critical approaches to literature' David Daiches, Orient Longman, Bombay, (1956).
13. 'Dachepalli Standard Dictionary, K.V. Radha Krishnasastri, Dachepalli Kistaiah & Sons, Secunderabad, (1961).
14. 'Dictionary of Philosophy and Religion' W.L. Rease.
15. 'Dictionary of Psychology', Howard, C. Warren, Houghton Mifflin Co. (1962).
16. Encyclopedia of Psychology, Vol. I, Search Press, London.

17. English novel, B.R. Mullick.

18. E.M. Forster-A reassessment V.A. Shahane, Kitab-mahal (W.S D.) Pvt. Ltd , Allahabad, (1962).

19. Fifty years of modern India (1919-1969), Vijaya-dhar Mahajan, S. Chand and Co New Delhi, (1970).

20. Fight for freedom, N. G Ranga, S. Chand and Co New Delhi, (1968).

21. 'India, from Curzon to Nehru and after' Durgadas, Collins, St. Jame's Palace London, (1969).

22. 'International Encyclopedia of Social Sciences' Vol. 5, The macmillan Co. & The Free Press, New york, (1972).

23. 'International Encyclopedia of the Social Sciences' Vol. 9. (as above).

24. 'Mahayogi Sri Aurodindo, R R. Diwakar, Bhara-theeya Vidya Bhavan, Chowpathy, Bombay, (1962).

25. 'Modern Psychology (The Teachings of C.G. Jung) David Cox. Barnes & Noble, Inc New york, (1970).

26. 'New Introductory Lectures on Psychoanalysis' S. Frued, W.W. Norton & Co. New York, (1933).

27. 'New testament' Psalms, Proverbs, National Publi-shing Co, (1968).

28. 'Plainman and the novel', Roger Dataller.

29. 'Problems of neurosis', Alfred Adler, Cosmopolitan Book Co, New York, (1930).

30. 'Seven approaches to the novel' John Stephens, George G. Hannap and Co. London, (1972).

31 'Sociology of Knowledge', Karl Mannheim.

32. 'Shorter Oxford English dictionary on historical Principles '

33 Sri Aurobindo, Vol. 16 'The Supramental manifestations and other Writings '

34. Sri Aurobindo, Vol. 17, 'The hour of God and other Writings', Sri Aurobindo birth Centenary Library Pondicherry, (1972).

35. 'The human mind', S P. Adinarayana, Hutchinson's University Library, New york, (1950).

36. 'The new dictionary of Psychology' Philip Lawrence, Harriman, Philosophical Library, New York, (1947).

37 'The Encyclopedia Americana', Vol. 10.

38 The Life Divine, Sri Aurobindo,' Sri Aurobindo International University Centre, Pondicherry, (1955).

39. The Razor's edge, Somerset Maugham, Heron Books, London, (1967)

40. The novel, Elizabeth Drew, Dell Publishing Co INC. New York, (1969).

41. The novel and the people', Rolgh, Fox, Foreign languages Publishing house, Moscow, (1956).

42 'The novel today', Philip Hinderson

43. 'The treatise on the novel', Robert Liddell.

44 'What life should mean to you', Alfred Adler, Unwin Books, London.

45. 'World University Encyclopedia', Vol 8. Books, INC, New York, (1967).

46. 'World University Encyclopedia' Vol 9, 11 and 12

47. 'Zoology' Vol III, Prof. Narasimha Rao, T.V. Siva-sastry, Commercial Literature and Co. Guntur.

---

గమనిక : పుస్తకం కవర్ పేజీ చిరిగిపోయిన సందర్భాలలో రచయితల పేర్లు మాత్రమే ఇవ్వబడ్డాయి.